ACC. NO 20100

# శ్రీ లలితా సహస్ర నామవివరణము

(SCIENTIFIC AND SPIRITUAL SPLENDOUR OF SRI LALITHA SAHASRAM)

(ప్రథమ భాగము)


వివరణ కర్త

డా॥ జి.ఎల్.ఎన్.శాస్త్రి, M.Sc., M.Phil., Ph.D.

(రిటైర్డ్) రీడర్ & భౌతిక శాస్త్ర విభాగాధ్యక్షులు

టి.జె.పి.యస్. కళాశాల, గుంటూరు.






జగద్గురు పీఠము - గుంటూరు శాఖ

(The World Teacher Trust - Guntur Branch)

GUNTUR - 522 002.

Phone : 233995

**శ్రీ లలితా సహస్ర నామ వివరణము**

ప్రథమ ముద్రణ : జూన్ 1997

ద్వితీయ ముద్రణ : ఏప్రిల్ 1998

అన్ని హక్కులు గ్రంథ కర్తవి ©

ప్రాప్తి స్థానం :

1. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
H/O డా॥ జి.ఎల్.ఎన్.శాస్త్రి
'మైత్రేయ నిలయం'
5-10-4, 2/9 బ్రాడీపేట, గుంటూరు - 2
ఫోన్ : 233995

2. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
45-40 -36/1
అక్కయ్యపాలెం
విశాఖపట్టణం - 530 016.

| | | |
|---|---|---|
| వెల : | సాధారణ ప్రతి | రూ.**80-00** |
| | గ్రంథాలయ ప్రతి | రూ.**100-00** |

ముఖచిత్రం : లాం వర్ధన్ రావు, విద్యాఆర్ట్స్, నగరంపాలెం

ముద్రణ : **ఓంకార్స్ గ్రాఫిక్స్**, 2/9, బ్రాడీపేట, గుంటూరు. Ph.232653

# విషయసూచిక

| విషయము | | పుటసంఖ్య |
|---|---|---|
| | పంచదశాక్షరీ మంత్రం - ఆశ్వయుజ శుక్ల పక్షం | XII |
| | దాగుడు మూతల దరహాసాలు | XIV |
| | మూడు కూటములు | XV |
| | దేవీ నవరాత్రులు | XVI |
| | నవ'రాత్రులు' ఏమిటి ? | XVI |
| | బిరుదు నామాలు | XVII |
| | నామాల అనువర్తనాలు(Applications) | XVII |
| | ముఖ్య గమనిక | XIX |
| | శ్రీ లలితా అష్టోత్తర వైశిష్ట్యము | XX |
| | ఈ ప్రథమ భాగ పరిధి | XX |
| II. | శ్రీ లలితా నామ వివరణ ప్రారంభం | 1 |
| III. | అనుబంధం | |
| | నాడులు | 217 |
| | షట్చక్రాలు | 219 |
| | వాగ్దేవతలు | 223 |
| | నిత్యాదేవతలు | 223 |
| | శ్రీ చక్రము | 225 |
| | నవావరణములు | 226 |
| | శ్రీ లలితా పరమేశ్వరి మంత్రిణులు | 234 |
| | అమ్మవారి సేనానులు | 235 |
| | భండాసురుని సేనానులు | 235 |
| | భండాసురుని పుత్రులు | 235 |
| | అస్త్ర ప్రత్యస్త్రములు | 235 |
| | 'శ్రీమన్నగరము' | 237 |
| | శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రం | 239 |
| | శ్రీ లలితా సహస్ర నామావళి | 255 |
| | అకారాది నామ సంఖ్యాను క్రమణిక | 263 |

# ముందుమాట

(ద్వితీయ ముద్రణము)

పట్టుమని పది నెలలు కూడా నిండకుండానే శ్రీలలితా సహస్రనామాలకు 'ఆత్మజ్ఞాన – శాస్త్రజ్ఞాన' సమన్వయాత్మకమైన వివరణ 'చతుర్భాగ సమన్విత' గా – నాలుగు అపూర్వమైన, అపురూపమైన సంపుటాలుగా – 'ఈశ్వర' నామ సంవత్సర కాలపరిమితిలోనే వెలువడడం, అంతేకాకుండా ప్రథమ భాగపుస్తకాలన్నీ ఈ తొమ్మిది నెలల కాలంలోనే పూర్తిగా అయిపోయి, తిరిగి ద్వితీయ ముద్రణకు రావడం– అత్యంత ఆశ్చర్యాన్ని, అనిర్వచనీయమైన ఆనందాన్ని కలుగచేసాయి. ప్రథమభాగం – 1997 జూన్ 29న, ద్వితీయ భాగం 1997 అక్టోబరు 19న, తృతీయ భాగం – 1998 జనవరి 11న, చతుర్థభాగం – 1998 మార్చి 26వ తేదీన ఆవిష్కరింపబడ్డాయి. ఇదంతా చూస్తుంటే – కాలస్వరూపిణి అయిన అమ్మవారు కాలంతోనే పోటీపడి, కలకాలం నిలిచే తన నామాల పూర్తి వివరణను ఇలా ముద్రింపచేసుకుందేమోననిపిస్తోంది.

విద్యార్థులు, ఉపాధ్యాయులు, అధ్యాపకులు, రీడర్లు, ప్రొఫెసర్లు, ఇంజనీర్లు వైద్యులు, శాస్త్రజ్ఞులు, పండితులు, పామరులు, సామాన్యులు, అసామాన్యులు, పీఠాధిపతులు, – ఇలా ఎందరో ఈ పుస్తకాలను చదివారు. ఒక్క ఆంధ్ర ప్రదేశ్‌లోనివారే కాకుండా దేశంలోని, విదేశాలలోని చాలామంది తెలుగు వారు ఈ పుస్తకాలను చదివి అమ్మవారి వైభవాన్ని అర్థంచేసుకొని, అనుగ్రహాన్ని పొందారు. ఈ సందర్భంలో నేను వారివద్ద నుండి అందుకున్న ప్రశంసాపూర్వక లేఖలకు వారందరికీ కృతజ్ఞతలను, శుభాకాంక్షలను తెలుపుకుంటున్నాను. వారి కోరిక మేరకు ఆంగ్లభాషలోకి కూడ ఈ వివరణ అనువదింపబడడానికి కృషి జరుగుతోంది.

ఈ నాలుగు వివరణ గ్రంథాలు ఇలా అత్యంత ఉపయోగకరంగా వెలుగులోకి రావడానికి కారణభూతురాలైన జగజ్జనని శ్రీ లలితాదేవికి సాష్టాంగ దండ ప్రణామాలను అర్పిస్తున్నాను. ఈ సత్కార్యంలో పాలు పంచుకుని సర్వ విధాలా దోహదపడిన వారందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెల్పుకుంటున్నాను. ముఖ్యంగా కర్నూలు వాస్తవ్యులు

శ్రీ జె. యమ్. రామచంద్రన్‌గారు ఈ పుస్తకాలు ఆవిష్కరింపబడిన వెంటనే మూడు రోజుల వ్యవధిలో ఆమూలాగ్రం అత్యంత సూక్ష్మపరిశీనాదృష్టితో చదివి, ప్రథమ భాగంలో దొర్లిన కొన్ని అచ్చుతప్పులను వివరంగా టైప్ చేసి పంపించారు. స్టేట్‌బ్యాంకు ఆఫ్ ఇండియా సంస్థలో రీజినల్ మేనేజర్ గా రిటైర్ అయి కర్నూలులో ఉంటూ - దాదాపు 75 సంవత్సరాల వయస్సులో వారు అలా ఉత్సాహంతో పుస్తకాలన్నీ చదివి, ఈ ద్వితీయ ముద్రణలో అచ్చుతప్పులు దొర్లకుండా ఉండేందుకు మార్గదర్శకులుగా సహకరించారు. వారిని నేను ఇంతవరకు భౌతికంగా చూడలేదు. నాకు పరిచయం కూడా లేదు. వీరు నాకు ఇచ్చిన ప్రోత్సాహానికి, సహకారానికి హృదయపూర్వకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. వారికి అమ్మవారు సంపూర్ణ ఆయురారోగ్యాలను కలుగ చేయాలని ప్రార్థిస్తున్నాను.

ఇలాగే మిగిలిన భాగాలలో దొర్లిన అచ్చుతప్పులను ఇతర పాఠకులు గూడా తెలియ పరిస్తే వాటిని - ఆ భాగాల ద్వితీయ ముద్రణలో సవరించుకుంటామని సవినయంగా మనవి చేసుకుంటున్నాను.

జగజ్జనని అయిన శ్రీలలితాంబిక యొక్క అవ్యాజమైన అనురాగ స్రవంతిలో మనందరం ఓలలాడి, ఆనంద క్రీడాత్మకంగా గడుపుతూ- జీవితాలను సార్థకం చేసుకుందాము.

గుంటూరు — ఇట్లు,

13-4-98 — **జి.ఎల్.ఎన్. శాస్త్రి**

# ముందుమాట

శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రానికి వ్యాఖ్యానాలు ఉన్నప్పటికీ ఈ ప్రస్తుత వివరణ చాలా విషయాల్లో వాటికి భిన్నంగా ఉంటుంది. 'ఆత్మజ్ఞాన - శాస్త్రజ్ఞాన' సమన్వయాత్మకమైన విశేషార్థాలు, అంతరార్థాలు, సంకేతార్థాలను ఎన్నో ఈ ప్రస్తుత వివరణలో చెప్పడానికి ప్రయత్నించాను. వాటిలో కొన్ని మా గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారు సెలవిచ్చినవి కాగా, మరికొన్ని – అమ్మవారి అనుగ్రహం వలన, గురుదేవుల కృప వలన – నాకు స్ఫురించినవి. ఇంతవరకు సాంప్రదాయరీతిలో వస్తున్న, వ్రాస్తున్న అర్థాలే కాకుండా స్వతంత్రించి హేతుబద్ధంగా వ్రాసినవి గూడా వున్నాయి.

## విన్నపం

నేను వివరించిన విషయాల కన్న ఈ నామాలకు ఇంకా ఎన్నో విలువైన విశేషాలు గూడా ఉండటానికి ఎప్పుడూ అవకాశం ఉంటుంది. పరిశోధనా దృక్పథంతో ఆలోచిస్తే – ఏ విషయం గురించి అయినా – 'ఇదే చివరకు చెప్పే విషయం, ఇంకా చెప్పవలసింది ఏమీ మిగలలేదు!' అనే 'భరతవాక్యం' ఎప్పుడూ వుండదని నా అభిప్రాయం. ముందు ముందు మరికొన్ని విశేషాలతో, క్రొత్త క్రొత్త వివరాలతో వ్యాఖ్యానాలు గూడా రావచ్చును. నేనే కొంత కాలం ఆగి వ్రాసినా క్రొత్త భావాలు రావచ్చును. ప్రస్తుతానికి ఈ వివరణ నేను చేసిన ఒక 'ప్రత్యేక ప్రయత్నం' అని మాత్రం చెప్పగలను. అయితే ''ఈ స్తోత్రం లోని నామాలకు నేను ఈ వివరణలో చెప్పిన విషయాలనే వ్యాసుల వారు గూడా ఊహించి తదనుగుణంగా ఆయా నామాలను రూపొందించి ఉండాలి'' అని చెప్పుకునే అహంకారిని మాత్రం కాదు. 'వ్యాసులవారి హృదయాన్ని ఇంకా పూర్తిగా తెలుసుకోవాలి' అని అనుకునే సత్యాన్వేషిణి మాత్రమే !

## ఎప్పుడో రావలసిన పుస్తకం ఇది

ఈ వివరణ ఇలా రావాలని నా చిరకాల వాంఛ. అసలు ఇంకా ముందుగా ఎప్పుడో

ఈ పుస్తకం రావల్సిందే ! కాని, ఎందుకో రాలేదు. నాకైతే మొదట్లో అర్థంకాలేదు. కాలచక్రం గిఱ్ఱున తిరుగుతోంది, రోజులు గడచి పోతున్నాయని తెలుసు. ఆలస్యం పరిధిని మించుతోందని తెలుసు. అయినా, ఎందుకనో చాలా కాలంగా వివరణ పూర్తి చేద్దామనే తలంపు గాని, సంకల్పం గాని కలుగలేదు. ఎందుకంటే – రోజురోజుకు క్రొత్త క్రొత్త భావాలు స్ఫురిస్తున్నాయి. అవన్నీ బాగున్నట్లని పిస్తున్నాయి కూడా ! అలాంటప్పుడు 'అనవసరంగా ఎందుకు తొందరపడాలి ?' అని ఓపిగ్గా నిరీక్షించాను. అందరూ అన్ని వైపుల నుండి ఫోన్ల ద్వారా, పోస్టు ద్వారా, వ్యక్తిగతంగా కలిసినపుడు 'శ్రీ లలితా నామ వివరణ విషయం' పదే పదే గుర్తు చేస్తూ నిర్బంధ పెట్టారు. అలా నిర్బంధ పెట్టిన వారిలో ప్రప్రథములు శ్రీ శ్రీ శ్రీ విశ్వయోగి విశ్వంజీ గారు. 'ఏమిటి ఆలస్యం?' అన్నారు. 'ఇలా క్రొత్త క్రొత్త భావాలు స్ఫురిస్తున్నాయి' అన్నాను. 'అవసరమైతే వాటిని రెండవ ముద్రణలో చేర్చవచ్చు, ముందు ప్రథమభాగంగా ఒక పుస్తకం రానివ్వండి'' అన్నారు. విశ్వమందిరంలో మూడు సంవత్సరాలు నేను ప్రసంగించగా తాము విన్న లలితావివరణ విషయాలు గాలిలో కలసి పోకుండా వెంటనే గ్రంథస్థమవాలనే వారి హృదయ పూర్వకమైన ఆకాంక్షే వారు అలా అనడానికి కారణం.

మా జగద్గురు పీఠం అంతర్జాతీయ గౌరవాధ్యక్షులైన శ్రీ కంభం పాటి పార్వతీ కుమార్ గారు ఒకసారి గుంటూరు గురుపూజలలో నేను లలితా సహస్ర నామాలపై నిర్వహించిన 'క్విజ్' కార్యక్రమాన్ని ఎంతో ఆసక్తిగా విన్నారు. ఆనందంతో స్పందించి నన్ను లలితా సహస్ర నామ వ్యాఖ్యానం వ్రాయవలసిందని ప్రోత్సహించి, అందుకు తగ్గ కొన్ని సూచనలను గూడా చేశారు.

### కృషికి తగిన ఫలితం ఇది

ఈ గ్రంథం ఇలా రావడానికి వెనకవున్న 'కృషి' చాలా వుంది. విశాఖపట్టణంలో మా గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు 13.10.77 నుండి 5.11.78 వరకు ప్రతిరోజు సాయంత్రం రెండు గంటల పాటు శ్రీ లలితా సహస్రనామ వివరణ ధారావాహికంగా ప్రసంగించారు. ఈ ప్రసంగ విషయాలను కేవలం పురాణ కాలక్షేపంగా తీసుకోకుండా 'మహోపదేశం'గా భావించాను. ఈ ఉపదేశ ప్రేరణతో శ్రీ లలితా నామాలపైన, దేవీ ఆరాధన పైన విపరీతమైన అభిమానం కలిగి ప్రత్యేక అధ్యయనం

చెయ్యడం జరిగింది. తత్ఫలితంగా –

1982 సంవత్సరము నుండి ఇప్పటి వరకు గుంటూరు అరండల్‌పేటలోని శ్రీ దేశిరాజు పార్థసారధిగారి విశాల స్వగృహ ప్రాంగణంలో ప్రతి సంవత్సరం ఆశ్వయుజ శుద్ధపాడ్యమి నుండి పూర్ణిమ వరకు – జగద్గురు పీఠం సోదర సోదరీమణులందరం కలిసి సామూహిక సహస్ర నామపూజ, అనంతరం లలితా నామాల వైభవం పై ప్రసంగించడం, 1992 నుండి పూర్ణిమ రోజున గురుపూజా మహోత్సవాలను గూడా నిర్వహించడం జరుగుతోంది. 1989 నుండి 1992 వరకు గుంటూరు కృష్ణనగర్‌లోని విశ్వంజీ గారి సాన్నిధ్యంలో మూడువందల నామాలకు వ్యాఖ్యానం చెప్పడం జరిగింది. 1992లోనే గుంటూరు పట్టాభిపురంలోని శ్రీ హరిహర దత్తక్షేత్రంలో దాదాపు మూడు నెలలు ప్రతి రోజు సాయంత్రం లలితా నామ వివరణ సంక్షిప్తంగా ప్రసంగించటం జరిగింది. ఇంకా ఇలాగే పలుచోట్ల శ్రీ లలితా ప్రాభవం, నామ వైభవం, ఆరాధనా అనుభవం నలుగురూ పంచుకునేలాగా చెయ్యగలిగాను.

పైన తెలిపిన విధంగా జరిగిన 15 సంవత్సరాల అధ్యయన, బోధ, ఆచరణ, ప్రచారాత్మక మైన ఆరాధనా ఫలితంగా 16వ సంవత్సర మైన ఈ 1997లో అమ్మవారు అనుగ్రహించి ఈ 'లలితాసహస్రనామ వివరణ' ప్రథమభాగంగా దర్శనమిచ్చింది. అంటే అమ్మవారి పంచదశాక్షరీ మంత్రంలోని ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క సంవత్సరం చొప్పున 15 సంవత్సరాలు ఆరాధిస్తే – 16వ సంవత్సరంలో 16వ బీజాక్షరమైన 'శ్రీం' తో కలిసి ''షోడశి'' గా దర్శన మిచ్చిందన్నమాట ! ఇదంతా కృతి పూర్వోపాసనా కథా క్రమం.

**అసలు సంగతి**

ఇంతవరకు ప్రచురించిన 14 పుస్తకాల విషయంలో ఏమీ ఇబ్బంది పడలేదు. అన్నీ అనుకున్నట్లుగా, అనుకున్న 'బడ్జెట్' లో అనుకున్న సమయానికి పుస్తకాలు తయారై ఆవిష్కరింపబడ్డాయి. కాని, అమ్మవారి సంబంధమైన ఈ పుస్తకం విషయంలో బొత్తిగా మా ఆటలు, ప్రణాళికలు, అంచనాలు సాగలేదు. చిత్రపటాన్ని వేసిన చిత్రకారుణ్ణి, పుస్తక ముద్రణాధిపతిని, టైటిల్ ముద్రణ కావించిన వారిని ఇలా అందరినీ గూడా ఒక ఆట

ఆడించింది అమ్మవారు. ''మీరు చెప్పినట్లు నేను వినడం కాదు, నేను చెప్పినట్లు మీరు వినండి'' అంది. (ఆవిడ 'అనుల్లంఘ్యశాసన' కదా!) అయితే, మొదట్లో ఏమిటిలా అవరోధాలు, ఆటంకాలు అంచనాలు దాటిన ఖర్చులు అనుకున్నాంగాని – ప్రతి అవరోధం – ఒక మెరుగుదనం కోసం, ప్రతి ఆటంకం – లోపాల సవరణతో ఒక పరిపూర్ణత కోసం జరిగాయని తర్వాత గ్రహించగలిగాము. అమ్మవారు తనకు సంబంధించిన విషయంలో అలా తగిన విధంగా తనంతకు తాను జాగ్రత్త పడిందని తర్వాత సమన్వయు పరచుకోగలిగాము గూడా !

## విషయపరమైన విభాగం

ఒక పుస్తకం చదివిన తరువాత చదివిన వారి ప్రవర్తనా ప్రవృత్తులలో మంచిదిశగా మార్పువస్తే అంది మంచి పుస్తకం (Good Book)అని, అపురూపమైనవి, విలువైనవి అయిన ఎన్నో తెలియని విషయాలుంటే అది గొప్ప పుస్తకం (Great Book)అనీ చెప్పుకోవాలి. ఈ రెండు లక్షణాలు కలిగిన పుస్తకం అయితే అది ఉత్తమ పుస్తకం(Best Book) అవుతుంది. ఈ మూడో కోవకు చెందిన పుస్తకం కావాలని ఈ గ్రంథాన్ని ముఖ్యంగా మూడు భాగాలుగా విభజించడం జరిగింది. అవి –

1) పీఠిక 2) నామ వివరణ 3) అనుబంధం. గ్రంథస్థ విషయాలపై సాధారణంగా వచ్చే సందేహాలన్నిటికి హేతుబద్ధంగా, శాస్త్రబద్ధంగా నచ్చే సమాధానాలు పీఠికలో తెలుపబడ్డాయి. శ్రీ విద్యకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన వివరాలు, లలితా సహస్ర నామ స్తోత్రం, నామాల సంఖ్యాను క్రమణిక, అకారాది నామ సంఖ్యాను క్రమణిక మొదలైన విషయాలు అనుబంధంలో తెలుప బడ్డాయి. ఈ పీఠికా, అనుబంధాలకు మధ్య వున్న భాగంలో అమ్మవారి నామాల వివరణ తెలుప బడింది.

రకరకాల పేర్లతో వుండే తంత్ర విషయాల కన్న ప్రవర్తనంలో మార్పును తీసుకు రాగలిగే సాధనా పరమైన విషయాలకే ఈ వివరణలో ప్రాధాన్యం ఇవ్వబడింది. అలాగే, నామాలలో ఇమిడి వుండే బీజాక్షరాలను బయటకు లాగే ప్రయత్నం రెండు మూడు నామాల విషయాలలో చేసినా, అదేమంత ఉపయోగ కరమైన విషయం కాదని ఆ ప్రక్రియకు తక్కువ ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. ఒక నామానికి ఎన్ని పుటలు వివరణ వ్రాశారు, పుస్తకం ఎంత పెద్ద గ్రంథంగా తయారైంది' అన్న విషయం కాకుండా, వివరణ ఎంతవరకు

అవసరమో అంతవరకే ఇవ్వడం జరిగింది. ఏవైనా విజ్ఞాన శాస్త్రపరమైన విషయాలు, తంత్ర పరమైన విషయాలు, యోగపరమైన విషయాలు వుంటే ఆ యా విషయాలను తెలిసిన వారిని అడిగి ఈ పుస్తకంలోని వివరణలో ఇచ్చిన సమన్వయాన్ని అర్థం చేసుకోవలసిందని ప్రార్థన.

## ఇక ఇందులో వాడిన భాష

ఇది శాస్త్ర గ్రంథమే కాబట్టి గ్రాంధిక భాషలో వ్రాయడం సముచితమే! కాని, అందరూ – ముఖ్యంగా యువకులు, ఆధునికులు, శాస్త్రజ్ఞులు ఈ పుస్తకం చదవాలని నా ఆకాంక్ష. కొందరికే అర్థమయేది గ్రాంథిక భాష. అందరికీ అందుబాటులో వుండేది వ్యావహారిక భాష. గ్రాంథిక భాషలోని సంధుల వల్ల వచ్చే కొన్ని ఇబ్బందులను గూడా (ఉదా : తనకున్న కొద్దిపాటి గ్రాంథిక భాషా పరిజ్ఞానాన్ని, అభిమానాన్ని వ్యక్తపరచటం కోసం. ''నా కప్పయు నీ కమ్మయు నైన మీనక్క క్షేమమని తలంచెదను'' అని మేనమామ వ్రాసిన ఉత్తరాన్ని అందుకున్న మేనల్లుడికి మేనమామపై చాలా కోపం వచ్చి వ్యవహారం చాలా దూరం పోయింది!) ఈ వ్యవహారిక భాషలో స్వేచ్ఛగా తొలగించుకోవచ్చును. అందుకని – బ్రాకెట్లలో చెప్పిన బాధల లాంటివి కొని తెచ్చు కోకుండా, సంధి ప్రక్రియలు ప్రకోపించకుండా, అనౌచిత్యానికి దారితీయకుండా వీలైనంత వరకూ జాగ్రత్తపడుతూ, పత్రికా భాష అయిన శిష్ట వ్యావహారిక భాషలోనే వ్రాయడం జరిగింది. పీఠిక చదవందే నామ వివరణ, అనుబంధం చదవకండి. ఇది నా సలహా మాత్రమే! ఆ పైన మీ ఇష్టం.

గుంటూరు

12.6.97

ఇట్లు,

జి.ఎల్.ఎన్. శాస్త్రి

# కృతజ్ఞతలు

జగజ్జననిని తెలుసుకోమని జన్మ నిచ్చిన జననీ జనకులకు, ఆ జగజ్జననిని కలుసుకోమని వేష విలాస వివరాలను ఇచ్చిన గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారికి, ఈ గ్రంథం ఎప్పుడు ఇలా వస్తుందా అని నా కంటె ముందుగా ఆశించి, ఆకాంక్షించి, ఆశీర్వదించిన శ్రీశ్రీశ్రీ విశ్వంయోగి విశ్వంజీగారికి, సభక్తి ప్రణామములు.

వివిధ కార్యక్రమాల ఒత్తిడిలో ఉండి గూడా నా మీద గల ఆదరాభిమానములతో ఎలాగో అలా వీలుకలుగ చేసుకుని ''ఫలశ్రుతి'' ని వ్రాసి ఇవ్వడమే గాక గ్రంథ ప్రచురణకై సహకరించిన మా జగద్గురు పీఠ అంతర్జాతీయ గౌరవాధ్యక్షులు శ్రీ కంభంపాటి పార్వతీ కుమార్ గారికి, స్వల్పకాల వ్యవధిలోనే గ్రంథాన్ని ఆ సాంతం చదివి సంపూర్ణ పరితృప్తిని, ఆనందాన్ని పొంది, తాము పొందిన ఆనందానుభూతిని – 'శాస్త్రీయలాలిత్యం' అని ఎంతో సార్ధకమైన శీర్షికతో – రమ్యాతి రమ్యంగా, రసవత్తరమైన, స్పష్టమైన రీతిలో – వ్యక్తపరచిన శ్రీ పరమాత్ముని శ్రీ దత్తప్రసాద్‌గారికి – వయసుకు మించిన ఉత్సాహంతో ఆర్ష ధర్మ గ్రంథ ప్రచురణ ప్రచార యజ్ఞంలో నిరంతర కార్యనిమగ్నులై గూడా వీలు చూచుకుని ఈ ప్రస్తుత గ్రంథంలో తమ అభిప్రాయ 'దీపస్తంభాన్ని' నిలబెట్టి, ఆ వెలుగులో గ్రంథాన్ని చదువుకోమని సూచించిన శ్రీ ఏలూరి పాటి అనంతరామయ్య గారికి, – నా కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు. హృదయ పూర్వక అభివందనములు.

ఒక సత్కార్యం జరగడానికి ఎంతో మంది యొక్క సామూహిక కృషి(Team Work) ఉంటుంది. అలాగే ఈ గ్రంథ ముద్రణ వెనుక గూడా అలాంటి కృషి వుంది.

ఇంతకు పూర్వం ప్రచురించిన 'లీలామాధవమ్' 'సుందరకాండ' పుస్తకాల ముద్రణకు, మా ఉచిత హోమియో వైద్యాలయ నిర్వహణకు కూడా ద్రవ్య సహాయం చేయడమే కాక, ప్రతి సంవత్సరం గుంటూరులో జరిపే గురుపూజా నిర్వహణకు గూడా తగినంత ఆర్థిక సహాయాన్నందిస్తున్నారు శ్రీ కొండా శివరామకృష్ణ మూర్తి గారు. మాస్టరు ఇ.కె. గారు స్వప్నంలో దర్శనమిచ్చి ఇచ్చిన ఆదేశం మేరకు ఈ లలితా సహస్ర నామ వివరణకై తాను కేటాయించిన నిధి నుండి ఈ ప్రస్తుత గ్రంథం 'టైటిల్ పేజీ'

ముద్రణ ఖర్చుకు విరాళమిచ్చారు. అంతేకాదు, ఈ పుస్తకంలో ఉన్న చిత్ర పటాల నమూనాలను గూడా వారు, వారి అమ్మాయి చి.ల.సౌ. వాణీ బాల చిత్రించి ఇచ్చారు. అంటే ఒక విధంగా చెప్పుకోవాలంటే ఈ పుస్తకం తాలూకు 'అట్టహాసం' 'చిత్ర విన్యాసం' అంతా వారిదే నన్నమాట! వీరికి పరమ గురువుల శుభాశీస్సులు, నా కృతజ్ఞతలు.

మా జగద్గురు పీఠం గుంటూరు శాఖవారు నిర్వహించే ప్రధానమైన కార్యక్రమాలకు తమ విశాల గృహ ప్రాంగణాన్ని సానుకూల పరుస్తూ, శ్రీ లలితా దేవీ పూజలలో అత్యంత శ్రద్ధా భక్తులతో పాల్గొంటూ, పూజామహోత్సవాల నిర్వహణ నుండి ఈ పుస్తక ముద్రణా యజ్ఞం దాకా కూడా అత్యంత ఆదరభావంతో సహకరిస్తూ, ప్రోత్సహిస్తూ, ఆదుకుంటూ వున్న శ్రీ దేశిరాజు పార్థసారధి – శ్రీ లక్ష్మి దంపతికి, శ్రీ కె. వెంకుబాబు – లక్ష్మి దంపతికి, వారి వారి కుటుంబ బంధు మిత్ర సభ్యులకు, లలితా పూజలలో పాల్గొనే ఇతర సోదర సోదరీమణీ బృందానికి, నా మీద నమ్మకంతో ప్రచురణ పూర్వ మూల్యాలను, యథా శక్తి విరాళాలను ఇచ్చిన వారికి, అలా ఇచ్చిన వాటిని స్వీకరించి మాకు అంద జేసిన వారికి నా హృదయ పూర్వక శుబాకాంక్షలు, కృతజ్ఞతలు.

ఈ గ్రంథ లిఖిత ప్రతిని సుందరమైన అక్షరమాలికలతో అలంకరించి ముద్రణకు సిద్ధపరచి ఇచ్చిన శ్రీ ఎమ్. రామ మూర్తిగారికి, నాతోపాటే ఈ గ్రంథ ప్రచురణా యజ్ఞంలో శాయశక్తులా అహర్నిశలు శ్రమిస్తూ, అనుక్షణం అండగా వున్న చిరంజీవి సూరపరాజు హనుమాన్ ప్రసాద్‌కు, అవసరమైనపుడల్లా శుద్ధ ప్రతిని తయారు చెయ్యడంలోను, ప్రూఫులు దిద్దడంలోను సహకరించిన నా సహధర్మచారిణి చి.ల.సౌ. మీనాక్షి (విష్ణుప్రియ) కి నా శుభాభినందనలు.

'అనవద్యాంగి' అయిన అమ్మవారిని అత్యంత సుందరంగా చిత్రించి ఇచ్చి తాను ధన్యుడై, పాఠకులను గూడా ధన్యులుగా చేయబోయే చిరంజీవి వర్ధన్‌రావుకు; అందంగాను, చదువుకోడానికి అనుకూలంగాను ఉన్న అక్షరాలతో పుస్తకాన్ని DTP & Off-Set లో ముద్రించి ఇవ్వడంలో బాధ్యతపడి స్వంత పనిగా శ్రమించిన చిరంజీవి కె. రాముకు; టైటిల్ ముద్రణలో సహకరించిన తదితరులకు – నా ఆశీః పూర్వక శుభాభినందనలు.

ఈ పుస్తక రచనకు ముందు చూచిన కొన్ని గ్రంథాలు.

1) శ్రీ లలితా రహస్యనామ సహస్ర గూడార్థ దీపిక ( గ్రంథ కర్త – శ్రీ రాచకొండ వేంకట కోటేశ్వరరావు, ప్రకాశకులు : శ్రీ రాచకొండ దుర్గాప్రసాద్, 4/13 బ్రాడీపేట, గుంటూరు.)

2. శ్రీ కళా ప్రకాశము ( గ్రంథకర్త : శ్రీ ముక్కవిల్లి అన్నప్ప దీక్షితులు, ప్రకాశకులు: శ్రీ గౌతమీ విద్యాపీఠం, రాజమండ్రి – 533 101)

3. శ్రీ లలితా సహస్ర నామావళి ( ప్రకాశకులు : స్వధర్మ స్వారాజ్య సంఘం, బ్రాడ్వే, మద్రాసు )

ఆయా పుస్తకాల గ్రంథ కర్తలకు, ప్రకాశకులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఈ విధంగా ఈ గ్రంథ ప్రచురణా యజ్ఞానికి నిండు వేసవిలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరించిన వారందరికీ నా కృతజ్ఞతాపూర్వక వందన హరి చందనాలు. వీరందరూ అమ్మవారి అరుణారుణ చరణ కమల వికాస ప్రకాశంలో శుద్ధాంతరంగులై, పిల్లల చదువుల, పెళ్ళిళ్ల బాధ్యతలు సకాలంలో నిర్వహిస్తూ, పవిత్ర జీవన మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ, సంపూర్ణ ఆయురారోగ్యైశ్వర్యాలతో అనంతమైన ఆనందాన్ని అనుభవించాలని – హృదయ పూర్వకంగా శ్రీ లలితా మాతృమూర్తిని అభ్యర్థిస్తున్నాను.

*12.6.97* జి.ఎల్.ఎన్. శాస్త్రి

ఓం శ్రీ సాయిరామ్ గురుదేవదత్త

# ఆశీస్సులు

**భగవాన్ శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ**

సద్గురు మహారాజ్

విశ్వమందిరం, కృష్ణనగర్

గుంటూరు – 522 006.

'సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ,'. సమస్త శాస్త్రముల, మత గ్రంథముల సారాంశము ఇదియే. సత్యం, ఏది సత్యం ? జ్ఞానమే సత్యం. ఎక్కడ ఉన్నది జ్ఞానం? అనంతమైన ఈ విశ్వంలో అణు అణువున పరిభ్రమిస్తూ అనంత దివ్య తేజో తరంగమయ రూపంలో విరాజిల్లుచున్నది. ఈ జ్ఞానం శ్రీపర బ్రహ్మ జ్ఞానం. దివ్యము, అమృతము, అవ్యయము, ఇదియే బ్రహ్మము. ఇదియే ఆది పరాశక్తి. సృష్టికి మూలము. సృష్టికి ఆధారము అయి ఉన్నది.

సమస్తమైన ఈ విశ్వమంతా ఒకానొక దివ్య సంకల్ప ప్రభావం చేత విచ్ఛిన్న కర ప్రక్రియతో ఏర్పడినదే! సమస్త సృష్టికి మూలము బిందువే. ఆ బిందువే ఆది పరాశక్తి లలితకు ఆధారమైనది. ప్రకృతి పురుషుల, సయ్యాటగా, చీకటి వెలుగుల దొంగాటగా వెలిగే జగన్నాటక సూత్రధారియే ఆ పరాశక్తి.

అట్టి పరాశక్తిని సద్గురు అనుగ్రహ కటాక్షంతో, చిరంజీవి శాస్త్రి అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేశాడు. మామూలు ప్రయత్నంకాదు విశ్వ ప్రయత్నం చేశాడు, శోధించాడు, తపించాడు, తపస్సు చేశాడు, పరిశోధించాడు, పరిశీలించాడు. విప్పారిన అంతర్గత నేత్రంతో పరమ సత్యాలను, రహస్యాలను కనుగొన్నాడు. లలితా సహస్ర నామములను ఆరాధించాడు. ఆలోచించాడు, అర్థం చేసుకున్నాడు. మనల్ని ఆలోచింపచేశాడు. ఒకొక్క నామానికి చిరంజీవి శాస్త్రి ఇచ్చిన వ్యాఖ్యానం గమనిస్తుంటే అతనిలో అనంత ప్రేమామృత భక్తి భావంతో నిండిన వ్యాసులవారు కనుపిస్తారు.

లలితా సహస్రనామముల వ్యాఖ్యానములతో ఎన్నో గ్రంథాలు వచ్చినా, అవి అన్నీ ఒక ఎత్తు, ఇది మరొక ఎత్తు. ఈ గ్రంథం అత్యున్నత శిఖరాలను అధిరోహించిన సముచిత,

సమగ్ర ఆలోచనా ఫలిత, ఆధ్యాత్మిక, యోగ శాస్త్రీయ పరిశోధనా గ్రంథం. శాస్త్రి హృదయ స్పందనకు, మనో భావాలకు ఈ గ్రంథం ఒక దర్పణం. విశ్లేషణాత్మకమైన ఇటువంటి గ్రంథం వెలువడాలని ఎప్పటినుంచో నా ఆకాంక్ష. ఈనాటికి అది సఫలీకృతమైనది. ఈ గ్రంథ రచన ద్వారా చిరంజీవి శాస్త్రి, చిరంజీవి అయినాడు. మిగిలిన అన్ని భాగాలు త్వరలో ముద్రితం కావాలని నా ప్రగాఢ ఆకాంక్షను తెలియజేస్తున్నాను. ఈ గ్రంథం మిగిలిన భాషల్లోనికి, ముఖ్యంగా – ఆంగ్లంలోనికి అనువదించాలని, తద్వారా ప్రపంచం లోని సమస్త మేధావి వర్గం చేతులలోనికి వెళ్ళి, వాళ్ళని ఆలోచింప చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

శాస్త్రి, వారి కుటుంబ సభ్యులకు దివ్యమైన ఆశీస్సులను అందజేస్తున్నాను.

ఈ గ్రంథాన్ని ఆంధ్ర పాఠకలోకం సముచితమైన రీతిలో ఆదరించి, ఆనంద భరితులు కాగలరని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ ఆశీస్సులను అందజేస్తున్నాను.

అవధూత చింతన శ్రీ గురుదేవదత్త.

# ఫలశ్రుతి

శ్రీ లలితాదేవి ఆంధ్రుల ఆరాధ్య దేవత. త్రిగుణాత్మిక. త్రిపుర సుందరి. సమస్త జగత్తుకు ఆధారమామె. చైతన్య స్వరూపిణి. సృష్టికార్యమునకు మూలము. మూలశక్తి స్వరూపిణి. సమస్త శక్తులకు ఆధారము. సాకార బ్రహ్మ స్వరూపిణి. బ్రహ్మము అప్రజ్ఞాతము, అలక్షణము, అప్రతర్క్యము, అనిర్వచనీయము, అభావ్యము, నామరూపాతీతము, అవ్యక్తము. అట్టి తత్త్వము యొక్క సూక్ష్మాతి సూక్ష్మ వ్యక్త రూపముగ నిలచునది అమ్మతత్త్వము. అయ్య అవ్యక్తుడు. అమ్మ అయ్య యొక్క ప్రతి నిధి. పరతత్త్వము యొక్క ప్రథమ వ్యక్త స్వరూపము లేక సంకల్పము. ఈ సంకల్పమే మొదటి వెలుగు. అనగా ప్రధానము, అదితి, చైతన్య స్వరూపిణి, గాయత్రి ఇత్యాది నామములచే గ్రహింపబడునది. త్రిగుణాత్మక సృష్టికి మూలము. అనగా త్రిమూర్తులకు పుట్టుక స్థానము. త్రిశక్తులకు పుట్టుక స్థానము. సమస్త సృష్టికి పుట్టుక స్థానము. సృష్టి కథకు వెండి తెర. పరమాత్మచే సంకల్పింపబడుట వలన వెలిగి యున్న తెర. సృష్టి సినిమాకు ఆధార భూతము. మాయాతీత ఆరాధనము చేత భక్తులను తన మాయనుండి తరింప చేయు అనుగ్రహ రూపిణి.

సమస్త సృష్టి శక్తులు ప్రణాళికలు ఆమె అధీనము కావున, ఆమె ఆరాధకులకు ఆమెయే సమస్త శక్తియును మరియు భుక్తియును.

అమ్మ సౌందర్య స్వరూపిణి. ఆమె ఆరాధనము అత్యంత వైభవోపేతము, ఆనంద భరితము మరియు ఉల్లాస కారణము. రస స్వరూపిణి కావున సాధన మార్గమంతయు ఆహ్లాదకరముగ భాసించును. అమ్మను గూర్చిన స్తోత్రములలో ''లలితా సహస్ర నామము'' ను మించిన స్తోత్రము లేదనుట నిర్వివాదము. ఈ స్తోత్రము అగస్త్య మహర్షికి హయగ్రీవుడు ఉపదేశించినది. ఇందు సకల మంత్ర, తంత్ర యంత్ర, యోగసాధనములు నిక్షేపింపబడినవి. వేదాంగములను ప్రయోగించి తెలిసినవారు – నిక్షిప్తమైన రహస్యములను పాఠకలోకమునకు అందించుటకు యిందు అపారమైన విజ్ఞాన సంపద కలదు. ఎవరు ఏ దృక్పథమున పరిశీలించిన, వారికి ఆ దృక్కోణము నుండి రహస్య ప్రకాశ మొనర్చి తుష్టి నందించగల దివ్యస్తోత్ర రాజమిది.

లలితాదేవి ఆరాధనమున, తన యందు భాసించిన దివ్య భావములను అందరికీ వివరిస్తూ గత పదిహేను సంవత్సరములుగా శ్రీ జి.ఎల్.ఎన్ శాస్త్రిగారు ఆస్తిక జనుల ఆర్తికి తుష్టి నందించుచున్నారు. ఆయన, వారి సతీమణి – అమ్మవారి ఆరాధనమున తన్మయము చెందుచూ, తదానందమును గుంటూరులోని ఆస్తిక జనులకు ఎడతెరపి లేక పంచుతూ వున్నటువంటి పవిత్ర దంపతి. వారి నుండి సహస్ర నామముల వ్యాఖ్యానము కావలెనని కోరిన భక్త జనుల కోరికను మన్నించి, శాస్త్రిగారు యీ మహా యజ్ఞమును నిర్వర్తించుచున్నారు. లలితాదేవి అనుగ్రహ పాత్రులగు వారికి సాధ్యపడని కార్యమేది ? అమ్మ అనుగ్రహమే యీ యజ్ఞమునకు ఫలశ్రుతి. ఆ దివ్యానుగ్రహము రచయితకు, వారి కుటుంబమునకు, వారి అనుయాయులకు, పాఠకులకు లభింపవలెను. అమ్మ కామేశ్వరి గనుక యీ కడపటి కోరికతో జీవులను తరింప జేయువలెనని ప్రార్థన.

శుభం భూయాత్

కంభం పాటి పార్వతీ కుమార్

ఈశ్వరనామ సంవత్సర
వైశాఖ శుద్ధ ఏకాదశి
18-5-1997

# శాస్త్రీయ లాలిత్యం

**పరమాత్ముని శ్రీ దత్తప్రసాద్**
కార్యదర్శి, శ్రీనాథపీఠం
అధ్యక్షుడు, శ్రీ కంచి కామకోటి పీఠ
హరిహరదత్త క్షేత్రం

విష్ణునామ సహస్రాచ్చ శివనామైకముత్తమమ్
శివనామ సహస్రాచ్చ దేవ్యానామైక ముత్తమమ్.

విష్ణునామ సహస్రము కంటె శివనామ మొకటి ఉత్తమమైనది. శివనామ సహస్రము కంటె దేవీ నామ మొకటి ఉత్తమమైనది. ఇది బ్రహ్మాండోత్తర పురాణ వాక్యం. జగద్గురువులు శ్రీ ఆది శంకర భగవత్పాదులు ''శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం'' – '' భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్'' – ''మహాంతః పశ్యంతో దధతి పరమానంద లహరీమ్'' అని దేవీ మాహాత్మ్యాన్ని స్తుతించారు. నామ స్తోత్రాలలో లలితా రహస్యనామ స్తోత్రం ఉత్తమోత్తమ మైనది. ఇది బ్రహ్మజ్ఞాన సంపన్నమై, వేదాంత బోధకమై, శ్రీ చక్ర బ్రహ్మాండ పిండాండ సామరస్య ప్రతిపాదకమై, యంత్ర మంత్ర పూజా విషయ ప్రబోధకమై, యోగశాస్త్ర రహస్యాలతో, కర్మ మార్గాన్ని, భక్తి మార్గాన్ని, ఉపాసనా మార్గాన్ని, జ్ఞాన మార్గాన్ని ప్రతిపాదించునట్టిదై అలరారుతోంది. ఈ నామ సహస్రంలో దేవి బాహ్య సౌందర్య వర్ణనతో పాటు, ఆమె మూర్తామూర్త స్వరూప వర్ణన కూడా పొందుపరచబడింది. ఈ నామ స్తోత్రం భక్తులకు, సాధకులకు, యోగులకు మార్గదర్శకమై విరాజిల్లుతోంది. షణ్ముఖ స్థాపనా చార్యులైన శంకరులు ప్రబోధించిన మార్గం సగుణ పరబ్రహ్మోపాసన ద్వారా నిర్గుణ పరబ్రహ్మోపాసన. ఇట్టి సమన్వయాత్మకమైన మార్గం – కర్మమార్గానికి జ్ఞాన మార్గానికీ మధ్యే మార్గమైన ఉపాసనా మార్గం. ఈ మార్గం లలితా సహస్ర నామ స్తోత్రంలో అంతర్లీనంగా పరివ్యాప్తమైంది. అందుకే ఈ సహస్ర నామ స్తోత్రం రహస్య నామ స్తోత్ర సార్థక నామంతో కీర్తించబడింది. ఇట్టి స్తోత్రరాజానికి సంస్కృత భాషలో ప్రకటింపబడిన వ్యాఖ్యలు ఆరని చెప్పుకున్నా

రెండే లభ్యమౌతున్నాయి. అందులో మొదటిది 18వ శతాబ్దం నాటి ''సౌభాగ్య భాస్కరం''. ఇది శ్రీమద్భాస్కరరాయ ప్రణీతమైంది. రెండవది 'కళ్యాణ శ్రీకళా' అన్న పేరుతో గుంటూరు శృంగేరి విరూపాక్ష శ్రీ పీఠాధ్యక్షులు శ్రీ కళ్యానంద భారతీ స్వామి వారి వ్యాఖ్యానం. ఇంక తెలుగులో ఈ లలితా సహస్ర నామాలకు భాష్యాలుగా, వ్యాఖ్యానాలుగా, వివరణ గ్రంథాలుగా, కేవల శబ్దార్థ తాత్పర్య పరిమిత రచనలుగా ఎన్నో ప్రకటింప బడ్డాయి. ఎన్ని ఉన్నా క్రొంగ్రొత్త ఆలోచనలతో నవనవోన్మేష ఊహలతో, అమ్మవారి స్వరూప స్వభావాలను అందించటానికి సాధకులు ఉత్సాహం చూపుతూనే ఉన్నారు. అందుకు కారణం – కొత్త కొత్త ఆలోచనలకు, నిత్యనూత్న భావాలకూ ఆలవాలమైన శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రం యొక్క వైశిష్ట్యమే ! అసలు అమ్మవారి సహస్ర నామాలకు వివిధార్థాలను భావించాలన్నా, నిగూఢార్థాలను వివరించాలన్నా - బహు శాస్త్ర ప్రావీణ్యం అత్యంత ఆవశ్యకం. శ్రీ లలితా సహస్ర నామ సాగరంలో వెదికిన వారికి వెదికినన్ని రత్నాలు లభ్యమౌతాయి. సశాస్త్రీయమైన దృక్పథంతో వీక్షించే వారికి గోచరించే అనంత సత్యాలు కోకొల్లలు. సరసమైన ఊహాశాలికి స్ఫురించే ఊహలు ఎన్నెన్నో! ఇట్టి సాగరంలో మునకలిడి ''శ్రీలలితా సహస్ర నామ వివరణ'' అనే మరో అమృత భాండాన్ని వెలికి తీసిన వారు శ్రీ జి.యల్.యన్.శాస్త్రిగారు.

శ్రీ జి.యల్.యన్. శాస్త్రిగారు బహుముఖ ప్రజ్ఞా సంపన్నులు. కులపతి శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య గారి ప్రియాంతేవాసి. వారి వద్ద శ్రీ శాస్త్రి గారు వేదాన్ని అధ్యయనం చేసారు. ఇతిహాసాలను అభ్యసించారు. జ్యోతిష్య శాస్త్రాన్ని పరిశోధించారు. యోగశాస్త్రాంతర్గత విషయాలను పరిశీలించారు. సంస్కృతాంధ్ర కావ్యాలను సమీక్షించారు. వాస్తు శాస్త్ర నైపుణ్యాన్ని గ్రహించారు. ఉపనిషద్విజ్ఞానామృత పానం చేశారు. హోమియో వైద్యంలో నిష్ణాతులైనారు. గురుముఖతః మంత్ర శాస్త్ర మహార్ణవంలో జలకమాడారు. ప్రాచీన ఆర్ష ధర్మం పట్ల ఒక సమగ్రమైన అవగాహనను అంది పుచ్చుకొన్నారు. సంప్రదయాకాశంలో విహారం చేసారు. ఇది ఇలా ఉంటే – శ్రీ శాస్త్రిగారు భౌతిక శాస్త్రంలో ఆంధ్ర విశ్వ విద్యాలయం నుండిM.Sc., M.Phil., Ph.D. పట్టాలను పొందారు.. వివిధ జాతీయ అంతర్జాతీయ సదస్సులలో పాల్గొన్నారు. వివిధ విజ్ఞాన పత్రికలకు అనేక పరిశోధనా వ్యాసాలను అందించారు. భారతీయ ధ్వని శాస్త్ర,

అతిధ్వని శాస్త్ర సంబంధమైన వీరి ప్రావీణ్యానికి ఎన్నో గౌరవాలు లభించాయి. శ్రీ శాస్త్రిగారు సనాతన సంప్రదాయ నిబద్ధ నేపథ్యంలో ఆధునిక విజ్ఞాన దృక్పథాన్ని మేళవించగల చతురులు. మీదు మిక్కిలి వీరు ఉత్తమ ఉపాధ్యాయులు. 1996-97 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత వీరు. హృద్గతమైన విషయాన్ని ఇతరులకు అవగతమయ్యే రీతిలో చెప్పటానికి వీరి అధ్యాపన సామర్థ్యం తోడైంది. ఇంతే కాకుండా వీరు ఒక మంచి రచయిత కూడా! వీరు కావ్యాలను కూర్చారు. నాటకాలను వ్రాసారు. జ్యోతిష్య శాస్త్ర గ్రంథాలను వెలువరించారు. తైత్తరీయం వంటి ఉపనిషత్తులకు వివరణ గ్రంథాలను రచించారు. శ్రీ ఆదిశంకరుల 'సౌందర్యలహరి', 'శివానందలహరి' వంటి స్తోత్రాలకు వ్యాఖ్యానాలను ప్రకటించారు. సరళమైన సుబోధమైన తెలుగులో శ్రీ మద్రామాయణంలోని ఆరణ్య, కిష్కింధ, సుందర కాండల నందించారు. వీరిలోని అధ్యాపనా సామర్థ్యానికి, రచనా కౌశలానికి చక్కని సాహచర్యం లభించింది. ఇంత విశాలమైన సైద్ధాంతిక పృష్ఠభూమితో - తాత్త్విక, తార్కిక సంపదలను తోడ్కొని- శ్రీ జి.యల్.యన్. శాస్త్రిగారు శ్రీ లలితా సహస్ర నామ వివరణకు పూనుకున్నారు.

శ్రీ జి.యల్.యన్. శాస్త్రిగారు అమ్మవారి నామాన్ని దర్శించి, ఆమె నామ సౌందర్యంలో ఓలలాడి, ఆ నామంలో అంతర్లీనమైన అర్థ సౌకుమార్యాన్ని స్పృశించి, భావ మాధుర్యాన్ని ఆస్వాదించి పులకించి, పరవశించి, పలువిధాలుగా స్పందించి తాను గన్న అర్థాలను హేతు బుద్ధితో పరిశీలించి, తార్కిక వీక్షణంతో సమీక్షించి మనముందుంచుతారు. అమ్మవారి నామాల్లో "శ్రీమాతా" అన్నది తొలి నామం. ఈ నామం మాతృత్వానికి మూలం. అంటే జన్మకు హేతుభూతమైన నామం. జీవి ప్రాదుర్భావానికి సంకేతం. సహస్ర నామాల్లో చివరి వాక్యంలో ఉన్న 'శివశక్త్యైక్యరూపిణీ' అన్న నామం ముక్తికి సంకేతం. అంటే బ్రహ్మాండంలో జీవి లీనం కావటానికి సంకేతం. అంటే ఈ నామం మోక్ష ద్వారం. అందుకే అమ్మవారు 'మోక్ష ద్వార కవాట పాటనకరి'. ఇలా శ్రీ శాస్త్రి గారు తొలి నామాన్ని మలి నామాన్ని భావించి మధ్యలోని 998 నామాల్ని జీవియాత్రగా, ముక్తికి జీవుని వేదనగా దర్శించారు. ఈ హృద్యమైన స్పందనలో శ్రీ శాస్త్రిగారి వైలక్షణ్యం ఉట్టిపడుతోంది. శ్రీ శాస్త్రిగారందించిన ఈ భావన అపూర్వం.

మొత్తం 182 స్వర శ్లోకాల్లో నిక్షిప్తం చేయబడిన అమ్మవారి సహస్ర నామాల్లో 'శ్రీమాతా' శ్రీమహారాజ్ఞీ, శ్రీమత్సింహాసనేశ్వరీ' అనే మూడు నామాలూ మొదటి శ్లోకం లోని మొదటి పంక్తిలో పొందు పరచబడ్డాయి. ఈ మూడు నామాలనూ సృష్టి స్థితి లయాలను సూచించే నామాలుగా భావించటం బహుశ్రుతమైన విషయం. శ్రీమాతా అన్న నామాన్ని సంభావనా పూర్వపద కర్మధారయ సమాసంగా అన్వయించుకొని అమ్మను "శ్రీ" అనే మాతగా దర్శించటం, "శ్రీమహారాజ్ఞీ" అన్న నామాన్ని నిఖిల జగత్పాలనా భారాన్ని వహించే శక్తిగా అభివర్ణించి తైత్తిరీయ మంత్రంతో సమన్వయ పరచటం, 'శ్రీమత్సింహాసనేశ్వరీ' అన్న నామంలో అమ్మను ధర్మాసనాధిష్ఠాన దేవతగా, పంచభూతాలను అధిష్ఠించే లయకారిణిగా స్తుతించటంలో శ్రీ శాస్త్రిగారి విలక్షణ దృక్పథం గోచరిస్తుంది.

తరువాత నామాల్లో అమ్మవారి ఉపాస్యరూప వర్ణన జరిగింది. "లోకాన తీత్య లాలితే లలితా తేన సోచ్యతే" లోకాతీత లావణ్యంతో లాస్యం చేసే లలనామణి లలితాంబిక. అట్టి తల్లి లావణ్యాన్ని మొదట ఇరవై శ్లోకాలు కీర్తిస్తాయి. అందులో ఒక నామం – 'ముఖచంద్ర కళంకాభ మృగనాభి విశేషకా' అన్నది. అమ్మవారి ముఖమనే చంద్రబింబంలో నొసటి కస్తూరి బొట్టు చంద్రుని లోని మచ్చ – అని ఈ నామం భావం. ఈ వర్ణన రూపకాలంకార సమన్వితమైనది. ఇంతవరకు మాత్రమే చెప్పి తరువాత నామానికి వెళ్ళటం శ్రీ శాస్త్రిగారి జీవలక్షణం కాదు. ఇంకా ఇంకా ఏమన్నా చెప్పవచ్చా – అని కుశాగ్రబుద్ధితో పరికించేదే శాస్త్రిగారి లక్షణం. బొట్టును సహజంగా భ్రూమధ్యాన అలంకరించుకుంటారు. మరి శిష్యుణ్ణి అనుగ్రహించి ప్రేరణ కలిగించటానికి గురువు అతని భ్రూమధ్యస్థానాన్ని ఎందుకు స్పృశిస్తాడు ? కారణం లేనిదే కార్యం ఉండదు – అని ఆ వైపుగా దృష్టిని సారించారు శాస్త్రిగారు. మృగనాభి విశేషకమంటే కేవలం కస్తూరి బొట్టు కాదు. మృగమంటే ఎల్లప్పుడూ వేటగానికి ముందుండి మార్గ నిర్దేశకత్వం చేసేది. అందుకనే మృగ శబ్దానికి మార్గాన్ని అర్థంగా తీసుకొన్నారు శాస్త్రిగారు. 'మృగమార్గ అన్వేషణే' అని అమరం అంటున్నది. కనుక ఇక్కడ జ్ఞానాన్వేషణగా అర్థం చెప్పారు శాస్త్రిగారు. మరి నాభి అంటే – నహ్యతే ఇతి నాభిః – అని అమరం అర్థం చెబితే, ఆ అర్థాన్ని గ్రహించి

'నాభికి' 'కట్టబడిన కేంద్రం'గా అన్వయించుకొన్నారు శాస్త్రిగారు. అంటే అమ్మవారి బొట్టు జ్ఞాన కేంద్రంగా ఉన్నదన్నమాట. మరి జ్ఞాన కేంద్రం భ్రూమధ్యంలోనే ఎందుకుండాలి ? అన్న ప్రశ్నకు జ్ఞాన సంబంధమైన ఆజ్ఞా చక్రస్థానం అదే కనుక అని శాస్త్రిగారు సమాధానంచెప్పారు. అందుకనే శిష్యుని భ్రూమధ్యాన్ని స్పృశించి జ్ఞాన ప్రేరణ కలిగిస్తాడని శ్రీ శాస్త్రిగారు ఒక అద్భుతమైన తర్క సంపన్నమైన ఆలోచనా ధోరణిని ఈ నామం ద్వారా మనకందించారు.

'శుద్ధ విద్యాంకురా కార ద్విజ పంక్తి ద్వయోజ్జ్వలా' – అన్న నామంలో స్వపర భేదం లేని అద్వైత సిద్ధిని ప్రసాదించే బ్రహ్మ విద్యను శుద్ధ విద్యగా భావించి, అమ్మ నామ శ్లోకాలలో వాడబడిన అనుష్టుప్ ఛందంలోని 16 + 16 అక్షరాలు కలిగిన రెండు పంక్తులనూ అమ్మవారి దంత పంక్తి ద్వయంగా కీర్తించి, అంతటితో ఆగక శ్రీ శాస్త్రిగారు ద్విజ పంక్తి ద్వయాన్ని – అంటే అమ్మవారి పలువరసలను – వేద స్వస్తి జరిగే ఒక దృశ్యంగా దర్శించారు. వేదస్వస్తికి పండితులు ఎదురు బదురుగా కూర్చోటం ఆచారం.

'రత్నగ్రైవేయ చింతాక లోల ముక్తా ఫలాన్వితా' అన్న నామంలోని 'లోలా' – 'ముక్తా' శబ్దాలను ధ్యానశుద్ధికి ప్రతీకలుగా గణించారు. చపలచిత్తానికి లోల శబ్దాన్ని, ముక్త సంగులకు ముక్తా శబ్దాన్ని గ్రహించి, వారికి దక్కే ప్రతిఫలాలలోని భేదాలను సూచించే శబ్దాలుగా నామంలోని – ఆ + ఫల + అన్వితా – శబ్దాలను స్వీకరించారు. అంటే అమ్మవారి మెడలో రత్నాలు పొదిగిన చింతాక పతకం వ్రేలాడుతోంది. అందులోని జ్ఞాన రత్నాలను లోలు లందు కోలేరు. కేవలం ముక్తులు మాత్రమే అందుకోగలరు – అని భావ సమన్వయం చేసారు శ్రీ శాస్త్రిగారు. శబ్దాలుంటాయి, వాటికి అర్థాలుంటాయి. కానీ శబ్దార్థ సమన్వితమైన రూపాల్లో భావాన్ని అన్వేషించటం లోనే వ్యాఖ్యాత సామర్థ్యం ద్యోతకమౌతుంది. శ్రీ జి. యల్. యన్. శాస్త్రిగారి వ్యాఖ్యానంలో ఇటువంటి సామర్థ్యం అడుగడుగునా గజ్జె కట్టి నృత్యంచేసింది. ఆ గజ్జెల రవళిలో భావసరళిని ధ్వనింప చేసింది.

'మరాళీ మందగమనా' అన్న నామంలో శ్రీ శాస్త్రిగారి వైద్య విజ్ఞాన పరిజ్ఞానం

మరో వైద్య శాస్త్ర సత్యాన్ని అందించింది. అమ్మవారి నడక హంస గమనం వలె ఠీవిగా ఉంటుంది. హంసను – 'సోహం' గా భావించటం సంప్రదాయం. ప్రాణాయామ ప్రక్రియగా కూడా హంసగమనాన్ని భావించారు శ్రీ శాస్త్రిగారు. కల్లోలం కాని శ్వాస-ప్రాణి ఆయుర్దాయాన్ని పెంచుతుంది. ఉద్రేకంలో, ఉల్లాసంలో, ఉత్తేజంలో శ్వాసగతి కల్లోలిత మౌతుంది. ఈ కల్లోల మెన్నో వ్యాధులకు మూలం – ముఖ్యంగా ఆస్త్మాకన్నది శ్రీ శాస్త్రిగారి ఉద్దేశ్యం. మరి అట్టి వ్యాధులను పోగొట్టుకోటానికి 'మరాళీ మందగమనా' అన్న నామాన్ని జపించి, ఆ నామ గూడార్థాన్ని గ్రహించి, తదనుగుణంగా శ్వాసరీతిని నియంత్రించి స్వస్థత పొందవచ్చని శ్రీ శాస్త్రిగారి లోని వైద్య శాస్త్ర నైపుణ్యం నొక్కి వక్కాణించింది. సంగీతం ద్వారా రోగాలను పోగొట్టవచ్చని శ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారు ఎలుగెత్తి చాటారు. ప్రత్యక్షంగా ధృవీకరించారు. అలాగే శ్రీ జి. యల్. యన్. శాస్త్రిగా.రు దేవీనామ పారాయణ ద్వారా కూడా రోగాల నుండి ఉపశమనం పొందవచ్చని చెప్పారు. చెప్పిన రీతిలో తర్కంతో వైద్య శాస్త్ర నైపుణ్యం కూడబలుక్కున్నాయి.

'విశుక్ర ప్రాణ హరణ వారాహీ వీర్యనందితా' – అన్న నామ భావాన్వయంలో కూడా శ్రీ శాస్త్రిగారి ప్రజ్ఞ విజ్ఞతతో విహరించింది. భండాసురుని సైన్యాధిపతి అయిన విశుక్రుని ప్రాణాలను అమ్మవారి దండనాథ అయిన వారాహీ దేవి హరించింది. ఇది తెలిసి అమ్మవా.రు సంతోషించింది. ఇదీ ఈ నామంలో కనిపించే పౌరాణిక సంప్రదాయార్థం. కాని, విశుక్రుణ్ణి శ్రీ శాస్త్రిగారు శుక్రధాతువులో వికారాన్ని కలిగించి కామాన్ని ప్రకోపింప చేసే ఆసురీ ప్రవృత్తిగా స్వీకరించారు. అట్టి కామాన్ని జయించాలంటే సాధకునికి 'వారాహి' కృపకావాలి. మరి ఈ వారాహి అంటే ఎవరు ? వరాహానికి సంబంధించినది వారాహి. వరాహం అంటే – 'వర + అహం' గా విడదీసి 'శ్రేష్ఠమైన అహం' గా సంభావించి పరమేశ్వర అపరిమిత తత్త్వానికి, అఖండత్వానికి సూచికగా గ్రహించారు. సంసార లంపటంలో మునిగి పోవటానికి కారకుడైన విశుక్రుని బారినుండి రక్షింపబడాలంటే ''జన్మ జలధౌ నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి'' అన్న ఆది శంకరుల శ్లోకంలో వర్ణింపబడ్డ వరాహమే, పరమేశుని దివ్య తత్త్వమే ఆధారమని ఔచిత్య సుందరంగా శ్రీ శాస్త్రిగారు వివరించారు.

'భయాపహా' - అన్న నామంలో అమ్మ కేవలం భయాన్ని పొగొట్టేది అని మాత్రమే చెప్పకుండా, 'మనం ఏం చేసినా భయపడకుండా అమ్మ అనుగ్రహిస్తుంది' - అని పాఠకులు అపోహపడే ఆస్కారం ఇవ్వకుండా, అమ్మ మనచేత భయపడకుండా ఉండటానికి, భయపడే అవసరం లేని సత్కర్మలను మాత్రమే చేయిస్తుంది - అని అర్థం చెప్పారు శ్రీ శాస్త్రిగారు. అంటే అమ్మ మనల్ని పరమతత్త్వానికి చేరువ చేస్తుంది. ఇక్కడ 'ధియోయోనః ప్రచోదయాత్' అన్న గాయత్రీ మంత్ర తత్త్వాన్ని - భయాపహా అన్న నామంతో సమన్వయ పరిచారు శాస్త్రిగారు.

'శాంభవీ' అన్న నామంలో స్వవ్యక్తిత్వ లోకంలో తమ వైశిష్ట్యాన్ని వ్యాపారంగా మార్చే వారిని సున్నితంగా మందలించటం కూడా ఎంతో ఔచిత్య సుందరంగా ఉంది. 'శాతోదరీ' అన్న నామ వివరణలో సన్నని నడుము గల వారికి గల సౌలభ్యాన్ని, నడుము లావుగా ఉన్నవారికి గల వైద్య శాస్త్ర సంబంధమైన ఇబ్బందినీ శ్రీ శాస్త్రిగారు వివరించారు. 'నిర్మలా' అన్న నామంలో శాస్త్రజ్ఞానానికి, ఆత్మజ్ఞానానికి సమన్వయాన్ని సాధించటంలో గల ప్రాముఖ్యాన్ని వివరించారు.

సమస్త శాస్త్ర సారాన్ని, సమస్త వేదాంత సారాన్ని తన గర్భంలో ఇముడ్చుకొన్న పరిపూర్ణ మాతృ స్వరూప దిగ్దర్శనమే శ్రీ లలితా నామ సహస్రం. ఇది గానానికి గానం, జ్ఞానానికి జ్ఞానం, స్తోత్రానికి స్తోత్రం, శాస్త్రానికి శాస్త్రం. ఇది విలక్షణమైన విజ్ఞాన సర్వస్వం. వేదాలలో గాయత్రిగా, ఉపనిషత్తులలో ఉమగా, పురాణాలలో లలితగా, కాళిగా, ఆగమాలలో మహాత్రిపురసుందరిగా, రాజరాజేశ్వరిగా, మహాకాళిగా, మహాసరస్వతిగా, మహాలక్ష్మిగా, పామరుల పాలిట పోలేరమ్మగా, అంకాళమ్మగా ఏ శక్తి అయితే చిచ్ఛక్తిగా ఈ బ్రహ్మాండమంతా ఆవరించి ఉందో ఆ అమ్మే 'లలితాంబిక'. అట్టి అమ్మ స్వరూపాన్ని, మాతృ స్వభావాన్ని సహస్ర నామాల్లోని తొలి రెండు వందల నామాల్లో వివరించి అమృత భాండంగా అందించారు. సుధావృష్టిని కురిపించారు. బ్రహ్మ శాస్త్ర సమ్మతమైన భావాల్ని మథించి పరతత్త్వాన్ని శోధించి అమృతాన్ని ఆవిష్కరించారు. అందుకున్న వారికి అందుకున్నంత. అమ్మ నామాలను అర్థ జ్ఞానంతో పారాయణ చేసి

తపించటానికి, తరించటానికి శ్రీ శాస్త్రిగారి ఈ గ్రంథం ఎంతో ఉపయుక్తమైంది. అచిర కాలంలోనే శ్రీ జి. యల్. యన్ శాస్త్రిగారు మిగిలిన నామాలకూ వివరణ నందించగలరనీ, అందుకు శ్రీ మాత వారికి పరిపూర్ణ అనుగ్రహాన్ని, ఆయురారోగ్య ఐశ్వర్యాలను సమకూర్చ గలదని నా విశ్వాసం.

శుభం భూయాత్

# దీపస్తంభం

ఆంధ్ర వ్యాస, కవికుల రత్నదీప,
వైదికాగమాలంకార, భాషాప్రవీణ,

**ఏలూరి పాటి అనంత రామయ్య**, ఎం.ఏ
సంస్కృతం, ఎం.ఏ తెలుగు, బి.ఇడి., రిటైర్డ్
ప్రిన్స్‌పాల్, గుంటూరు కె.వి.కె. సంస్కృత కళాశాల,
అనంతసాహితి కార్యదర్శి, హైదరాబాద్ -59.

కులపతి డా.ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు బహువిద్యలలో నిష్ణాతులు. అధ్యాత్మ విద్యాసారూప్యౌషధ వైద్య జ్యౌతిష త్రివేణీ సంగమ పవిత్ర క్షేత్రమై, జగద్గురు పీఠారామమై, జగత్తుకు ఆత్మిక శారీరిక మానసిక స్వస్థత చేకూర్చిన ధన్యులు. వారు శ్రీవైష్ణవులయినా-శివాశివద్వేషులుకారు. భారతీయ ధర్మప్రచారకులయినా-అన్యమత విమతులు కారు. సనాతన ధర్మ తత్త్వజ్ఞులయినా-అధునాతన పరిణామం ప్రతిదానికీ వ్యతిరేకులు కారు. ఇరవై శతాబ్దిలోని సమాజానికి పథనిర్దేశికులయిన దేశికులలో విశిష్టులయి, తనంత వారు అసంభవము కనుక, కాకపోయినా తనవంటి వారిని అనర్ఘ శిష్యులను అనేకులను తీర్చిదిద్ది దీప స్తంభాలలా నిలిపిన తేజోమూర్తులు. నేను గమనించగలిగిన అట్టి దీపస్తంభాలలో డా.జి.ఎల్.ఎన్.శాస్త్రిగారు గా ప్రసిద్ధులైన గొర్తి లక్ష్మినారాయణ శాస్త్రి గారొకరు. వీరిని-నేను విశాఖపట్టణంలో పార్వతీకుమార్ గారింట్లో, ఎక్కిరాల వారు భాగవత ప్రకాశాన్ని మౌఖికంగా వెలువరిస్తుంటే, కాగితాలపై కెక్కిస్తుండగా-తొలిసారి చూశాను, 1978 కి అటో ఇటో! అపుడు ఆచార్యుల వారు నేను మాటాడుకొన్నసమయంలో-వీరుశ్రోత. ఆచార్యుల వారు ప్రత్యక్షంగా చెప్పుతున్నది వ్రాయటంతో ప్రారంభించిన శాస్త్రి గారు - చెప్పినది, చెప్పనున్నది, చెప్పవలసినది వారి-చర్మ చక్షువులకు పరోక్షమయిన సందర్భంలో కూడా వ్రాస్తూనేవున్నారు. ఇది ఈ గురుశిష్యులిద్దరి నైష్ఠికతకూ నిదర్శనము.

గుంటూరు హిందూకళాశాలలో తెలుగు లెక్చరర్‌గా ప్రారంభించిన ఆచార్యుల వారి శిష్యులైన శాస్త్రిగారు కూడా, గుంటూరు లోనే టి.జె.పి.యస్.కళాశాలలో భౌతిక

శాస్త్రాచార్యులుగా ఉంటూ, ఆచార్యులవారి త్రివేణులకు పంటకాలువలు త్రవ్వుతూ పారిస్తూ, ఉండటం కేవలం కాక తాళీయంకాదు. వారు వదలినచోట మొదలు పెట్టి, వారు మిగిలిచిన పని కొనసాగించటం వీరి ప్రణాళిక కొనసాగించటమవుతుంది కాని, కాక తాళీయము, ఘుణాక్షరము ఎలా అవుతుంది?

శాస్త్రిగారు తమ పుస్తకాలలో వేసిన తాము వ్రాసిన పుస్తకాల పట్టిక చూస్తే వారి బహువిషయాధికారం తెలుస్తుంది. శ్రీలలితా సహస్రనామ ప్రాశస్త్యం గమనించి, దాని గురించి వ్రాసినవారు శ్రీలలితాసహస్రనామ వివరణం వ్రాయడం ఆశ్చర్యంకాదు. కృష్ణమాచార్యుల వారెందరికో శ్రీలలితా సహస్రనామ పారాయణంచేసుకొమ్మని చెప్పటం నేనెరుగుదును.

శ్రీవిద్య ఒక మహారహస్య ఖని. దానిలోని రహస్యాలను ఎందరో మహర్షులు, తత్తుల్యులు సంస్కృతాది భాషలలో వివరించి ఉన్నారు. అయినా జనానికి క్రొత్త విద్యలు తెలుస్తున్నాయి. వాటి వల్లకలిగిన తెలివితో ప్రాచీన విషయాలను పరిశీలిస్తే- బహువిశేషాలు స్ఫురించటం సహజం. అదీకాక, ఇదివరకటి మనుషులు - సంస్కృతం, దేశ భాషా వాటిలో వచ్చిన వివిధ విషయాలు చదువుకొనేవారు. ఇప్పుడు ఇంగ్లీషూ, దానిలో వచ్చిన వివిధ విషయాలు తెలుసుకొనడంతో చదువులు మొదలయి కొనసాగుతున్నాయి. ఇలా చదివిన ఆధునికులకు మన ప్రాచీన విషయాల మహత్త్వమూ, తత్త్వమూ తెలియాలంటే- వీరికి తెలిసిన అధునాతన విషయాలు తెలిసినవారు - ఆ పరిజ్ఞానం ఆధారంగా, సహాయంగా వాటిని చెపితే సులువుగా తెలుస్తుంది. శ్రీచక్ర నిర్మాణం గురించి ఒక రష్యన్ తత్త్వవేత్త కొన్నేళ్ళ క్రితం ఆశ్చర్యం వ్యక్తంచేయటం, దానిపైని హిందూపత్రికలో ఒక వ్యాసం రావటమూ చాలామంది గమనించివుంటారు. తరువాత ఎందరో ఇంకా తెలుసుకొనటానికి ప్రయత్నించారు, ప్రయత్నిస్తున్నారు.

ఈ సంపుటంలో తొలి రెండువందల నామాల వివరణం ఉన్నది. వీటిలో 4,55,61,69 మొదలైన నామాల వివరణంలో ఆధునిక విషయపరిజ్ఞానం శాస్త్రి గారికి ఎలా ఉపయోగపడిందో వెల్లడి అవుతుంది. అలాగే పగడం(Coral) నామం 20, వజ్రం (Diamond) అదేనామం, పండ్లు (Teeth) నామం 24, వంతెన (Bridge) నామం-30, డబ్బు (Money or Currency) నామం-162మొదలైన నామాల వివరణలను బట్టి వీరు

ఎవరి ఉపయోగం కోసం ప్రధానంగా ఈ వివరణ ఉద్దేశించారో తెలుస్తూ, నేను పైని చెప్పిన విషయం పరిపుష్టమవుతుంది.

వివరణ ఒక ఎత్తయితే–పీఠికా, అనుబంధమూ, రెండెత్తులుగా సమకూర్చారు. వాటిలో తెలుసుకొనవలసిన అంశాలు చాలావున్నాయి. పీఠికలో ''తల్లి'' మతల్లికా, లలితా–పదాలనుంచి వచ్చినదన్నమాట భాషా శాస్త్రవేత్తలు గమనించవలసినది.

మిగతా 800ల నామాల వివరణము– బహుశః మరినాలుగు సంపుటాలుగా–ఎంతత్వరగా వస్తే లోకానికి అంతమేలు.

ఇంతమంచి గ్రంథం వ్రాసిన శాస్త్రిగారు ఈ విద్య ఏమీ తెలియని నాకు ఈ మాటలు వ్రాసే అవకాశం కల్పించటం వారి ఔదార్యం.

3-6-1997

పుల్లెపాటి అనంత రామయ్య



శ్రీ లలితా దేవి

# చిద్రూప చింతన

తే. గీ. కనులకింపగు రూపమ్ము కలిగి యుండి (మహాలావణ్యశేవధిః)

ఏమి వంకలు లేనట్టి లేమ ఆమె (అనవద్యాంగీ)

ఈవి చింతామణీ సౌధ గృహిణియైన (చింతామణి గృహాంతస్థా)

లక్షణాహ్లాద వర్తనాలబ్ధి యున్న (సాధ్వీ)

హ్రీం యనంగను గళమెత్తు హృదయ శక్తి (హ్రీంకారీ)

హరిణ నయనమ్ములను గల్గు తరుణి ఆమె (మృగాక్షీ)

సకల శక్తుల మూలమౌ శక్తి ఆమె (సర్వశక్తిమయీ)

కడిమితోటల వాసియౌ కన్నతల్లి (కదంబవనవాసినీ)

హరివిధీంద్రుల అర్చనలందు తల్లి (హరి బ్రహ్మేంద్ర సేవితా)

లయకరీ కూడ అయినట్టి లలన ఆమె (లయకరీ)

హ్రీం యనంగ వాగింధన మ్మిచ్చుశక్తి (హ్రీంకారీ)

సచ్చిదానందరూపిణి స్వప్రకాశ (సచ్చిదానంద రూపిణీ, స్వప్రకాశా)

కళలు మాలగా నున్నట్టి కల్పవల్లి (కళామాలా)

లలిత లలితార్థ భావ సంకలితమూర్తి (లలితాంబికా)

హ్రీం యనంగను గళశక్తినిచ్చుతల్లి (హ్రీంకారీ)

శ్రీం యనంగను సిరులిచ్చు శ్రీల తల్లి (శ్రీమాతా)

శా॥ 'ఓం' కారేశ్వర శంకర ప్రణవ నాదోద్యానసంశోభితా

'ఐం' కారేశ్వరి – సూనరాణి ! స్ఫుటవాగర్థాను సంస్థాపితా

'హ్రీం' కారేశ్వరి ! 'వాగ్విలాసగళమున్' హృద్యాతి హృద్యమ్ముగా

'శ్రీం' కారేశ్వరి ! నాకు నిమ్ము కృపతో చిద్రూపచింతామణీ !

జి.ఎల్.ఎన్. శాస్త్రి



# అంకితము

గురుదేవులు

శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్య

పాదారవిందములకు

అంజలిఘటిస్తూ

-జి. ఎల్. ఎన్.శాస్త్రి

# అంకితము

స్తవనీయాత్మనివాసికిన్, శ్రుతిశిరస్సౌరభ్య సంవాసికిన్,
ధవళస్వచ్ఛమనస్వికిన్, వివిధ శాస్త్రజ్ఞాన వర్చస్వికిన్,
శ్రవణానంద వచస్వికిన్, భువన సంజాతాప్త తేజస్వికిన్,
శివవిష్ణ్వాత్మకమూర్తికిన్, స్మితముఖ శ్రీ కృష్ణమాచార్యకున్.

శ్రీ విద్యబోధించు చిచ్ఛక్తి భక్తుండు
సూర్యస్తుతిని జెప్పు ఆర్యమూర్తి
శివసూక్తముల జెప్పు శివభక్త చిత్తుండు
శ్రీ గణేశుని గొల్చు యోగమూర్తి
విష్ణు సాహస్రక వివరణాత్మక కర్త
కృష్ణచరిత, క్రీస్తు గేయ – కర్త
భాగవత జ్యోతిషాగమ సూక్త గీ
తా బాలశిక్ష – సూత్రాల కర్త
పూర్వ పశ్చిమ సంస్కృతీ పుష్పములకు
యోగ సంస్కార పరిమళ భోగమిచ్చి
అన్వయించిన ఎక్కిరాలాన్వయులగు
కృష్ణమాచార్య గురువు కంకితము నిత్తు

భక్తి నిండిన యెదతోడ ప్రణతిజేసి
పరవశించిన మదితోడ ప్రణుతి జేసి
దివ్యలలితాంబికా నామ దీప్తి కిరణ
భాష్యమైన ఈ ప్రథమ విభాగ సుమము.

జి. ఎల్. ఎన్. శాస్త్రి

# పీఠిక

వేద వ్యాస మహర్షి వ్రాసిన అష్టాదశ పురాణాల్లో – 'బ్రహ్మాండ పురాణం' ఒకటి. ఈ పురాణంలో – సృష్టి యొక్క ఆవిర్భావము చెప్పబడుతుంది. మొగ్గ నుండి పువ్వు విచ్చుకునే విధంగానే – బ్రహ్మయొక్క అండం నుండి విశ్వం యావత్తూ విచ్చుకుని ఉద్భవిస్తుంది. ఈ ప్రక్రియలో జరిగే వివిధ దశలలోని వివరాలన్నీ కథల రూపంలో ఈ పురాణంలో వుంటాయి. అటు బ్రహ్మాండం నుండి విశ్వం యొక్క ఆవిర్భావము, ఇటు – పిండాండం నుండి జీవి యొక్క ఆవిర్భావము – ఈ రెండు ప్రక్రియలు సమన్వయింపబడి ఈ పురాణ కథలలో వుంటాయి.

## ప్రకృతీ - పురుషులు

ఏ ప్రక్రియలో అయినా రెండు అంశాలుంటాయి. అవి 1) 'కార్యము' 2) 'కారణము'. కళ్లకు కనబడేదంతా – 'కార్యం'(Effect). దీనిలో మళ్లీ రెండు భాగాలుంటాయి. 1) స్థూలము (Gross) 2) సూక్ష్మము (Subtle). పదార్థమయమైన దంతా (Materialistic part) 'స్థూలం' క్రిందకు వస్తుంది. ఆ పదార్థ చైతన్య గుణం అంతా 'సూక్ష్మం' క్రిందకు వస్తుంది. చైతన్యానికి సంబంధించిన కదలికలను, దాని ఫలితాలను కళ్లతో చూడగలుగు తున్నాము కాబట్టి, స్థూల భాగంతో పాటు ఈ సూక్ష్మభాగం కూడా కలిసి ''కార్యం'' క్రిందకే వస్తుంది. ఈ 'కార్య' అస్తిత్వానికి కారకమైన దాన్ని 'కారణము'(Cause) అంటారు. ఈ కారణాన్ని మనం సాధారణంగా కళ్లతో చూడలేము. ఉదా: వ్రేలు కదులుతుంటే – స్థూలభాగానికి సంబంధించిన 'వ్రేలు' ను చూస్తాం. దాని కదలికలను చూస్తాం. కాని, ఆ వ్రేలు అలా కదలడానికి వెనుక గల 'కారణాన్ని' మనం చూడలేము. కళ్లకు కనబడే ఈ 'కార్యాన్ని' – 'ప్రకృతి' అని; దాని 'కారణాన్ని' – 'పురుషుడు' అనీ వేదాంత గ్రంథాల్లో ప్రతిపాదిస్తారు, సంకేతిస్తారు

సృష్టిని ఒక వృత్తం (Circle)తో పోలిస్తే – ఆ వృత్తం యొక్క పరిధి (Circumference) ప్రకృతి అయితే, కేంద్రం – పురుషుడు అవుతాడు. సృష్టి – అనే వృత్తంలో 'పరిధి

– కేంద్రము' అనే 'ప్రకృతి – పురుషులు' కలిసే వుంటారు. వీరి జంట విడదీయలేని వీరిలో ఎవరు ముందు, ఎవరు వెనుక అని గూడా వుండదు. గణితాత్మకమైన మెదడు కలిగిన వారికి (Mathematical Brains), సాంఖ్యక మనస్సు కలిగిన వారికి, (Statistical Minds), చరిత్ర కారులకు (Historians) - 'ముందు వెనుకలు లేకుండా, ఈ ప్రకృతి పురుషులు ఎలా కలిసే వుంటారు?' – అన్నది అభ్యంతరం కావచ్చునేమో కాని. వుంటారు. చెట్టు తాలూకు వ్యూహం విత్తనంలోను, విత్తనం తాలూకు అంకురం చెట్టుకు వుండే పండులోను ఎలా ఏక కాలంలో ఇమిడి వుంటాయో – అలాగే ఈ ప్రకృతీ పురుషుల జంట గూడా ఎప్పుడూ కలిసే వుంటుంది. అందుకే భగవద్గీతలో –

''ప్రకృతిం పురుషం చైవ విద్ధ్య నాదీఉభావపి'' (13 అ – 20శ్లో)

అన్నాడు గీతాచార్యుడైన కృష్ణ పరమాత్మ. దీనిని బట్టి, ప్రకృతీ పురుషులు ఒక నాణెం (Coin) యొక్క బొమ్మ (Head) బొరుసు (Tail) స్థితుల లాగా వుంటారని తెలుస్తోంది. ఒకే తత్త్వం యొక్క ఈ రెండు అంశాల స్వరూపాన్ని భారతీయులు 'అర్ధనారీశ్వరులు' అనే సంకేతంతోను, చైనీయులు 'ఇన్ – యాన్(Yin - yang) అనే సంకేతంతోను, క్రిష్టియన్లు 'జిహ్ – వహ్' అనే సంకేతంతోను చెబుతారు. ఈ మూడూ ఈ క్రింది పటాలలో చూపబడ్డాయి.



భారతీయుల సంకేతము
అర్ధనారీశ్వరుడు
శివుడు పార్వతి



చైనీయుల సంకేతము
ఇన్(YIN)-యాన్(YANG)



క్రిష్టియన్‌ల సంకేతము
జిహ్- వహ్

1) 'దేహము – ఆత్మ' 2) 'పగలు – రాత్రి' 3) వెలుగు – చీకటి, 4) మెలకువ – నిద్ర', 5) సృష్టి – ప్రళయము, 6) కళ్లు తెరిచిన స్థితి – కళ్లు మూసిన స్థితి – ఇలా జంటగా వుండే వన్నీ గూడా 'ప్రకృతీ – పురుషుల' తత్త్వాల క్రిందకే వస్తాయి. ఈ ప్రకృతీ పురుషులనే – 'అమ్మవారు – అయ్యవారు' అని, 'శక్తి – శివుడు' లేదా 'పార్వతి – శివుడు' అనీ సంకేతిస్తారు. ఈ జంటల లోని రెండు అంశాలు – పైకి చూడ్డానికి వ్యతిరేకంగా (Opposite) వున్నట్లు అనిపిస్తుంది – కాని, వాస్తవానికి అవి రెండూ పరస్పరాధార పరిపూరకాలు (Inter Dependent Complimentary Counter parts) అని తెలుసుకోవాలి. ఈ ప్రకృతీ పురుషులకు సంబంధించిన – స్థూల, సూక్ష్మ, కారణాత్మకమైన 'సగుణ పరబ్రహ్మ స్వరూపిణి' గా ఒక మూర్తిని ఊహిస్తే ఆ మూర్తి 'శ్రీ లలితాదేవి' అని అర్థం చేసుకోవాలి.

## జగజ్జనని - లలితాదేవి

బ్రహ్మాండ పురాణంలో సృష్టి యొక్క ఆవిర్భావానికి సంబంధించిన దేవకార్య విషయాలు ఉపాఖ్యానాల రూపంలో వుంటాయి. అలాంటి ఉపాఖ్యానాలలో 'లలితోపాఖ్యానం' ఒకటి. ముందు ఈ 'లలితాదేవి' పదం ఎలా వచ్చిందో చూద్దాం!

సృష్టిలోని ఒక్కొక్క జీవికి ఒక్కొక్క తల్లి వుంటుంది. అంటే – విశ్వంలోని సమస్త జీవులకు ఎవరెవరి తల్లి దండ్రులు వారి వారికి వుంటారు. విశ్వంలోని వివిధ జీవుల తల్లులందరికీ మూలమైనదిగా ఒక తల్లి ఉండాలి గదా! ఉంటే – ఆ తల్లి 'జగన్మాత', 'విశ్వజనని' ఔతుంది. పంచభూతాత్మకమైన సృష్టి అంతా నామ రూపాత్మకము కాబట్టి, సృష్టికి మూలమైన జగన్మాతను గూడా ఒక నామముతోను, ఒక రూపముతోను వ్యక్తపరచడానికి గాను ఒక నామాన్ని, అందుకు సమంజసమైన ఒక రూపాన్ని ఋషులు దర్శించి, ధ్రువపరిచారు. ఆ నామమే 'లలిత' ఆ రూపమే మనం పూజించే ''లలితాదేవి యొక్క దివ్యమంగళ విగ్రహము'' ఈ లలితాదేవియే – సహస్ర నామస్తోత్రంలో 'శ్రీమాతా', 'జగద్ధాత్రీ', 'జగతీకందా', 'పరమేశ్వరీ' సృష్టికర్త్రీ 'విశ్వగర్భా' మొదలైన నామాలతో ప్రతిపాదింపబడింది.

## 'లలితా' నామ ప్రాశస్త్యం

'లలిత' అనే పదంలో ఒక 'ల' కారం, ఒక 'లి' కారం, ఒక 'త' కారం వున్నాయి. 'తల్లి' అనే పదంలో గూడా ఒక 'త' కారం ఒక 'లి' కారం ఒక 'ల' కారం వున్నాయి. ఇదీ – 'లలిత' పదానికి 'తల్లి' పదానికి మధ్య వుండే సంబంధం. సంస్కృతంలో 'తల్లి' అనే పదానికి 'యువతి' అని అర్థం. సంస్కృతంలోనే 'మతల్లికా' అనే పదం వుంది. ఈ పదానికి – 'శ్రేష్ఠమైన' (A word used at the end of nouns to denote excellence or anything best of its kind') అని తెలుపడానికి నామవాచకాల చివర ఉపయోగిస్తారు. ఉదా: 'గోమతల్లికా' – అంటే 'శ్రేష్ఠమైన గోవు' అని అర్థం. ఈ 'మతల్లికా' పదంలో గల మొదట, చివర ఉన్న 'మ', 'కా' అక్షరాలకు మధ్యగా ఆ పదానికి ప్రాణప్రదంగా వున్న రెండు అక్షరాల పదమే 'తల్లి'. ఈ 'తల్లి' అనే పదమే రూపాంతరం చెంది, దర్శించిన ఋషులకు 'లలిత' గా భాసించి వుండవచ్చును. ('కశ్యపః' – 'పశ్యకః' అయినట్లు అన్నమాట!)

## తెలుగువారి అదృష్టం

జన్మనిచ్చే మాతృ స్వరూపిణిని తెలపడానికి తెలుగుభాషలో పైన వివరించిన 'తల్లి' అనే పదాన్నే తీసుకోవడం మన తెలుగువారి అదృష్టం. అంటే – జగజ్జనని నామం అయిన 'లలిత' యే మన తెలుగు భాషలో తల్లిగా రూపాంతరం చెందింది అని గూడా చెప్పుకోవచ్చును. దీనిని బట్టి మిగిలిన వారి కంటె మన తెలుగు వారికి లలితాదేవి మరింత దగ్గరైన తల్లి అనడం సమంజసమే గదా!

## తల్లి - ప్రథమ దైవం

ప్రతి వ్యక్తి తాను పుట్టునపుడు – తల్లి నుండి వేరు పడి, తల్లి ప్రక్కన, తల్లి ఒడిలో పడుకుంటాడు. ముందుగా తల్లిని గుర్తు పడతాడు. (మాతా పూర్వరూపమ్ – తైత్తిరీయం). సాధారణంగా తల్లి చెప్పిన తరువాతనే, తల్లి చూపించిన తరువాతనే గాని తండ్రిని, తదితరులనుచూడ్డం, గుర్తుపట్టడం జరగదు (పితోత్తర, రూపమ్ – తైత్తిరీయమ్) కాబట్టి, ప్రతి వ్యక్తికి ప్రథమ గురువు – తల్లి. మొదటగా పరిచయమై,

ప్రేమను పంచు వ్యక్తి - తల్లి. ప్రథమ గురువుగా, ప్రేమ పూర్వక పోషణ కర్తగా, రక్షణ కర్తగా వ్యవహరించు వ్యక్తి - తల్లి. ఇన్ని విధములుగా ఆదుకొను 'తల్లి' ప్రతి వ్యక్తికి ప్రథమ దైవమని తైత్తిరీయోపనిషత్తు నందు 'మాతృదేవోభవ' అని చెప్పబడింది. ఇక అందరి తల్లులకు మూలమైన విశ్వజనని అయిన లలితాదేవి ప్రథమ, ప్రధాన దైవం అవుతుందని మళ్లీ వేరే చెప్పాల్సిన పనిలేదు గదా!

## లలితా స్తోత్ర ఆవిర్భావము

జగజ్జనని అయిన లలితాదేవి అందరికీ ప్రథమ, ప్రధాన దైవం గాబట్టి, ఆ లలితా దేవి యొక్క వైభవాన్ని గూర్చి చెప్పమని అగస్త్యుల వారు అభ్యర్థించినపుడు హయగ్రీవుల వారు చెప్పిన లలితోపాఖ్యానం లోనిదే ఈ లలితా సహస్ర నామస్తోత్రం. ఈ లలితోపాఖ్యానం బ్రహ్మాండ పురాణం లోనిది. విశ్వముగా విచ్చుకొన బోయే ముందు వుండే విశ్వము యొక్క విత్తనస్థితిని 'బ్రహ్మాండం' అంటారు. విచ్చుకొన్న తర్వాత 'వివిధత్వము' గాను, విచ్చుకొనక పూర్వము' ఏకత్వము' గాను ఉండే జగన్మాత పరతత్త్వము ఈ స్తోత్రంలో ప్రతిపాదింపబడుతుంది.

## లలితోపాఖ్యానంలోని విభాగాలు

లలితోపాఖ్యానములోని మొత్తం శ్లోకాల గురించి ఈక్రింది శ్లోకం చెబుతుంది.

శ్లో. పంచాశదేక ఆదౌ, నామసు సార్ధ ద్వ్యశీతి శతమ్,
షడశీతిః సార్ధాంతే, సర్వే వింశతి శతత్రయమ్ శ్లోకాః

(పదవి భాగం: పంచాశత్, ఏక, ఆదౌ, నామసు, స + అర్ధ, ద్వి + అశీతి, శతమ్, షట్ + అశీతిః, స + అర్ధా + అన్తే, సర్వే, వింశతి శతత్రయం, శ్లోకాః)

పై శ్లోకాన్ని బట్టి లలితోపాఖ్యానంలోని శ్లోకాలను మూడు భాగాలుగా విభజించినట్లు తెలుస్తోంది. ఇవి - 1) ఉపోద్ఘాతం 2) నామాలు 3) ఫలశ్రుతి. ఉపోద్ఘాతంలో 51 శ్లోకాల లోను, నామాలు 182 1/2 శ్లోకాలలోను, ఫలశ్రుతి 861/2 శ్లోకాలలోను వుండి మొత్తం 320 శ్లోకాలు ఉంటాయి. వాస్తవానికి ఉపోద్ఘాతంలో 50 శ్లోకాలే వుంటాయి. 51వ శ్లోకమే ధ్యాన శ్లోకం. ఈ ధ్యాన

శ్లోకం (''అరుణాం కరుణా ... అంబికాం'' అనే శ్లోకం) బ్రహ్మాండ పురాణంలోనిది కాదు. అందుకనే దాన్ని పంచాశత్ + ఏక (50 + 1) అని పై శ్లోకంలో విడదీసి వ్రాయడం జరిగింది.

## లలితాస్తోత్ర విశిష్టత

ఈ లలితా సహస్ర నామస్తోత్రం అతి జాగ్రత్తగా వ్రాయబడింది. శివ, విష్ణు, లక్ష్మి సహస్ర నామాది స్తోత్రాలు చాలా వున్నప్పటికీ లలితా సహస్ర నామ స్తోత్రానికి ఒక ప్రత్యేకత వుంది. మిగతా సహస్రనామ స్తోత్రాల్లో – తు, చ, స్మ, తథాహ, – మొదలైన వ్యర్థ పదాలు, వ్యర్థ అక్షరాలు ఉండవచ్చునేమో కాని, ఈ లలితా సహస్ర నామ స్తోత్రంలో ఒక్క వ్యర్థపదంగాని, వ్యర్థ అక్షరం గాని వుండదు. అన్నీ నూటికి నూరుపాళ్లూ నామాలే! (సాధారణంగా వేద వ్యాసులవారి శ్లోకాల్లో ''చ'' అనే అక్షరం ఎక్కువగా వస్తుంది. అందుకే 'చ కారకుక్షి' అని వ్యాసుల వారిని కాళిదాసు అన్నాడని గూడా లోకంలో చెప్పుకుంటారు. కాని, ఈ లలితాస్తోత్రంలో మొదటి నుండి చివరిదాకి ఎక్కడా 'చ' అనే అక్షరం – 'మరియు' అనే అర్థాన్ని తెలిపే పదంగా వాడబడలేదని గూడా గ్రహించాలి. అందుకని కాళిదాసు అన్నమాటకు ఈ స్తోత్రం – వ్యాసుడు 'చకారకుక్షి' కాడని సమాధానం చెబుతుంది).

స్థావర జంగమాత్మకమైనదే ఈ సృష్టి. ఈ విశ్వమంతా స్త్రీ, పురుష, నపుంసకాత్మకమైన వ్యక్తి, వస్తు, సముదాయంతో నిండి వుంటుంది. సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారు గూడా – ఈ స్తోత్రంలో 'బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ' 'శ్రీశివా' 'శివశక్త్యైక్యరూపిణీ' మొదలైన నామాల చేత పరబ్రహ్మ తత్త్వంగా పరిగణింపబడి, స్తోత్రంలో స్త్రీ లింగ, పుంలింగ, నపుంసకలింగాలకు చెందిన పద శబ్దాలతో ప్రతిపాదింపబడుతుంది.

ఇతర సహస్ర నామాల్లో వుండే విధంగా ఈ స్తోత్రంలోని నామాలు పాడి పాడిగా ఉండే నామాలు కాదు. ఈ నామాల వరుసలో అంతర్లీనంగా ఒక సూత్రము వుంది. కథాగమనం వుంది. ఇతర స్తోత్రాల్లో తెలియపరచని శాస్త్ర విషయాలెన్నో వున్నాయి. ఉపమాన, రూపకాలంకారాదులు, సమాసాలు, శిల్పము ఉండి – పాఠకులు చదువుతున్నపుడు ఒక మహా దృశ్యకావ్యంగా భాసించి, కావ్య కళావైభవముతో అమ్మవారు సాక్షాత్కరించి, ఆనందానుభూతిని కలుగ చేస్తుంది. ఈ స్తోత్రంలో వుండే –

ఉదా: నారాయణీ, నాదరూపా, నామరూపవివర్జితా;
రంజనీ, రమణీ, రస్యా, రణత్కింకిణి మేఖలా;
రమా, రాకేందు వదనా, రతిరూపా, రతిప్రియా;
రక్షాకరీ, రాక్షసఘ్నీ, రామా, రమణలంపటా;

మొదలైన నామమాలికలన్నీ రాగమాలికల లాగా భాసించి, ఒక అనిర్వచనీయమైన మానసోల్లాసాన్ని కలుగజేస్తాయి.

ఈ స్తోత్రంలో వుండే శ్లోకాల సంఖ్య ఏఏ అక్షరాలతో ప్రారంభింపబడి, ఆ అక్షరాల ప్రారంభంతో ఎన్నెన్ని నామాలుంటాయో - ఇవి అన్నీ గూడా ఒక పద్ధతి ప్రకారం వుంటాయి. ఉన్న నామాలను తీసివేయటం గాని, క్రొత్త వాటిని చేర్చటం గాని, మార్చడం గాని చేయడానికి వీలుకాని విధంగా - మంచి కట్టుదిట్టంగా - నామాలన్నీ నిబద్ధమై ఈ స్తోత్రంలో వుంటాయి. ఈ విషయం పూర్తిగా అవగాహన కావాలంటే కొన్ని శాస్త్ర సంబంధమైన సాంకేతిక విషయాలు ముందుగా తెలుసుకోవాలి. ఉదాహరణకు ఈ క్రింది శ్లోకం చూడండి.

## సాంకేతిక విషయాలు (Symbolic Terminology)

శ్లో. త్రిపురాం కులనిధి మీడే 2 రుణ శ్రియం కామరాజవిద్ధాంగీమ్,
త్రిగుణైర్దేవైర్నినుతామే కాన్తాంబిన్దుగాం మహారమ్భామ్.

పద విభాగం:
త్రిపురాం, కులనిధిమ్, ఈడే, అరుణ శ్రియమ్, కామరాజ విద్ధాంగీమ్,
త్రిగుణైః, దేవైః, నినుతాం, ఏకాం, తాం, బిందుగాం, మహారమ్భామ్.

ఈ శ్లోకానికి రెండు రకాల అర్థాలున్నాయి. 1) బాహ్యార్థం 2) అంతరార్థం

బాహ్యార్థం : మూడు పురములు కలది, కులమునకు గని అయినది, అరుణకాంతులు గలది, శివునితో సమానమైన శరీరం గలది, త్రిగుణ స్వరూపులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులచే స్తుతింప బడునది, సాటిలేని మేటి స్వరూపము గలది, శ్రీ చక్ర మధ్య బిందునివాసిని, మహాస్సృష్టికి ఉన్ముఖురాలు - అయిన శ్రీ త్రిపురసుందరీ దేవిని స్తుతించుచున్నాను.

ఇక అంతరార్థం తెలియాలంటే కొన్ని సంకేతాలు తెలియాలి. అక్షరాలతో అంకెలు తెలుసుకునే విధానం 'వరరుచి' మొదట తెలిపాడు. అంకెలకు అక్షరాలకు ఈ క్రింద తెలిపిన సంబంధాన్ని గుర్తు పెట్టుకోవాలి.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 0 |
| క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ | | | | | |
| య | ర | ల | వ | శ | ష | స | హ | | |

పైన తెలిపిన పట్టికలో ప్రకారం – క, ట, ప, య – ఈ నాలుగు అక్షరాలు – '1' అంకెను సూచిస్తాయి. అలాగే – ఖ, ఠ, ఫ, ర – ఇవి '2' ను సూచిస్తాయి. ఈ విధంగా అర్థం చేసుకుంటూ చివరకు – ఞ, న – ఈ రెండు అక్షరాలు '0' ను సూచిస్తాయి అని తెలుసుకోవాలి.

పై సంకేతాలను బట్టి ఉదా:– 'కర' – అంటే, – క – 1, ర – 2 కాబట్టి, 'కర' అంటే 12 అవుతుంది. కాని, సంస్కృతంలో 'అంకానాం వామతో గతిః', అంటే – అంకెలను లెక్కపెట్టడంలో ఎడమ వైపుగా అంటే – కుడి నుండి ప్రారంభించి ఎడమ వైపుగా అని చదువుకుంటే 'కర' అనే పదం 21 అనే సంఖ్యను సూచిస్తుంది. ఉదా:– 'ఫల' అనే పదంలో ఫ – 2, ల – 3 లను సూచిస్తాయి గాబట్టి 'ఫల' అనే పదం 23 సంఖ్యను సూచించినా 'వామతోగతిః' అన్న సూత్ర ప్రకారం ''32'' అవుతుంది.

ఒక్కొక్కప్పుడు సంయుక్తాక్షరం వస్తే – రెండవ అక్షరానికే ప్రాధాన్యం వుంటుంది. ఉదా: ''మ్భాం'' అనే సంయుక్తాక్షరం వుంటే 'మా' అనే అక్షరాన్ని తీసుకోకుండా 'భాం' అనే అక్షరాన్నే తీసుకోవాలి. దీనిని బట్టి 'రమ్భాం' అనే పదంలో ర – 2, భా – 4 గా తీసుకుని 24 గా మొదట గుర్తించి, అటుపైన తారుమారు చేసి 42గా అర్థం చేసుకోవాలి.

ఒక్కొక్కప్పుడు ఇలా కాకుండా మరికొన్ని సంకేత పదాలుంటాయి. ఉదా:– 'అగ్ని' అనే పదం త్రేతాగ్నులను సూచిస్తుంది కాబట్టి 'అగ్ని' అనే పదం – 3 సంఖ్యను

సూచిస్తుంది. ఉదా:– 'చక్ర' అనే పదం షట్చక్రాలను సూచిస్తుంది. కాబట్టి 'చక్ర' అనే పదం – 6 సంఖ్యను సూచిస్తుంది. అలాగే 'ద్వార' అనే పదం నవద్వారాలను సూచిస్తుంది కాబట్టి 9 సంఖ్యను, 'రాశి' అనే పదం ద్వాదశ రాశులను సూచిస్తుంది కాబట్టి, 12 సంఖ్యను సూచిస్తాయి – అని ఈ విధంగా ఈ పదాలను అర్థం చేసుకోవాలి.

ఇంతవరకు చెప్పిన విషయాలను గుర్తు పెట్టుకుని ముందు చెప్పిన ''త్రిపురాం ... మహారమ్భామ్'' అన్న శ్లోకంలో వున్న అంతరార్థం తెలుసుకోవచ్చును.

1. త్రి/పురాం:– పు – 1, ర – 2 కాబట్టి, పురాం – 21 అవుతుంది అంటే 'త్రి' అనే అక్షరంతో ప్రారంభమయే నామాలు 21 వుంటాయి అని అర్థం.

2. కుల/నిధి:– నిధి – అంటే నవనిధులు. ఇవి 9 కాబట్టి 'కుల'తో ప్రారంభమయే నామాలు 9 వుంటాయి అని అర్థం.

3. అరుణ / శ్రియం:– 'అరుణ' అంటే సూర్యుడు అంటే ఆదిత్యుడు. ఈ ఆదిత్యులు 12 మంది వుంటారు కాబట్టి, 'శ్రియం' అంటే – 'శ్రీ' గాబట్టి 'శ్రీ' అనే అక్షరంతో ప్రారంభమయ్యే నామాలు 12 వుంటాయి అని అర్థం.

4. కామ/రాజ :– రాజులు – 16 గురు వుంటారు. (షోడశరాజులు) కాబట్టి 'కామ' అనే పదంతో ప్రారంభమయే నామాలు 16 వుంటాయి అని అర్థం.

5. వి/ద్ధాంగీం :– ధ – 9, గీం – 3 సూచిస్తాయి. వామ గతిని బట్టి 'ద్ధాంగీం' – 39 సంఖ్యను సూచిస్తుంది. అంటే, 'వి' తో ప్రారంభమయే నామాలు 39 వుంటాయి అని అర్థం.

6. త్రి / గుణైః– 'త్రి' అంటే 3 కాబట్టి 'గుణ' పదంతో ప్రారంభమయే నామాలు 3 వుంటాయి –

7. ని/నుతాం:– ను – 0, తాం – 6. కాబట్టి, వామగతిని అనుసరించి 'నుతాం' పదం – 60 సంఖ్యను సూచిస్తుంది. అంటే – 'ని' అక్షరంతో ప్రారంభమయే నామాలు '60' వుంటాయి అని అర్థం.

8. ఏకాం/తాం: 'ఏకాం' అంటే 'ఒకటి' అని అర్థం కాబట్టి – 'తాం' అనే అక్షరంతో

ప్రారంభమయే నామం ఒక్కటే వుంటుంది అదే 'తాంబూల పూరితముఖీ' అనే నామం.

9. బిందు/గాం : గాం – 3 కాబట్టి, 'బిందు' అనే పదంతో ప్రారంభమయే నామాలు మూడు వుంటాయి. అవే – 1) బిందుతర్పణ సంతుష్టా 2) బిందు మండలవాసినీ, 3) బైందవాసనా అనే నామాలు. (ఇక్కడ 'బిందు' అంటే బిందు అనే పదం లేదా బిందు సంబంధమైన పదం అని పరిగణించాలి)

10. మహా/రమ్భాం : రం – 2, భాం – 4 కాబట్టి వామగతిని అనుసరించి 'రంభాం' అనే పదం 42 సంఖ్యను సూచిస్తుంది. అంటే ''మహా' అనే పదంతో ప్రారంభమయే నామాలు 42 వుంటాయి అని అర్థం.

ఇంకా ఇతర అక్షరాలతో లేదా – పదాలతో ప్రారంభమై వచ్చే నామాలు, వాటి సంఖ్యలు ఇదే విధంగా కట్టుదిట్టంగా నిబద్ధమై వుంటాయి. ఇక్కడ కొన్ని మాత్రమే ఉదాహరణ పూర్వకంగా వివరింపబడ్డాయి.

## నామాలున్న శ్లోకాలు 182 1/2 ?

లలితా అమ్మవారి వెయ్యి నామాలు – మొత్తం 182 1/2 శ్లోకాలలో నిక్షిప్తం చెయ్య బడ్డాయని ఇంతకు పూర్వం చెప్పబడింది. 'శ్రీమాతా' అనే నామం దగ్గఱ నుండి 'లలితాంబికా' అనే నామందాకా మొత్తం వెయ్యి నామాలు 182 1/2 శోకాల్లో వుంటాయి. ''ఏవం శ్రీలలితా దేవ్యానామ్నాం సాహస్రకం జగుః'' అనేది 183వ శ్లోకంలోని రెండవ సగం. ఈ సగభాగంలో నామాలు వుండవు. అందుకని మొత్తం వెయ్యి నామాలు 182 1/2 శ్లోకాల్లోనే కూర్చబడ్డాయి అని తెలుస్తోంది. ఇలా వెయ్యి నామాలు 182 1/2 శ్లోకాల్లోనే నిక్షిప్తం చెయ్యడానికి కారణం వుంది.

ఒక సంవత్సరంలోని పగలు లేదా వెలుగు భాగాన్ని – అమ్మవారితోను; రాత్రి లేదా చీకటి భాగాన్ని – అయ్యవారితోను సమన్వయ పరచుకున్నాం కాబట్టి, అల్లాంటి సంవత్సరంలో వుండే సగం రోజుల పగటి భాగాన్ని – అమ్మవారికి సంబంధించినదిగా సమన్వయ పరచుకుంటే – సంవత్సరానికి 365 రోజులు (సూర్యుని చుట్టూ భూమి తిరగడానికి పట్టే రోజుల సంఖ్య) కాబట్టి, అందులో సగం రోజుల కాలం అంటే,

182 1/2 రోజుల కాలభాగం అమ్మవారికి సంబంధించినది అవుతుంది. అందుకని వ్యాసులవారు అమ్మవారి వెయ్యినామాలను 182 1/2 శ్లోకాల్లోనే నిక్షిప్తం చేశారు.

## అమ్మవారి మంత్ర బీజాక్షరాలు

శ్రీ విద్యాదేవత గూర్చి 'నిత్యోత్సవ తంత్ర' గ్రంథంలో ఇలా చెప్పబడింది.

''వాంతం వహ్ని సమారూఢం
వామనేత్రేందు సంయుతమ్''

పై శ్లోక పాదాలకు రెండు రకాల అర్థాలున్నాయి. 1) బాహ్యార్థం 2) అంతరార్థం. బాహ్యార్థం అమ్మవారి లక్షణాన్ని గూర్చి, అంతరార్థం అమ్మవారి బీజాక్షరం గురించి చెబుతాయి.

బాహ్యార్థం:- ''ఎడమ కంటిలో చంద్రుని కలిగినది, వెడల గ్రక్కుచూ వుండు అగ్నితేజస్సును అధిరోహించునది''

చంద్రుని వెన్నెల - చల్లదనాన్ని, ఆహ్లాదాన్ని సూచిస్తుంది.

అగ్ని తేజస్సు - చైతన్యవంతమైన శక్తి ప్రకాశ ప్రసారాన్ని సూచిస్తుంది.

ఈ రెంటినీ బట్టి - పై శ్లోక పాదాలకు -

''ప్రకాశవంతమైన శక్తి ప్రసారాన్ని కలిగిన సాన్నిధ్య లక్షణం, ఆనందకరమైన అనుగ్రహాన్ని వర్షించే లక్షణం - కలిగిన దేవతయే ఈ శ్రీవిద్యకు అధిష్ఠాత్రి'' అని అర్థం వస్తుంది.

అంతరార్థం తెలియాలంటే - ఈ పాదాల్లో వాడిన పదాల అంతరార్థాలు, సంకేతార్థాలు ముందు తెలియాలి. అప్పుడు ఆ సంకేత అర్థాలు సూచించే వాటిని బట్టి ఈ రెండు పాదాల్లో ఇమిడి వున్న రహస్యం బయట పడుతుంది. 'వాంతం' - అంటే, 'వ'కు తరువాత వచ్చే అక్షరం - అంటే ''శ'', 'వహ్ని' - అంటే, మంత్రశాస్త్రంలో రేఫము ('ర'కారం) అని అర్థం. 'సమారూఢం' - అంటే, అధిరోహించిన అని అర్థం. 'నేత్రం' - అంటే మంత్ర శాస్త్రంలో గుడి ('ఇ' కారం) అని, 'వామనేత్రం' అంటే - గుడిదీర్ఘం - ('ఈ' కారం) అనీ అర్థాలు.

'ఇందు' – అంటే చంద్రుడు – అంటే – ''0'' (పూర్ణబిందువు) అని, ''సంయుతమ్'' – అంటే 'కూడిన' అనీ అర్థం.

ఇప్పుడు రెండు పాదాల సంకేతార్థాలు కలిపితే –

'శ' కార 'ర' కార, 'ఈం' కారాల కూడికతో వచ్చే అక్షరం అంటే, ''శ్రీం'' అని అర్థం.

కాబట్టి; అమ్మవారికి సంబంధించిన ప్రధానమైన బీజాక్షరం ''శ్రీం'' అన్నమాట!

## ''శ్రీ'' విశేషం

అవ్యక్తానికి సంబంధించిన పరమేశ్వరుని ఉచ్చరించడానికి ''ఓం'' అనేది బీజాక్షరం. అంటే – ఇది జగత్పితకు సంబంధించిన బీజాక్షరం. వ్యక్తానికి సంబంధించిన పరమేశ్వరిని ఉచ్చరించడానికి 'శ్రీం' అనేది బీజాక్షరం అవుతుంది. అంటే, ఇది జగన్మాతకు సంబంధించిన బీజాక్షరం అన్నమాట! ఓం – అక్షరంలో 'అ–ఉ–మ' అనే మూడు అక్షరాలున్నట్లే – 'శ్రీ' – అక్షరంలో గూడా 'శ–ర–ఈ' అనే మూడు అక్షరాలున్నాయి. ఇవి వరుసగా ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులకు ప్రతీకలు. వీటిమీదనే మొత్తము వ్యక్త స్పష్టి అంతా ఆధారపడి వుంటుంది. అందువల్లనే ఈ స్తోత్రం – శ్రీమాతా, శ్రీ మహారాజ్ఞీ, శ్రీమత్సింహాసనేశ్వరీ అని 'శ్రీ' తో ప్రారంభింపబడే మూడు నామాలతో మొదలు పెట్టి, 'శ్రీచక్రరాజనిలయా' 'శ్రీమత్త్రిపురసుందరీ,' 'శ్రీశివా' అని మళ్లీ 'శ్రీ' తోనే ప్రారంభింపబడే మూడు నామాలతో ముగింపబడింది. అంతేకాదు – 'జన్మ'కు సంబంధించిన 'శ్రీమాతా' నామంతో ప్రారంభింపబడి, 'ముక్తి'కి సంబంధించిన 'శివశక్త్యైక్యరూపిణీ' అనే నామంతో ముగింపబడటం గూడా ఒక ప్రత్యేకత అనే చెప్పాలి.

## పంచదశాక్షరీ మంత్రం: ఆశ్వయుజ శుక్లపక్షం.

ప్రతి మాసంలోను శుక్లపక్షంలో దినదినానికి వెన్నెల వెలుగులు పెరుగుతూ చివరకు 'పూర్ణిమ' వస్తుంది. అందుకని ఈ శుక్ల పక్షాన్ని అమ్మవారికి సంబంధించినదిగా సమన్వయ పరచుకోవాలి. కృష్ణ పక్షంలో దినదినానికి చీకటి పెరగుతూ చివరకు 'అమావాస్య' వస్తుంది. అందుకని కృష్ణ పక్షాన్ని అయ్యవారికి సంబంధించినదిగా సమన్వయ పరచుకోవాలి.

అమ్మవారికి సంబంధించిన శుక్ల పక్షంలో పాడ్యమి నుండి పూర్ణిమ వరకు మొత్తం 15 తిథులుంటాయి. ఈ 15 తిథులను అనుసరించి 15 బీజాక్షరాలు గల ఒక మంత్రాన్ని ఋషులు దర్శించి, సమన్వయ పరచి ఇచ్చారు. ఆ మంత్రం –

''క, ఏ, ఈ, ల, హ్రీం; హ, స, క, హ, ల, హ్రీం; స, క, ల, హ్రీం''

ఈ మంత్రాన్నే 'పంచదశాక్షరీ మంత్రం' అంటారు. ఈ మంత్రాన్ని సంకేత పదాలతో ఒక శ్లోకంలో ఇచ్చారు.

''కామో, యోనిః, కమలా, వజ్రపాణి, ర్గుహా; హ, సా
మాతరి, శ్వాభ్ర, మింద్రో, గుహా; స, క, లా, మాయయావృతా''.

ఈ శ్లోకంలోని పదాలు సూచించే బీజాక్షరాలను విడదీస్తే, క, ఏ, ఈ, ల, హ్రీం; హ, స, క, హ, ల, హ్రీం; స, క, ల, హ్రీం' అనే పంచదశాక్షరీ మంత్రం వస్తుంది.

''ఒక్కొక్క బీజాక్షరానికి ఒక్కొక్క రోజు చొప్పున, పదిహేను బీజాక్షరాలకు 15 రోజులుగా అమ్మవారు ఆరాధింపబడుతుంది''. ఈ విషయం లలితాసహస్ర నామాల్లోనే సూచన ప్రాయంగా ఈ క్రింద తెలిపిన నామం తెలియపరుస్తుంది –

''ప్రతి పన్ముఖ్యరాకాంత తిథిమండల పూజితా''

'ప్రతిపత్' – అంటే, పాడ్యమి నుండి 'రాకాంతా' – అంటే, పూర్ణిమాంతం వరకు ఆరాధింపబడునది'' అని పై నామానికి అర్థం. సంవత్సరంలోని ప్రతి మాసంలోను వచ్చే శుక్లపక్షంలో పాడ్యమి నుండి పూర్ణిమ వరకు 15 తిథులు వున్నప్పటికీ – ఆశ్వయుజ మాసంలో వచ్చే శుక్ల పక్షానికి సంబంధించిన 15 రోజులే అని గూడా పై నామంలో సూక్ష్మంగా ''ముఖ్య'' అనే పదం ద్వారా సూచింపబడింది. ఆ సూక్ష్మ విషయం చూద్దాం!

'అశ్వినీ' నక్షత్రంలో చంద్రుడు వుండి సరిగ్గా $180^0$ లలో ఎదురుగా సూర్యుడున్న రోజును 'ఆశ్వయుజ పూర్ణిమ' అంటారు. ఈ పూర్ణిమకు ముందు వున్న 15 రోజులు, తరువాత వున్న 15 రోజులు కలిసి మొత్తం 30 రోజులను 'ఆశ్వయుజమాసం' అంటారు. అలాగే, కృత్తికా నక్షత్రం తాలూకు మాసాన్ని కార్తీక మాసం అనీ, 'మృగశిరా' నక్షత్రం తాలూకు మాసాన్ని మార్గశిర మాసం అనీ ... 'ఫల్గుణీ' నక్షత్రం తాలూకు మాసాన్ని

ఫాల్గుణ మాసం అనీ అంటారు. ఇలాగే చిత్ర, విశాఖ... మొదలైన కొన్ని ఇతర నక్షత్రాల తాలూకు మాసాలు చైత్ర, వైశాఖ ..... మొదలైన మాసాల్లాంటివౌతాయి.

అశ్వినీ నక్షత్రం 27 నక్షత్రాల్లో మొదటిది. కాబట్టి, ఈ మొదటి నక్షత్రానికి సంబంధించిన 'ఆశ్వయుజ మాసం'' ఒక విధంగా మొదటి మాసం అవుతుంది. అంటే సంవత్సరానికి ముఖం (అంటే ముందు వచ్చే మాసం) అంటే – 'ముఖ్య' మైనది అవుతుందన్నమాట. అదీ కాక ఈ ఆశ్వయుజ మాస, కార్తీక మాసాల్లోని శుక్ల పక్షాల్లో ఉత్తర అక్షాంశ రేఖా ప్రాంతాలైన మన భారతదేశం లాంటి ప్రాంతాల్లో చంద్రుడు సాయంత్రాలు త్వర త్వరగా ఉదయించి, ఎక్కువ కాలం ఆకాశంలో వెన్నెలలు విరజిమ్ముతాడు. ఇక పూర్ణిమ నాడైతే ఈ వెన్నెల పరాకాష్ఠగా వుంటుంది. అందుకే ఆ శరత్కాల పూర్ణిమా చంద్రుణ్ణి ''పరిపక్వచంద్రుడు'' అంటారు. ఖగోళ శాస్త్రం (Astronomy)లో గూడా శరత్కాల పూర్ణిమా చంద్రుణ్ణి 'Harvest Moon' అంటారు. ఈ 'ముఖ్యమైన పూర్ణిమ' ను తెలియ చెయ్యడానికే పై నామంలో ''ముఖ్యరాకా....'' అని సూచించారు.

## దాగుడుమూతల దరహాసాలు

నక్షత్రాల్లో మొదటిదైన 'అశ్వినీ' నక్షత్రం తాలూకు మాసమైన ఆశ్వయుజమాసం ఒక విధంగా మొదటి మాసం అయినట్లే – నక్షత్రాల్లో చివర్లో వచ్చే పూర్వాభాద్రా లేదా ఉత్తరాభాద్రా నక్షత్రాల తాలూకు మాసమైన భాద్రపదమాసం చివరిమాసం అవుతుంది. అందుకే ప్రతిమాసంలో వచ్చే అమావాస్య 'లయా' నికి సంబంధించినదే అయినా, చివరి మాసమైన భాద్రపద మాసంలో వచ్చే అమావాస్య 'మహాలయ అమావాస్య' ఔతుంది. (అంతంలో వచ్చే అధిక లయత్వాన్ని సూచించడానికి 'మహా' అనే విశేషణంతో ఈ అమావాస్యను సూచించారు).

భాద్రపద మాసం వర్షఋతువుకు సంబంధించిన శ్రావణ భాద్రపద మాసాల్లో చివరిది. ఈ వర్ష ఋతువులో ఆకాశం నల్లని మబ్బులతో నిండి చీకటిగా వుంటుంది. ముసురుగా వుంటుంది. హృదయంలో వుండే చోటును 'దహరాకాశం' అంటారు. శరదృతువు ప్రారంభంతో చీకటి పటాపంచలై వెన్నెల వెలుగులు విరజిమ్మబడతాయి. (' సర్వ శుక్లా సరస్వతీ ' అని అంటారు. అంటే – పరిశుద్ధమైన తెల్లని రంగులో సరస్వతి

ఉంటుంది' అని అర్థం. ఈ సరస్వతికే మరో పేరు 'శారద'. తెల్లని నిండు వెన్నెలల శరదృతువుకు 'శారద' పేరు పెట్టడంలోని ఔచిత్యమిదే ! ) అలాగే, హృదయగతమైన దహరాకాశం అజ్ఞానంతో నిండివుంటే – శారద ( అంటే సరస్వతి అని, శరదృతువు అనీ అర్థాలు) సాన్నిధ్య ప్రారంభంతో అజ్ఞాన తిమిరం పటాపంచలై సుజ్ఞాన ప్రకాశ దీపికలు విస్తరిల్లి హృదయం ప్రజ్ఞానవంత మౌతుంది కూడా !.

ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నాడు చంద్రునికి, సూర్యునికి మధ్య కోణీయదూరం (Angular Separation) $0^0$ నుండి $12^0$ దాకా వుంటుంది. భూమి మీద నుండి చూచేవారికి చంద్రుని వెన్నెల $12^0$కు తగ్గ అనుపాతంలోనే వుంటుంది. ఆ రోజు చంద్రుడు అంతగా కనబడక పోయినా ఈ $12^0$ మేరకు వుండే వెన్నెల మాత్రం ఉంటుంది.

సూర్యుణ్ణి అయ్యవారితోను, చంద్రుణ్ణి అమ్మవారితోను పోల్చుకోవాలి. అప్పుడు సూర్యుడు అనే అయ్యవారికి, చంద్రుడు అనే అమ్మవారికి జరిగే దాగుడు మూతల ఆటలో అమ్మవారి దర్శనం ఆరోజు వుండే వెన్నెల మేరకు మనకు కలుగుతుంది. ఈ వెన్నెల వెలుగులే అమ్మవారి సన్నని నవ్వుగా సమన్వయ పరచుకోవాలి. శుక్ల పక్షంలోని తిథుల క్రమంలో ఈ వెన్నెల – దిన దినానికి వృద్ధి చెందుతూ, అమ్మవారి పరిపూర్ణ హాసం యొక్క వికాసం పూర్ణిమ రోజున వుంటుంది. అందుకే – దశమితో ఆపకుండా పూర్ణిమ వరకు– యోగమార్గంలో వుండే ఉపాసనాపరులు, శ్రీవిద్యా ఉపాసకులు ఈ ఆశ్వయుజ మాస శుక్ల పక్షానికి చెందిన 15 రోజులూ అమ్మవారిని ఆరాధిస్తారు.

## మూడు కూటములు

ఇంతకుముందు తెల్పిన పంచదశాక్షరీ మంత్రం మూడు భాగాలుగా వున్నట్లు తేలికగా గమనించవచ్చు. ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క 'కూటము' అంటారు. పంచదశాక్షరీ మంత్రంలో మొదట వున్న కూటం 'క' తో ప్రారంభింపబడింది కాబట్టి, ఆ భాగాన్ని 'కాది కూటము' అని, రెండవది 'హ' తో ప్రారంభింపబడింది కాబట్టి, 'హాది కూటము' అని, మూడవది 'స' తో ప్రారంభింపబడింది కాబట్టి, 'సాది కూటము అనీ అంటారు. ఈ మూడింటినే వరుసగా ''వాగ్భవకూటము' 'మధ్యకూటము' 'శక్తికూటము' అని గూడా అంటారు. ఈ మూడింటినీ వరుసగా అమ్మవారి ముఖం

వుండే శిరో భాగంతోను, కంఠం నుండి నాభివరకు వుండే భాగంతోను, నాభి నుండి అడుగు భాగంతోను – న్యాసం చేసుకుని ఈ మంత్రాన్ని అమ్మవారుగా ఆరాధిస్తారు.

## దేవీ నవరాత్రులు

పైన పంచదశ రాత్రుల ప్రాముఖ్యం చెప్పబడింది గదా, మరి దేవీ నవరాత్రులేమిటి? అని సందేహం రావచ్చు ఇది వేరే కథ. అమ్మవారికి మహిషాసురునికి జరిగిన యుద్ధంలో రోజు రోజుకు అమ్మవారు విజృంభిస్తూ మహిషాసురుణ్ణి 9 వ రోజు రాత్రి సంహరిస్తుందని దేవీ భాగవతంలో చెప్పబడుతుంది. అందుకనే ఈ తొమ్మిది రోజులు అమ్మవారిని పూజిస్తారు. చివరి రోజైన తొమ్మిదవ రోజున అమ్మవారిని 'మహిషాసురమర్దిని' గా అలంకరించి పూజిస్తారు. అమ్మవారి ఈ విజయాన్ని పురస్కరించుకుని సుఖసంతోషాలతో ఆ మర్నాడు జరుపుకునే పండుగ విజయదశమి. (ఈ కథలోని మహిషాసురుడు, అతని పరివారం – మనలో వుండే అజ్ఞాన భావాలకు, ఆసురీగుణాలకు ప్రతీక లన్నమాట అమ్మవారు, అమ్మవారి పరివారం – జ్ఞాన సంపర్క భావాలకు, దైవీ గుణాలకు సంకేతాలన్నమాట ! ఆసురీ గుణాల మీద – దైవీ గుణాలు, అజ్ఞాన భావాలమీద జ్ఞాన భావాల యొక్క విజయాధి పత్యమే ఈ కథలోని అంతరార్థం)

## నవ 'రాత్రులు' ఏమిటి ?

చంద్రుని వెన్నెల వెలుగులు, పూర్ణిమ – ఇవి అమ్మవారికి సంబంధించినవి. ఆశ్వయుజ మాసంలో శుక్ల పక్షానికి చెందిన రాత్రులైతే అమ్మవారికి మరింత ఎక్కువ సంబంధమైనవి. ఈ శరత్కాల శుక్ల పక్షాల్లో, సంవత్సరం మొత్తం మీద వెన్నెల వెలుగులు పరాకాష్ఠ స్థితిలో వుంటాయి. ఆశ్వయుజ మాసం – సూర్యుడు కన్యారాశిలో ఉండగా ప్రారంభమౌతుంది. అందుకే ఆ మాసంలో సూర్యోదయ సమయానికి కన్యారాశి గూడా తూర్పున సూర్యునితో పాటు ఉదయిస్తుంది. సాయంకాల సమయానికి పడమట దిక్కు ప్రాంతానికి ఈ కన్యారాశి, ఆ రాశిలోని సూర్యుడు చేరతారు. ఈ కన్యారాశికి ముందే 'సింహరాశి' ఆ పడమట దిక్కు ప్రాంతాన్ని జేరుతుంది. అప్పుడు ఆ పశ్చిమ దిక్కువద్ద 'సింహరాశిపై కన్యారాశి వున్నట్లు' గోచరమౌతుంది. 'అలా వున్న అప్పటి స్థితి – 'అమ్మవారు సింహాన్ని అధిష్ఠించిన స్థితిని' స్ఫురింప చేస్తుంది. అమ్మవారి యొక్క

''శ్రీమత్సింహాసనేశ్వరీ'' అన్న నామంలో ఈ విషయం చెప్పబడుతుంది. ఈ ఆశ్వయుజ మాసంలోని శుక్లపక్షంలో ప్రతిరోజు సాయంకాలం నుండి సింహరాశిపై కన్యారాశి ఆధిపత్యం వుండడం వలన, సింహారూఢియై – మహిషాసురునితో 9 రోజులు యుద్ధం చేసి సంహరించడం వలన ఈ నవరాత్రులలో అమ్మవారిని ఆరాధించి, విజయదశమినాడు పండుగ జరుపుకోవడం సంప్రదాయమైంది.

## బిరుదునామాలు

ఈ లలితా సహస్ర నామ స్తోత్రంలో ఒక్క 'లలితాంబికా' అన్న నామం తప్ప మిగిలిన వన్నీ బిరుదు నామాలే ! చక్కని చరిత్ర వున్న చోట చక్కని స్తుతికి అవకాశం వుంటుంది. లలితా దేవి చక్కని మహిమాన్వితమైన చరిత్ర గలది. కాబట్టి, చక్కటి స్తుతికి పాత్రమైంది. ఈ మహిమాన్వితమైన చరిత్ర ఘట్టాలలోని ఒక్కొక్క ప్రత్యేక సందర్భాన్ని బట్టి, వైశిష్ట్యాన్ని బట్టి – ఒక్కొక్క 'నామం' అమ్మవారికి ఏర్పడింది. అంటే – ఇవన్నీ అమ్మవారికి బిరుదు నామాలన్నమాట ! అసలు నామంతో పిలిచినప్పటి కంటె బిరుదు నామంతో పిలిచినప్పుడు ఏ వ్యక్తికైనా ఎక్కువ సంతోషం కలుగుతుంది. బిరుదు నామంతో పిలిచినప్పుడు – ఆ బిరుదు నామం ఏ సందర్భంలో వచ్చిందో – ఆ సందర్భ సన్నివేశమంతా ఒక్కసారి స్ఫురణకు రావడమే ఇందుకు కారణం. కాబట్టి, అమ్మవారిని ఈ బిరుదు నామాలతో స్మరించి పారాయణం చేసి ప్రసన్నురాలిని చేసుకోడంలో చక్కని ఔచిత్యం గూడా వుంది.

త్రిమూర్తులకు, సర్వదేవతలకు గూడా ఆరాధ్యదైవం (హరి బ్రహ్మేంద్రసేవితా, 'సచామర రమావాణీ సవ్యదక్షిణసేవితా, మొదలైన నామాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తాయి) కాబట్టి, అమ్మవారిని ఆరాధిస్తే సర్వదేవతలను ఆరాధించినట్లే అవుతుంది. అందుచేత అమ్మవారిని ఆరాధించి, అమ్మ అనుగ్రహాన్ని పొంది – ఆయురారోగ్య ఐశ్వర్య జ్ఞాన భోగ మోక్షాలను అన్నిటినీ పొందవచ్చును.

## నామాల అనువర్తనాలు (Applications)

ఈ లలితా సహస్ర నామస్తోత్రంలోని నామాలన్నీ రహస్య నామాలు: వీటికి మామూలుగా నిఘంటువుల ద్వారా తెలుసుకొనే అర్థాలే గాక గూఢార్థాలు, సంకేతార్థాలు,

అంతరార్థాలు గూడా వుంటాయి. కొన్ని కొన్ని నామాలకు ప్రత్యేకమైన అనువర్తనం (application) వుంటుంది.

ఉదా: 1) 'పాయసాన్న ప్రియాత్వక్స్థా'

అనే 99వ శ్లోకంలోని 'త్వక్స్థా' అనే నామాన్ని 'త్వక్స్థాయై నమః' అని సంపుటి చేసి జపిస్తే చర్మవ్యాధులున్న వారికి ఆ చర్మవ్యాధులు తగ్గుతాయి.

ఉదా: 2) 'మూలాధారాంబుజారూఢా పంచవక్త్రాస్థి సంస్థితా ...' అనే 106వ శ్లోకంలోని 'అస్థి సంస్థితా' అనే నామాన్ని 'అస్థి సంస్థితాయై నమః' అని సంపుటి చేసి జపిస్తే ప్రమాదాల్లో ఎముకలు విరిగిన వారికి ఆ ఎముకలు అతి శీఘ్రకాలంలో అతుక్కుని పూర్వస్థితిని పొందుతారు.

ఉదా: 3) 178వ శ్లోకంలోని 'సువాసిన్యర్చన ప్రీతా' అనే నామాన్ని ''సువాసిన్యర్చన ప్రీతాయైనమః'' అని సంపుటి చేసి జపిస్తే – వివాహం కాని కన్యలకు త్వరగా వివాహం అవుతుంది. ఇదే విధంగా చాలా నామాలకు ఇటువంటి ప్రత్యేకత వుంది. అయితే అలాంటి నామాలన్నిటినీ లాభం రావడానికి మాత్రమే జపించకూడదు. లాభం వస్తుందంటే చేసేది – వ్యాపారం అవుతుంది గాని భక్తి అవదు. భక్తిలేనపుడు అనుగ్రహం సిద్ధించదు. భక్తితో మనం పారాయణ చేస్తే మనకు కావలసినవి – అవసరాన్ని బట్టి, అవసరమైన సమయాల్లో అమ్మవారే మనకు సమకూరుస్తుంది.

## ముఖ్య గమనిక

ఏ స్తోత్రాన్నైనా ఒక్కొక్క బాణీ (Tune)తో చదువుతూ వుంటాం. ఆ విధంగా చదవడంలో ఒక విసురు, ఆవేగము మనకు తెలియకుండానే వస్తాయి. ఆవేగపు విసురులో ఒక్కొక్కప్పుడు నామాలను అర్థరహితంగా విరవడం గూడా సంభవించవచ్చు. ఒక్కొక్కప్పుడు అర్థరహితంగానే గాక పెడర్థాలకు గూడా దారితీయడం సంభవించవచ్చు.

1) ఉదా:– 15వ శ్లోకంలోని మెదటి రెండు పాదాలను –

'లక్ష్యరోమలతాధారా – తాసమున్నేయ మధ్యమా'

అని – రెండు ముక్కలుగా విరిచి చదవడం బాణీకి సదుపాయంగా సరిపోవచ్చు నేమో గాని అలా మాత్రం విరవకూడదు 'లక్ష్యరోమ లతాధారతాసమున్నేయమధ్యమా' అని రెంటినీ కలిపి '16 అక్షరాల నామం' గానే చదవాలి. ఒక వేళ కాస్త విరామం తీసుకోదలిస్తే – 'లక్ష్యరోమలతాధారతా – సమున్నేయమధ్యమా' అని 'లతాధారతా' తరువాత కించిత్ విరామం తీసుకోవచ్చు. (అసలు విరామం లేకుండా చదవడమే ఉత్తమం)

2) ఉదా:– 51వ శ్లోకంలోని మొదటి రెండు పాదాలను –

'దుష్టదూరా – దురాచారశమనీ – దోషవర్జితా' అని విడదీసి మాత్రమే చదవాలి. 'దురాచారా – శమనీదోష వర్జితా' అని విడదీసి **చదవకూడదు.**

3) ఉదా:– 162వ శ్లోకంలోని మొదటి రెండు **పాదాలను** 'అజా – క్షయవినిర్ముక్తా – ముగ్ధా – క్షిప్ర ప్రసాదినీ' అని విడదీసి చదువు**కోవాలి** గాని 'ముగ్ధాక్షి – ప్రప్రసాదినీ' అని విడదీసి చదవకూడదు.

ఇంకా ఇటువంటి సందర్భాలు వున్నచోట పెద్దలనడిగి దోషం లేకుండా వుండే విధంగా చదువుకోవడం యుక్తము, ఉత్తమము.

## శ్రీ లలితా అష్టోత్తర వైశిష్ట్యము

ఒక్క సహస్రనామస్తోత్ర విషయంలోనే కాదు, అష్టోత్తర శతనామావళి విషయంలో గూడా ఇతరదేవతల అష్టోత్తర శతనామావళులకన్న శ్రీ లలితా అష్టోత్తరం భిన్నంగా వుండి, ఒక ప్రత్యేకతను కలిగి వుంటుంది. ''రజతాచల శృంగాగ్ర మధ్యస్థాయైనమోనమః'' అన్న మొట్ట మొదటి నామం నుండి 108వ దైన చివరి నామం దాకా ఉండే నామాలన్నీ గూడా చివరకు ''నమోనమః'' **ఉండి,** పూర్తిగా 16 అక్షరాలతో, ఛందో బద్ధంగా – 'రెండు అనుష్టుప్ పాదాల కూర్పు**తో**' – ఉంటాయి. ఇలా, 16 అక్షరాలతో ఉండడం – అమ్మవారి 'షోడశ కళా ప్రపూర్ణత్వాన్ని' – సూచిస్తాయి. (ఇతర అష్టోత్తరాల్లోని నామాలు ఇష్టం వచ్చినట్లుగా వేరువేరు అక్షర సంఖ్యలలో ఉంటాయి).

ఇన్ని రకాలుగా వైశిష్ట్యము, ప్రాశస్త్యము కలిగినది కాబట్టే – శ్రీ లలితాదేవి ముల్లోకవాసులచేత 'జగజ్జనని' గా ఆరాధింపబడుతుంది.

## ఈ ప్రథమభాగ పరిధి

'శ్రీమాతా' నుండి 'మహాలావణ్యశేవధిః' వరకు ఉన్న నామాల్లో –

జగన్మాతగా పోషణ, మహారాజ్ఞిగా పాలన, సింహాసనేశ్వరిగా ఆపత్సమయ రక్షణా లక్షణాలను కలిగిన అమ్మవారి యొక్క – ఆపాద మస్తక భౌతిక రూప వర్ణనకు సంబంధించిన విషయాలు వివరింపబడతాయి.

'సర్వారుణా' నుండి 'బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవ సంస్తుత వైభవా' వరకు ఉన్న నామాల్లో –

మనలో అమ్మవారి చిరునామా గూర్చి సంకేత పూర్వకంగా తెల్పే నామాలతో పాటు ఆమె ప్రాదుర్భావ ఉద్దేశ్య, లక్ష్యములకు(Purpose and Target), ఆమెకు చెందిన మనలోని ఆమె అంతర్గత జ్ఞాన సామ్రాజ్య వైభవానికి సంబంధించిన విషయాలు వివరింపబడతాయి.

'హరనేత్రాగ్ని సందగ్ధ కామసంజీవ నౌషధిః' నుండి 'సర్వమంగళా' వరకు వున్న నామాల్లో –

సాధక యోగ సాధనాసిద్ధికై; భక్తజన ప్రవర్తనా శుద్ధికై; సర్వమంగళత్వ సంసిద్ధికై వినియోగపడు అమ్మవారి శిక్షణా సౌభాగ్య లక్షణాలకు సంబంధించిన విషయాలు వివరింపబడతాయి.

ఈ విధంగా ఈ ప్రథమ భాగంలోని వివరణ లలితాస్తోత్రంలోని మొదటి 200 నామాలకు పరిమితమైంది.

> శ్రీ విద్యను అభ్యసించడం కష్టం కావచ్చు. శ్రీ చక్రార్చన కష్టంకావచ్చు. కాని, శ్రీలలితా సహస్ర నామ పారాయణ చేసి అమ్మవారి అనుగ్రహం పొందడం అందరికీ అందుబాటులో వున్న సాధ్యమైన పని కాబట్టి, స్త్రీ పురుష భేదం లేకుండా సర్వులూ – కనీసం, ఈ లలితా సహస్ర నామస్తోత్రాన్ని పారాయణ చేసి, ఈ పుస్తకంలో తెలిపిన 'శాస్త్ర జ్ఞాన – ఆత్మ జ్ఞాన' సమన్వయాత్మకమైన అర్థాలు, అంతరార్థాలు తెలుసుకుని జీవితాన్ని ధన్యం చేసుకోవచ్చును.

వివరణ కర్త
**జి.ఎల్.ఎన్.శాస్త్రి**

శ్రీ గణేశాయ నమః

శ్రీమత్త్రిపుర సుందర్యై నమః

# 1. శ్రీ మాతా

ఇది లలితాదేవి యొక్క మొదటి నామం. ఇది మూడక్షరాల నామం. లలితాదేవికి ఈ నామంతో నమస్కారం చేసేటప్పుడు ''శ్రీ మాత్రే నమః'' అని చెప్పాలి. అంటే ''శ్రీమాత కొఱకు నమస్కారం'' అని అర్థం. అంతేగాని 'శ్రీమాతానమః' అని చెప్పకూడదు - వ్యాకరణ దోషం వస్తుంది. తెలుగులో 'శ్రీ మాతకు నమస్కారం' అని అంటాము. కాని, సంస్కృతంలో నమస్కారం చతుర్థీ విభక్తిలో చెప్పటమే సంప్రదాయం. ఉదా: శివాయ నమః = 'శివుని కొఱకు నమస్కారం, గురవే నమః = గురువు కొఱకు నమస్కారం, హరయే నమః = హరి కొఱకు నమస్కారం. 'మాతృ', 'అంబా' ఈ సంస్కృత పదాలకు 'తల్లి' అని అర్థం. 'మాతృ' పదం నుండే ఆంగ్లంలో 'మదర్' అనే పదం వచ్చి వుంటుంది. ఈ మొదటి నామానికి ఎన్నో రకాల అర్థాలున్నాయి.

'శ్రీ' - అంటే మంగళకరమైన లేదా శుభప్రదమైన, 'మాతా' అంటే 'తల్లి' అని అర్థం. మన శుభాన్ని కోరే వారిలో తల్లిదే అగ్రస్థానం. అందుకే 'మాతృదేవోభవ' అని ముందుగా చెప్పబడింది. 'కుపుత్రో జాయేత్ క్వచిదపి కుమాతా న భవతి' అని ఆర్యోక్తి. అంటే 'కుపుత్రుడు (తల్లి పట్ల చెడ్డ కొడుకు) వుంటే వుండవచ్చు గాని, కుమాత (కొడుకు పట్ల చెడ్డతల్లి) ఉండదు' అని అర్థం.

సీతాతన్వంగి, రఘుమహారాజు, హిమాలయ పర్వతము, గోదావరీ నది - మొదలైన సంభావనా పూర్వపద కర్మధారయ సమాసాల్లాగానే 'శ్రీమాతా' అనే పదాన్ని కూడా అర్థం చేసుకుంటే 'శ్రీ' అనే తల్లి - అని అర్థం చెప్పుకోవలసి వుంటుంది. సమస్త విశ్వానికి తల్లిగా ఒక వ్యక్తి వుంటే - ఆ వ్యక్తి పేరు 'శ్రీ' అని గాని, ఎక్కడైనా, ఎప్పుడైనా పదార్థమయమైన దేహంతో పుట్టుక జరిగితే - ఆ దేహాన్నిచ్చిన తల్లిని సంకేతించడానికి ఉపయోగించేపదం 'శ్రీ' అని గాని ఈ పదానికి అర్థం చెప్పుకోవచ్చును.

కళ్ళకు కనబడేటట్లు పదార్థమయంగా, చైతన్యవంతంగా వ్యక్తమయే సృష్టిలోకాన్ని 'కల్పలోకం' అంటారు. కళ్ళకు కనబడక పూర్వం ఆ సృష్టి వున్న లోకాన్ని 'సంకల్ప

లోకం' అని అంటారు. ఉదా:- మనస్సులో వున్న ప్రణాళిక సంకల్ప లోకానికి చెందినది. ఆ ప్రణాళిక భౌతికంగా జరుగుతున్నపుడు కల్ప లోకానికి చెందినది అవుతుంది. కల్పలోకాన్ని తల్లితోను, సంకల్ప లోకాన్ని తండ్రితోను సమన్వయ పరిస్తే - ఆ తల్లికి సంకేత బీజాక్షరం ''శ్రీం'', ఆ తండ్రికి సంకేత బీజాక్షరం ''ఓం'' (తస్యవాచకః ప్రణవః (ప్రణవః అంటే ఓం) అని పతంజలి తన యోగసూత్రాల్లో చెప్పాడు) అవుతాయి.

'ఓం'లో ఎలా అయితే 'అ'కార 'ఉ' కార 'మ' కారాలు మూడు వున్నాయో 'శ్రీ'లో గూడా 'శ' కార, 'ర' కార, 'ఈ'కారాలు మూడున్నాయి - అన్న సంగతిని గుర్తుంచుకోవాలి. ఈ మూడు అక్షరాలు వరుసగా సత్త్వరజస్తమోగుణాలను - ఆ త్రిగుణజనిత త్రిమూర్తులైన విష్ణు, బ్రహ్మ, రుద్రులను; వారి ప్రకృతులైన లక్ష్మీ, సరస్వతీ, పార్వతులను; వారి శక్తులైన ఇచ్ఛాశక్తి, జ్ఞాన శక్తి, క్రియాశక్తులను సూచిస్తాయి.

శ్రీ - అనే ఏకాక్షరం ముగురమ్మలైన లక్ష్మీ, సరస్వతీ, పార్వతులను సూచిస్తే - 'శ్రీమాతా' అనే నామం ఆ 'శ్రీ' లోని వారికి, అంటే - ఆ ముగురమ్మలకు, 'మాతా' అంటే మూలపుటమ్మను సూచిస్తుంది - అని ఇంకో అర్థాన్ని చెప్పుకోవచ్చును.

'దాత' అంటే దానానికి సంబంధించిన వాడు, అంటే ఇచ్చేవాడుగా అని అర్థం ఎలా చెప్పుకోవచ్చునో 'మాతా' అంటే మానానికి అంటే కొలతకు (Measure)కు సంబంధించినదిగా అంటే కొలిచేదిగా అర్థం చెప్పుకోవచ్చు. 'మితి' అన్నా గూడా కొలత (Dimension) కాబట్టి 'శ్రీమాత' అంటే 'శ్రీని కొలిచేది' అని - ఇంకోరకంగా అర్థం చెప్పుకోవచ్చు. కొలిచేది.(అంటే - ప్రమాణం) ఎప్పుడూ కొలవబడేదాని కన్నా గొప్పది అయివుండాలి కాబట్టి, శ్రీలను, అంటే - అన్ని రకాల సంపదలను, భాగ్యాలను కొలిచే శ్రీమాతను - వాటి కన్నా పైన వుండే నిరుపమాన మోక్ష సామ్రాజ్యాన్ని ప్రసాదించే తల్లిగా, మోక్ష స్వరూపిణిగా అర్థం చెప్పుకోవాలి.

జీవుడు పదార్థమయ శరీరంలో వ్యక్తమవడానికి, అలా వ్యక్తమై మొట్ట మొదటిసారిగా భూమి మీద తిరగడానికి కారకులు - జననీ, జన్మభూములు. ఈ ఇద్దరూ స్వర్గం కంటే ఉన్నతమైనవారుగా ''జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ'' అనే సూక్తి చెబుతుంది. మళ్ళీ ఈ ఇద్దరిలోనూ జనని పేరే ముందు. కష్టం వచ్చినా, బాధ కలిగినా,

ఎవరైనా ముందు తలచుకునేది అమ్మనే గదా! మన ఒక్కళ్ళకే తల్లి మన అమ్మ అయితే – మొత్తం జగత్తుకేతల్లి ఆ జగజ్జనని. కాబట్టి, ఆ జగజ్జననిని ముందు తలచుకుని స్తోత్రాన్ని ఆరంభించడం జరిగింది.

( ఇతర ప్రాచీన మతాల్లోనూ, జాతుల్లోనూ కూడా ఈ జగజ్జననీ ఆరాధన వుంది. ప్రాచీన సుమేరియన్ పురాణంలోని ''ఇనన్నా'', ఈజిప్టు దేశంలో ఆరాధింప బడే 'మాత్' (Maat) – ఈ కోవకు చెందిన వారే ! న్యాయ స్థానంలో కళ్ళకు గంతలు కట్టుకుని, చేతిలో త్రాసు పట్టుకుని వుండే దేవత ఈ 'మాత్' దేవతయే ! 'మాతా' పదం నుండి 'మాత్' పదం వచ్చి వుంటుంది. ఈ మాత్ దేవతను గూడా లలితాదేవిలాగానే సూర్యచంద్రులను తన రెండు కళ్ళుగా కలిగిన దేవతగా ఆరాధిస్తారు.

పిల్లలు పుట్టనివాళ్ళు, పిల్లలు పుట్టి దక్కని వాళ్ళు – ఈ నామంతో అమ్మవారిని 'శ్రీమాత్రేనమః' అని జపిస్తే పిల్లలు పుట్టి దక్కటానికి అవకాశం వుంటుంది.

మొత్తం మీద 'శ్రీమాతా' అనే ఈ మొదటి నామానికి ఈ అర్థాలు చెప్పుకోవచ్చును.

1. శుభప్రదమైన తల్లి
2. శ్రీ – అనే జగజ్జనని.
3. శ్రీలను కొలిచేది
4. లక్ష్మి, సరస్వతీ, పార్వతులకు తల్లి.
5. ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులకు తల్లి.
6. మోక్ష సామ్రాజ్యదాయిని.
7. మోక్షస్వరూపిణి.

## 2. శ్రీ మహారాజ్ఞీ

ఇది లలితాదేవి యొక్క రెండవ నామం. ఇది ఐదు అక్షరాల నామం. ఈ నామంతో లలితాదేవికి నమస్కారం చేసేటప్పుడు ''శ్రీ మహారాజ్ఞ్యై నమః'' అని చెప్పాలి.

శ్రీ = శుభకరమైన, మహా = గొప్పదైన, రాజ్ఞీ = రాణి.

మొదటినామం 'శ్రీమాత' లో విశ్వజననిగా ప్రతిపాదింపబడిన లలితాదేవి ఈ రెండవ నామంలో పరిపాలనాధిపత్య బాధ్యతలుగల 'రాజ్ఞి' గా కూడా ప్రతిపాదింపబడింది. పిల్లలను కనడం మాత్రమే కాక వారిని సాకడం, అనగా – పోషించడం గూడా చేస్తుంది తల్లి. తల్లి తన శరీరంలో నుండి ప్రసవించి, తన శరీరం లోని రక్తాన్ని పాలగా మార్చి తన బిడ్డలకు ఇచ్చి పోషించినట్లే – ప్రకృతి మాత తనలోని పంచభూతాలను ఆహార పదార్థాలుగా మార్చి, జీవులు శరీరంతో వ్యక్తమవడానికి, పెరిగి పెద్దవారవడానికి తోడ్పడుతుంది.

(ప్రకృతి మాత ఒడిలోని ప్రతిజీవి ఒక బిడ్డలాంటివాడు. తల్లి ఒడిలో పిల్లవాడు ఒక వైపు పాలు త్రాగడానికి రెండో వైపు పాలు త్రాగడానికి మధ్యలో వుండే కాల వ్యవధిలాగానే – ప్రకృతిమాత ఒడిలోని జీవియొక్క రెండు జననాల మధ్య మరణ కాలవ్యవధి వుందంటాడు విశ్వ కవి రవీంద్రుడు. మరణాన్ని గురించి ఇంత సున్నితంగా ఎవ్వరూ చెప్పలేదు. కాబట్టి బిడ్డపై తల్లికి ఎటువంటి పాలనాధికారం వుంటుందో ఈ విశ్వంపై ప్రకృతిమాతకు అలాంటి పాలనాధికారం వుంటుంది.)

ఒక చిన్న రాజ్యానికి అధికారిణి అయితే 'రాణి' అనవచ్చు. సమస్త విశ్వ సామ్రాజ్యానికే అధికారిణి కాబట్టి 'మహారాజ్ఞి'. (లాటిన్ భాషలో 'రెజినా' అనే పదం ఈ 'రాజ్ఞి' పదం నుండే పుట్టి ఉండవచ్చు. 'రెజీనా' అంటే 'రాణి'(Queen) అనే అర్థం గూడా!) తన పిల్లల శుభాన్నే కోరుతుంది మామూలు తల్లి. ఈ శ్రీమాత విశ్వ శ్రేయస్సునే కోరుతుంది కాబట్టి 'మహారాజ్ఞి'. పరమాత్మను గూర్చి ప్రతిపాదిస్తూ – ''యస్మాద్భూతని జాయన్తే, యేన జాతాని జీవన్తి'' అని ఉపనిషత్తు చెబుతుంది. కాబట్టి – జీవులు పుట్టడం, పెరగడం ఎవరివలన, ఎవరి చేత జరుగుతుందో – అట్టి పరమాత్మ స్వరూపురాలే జగజ్జనని అయిన శ్రీమాత, శ్రీ మహారాజ్ఞి.

క్రమం తప్పని – గ్రహ గతులు, ఋతు ధర్మాలు, వివిధ జీవుల శరీర నిర్మాణ వైవిధ్యాలు, పదార్థ ధర్మాలు మొదలైనవన్నీ ఎంతో పరిపాలనా దక్షత వుంటే గాని సాధ్యం కాదు. అట్టి పరిపాలనాదక్షత కలిగినది కాబట్టి ఈ శ్రీమాతను 'శ్రీమహారాజ్ఞి' గా గూడా చెప్పుకోవాలి. ఈ పరిపాలనా దక్షత గురించే తైత్తిరీయంలో –

''భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమ ఇతి'' - అని చెప్పబడింది. 'పరబ్రహ్మకు, లేదా పైన ప్రతిపాదించిన శ్రీ మహారాజ్ఞికి భయపడి - వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, యముడు మొదలైనవారు వారి వారికి కేటాయించిన పనులనుసక్రమంగా నిర్వర్తిస్తున్నారు' అని ఈ మంత్రాలకు అర్థం.

ఈ మహారాజ్ఞి పరిపాలనలో లొసుగులు వుండవు. 'పంచదార తియ్యగా వుండాలి' అని అమ్మవారు శాసిస్తే - అది తియ్యగా వుండాల్సిందే ! అలాగే ఉప్పు ఉప్పగా వుండాల్సిందే!! పొట్ల విత్తనంలోంచి పొట్లఆకులు, పొట్ల పువ్వులు, పొట్ల పిందె, పొట్లకాయ రావాల్సిందే గాని పొరపాటున బీరకాయ రాదు. ఇదీ - ఆ మహారాజ్ఞి ప్రకృతిలో విధించే శాసనం. ఇది లొసుగులు లేని, సమర్థ మైన పరిపాలనకు నిదర్శనం.

కార్య నిర్వహణ, పరిపాలన తెలియని వాళ్ళు, చేతకాని వారు ఈ నామంతో అమ్మవారిని 'శ్రీ మహారాజ్ఞ్యై నమః' అని జపిస్తే - వారు మంచిపాలనా సమర్థులవుతారు.

మొత్తము మీద 'శ్రీమహారాజ్ఞీ' అన్న రెండవ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. శుభప్రదమైన మహారాణి.
2. శుభాలను పెంచేది.
3. జగత్తును పోషించి, పరిపాలించేది.
4. సమర్థపరిపాలనా దక్షురాలు.

## 3. శ్రీమత్సింహాసనేశ్వరీ

ఇది లలితాదేవి యొక్క మూడవ నామం. ఇది ఎనిమిది అక్షరాల నామం. లలితాదేవికి ఈ నామంతో నమస్కారం చేసేటప్పుడు శ్రీమత్సింహాసనేశ్వర్యై నమః' అని చెప్పాలి.

శ్రీమత్ = శోభతో కూడిన, సింహాసన = గొప్పదైన, శ్రేష్ఠమైన ఆసనమును, ఈశ్వరీ = అధిష్ఠించినది.

సింహాసనారూఢియై మహిషాసురుణ్ణి చంపినప్పటినుండి లలితాదేవికి 'సింహాసనేశ్వరీ', 'మహిషఘ్ని' అనే పేర్లు వచ్చాయి. మహిషాసురుణ్ణి చంపి జగత్తుకు శుభాన్ని చేకూర్చింది కాబట్టి 'మహిషఘ్ని'.

మనలోని పాశవిక, హింసాత్మక లక్షణానికి సంకేతం – సింహం. ఈ లక్షణాన్ని శమింపచేసేది, దానిపై అధిష్ఠించేది కాబట్టి 'సింహాసనేశ్వరీ'.

వర్ణ వ్యత్యయంచేత 'సింహ' శబ్దం 'హింస' గా మారుతుంది. ప్రళయంలో సమస్త విశ్వాన్ని తన పొట్టన పెట్టుకునే కాళీ మాత ఈ సింహాసనేశ్వరి.

జ్యోతిశ్శాస్త్రరీత్యా సింహరాశి మనలో హృదయాన్ని తెలియచేస్తుంది. కాబట్టి – సింహాసనేశ్వరి, అంటే – 'మన హృదయాన్ని అధిష్ఠించినది' అని అర్థం.

హృదయమే ధర్మాన్ని ప్రబోధిస్తుంది. కాబట్టి, హృదయ క్షేత్రమే 'ధర్మ క్షేత్రం' గూడా అవుతుంది. అందుకని మనలో 'ధర్మాసనాన్ని అధిష్ఠించేది' అని గూడా అర్థం.

'హృదయస్థమనా సన్నమ్' – గీత

'దహ్రం విపాపం పరమేశ్మ భూతం'

'హృత్పుండరీకం పురమధ్యసగ్గ్స్థమ్' – తైత్తిరీయం.

'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి – గీత

పై విధంగా గీతోపనిషత్తులు తెలిపిన వాటిని బట్టి మనలో సింహరాశి చేత గుర్తింపబడేది, పాపమంటని చోటు అయిన దహరాకాశాన్ని అధిష్ఠించినదే ఈ సింహాసనేశ్వరి.

తూర్పు దిక్కు ప్రజ్ఞను, పడమటి దిక్కు పదార్థాన్ని సూచిస్తాయి. ప్రతి రోజూ సూర్యుడు తూర్పున ఉదయించి పడమట అస్తమిస్తాడు. సూర్యుడితో పాటు రాశి చక్రంలోని రాశులు కూడా తూర్పున ఉదయించి పడమట అస్తమిస్తాయి. ప్రతిరోజూ అన్ని రాశులతో పాటు సింహరాశి గూడా పడమట దిక్కున అస్తమిస్తుంది. అప్పుడు

సింహరాశి క్రిందకు అస్తమిస్తుండగా పైన కన్యారాశి వుంటుంది. ఆ దృశ్యాన్ని ఇలా ఖగోళ, జ్యోతిశ్శాస్త్రాల రీత్యా సమన్వయ పరిస్తే - 'సింహాసనేశ్వరీ' అంటే 'సింహాన్ని అధిష్ఠించిన కన్యగా అర్థం చెప్పుకోవచ్చు. ఇలా ప్రతిరోజూ జరుగుతున్నా కన్యారాశిలో సూర్యుడున్నప్పుడిలా జరగడానికి విశిష్టత వుంది. ఎందుకంటే - ఈ కన్యారాశిలో సూర్యుడున్నప్పుడే గదా దేవీనవరాత్రులు ప్రారంభమయేది. అందుకని, ఈ సమన్వయం ఈ అర్థాన్ని మరింత బలపరుస్తుంది.

సింహాసనానికి క్రింద నాలుగువైపులా నాలుగు కాళ్ళు వుండి, పై భాగాన శృంగం వుంటుంది. క్రింద కాళ్ళు - పృథివి, ఆపస్, తేజస్సు, వాయువులను సూచిస్తే - ఈ నాలుగు భూతాలు ఉత్పన్నమవడానికి కారణమైన ఆకాశాన్ని - శృంగం సూచిస్తుంది. అంటే సింహాసనం ఈ పంచభూతాలను తెలియ చేస్తుందన్నమాట! ప్రకృతి అంటే ఈ పంచభూతాత్మకమే కాబట్టి 'సింహాసనేశ్వరీ' అంటే 'పంచభూతాలను అధిష్ఠించినది' అని గూడా అర్థం వస్తుంది.

సింహాసనానికి వున్న నాలుగుకాళ్ళు, శృంగము - ఈ ఐదు - సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాలు - అనే పంచకృత్యాలను సూచిస్తే, వాటిని నిర్వర్తించ గలిగినది- అని 'సింహాసనేశ్వరీ' అన్న నామానికి మరో అర్థంగా చెప్పుకోవచ్చు.

భూతలం మీద నుంచుంటే మనం చూడగలిగే దిశలైన - 'ముందు, వెనుక, కుడిప్రక్క, ఎడమ ప్రక్క, పైన' - 'ఈ ఐదు దిక్కుల పర్యంతం కనబడే దృశ్యార్థ గోళాన్ని అధిష్ఠించినది' అని ఇంకో అర్థం చెప్పుకోవచ్చును. మిగతా అర్థగోళం అయ్యవారిది. ఎందుకంటే - ఎప్పుడూ భూమికి ఒక వైపు వెలుగు (పగలు), రెండో వైపు చీకటి (రాత్రి) వుంటాయి. వెలుగు అమ్మవారికి, చీకటి అయ్యవారికి చెందినవని ముందే పీఠికలో చెప్పుకున్నాం గదా!

(పంచ ప్రణవాలు (శ్రీం, హ్రీం, క్లీం, ఐం, సౌః,) పంచదిశలు (పూర్వ, దక్షిణ, పశ్చిమ, ఉత్తర, ఊర్ధ్వ), పంచభూతములు (పృథివ్యాపస్తేజోవాయురాకాశములు), పంచముఖములు (సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానులు), పంచ ప్రేతములు (బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులను - ఆసనముగా గలిగి అధిష్ఠించింది అని గూడా అర్థం చెప్పుకోవచ్చు.)

మొత్తం మీద 'శ్రీ మత్సింహాసనేశ్వరీ' అన్న నామానికి ఈ క్రింద తెలిపిన అర్థాలు చెప్పుకోవచ్చు.

1. శోభతో కూడిన, గొప్పదైన, శ్రేష్ఠమైన ఆసనమును అధిష్ఠించినది.
2. మహిషాసురుణ్ణి చంపి జగత్తుకు శుభాన్ని చేకూర్చినది.
3. పాశవిక సింహలక్షణాన్ని శమింపచేసేది.
4. ప్రళయంలో సమస్త విశ్వాన్ని తనలోకి లయం చేసుకునేది.
5. హృదయాధిష్ఠాన దేవత.
6. ధర్మాసనాన్ని అధిష్ఠించినది.
7. దహరాకాశాన్ని అధిష్ఠించినది.
8. సింహరాశిని అధిష్ఠించిన కన్య.
9. పంచభూతాలను అధిష్ఠించినది.
10. సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాలు - అనే పంచకృత్యాలను నిర్వర్తించగలది.
11. భూమికి ఒక వైపు గల దృశ్యార్ధ గోళాన్ని అధిష్ఠించినది.
12. పంచాసనములను అధిష్ఠించినది.

ఇంతవరకు చెప్పబడిన మూడునామాలను జాగ్రత్తగా పరిశీలిస్తే 'శ్రీ మాతా', 'శ్రీమహారాజ్ఞీ', 'శ్రీమత్సింహాసనేశ్వరీ' - అనే మూడు నామాలలోని 'మాతా' రాజ్ఞీ' 'ఈశ్వరీ' అనే పదాలు వరుసగా సృష్టి, స్థితిలయకారకకృత్యాలను సూచిస్తాయి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ తమ విధులైన - సృష్టి, స్థితి లయాలను మూడింటిని ఈ అమ్మవారి మీద ఆధారపడి నిర్వర్తిస్తున్నారంటూ శంకర భగవత్పాదులు సౌందర్యలహరిలో చెప్పిన రెండవ శ్లోకం - 'తనీయాం సం పాంసుం ... భసితోద్ధూలనవిధిమ్' - ఇక్కడ గుర్తు చేసుకోవడం సమంజసం. (మొదట్లో వచ్చే ఈ మూడునామాలను 'శ్రీ' తో ప్రారంభించడం, అలాగే స్తోత్రానికి చివర్లో వచ్చే మూడు నామాలను గూడా 'శ్రీ'తో ప్రారంభించడం గూడా గమనించాలి. మొదటినామం 'జననానికి' సంబంధించిన 'శ్రీమాత' అయితే - చివరినామం 'ముక్తికి' సంబంధించిన 'శివశక్త్యైక్యరూపిణీ' అని చెప్పడంలోని ఔచిత్యాన్ని గ్రహించాలి.

# 4. చిదగ్ని కుండ సంభూతా

ఇది లలితాదేవి యొక్క నాల్గవనామం. ఇది ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు 'చిదగ్నికుండ సంభూతాయై నమః' అని చెప్పాలి.

చిత్ = చైతన్య మనెడి, అగ్నికుండ = అగ్నికుండము నుండి, సంభూతా = చక్కగా ఆవిర్భావము చెందినది (పుట్టడం అనే అర్థం కాదు)

చిత్ - అంటే చైతన్యం; కదలడం, మెలకువరావడం మొదలైనవన్నీ చైతన్య లక్షణాలే! ఇచ్ఛాశక్తిని సంకల్పశక్తి అనవచ్చును. ఇది హృదయానికి (Heart) సంబంధించినది. జ్ఞానశక్తి - బుద్ధికి (Head - Intellect) సంబంధించినది. క్రియాశక్తి - కర్మేంద్రియాలకు (Hand - కర్మేతిహస్తయోః - తైత్తిరీయం) సంబంధించినది.

ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులను మూడు శీర్షాలతో కూడిన ఒక చిన్న సమత్రిభుజంగా వూహిస్తే - దాన్ని చిదగ్ని కుండానికి ఒక ప్రమాణ కోష్ఠిక (Unit cell) అనవచ్చును. ఈ మూడు శక్తుల సమన్వయంతో ఉత్పన్నమయే శక్తిని 'చిచ్ఛక్తి' అనవచ్చును. ఇది ఆ త్రిభుజం యొక్క గరిమనాభి బిందువు (centroid) వద్ద 'చిద్బిందువు' గా వూహించాలి. (పటము -1) (From the point of Light .... అని ప్రారంభించే 'Great invocation, లో 'Point of Light'ను ఈ చిద్బిందువుగా చెప్పుకోవచ్చును)




పటము 1. చిదగ్ని కుండము

1. ఇచ్ఛాశక్తి 2. జ్ఞానశక్తి 3. క్రియాశక్తి 4. చిచ్ఛక్తి

అణువునుండి, ఆదిత్యునిదాకా; పిండాండం నుండి – బ్రహ్మాండందాకా వివిధ పరిమాణాల్లో జరిగే ఈ చిచ్ఛక్తి యొక్క ఆవిర్భావ త్రివిక్రమత్వాన్ని యోగ సాధనలో దర్శించాలి. సృష్టికి పూర్వం ఒక్కడుగా వున్న పరమాత్మ సృష్టిగా బృంహణము (వికసించడం)చెందబోయే ముందు వుండే బ్రహ్మతేజస్సు ఇదే! దీనినే శ్రీ విద్యలో అమ్మవారి 'ప్రకాశస్వరూపం' అంటారు.

కాలం అనే నేపథ్యం (Back ground)లో – చోటు గోళం (space globe) వ్యక్తమవుతున్నప్పుడు, కట్టెలోంచి అగ్ని వ్యక్తమవుతున్నపుడు, మనకు ఒక విషయం తెలియడంగాని, స్ఫురించడం గాని జరుగుతున్నపుడు, నిద్రనుండి మెలకువస్తున్నపుడు, జడస్థితి నుండి చైతన్య స్థితి కలుగుతున్నపుడు, బీజం (విత్తనం) నుండి వృక్షం ఆవిర్భావం చెందుతున్నపుడు, ఒక సంకల్పం కలుగుతున్నపుడు, సూర్యుడు ఉదయిస్తున్నపుడు – చిదగ్నికుండం యొక్క వివిధ పరిమాణాల్లో చిచ్ఛక్తి ఉత్పన్నమౌతున్నట్లు యోగసాధనలో దర్శించాలి.

మనలో మనం ఉన్నామని తెలిసే జ్ఞానం ఈ చిచ్ఛక్తియే ! ఇది బల్బు వెలగడం లాంటింది. ఈ చిచ్ఛక్తినే ఇంధనం లేకుండా పుట్టే అగ్ని (Fire without fuel) అంటారు. ఒక ఇనుపముక్క అయస్కాంతమైనపుడు, ఆ ఇనుప ముక్క కొలతల్లో, బరువు, రంగు, రుచి, వాసనల్లో తేడారాదు. నిద్రపోతున్న మనిషి మెలకువ స్థితిలోనికి వచ్చినప్పుడు గూడా అంతే ! మనిషి కొలతలు మొదలైన వాటిలో తేడా ఏమీ ఉండదు. మనకు ఒక విషయం తెలియక పూర్వం, తెలిసిన తర్వాత గూడా అంతే! అయినా ఈ రెండు స్థితులకు భేదం దేనివల్ల అయితే వస్తోందో దాన్ని 'చిచ్ఛక్తి' అని అర్థం చేసుకోవాలి. అంటే – ఈ చిచ్ఛక్తి ద్రవ్యాత్మకమైనది కాదన్నమాట! కాని, ఈ చిచ్ఛక్తిని ఒకరూపంగా దర్శిస్తే ఆ రూపం అమ్మవారు (Personification of kindling force).

పూర్వం 'భండు' డనే రాక్షసుడు పెట్టే బాధలు తట్టుకోలేక, దేవతలందరూ ఒక హోమం తలపెట్టారు. అందుకుగాను ఒక పెద్ద హోమ గుండం ఏర్పాటు చేసి, అందులో హోమద్రవ్యాల్ని సమర్పిస్తూ, తమ శరీర శకలాలను గూడ సమర్పించి, చివరకు తమను గూడా సమర్పించుకోవడాని సిద్ధ పడ్డారు. అప్పుడు, ఆ హోమగుండంలోంచి కోటి సూర్య ప్రకాశమాన, చంద్రశీతల గుణసమన్వితమైన దివ్య తేజస్సుతో, శ్రీదేవి ఆవిర్భవించి,

ఆ భండాసురుణ్ణి సంహరించింది. అందువలన అమ్మవారు చిదగ్ని కుండసంభూత. (ఈ భండాసురుడెవరో పూర్తి వివరాలు వచ్చే నామంలో చెప్పబడతాయి).

యోగాభ్యాసంలో సాధకునిలోని అన్ని శక్తులను సమన్వయ పరుస్తూ, కులకుండమునందలి సుషుమ్నాగ్నిలో సంభూతమయ్యే కుండలినీ శక్తిగా ఈ చిచ్ఛక్తిని దర్శించాలి. ఇలా బ్రహ్మాండ, పిండాండాల్లో సంభూతమయే అమ్మవారు ఉపనిషత్తులో – ''తామగ్నివర్ణాం తపసాజ్వలన్తీమ్ వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్, దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే, సుతరసి తరసే నమః.'' అని ప్రతిపాదింపబడింది.

తెలివితక్కువాళ్ళు, మందబుద్ధిగలవాళ్ళు ఈ నామంతో అమ్మవారిని 'చిదగ్నికుండ సంభూతాయైనమః' అని జపిస్తే – వాళ్ళు చైతన్యవంతులవుతారు.

మొత్తం మీద 'చిదగ్నికుండసంభూతా' అనే అమ్మవారి ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. 'చిత్' అనెడి అగ్నికుండమునుండి ఆవిర్భావము చెందిన శక్తి.
2. ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తుల సమన్వయ శక్తి.
3. సృష్టి ప్రారంభానికి ముందుండే బ్రహ్మతేజస్సు.
4. అణువునుండి ఆదిత్యుని దాకా, పిండాండం నుండి బ్రహ్మాండందాకా చైతన్య వంతం చేసే శక్తి.
5. మనలో మనం ఉన్నామని తెలిపే శక్తి.
6. భండాసురుని వధకై ఉద్భవించిన శక్తి.
7. యోగసాధకునిలో కులకుండమునందు ఉత్పన్నమయే శక్తి.
8. ఉపనిషత్తులో దుర్గాదేవిగా ప్రతిపాదింపబడిన శక్తి.

## 5. దేవకార్యసముద్యతా

ఇది లలితాదేవి యొక్క ఐదవనామం. ఇది ఎనిమిది-అక్షరాల నామం. ఈ నామంతో లలితాదేవికి నమస్కరించేటప్పుడు ''దేవకార్య సముద్యతాయైనమః'' అని చెప్పాలి.

దేవ = దేవతల యొక్క, కార్య = కార్యములకై, సముద్యతా = ఆవిర్భవించినది.

పూర్వము ఒకప్పుడు శంకరుని చేత కాముడు (మన్మథుడు) దహింపబడి భస్మమైపోతాడు. ఆ భస్మాన్ని గణేశ్వరుడనే చిత్రకారుడు చూసి ఆ బూడిదతో విచిత్రాకృతిలో ఒక పురుషుణ్ణి చేస్తాడు. ఆ విచిత్ర పురుషరూపాన్ని బ్రహ్మ చూసి - 'భండ' అంటాడు. అప్పటినుండి వాడు 'భండుడు' అనే పేరుతో ప్రసిద్ధుడవుతాడు. రుద్రకోపాగ్నికి భస్మమై రూపుకట్టుకోడం వలన రౌద్ర ప్రకృతితో మహాబలశాలియై, ఉగ్రకర్ముడై, రాక్షసకృత్యాలు చెయ్యడం మొదలు పెడతాడు. దేవతలు, త్రిమూర్తులు గూడా ఏవిధమైన ప్రతిక్రియ చేయ లేక, నానా అవస్థలు పడి, చివరకు పరిష్కారం కోసం, పరమేశ్వరీ కటాక్షం కోరి, పెద్ద హోమం చేస్తారు. ఆ హోమగుండంలోంచి దేవతల ఇక్కట్లు తీర్చి, వారి కార్యాన్ని, కోరికను నెరవేర్చడం కోసం అమ్మవారు ఉద్భవిస్తుంది.

మహిషాసురుడనే మరొక రాక్షసుడు దేవతలను బాధలు పెడుతుంటే - ఆ మహిషాసురుణ్ణి కూడా అమ్మవారు సంహరిస్తుంది. ఇలా ఎందరో రాక్షసులు ఎన్నోసార్లు దేవతలను ఇబ్బంది పెడుతుంటే - ఆ రాక్షసులను శిక్షించి, దేవకార్యక్రమం యథాతథంగా కొనసాగింపబడటం కోసం అమ్మవారు ఆవిర్భవిస్తుంది. అందువల్ల అమ్మవారు 'దేవకార్య సముద్యతా' అనే నామంతో పిలవబడుతుంది.

(ఒక సంస్థలో ఎప్పుడైనా అవకతవకలు జరిగితే - ఆ అవకతవకలు జరగడానికి కారకులైన వారిని శిక్షించి, సంస్థ కార్యకలాపాలు యథా తథంగా కొనసాగింపబడేట్లు ఆ సంస్థ యజమాని ఎలా అయితే చర్యతీసుకుంటాడో - అలాగే సమస్త సృష్టికార్యాన్ని తిన్నగా నడిపే అమ్మవారు - దేవ కార్యాన్ని చక్కబెట్టడం కోసం ఆవిర్భవించి, ఆదుకుంటూ, అవసరం తీరుస్తుంది. అని అర్థం చేసుకోవాలి.)

పరమాత్మలోని అంశాలైన ఆత్మలు గుణమయమైన నామరూపాలతో భౌతికంగా వ్యక్తమవడం కోసం దేహాలను కట్టుకోడం జరిగినపుడే మనం చూసే స్థావర జంగమాత్మకమైన సృష్టియావత్తూ ఏర్పడుతుంది. అంటే 'ఆత్మ' అనే 'గృహస్థు' తను వుండటం కోసం స్వంతంగా ఏర్పాటు చేసుకున్నదే ఈ 'దేహం' అనే 'గృహం' స్వంతగృహం లేకపోయినపుడు కూడా గృహస్థు వుంటాడు గదా! అలాగే దేహం లేనపుడు

గూడా ఆత్మ వుంటుందని తెలుసుకోవాలి. అంటే 'ఆత్మ' – స్థిరము లేదా నిరపేక్షకము (Absolute). 'దేహం' చరము లేదా సాపేక్షకము. (Relative). (కొందరు క్రైస్తవభక్తులు 'Every body has a Soul' అని చెబుతుంటే సెయింట్‌పాల్ (Saint Paul) విని 'Every body is a Soul and has a body' అని చెప్పాలి అని సరిదిద్దడం కూడా ఇందుకే!) జ్ఞానసంపర్కమైన భావాల ప్రభావం మనలో వున్నపుడు, ఈ ఆత్మజ్ఞానం కలుగుతుంది. అవిద్యా ప్రవృత్తికి సంబంధించిన – అజ్ఞానాత్మకమైన అహంకార, కామక్రోధాదిభావాలు పెచ్చుపెరుగు తున్న కొద్దీ – ఈ ఆత్మజ్ఞానం మరుగునపడిపోయి, దేహభావం, భౌతికవాదం పెట్రేగిపోతాయి. ఇక్కడ జ్ఞానసంపర్కమైన భావాలే దేవతలని, అవిద్యా ప్రవృత్తికి సంబంధించిన అహంకార కామక్రోధ లోభ మోహమద మాత్సర్యాది భావాలే రాక్షసులనీ సమన్వయపరచుకోవాలి. ఈ అజ్ఞానాత్మకమైన రాక్షసుల ప్రాబల్యం పెరిగిపోతే – ఆత్మజ్ఞానం కలగడానికి దోహదపడే జ్ఞానసంపర్క భావాలు – అనే దేవతల యొక్క కృషికి అవరోధం కలుగుతుంది. అప్పుడు – మనలో జ్ఞాన సంపర్కభావాల సమష్టి రూపంగా చిద్రూపిణి అయిన అమ్మవారు చిదగ్నికులకుండంలో ఆవిర్భావం చెంది – అజ్ఞానతిమిరాన్ని పారద్రోలి, జ్ఞానజ్యోతిని మళ్ళీ వెలిగిస్తుంది. అంటే – చీకటి పడుతున్నపుడు ఇంటి దీపం వెలిగించడంలాగా దేవకార్య నిమిత్తమై అమ్మవారి ఆవిర్భావాన్ని అర్థం చేసుకోవాలి. బ్రహ్మాండ పురాణంలోని లలితోపాఖ్యానంలోని స్థూలకథను ఈ విధంగా సమన్వయ పరచుకొని ఆత్మపరమైన సూక్ష్మార్థాన్ని గ్రహించాలి.

("అజం వా మేషం వా మహిషమపి మార్జారమపివా" – అన్నపుడు గూడా గొఱ్ఱెను, మేకను, దున్నపోతును, పిల్లిని బలి ఇవ్వు అనే అర్థం కాకుండా, మనలో వుండే 'మూర్ఖత్వం' – అనే గొఱ్ఱెను, 'పిరికితనం' – అనే మేకను, 'మదం' – అనే దున్నపోతును, 'దొంగబుద్ధి' – అనే పిల్లిని బలి ఇవ్వాలని అర్థం చెప్పుకోవాలి. అలాగే అహంకారానికి వృత్రాసురుడు, మదానికి మహిషాసురుడు, మోహానికి భండాసురుడు, ఇలా మనలోని అవిద్యా ప్రవృత్తులకు (అజ్ఞానాత్మక భావాలకు) అసురులు సంకేతాలని సమన్వయ పరచుకోవాలి.)

మనవల్ల లోకానికి, లేదా సమాజానికి ఉపకారం జరగాలంటే అమ్మవారిని ఈ నామంతో 'దేవకార్య సముద్యతాయై నమః' అని జపించాలి.

మొత్తం మీద 'దేవకార్య సముద్యతా' అనే ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చు.

(1) దేవతల కార్యనిమిత్తమై ఆవిర్భవించినది. అనగా-

(2) మహిషాసుర, భండాసురాది రాక్షసుల సంహార నిమిత్తమై ఆవిర్భవించినది.

(3) అవిద్యాప్రవృత్తికి సంబంధించిన – అజ్ఞానాత్మక తమోభూయిష్ఠ భావాలను రూపు మాపి, జ్ఞా నజ్యోతిని వెలిగించడం కోసం ఆవిర్భవించిన చిద్రూపిణి.

## 6. ఉద్యద్భానుసహస్రాభా

ఇది లలితాదేవి యొక్క ఆరవనామం. ఇది ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు ''ఉద్యద్భాను సహస్రాభాయై నమః'' అని చెప్పాలి.

ఉద్యత్ = ఉదయించుచున్న, భానుసహస్ర = వెయ్యి కిరణాల యొక్క లేదా వెయ్యి సూర్యుల యొక్క, ఆభా = కాంతులతో సమానమైన కాంతికలది.

ఐదవనామంలో అమ్మవారు దేవకార్యార్థమై ఆవిర్భవించిందని చెప్పబడింది. అలా ఆవిర్భవించిన అమ్మవారి యొక్క స్థూలరూపం ఎలా వుంటుందో వర్ణన – ఈ ఆరవనామం నుండి ప్రారంభమై 'స్వాధీనవల్లభా' అనే నామందాకా కొనసాగుతుంది.

కరచరణాదులతో కూడిన దేహమే అమ్మవారి స్థూలరూపం. ఈ స్థూల రూపమే కాకుండా, అమ్మవారికి సూక్ష్మరూపం, కారణరూపం అని కూడా వుంటాయి. స్థూలరూపాన్ని – సామరస్య రూపం అనీ; సూక్ష్మరూపాన్ని – మంత్రరూపం అనీ; కారణరూపాన్ని – పరారూపమని గూడా అంటారు. ఈ కారణ, సూక్ష్మ, స్థూల రూపాలను వరుసగా మన – మనో వాక్కాయములతో ఆరాధించాలి. అంటే – అమ్మవారి స్థూలరూపాన్ని – (అంటే విగ్రహాన్ని) మనం మన చేతులతో షోడశోపచార పూజచేసి ఆరాధించాలి. బీజాక్షర సమన్వితమైన ఆవిడ సూక్ష్మరూపాన్ని – మనం వాక్కుతో బీజాక్షర, స్తోత్రాదులు పఠిస్తూ ఆరాధించాలి. సూక్ష్మాతిసూక్ష్మమైన ఆవిడ కారణ

రూపాన్ని - మనం మన మనస్సుతో ధ్యానించి, ఆరాధించాలి. ఇలా త్రికరణశుద్ధిగా అమ్మవారిని ఆరాధిస్తే - మన సంకల్పానికి, ధ్యేయానికి - సిద్ధిచే కూరి, ఫలప్రదమౌతుంది.

అప్పుడే వండిన పిండివంటను వంటింట్లోంచి హాల్లోకి పట్టుకువస్తుంటే - పిండివంటకాల ఘుమఘుమ వాసనలు ముందు వస్తాయి. అటుపైన పిండి వంటను చూస్తాము. సూర్యుడు ఉదయిస్తున్నపుడు సూర్యబింబం ఇంకా పైకి రావడానికి ముందే ఆ సూర్య కిరణాల తేజస్సు మనకు కనబడుతుంది. పువ్వు కంటె పువ్వువాసన, దీపంకంటె దీపకాంతి - ముందే మనకు తెలుస్తాయి. అలాగే - చిదగ్నికుండంలో దేవకార్యార్థమై ఆవిర్భవించే అమ్మవారికంటే ఆవిడ తేజస్సు ముందు దర్శనమౌతుంది.

అసలు వెలుగుయొక్క రూపమే అమ్మవారైతే, అలాంటి అమ్మవారి తేజస్సు (Aura) ఇంకెలా వుంటుందో వూహించుకోవాల్సిందే! అది చర్మ చక్షువులకు గోచరమయేదికాదు.

'భాను' అంటే సూర్యుడనే అర్థముంది, 'కిరణ'మనీ అర్థముంది. 'సహస్ర' అంటే 'వెయ్యి' అని అర్థం చెప్పుకోవచ్చు లేదా 'అనేకం' (అనంతం) అనీ అర్థం చెప్పుకోవచ్చు. వెయ్యి సూర్యులు ఒక్కసారి, ఒకే కాలంలో ఉదయిస్తూంటే ఎన్ని కిరణాలతో, ఎంత కాంతివంతంగా ఆ దృశ్యం వుంటుందో - అంత కాంతి పుంజంతో సమానమైన తేజస్సు - అమ్మవారు ఆవిర్భవిస్తున్నపుడు మనకు గోచరమౌతుందని అర్థం.

అమ్మవారి అరుణ శరీరకాంతుల్లోంచే సహస్ర సూర్యులు ఉద్భవిస్తూ వుంటారన్నది అసలు సత్యం.

ఉదయించే సూర్యకాంతి అరుణవర్ణంలో వుంటుంది. ''అరుణాంకరుణా తరంగితాక్షీం...'' అనే అమ్మవారి ధ్యానశ్లోకంలో మొట్ట మొదటగా ఉపయోగించిన ''అరుణాం'' అనే పదానికి తగ్గట్టుగానే అమ్మవారి స్థూలరూపవర్ణన గూడా 'ఉద్యద్భాను సహస్ర'' అనే ఉపమానంతో అమ్మవారి చుట్టూ వుండే తేజస్సుతో ప్రారంభించి, ఆ తేజస్సు ఎలా వుంటుందో మొట్ట మొదట ఇక్కడ చెప్పడం జరిగింది.

భగవద్గీతలో విశ్వరూపాన్ని వర్ణిస్తున్నప్పుడు గూడా -

''దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః''

(గీత - విశ్వరూప - 12)

('ఆకాశంలో వేయి సూర్యులు ఒక్కసారి ఉదయిస్తే వెలువడే కాంతి ఎలా ఉంటుందో- ఆ విశ్వరూప మహాత్ముని కాంతి అలా వుంది' అని ఈ శ్లోకానికి అర్థం) అంటే - తేజస్సు గురించి చెప్పవలసి వచ్చినప్పుడల్లా - సూర్య, సహస్ర పదాలు తప్పకుండా వస్తాయి - అని గుర్తుంచుకోవాలన్నమాట ! ఈ సూర్య, సహస్ర పదాల వైశిష్ట్యం తెలుసుకుందాం.

సూర్యోదయంలో సూర్యకిరణ సందర్శన, స్పర్శనాదులతో ప్రపంచానికి మెలకువ వస్తుంది. పద్మాలు వికసిస్తాయి. అలాగే ఈ నామోచ్చారణ వల్ల సాధకుల, ఉపాసకుల శరీరాల్లోని సుషుమ్నాపథంలో మూలాధారం క్రింద స్విచ్ వేసినట్లవుతుంది. అమ్మవారి ఆవిర్భావ వికాసకాంతుల దర్శన, స్పర్శ నాదులతో సాధకుల, ఉపాసకుల హృత్పద్మాలు వికసించి, వారిలో షట్చక్ర విలసనానికి ప్రేరణ జరుగుతుంది.

సూర్యుని కిరణస్పర్శతో మనకు మెలకువ వస్తుంది. స్వప్న, సుషుప్తి, జడత్వ అవస్థల నుండి జాగ్రదవస్థలో అడుగుపెడతాం. అలాగే - ఉద్భవిస్తున్న అమ్మవారి తేజస్సును ధ్యానంచేసినా, 'ఉద్యద్భాను సహస్రాభా' అనే నామం జపించి, అర్చించినా- నిద్రలాంటి అజ్ఞానం పోయి, మెలకువలాంటి జ్ఞానం కలిగి, బ్రతుకు అర్థవంతమవుతుంది. అంటే - వివేక సూర్యోదయం జరిగి, విశ్వ విజ్ఞానం పట్ల సరియైన అవగాహన కలుగుతుంది. నిజానికి సూర్యోదయకాలంలో ధ్యానించవలసింది సూర్యాంతర్వర్తిని - అంతేకాని సూర్యుని కాదు, సవితృ మండల మధ్యవర్తిని - అంతేకాని సవితృమూర్తిని కాదు, ఆదిత్య హృదయాన్ని - అంతేకాని ఆదిత్యుని కాదు.

'స' కార - 'హ' కారాలు 'పురుషునికి, - ప్రకృతికి' సంకేతాక్షరాలు. అందుకే పురుషసూక్తం - 'సహస్రశీర్షాపురుషః....' అని 'స' కారంతోను, శ్రీసూక్తం - 'హిరణ్యవర్ణాం హరిణీం' అని 'హ' కార సంబంధమైన 'హి' కారంతోను ప్రారంభమవుతాయి. ఈ 'స' కార 'హ' కారాలు - మనలో - బ్రతికున్నంత కాలం

నిరంతరం మన ప్రమేయంతో సంబంధం లేకుండా జరిగే - శ్వాసలోని ఉచ్ఛ్వాసనిశ్వాసాలను సూచిస్తాయి. వీటి మధ్య చక్కని సహకారం వున్నంత వరకు జీవికి ఆరోగ్యము, ఆయుర్దాయము వుంటాయి. అందువల్ల 'స' కార 'హ' కారాలు సహకారానికి గుర్తు. అందుకే తైత్తిరీయోపనిషత్తులో 'సహనావవతు, సహౌనౌ భునక్తు, సహవీర్యం కరవావహై' అని మున్మారు 'సహ' పదంతో శాంతిపాఠం ప్రారంభమౌతుంది. ఆధ్యాత్మిక మార్గంలో ధ్యానానికి 'స' కార 'హ' కారాలు రెండూ రెండు కళ్ళులాంటివి. ఇవి ఒకదానితో ఒకటి పెనవేసుకుంటే ఏర్పడేవే - ''హ్స్రామ్'' - ''స్హ్రామ్'' అనే బీజాక్షరాలు. ఇవి రెండూ 'శివదూతీ' - 'శివారాధ్యా' అనే అమ్మవారి నామాలకు సంకేతాక్షరాలు. 'స' కార 'హ' కారాలు రెండూ ఉచ్ఛ్వాస, నిశ్వాసాలైతే - ఆ రెంటినీ నిరంతరం కొనసాగేటట్లు చేసే చైతన్యాగ్నికి సంకేతాక్షరం 'ర' కారం, దీన్నే 'రేఫం' అని 'ఋషభ' మని, ఆంగ్లంలో Trill అనీ అంటారు. 'స' కార 'హ' కారాలు ఒక దాని తరువాత ఒకటి ఏకాంతరంగా 'ర' అనే అగ్నిబీజ చైతన్యాగ్ని చేత శ్వాసను కలుగచేసి, జీవికి జీవనోదయాన్ని కలుగచేస్తాయి. అందుకని 'సహస్ర' పదం - జీవిలోని శ్వాసకు, చైతన్యానికి, ప్రాణానికి, వెలుగుకూ, జీవనానికి గుర్తు. వీటిని చక్కగా దర్శింపచేసేది గాబట్టి దీనిని 'సుదర్శన' మని కూడా అంటారు. అంతేకాక స (సో) = ఉచ్ఛ్వాసాన్ని, పింగళనాడిని; హ (హమ్) = నిశ్వాసాన్ని, ఇడానాడిని; ర = చైతన్యాగ్నిని, సుషుమ్నానాడిని; కూడా సూచిస్తాయి.

ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు కేంద్రస్థానమైన హృదయంలో 'స' కార 'హ' కారాలనే ఆధ్యాత్మిక నేత్రాలతో అమ్మవారిని దర్శిస్తూ ధ్యానించాలి

ఈ ఉద్యద్భానుసహస్రాభా అనే నామాన్ని ఇంకో విధంగా కూడా పదవిభాగం చేయవచ్చు.

''ఉద్యత్, భా - అను, సహస్ర, ఆభా'' అని రెండు భాగాలుగా విడదీస్తే బ్రహ్మాండ పిండాండాలకు సరిపోయే అర్థాలు వస్తాయి. 'ఉద్యద్భా' అంటే ఉదయిస్తున్న అఖండమైన వెలుగు (పరమాత్మ), అను సహస్ర + ఆభా = (ఆ అఖండ వెలుగును) అనుసరించి ఉదయించే (వ్యక్తమయే) అనేక వెలుగురవ్వలు (జీవాత్మలు) అని అర్థం వస్తుంది.

మన వర్చస్సు పెరగాలన్నా, మన సాన్నిధ్యం ఎదుటివారిని ప్రభావితం చేయాలన్నా అమ్మవారిని ఈ నామంతో 'ఉద్యద్భాను సహస్రాభాయై నమః' అని జపించాలి.

మొత్తం మీద 'ఉద్యద్భాను సహస్రాభా' అన్న నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

(1) ఒక్కసారిగా ఉదయిస్తున్న వేయి సూర్యులకాంతితో సమానమైన తేజస్సు కల తల్లి.
(2) అరుణ వర్ణమయమైన తేజస్సుతో అలరారు తల్లి
(3) సుషుమ్నా మార్గమునకు చైతన్య ప్రేరకురాలు.
(4) హృదయ పద్మవికాసదోహదకారిణి.
(5) జ్ఞానాగ్నిని రగుల్కొలుపు తల్లి.
(6) జాగ్రదవస్థను కలిగించు తల్లి.
(7) అఖండమైన వెలుగు (బ్రహ్మ)కు, ఖండమైన వెలుగురవ్వకు (జీవాత్మకు) కారణభూతురాలు.

## 7. చతుర్బాహుసమన్వితా

ఇది లలితాదేవి యొక్క ఏడవనామం. ఇది ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు 'చతుర్బాహు సమన్వితాయై నమః' అని చెప్పాలి.

చతు ః = నాలుగు, బాహు = చేతులతో, సమన్వితా = కూడినది.

అమ్మవారి ఆవిర్భావానికి ముందుగా దర్శనమిచ్చే అమ్మవారి తేజస్సు ఎలా వుంటుందో క్రిందటి ఆరవనామంలో చెప్పబడింది. ఈ నామంలో అమ్మవారి స్థూలరూపానికి చెందిన చేతుల గురించి చెప్పబడింది. అమ్మవారికి నాలుగుచేతులు ఉంటాయి. కుడివైపున రెండు చేతులు, ఎడమవైపున రెండు చేతులు ఉంటాయి. రెండు వైపులా ఒక చెయ్యి పైకి, రెండవ చెయ్యి క్రిందకు వుంటుంది. అమ్మవారు సృష్టికారిణి కాబట్టి సృష్టి క్రమపరంగా ఈ నాలుగు బాహువులు ఏమేమి తెలియచేస్తాయో విపులంగా తెలుసుకోడం అవసరం.

రక్షణకే కాకుండా పరాక్రమానికి (పర + ఆక్రమ = పరాక్రమ) కూడా బాహువులు సంకేతాలు. చోటులో పరాదేవి యొక్క పరాక్రమం ఎన్ని విధాలుగా వుంటుందో, దానిని బట్టి సృష్టి వ్యూహానికి నమూనా (Blue Print) ఎలా ఏర్పడుతుందో చూద్దాం.

ఆవిర్భవించబోయే అమ్మవారు చోటు గోళానికి (Space globe) కేంద్రమైతే - ఆ కేంద్రం నుండి పైకి (ఊర్ధ్వ), క్రిందకు (అధస్సు), కుడి, ఎడమలకు (ఇరుపార్శ్వములు) ఇలా నాలుగు దిశలుగా వ్యాపించిన సరళరేఖలు(Sides)గా అమ్మవారి బాహువులను ఊహించాలి. (జ్యా మెట్రీలో Sides అనే పదానికి సంస్కృతంలో బాహువులనే అంటాం. ఈ నాలుగు బాహువులను చోటు గోళంలో వుండే ఒక పెద్ద '+' గుర్తుగా వూహించవచ్చు). (చోటులో కేంద్రంలాగా వున్న వామనుడు చతుర్బాహుడైన విష్ణుమూర్తిగా నాల్గుదిశల మేరకు విస్తరిల్లడాన్ని గూడా ఇలాగే సమన్వయ పరుస్తూ చెప్పుకోవాలి!) గోళాకారం (అండాకారం)గా వుండే చోటు – ఈ నాలుగు బాహువులతో నాలుగు భాగాలౌతుంది. ఈ నాలుగు భాగాలు వరుసగా (1) ఖనిజ సంపద(Mineral kingdom) (2) వృక్ష సంపద (Plant kingdom) (3) జంతుసంతతి (Animal king-dom) (4) మనుష్య సంతతి (Human kingdom)గా భౌతికసృష్టి(Physical creation) జరగడానికి కారణమవుతాయి. (పక్షి సంతతి కూడా జంతు సంతతి క్రిందకే వస్తుంది). ప్రళయం తర్వాత వచ్చే సృష్టి – గాఢ నిద్రస్థితి నుండి పూర్తి మెలకువలోకి మారే ప్రక్రియ లాంటి ది. ఈ ప్రక్రియలో – సుషుప్తి, స్వప్న, జాగ్రత్, తురీయావస్థల్లో – ఒకదాని కన్న దాని తర్వాతది మెలకువకు మెరుగుపడే స్థితులు. ఈ క్రమంలో జీవపరిణామ వికాసం నాలుగు అవస్థలలో, నాలుగురకాల సంతతులుగా జరుగుతుంది – అనేది గూడా ఈ నాలుగు హస్తాలు సూచిస్తాయి.

చోటు గోళంలో ఈ నాలుగు బాహువులు సూచించే నాలుగు బిందువులు - సూర్యుడు భూమి చుట్టూ తిరుగుతున్నట్లు కనబడే సంవత్సరాత్మక భ్రాంతి చక్రంలో (Ecliptic) వరుసగా – (1) ఉత్తరాయణ ప్రారంభ బిందువు (2) ఉత్తర విషువము(Vernal Equinox) (3) దక్షిణాయన ప్రారంభ బిందువు (4) దక్షిణ విషువము (Autumn equinox)అను నాలుగు నిర్దేశ బిందువులను(Cardinal Points) తెలియజేస్తాయి.

చోటు గోళంలో భూమి తనచుట్టూ తాను తిరగడం వల్ల ఏర్పడే దినాత్మక (Diurnal) చక్రంలో ఈ నాలుగు బాహువులు సూచించే బిందువులు వరుసగా -

సూర్యోదయ (ప్రాతఃసంధ్య), మిట్టమధ్యాహ్న, సూర్యాస్తమయ (సాయంసంధ్య), అర్ధరాత్రి – బిందువులను గూడా సూచిస్తాయి.

పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ స్థితులలో వ్యక్తమయే వాఙ్మయ ప్రపంచానికి కూడా ఈ నాలుగు బాహువులు సంకేతాలు.

చతుర్విధ పురుషార్థాలను (ధర్మ, అర్థ, కామ, మోక్షములు), చతుర్వర్ణాలను (బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు), చతురాశ్రమాలను (బ్రహ్మచర్య, గార్హపత్య, వానప్రస్థ, సంన్యాసములు), అంతఃకరణ చతుష్టయమును (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములు) కూడా ఈ నాలుగు బాహువుల విభజన సూచిస్తుంది.

పైన చెప్పిన విషయాలన్నిటినీ కూడా ఇలా సమన్వయ పరచుకోవాలనే సూచన – చతుర్బాహుసమన్వితాలో వున్న – 'సమన్వితా' – అనే పదంలో వుంది.

నాలుగు చేతులలో ఏయే ఆయుధాలు ధరించి, ఎలా అందరినీ ఆక్రమించి తన వశంలో పెట్టుకున్నదో వచ్చే నామంలో చెప్పబడుతుంది.

ప్రపంచంలో విస్తరిల్లి, పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోవాలనుకునేవారు, సర్వతో ముఖాభివృద్ధిని కోరేవారు అమ్మవారిని ఈ నామంతో 'చతుర్బాహు సమన్వితాయై నమః' అని జపించాలి.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

(1) నాలుగు చేతులతో కూడినది.

(2) బ్రహ్మాండ గోళంలోని నాలుగు భాగాలు, వాటి నుండి ఉద్భవించే – ఖనిజ, వృక్ష, జంతు, మనుష్య జాతులు; వారి యొక్క సుషుప్తి, స్వప్న, జాగ్రత్, తురీయావస్థలు; సూర్యగమన భ్రాంతి చక్రం లోని నాలుగు నిర్దేశ బిందువులు; భూమి ఆత్మప్రదక్షిణ వలన ఏర్పడే దినాత్మక చక్రంలోని నాలుగు నిర్దేశ బిందువులు; నాలుగు స్థితులలోని వాక్కులు; చతుర్విధ పురుషార్థాలు; చతుర్వర్ణ; చతురాశ్రమ; అంతఃకరణ చతుష్టయాదులను సూచిస్తాయి – అనే సమన్వయంతో కూడిన చతుర్బాహువులు గలది.

# 8. రాగస్వరూప పాశాఢ్యా

ఇది లలితాదేవి యొక్క ఎనిమిదవ నామం. ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు 'రాగస్వరూప పాశాఢ్యాయై నమః' అని చెప్పాలి.

రాగ = అనురాగము, స్వరూప = స్వరూపముగాగల, పాశ = పాశముతో, ఆఢ్యా = ఒప్పుచున్నది.

అమ్మవారు నాలుగుచేతులతో కూడినదని క్రిందటినామంలో చెప్పబడింది. ఆ నాలుగు చేతులలో ఏ యే ఆయుధాలు ధరించిందో ఈ నామం నుండి వచ్చే నాలుగు నామాల్లోనూ చెప్పబడుతుంది. ప్రస్తుత నామంలో అమ్మవారి యొక్క రెండు ఎడమ చేతులలో – క్రిందుగా నున్న ఎడమ చేతిలో ధరించిన ఆయుధం గురించి చెప్పబడుతోంది.

భౌతిక బంధనానికి 'పాశం' ఎలాంటిదో, మానసిక బంధనానికి 'రాగం' అలాంటిది. 'రాగం' – అంటే 'రక్తి' అని, 'అనురాగం' – అంటే 'అనురక్తి' అని చెప్పుకోవచ్చును. రాగద్వేషాలు ఉత్తర దక్షిణ ధృవాల్లాంటివి. ఒకటి వుందంటే రెండోది కూడా వున్నట్లే! ఇలాంటి జంటే కామక్రోధాలు గూడా! అనుకూలంగా వుంటే – రాగం, ప్రతికూలమైతే – ద్వేషం; అలాగే అనుకూలంగా వుంటే – కామం, ప్రతికూలమైతే – క్రోధం వుంటాయి. అరిషడ్వర్గంలో మొదటిది కామం, అంటే – రాగమే! ఈ రాగము, భయము, క్రోధము వదలబడిన వారికే మోక్షప్రాప్తి అని గీతాచార్యుడు చెప్తాడు. (వీత రాగభయక్రోధా – 4 అ.10శ్లో) అయితే రాగం తప్పనికాదు. ఏ పని జరగాలన్నా మొదట ఈ 'రాగం' వుండాల్సిందే! ఉపయోగించుకోవడం (Apply చెయ్యడం) తెలియక పోతే రాగం కూడా ఒక రోగమే! 'వల్లోపడితే – వలరాజు (మన్మథుడు) కారణం' అని అనవలసి వస్తుంది. అయ్యవారికి, అమ్మవారికి – ఈ కామాన్ని సరిగ్గా ఉపయోగించుకోవడం తెలుసు. సృష్టి జరగక పూర్వం తానొక్కడూ ఒంటి గింటి రామలింగంగా వున్నపుడు 'బోలెడువుందిగా అవాలి' అని కోరిక (కామం) కలిగిందిట అయ్యవారికి (సోఽకామాయత, బహుస్యాం ప్రజాయేయేతి – తైత్తిరీయం). సమస్త సృష్టికి దారితీసిన పరమేశ్వరుడి ఈ కామాన్ని 'మహా కామం' అంటారు. ఆ స్థితిలోని పరమేశ్వరుణ్ణి

'మహాకామేశ్వరు'డంటారు. అలాగే తను మాత్రం ఈ రాగానికి బద్ధమవకుండా, రాగాన్ని అనురాగంగా మార్చి, ఈ అనురాగ పాశంతో – తన బిడ్డలైన సమస్త జీవుల్ని జగజ్జనని తన చెప్పుచేతల్లో పెట్టుకొంటుంది. చేతిలో పాశం వున్నా – అది అనురాగ పాశం కాబట్టి, అదీ అమ్మవారికి అలంకారంగానే భాసిస్తుంది.

దేవతామూర్తులు ధరించే ఆయుధాలకు సంకేతాలయిన బీజాక్షరాలు వుంటాయి. 'ఆం' అనేది పాశానికి బీజాక్షరం. ఆయుధాలు చెడ్డవి అనడం తప్పు. ఉపయోగించే ధ్యేయాన్ని బట్టి అవి మంచివి, చెడ్డవి అవుతాయి. పళ్ళు, కాయలు కొయ్యడానికి ఉపయోగిస్తే – కత్తి మంచిదే ! కాని, అదే మంచివారి మెడకాయలు కొయ్యడానికి ఉపయోగిస్తే చెడ్డది. అంటే ఆయుధానికి సద్వినియోగ, దుర్వినియోగాలు రెండూ వుంటాయి. పాశం యొక్క కీలకలక్షణం బంధనమే అయినా – ఆ బంధనం 'రాగా'నికి దారితీస్తే అది చెడ్డ ఉపయోగాన్ని, 'దమా'నికి దారితీస్తే అది మంచి ఉపయోగాన్ని తెలియచేస్తుంది. ఈ 'రాగం' 'దమం' అనేవి పాశం యొక్క ఋణాత్మక (Negative), ధనాత్మక (Positive) లక్షణాలను తెలియ చేస్తాయి. అంటే – మొదట 'రాగం'గా వున్న లక్షణం ఉపాసనా సాధనలో 'దమం'గా మారుతుంది. 'దమం' అంటే బాహ్యేంద్రియ నిగ్రహం. దేవతామూర్తులు ధరించే ఎనిమిది రకాల ఆయుధాల పేర్లు – వాటిని తెలియపరచే బీజాక్షరాలు, వాటి ధనాత్మక, ఋణాత్మక లక్షణాలు ఈ క్రింద తెలిపిన పట్టికలో వివరింపబడ్డాయి.

| ఆయుధం పేరు - | బీజాక్షరం - | ధనాత్మక లక్షణం - | ఋణాత్మక లక్షణం |
|---|---|---|---|
| (1) పాశం | ఆం | దమం | రాగం |
| (2) అంకుశం | క్రోం | సాధన | క్రోధం |
| (3) ధనుస్సు | ఓం | సంకల్పం | మనస్సు (చంచలత్వం) |
| (4) బాణం | క్లీం | లక్ష్యము | ఇంద్రియం (విషయాభిలాష) |
| (5) శక్తి | హ్రీం | ధైర్యం | మదం |
| (6) శూలం | క్రీం | పరాక్రమం | మాత్సర్యం |
| (7) శంఖం | శం | వర్ధనం | లోభం |
| (8) చక్రం | హ్స్రామ్ | ఆకర్షణ | మోహం |

వీటి పూర్తి వివరణ ముందు ముందు నామాల్లో వస్తుంది.

అపేక్ష, ప్రేమ, కరుణ, వాత్సల్యం, మమత వంటి లక్షణాలు లేని రాతి హృదయం గలవారు – అమ్మవారిని ఈ నామంతో 'రాగస్వరూపపాశాఢ్యాయై నమః' అని జపిస్తే వారిలో ఆ లక్షణాలు వికసిస్తాయి.

(1) అనురాగమను పాశముతో ఒప్పుచున్నది. అనగా – అమ్మవారు చేపట్టిన పాశము ఆమె అనురాగ లక్షణమును సూచించును – అని ఈ నామానికి అర్థము.

## 9. క్రోధాకారాంకుశోజ్జ్వలా

ఇది అమ్మవారి తొమ్మిదవ నామం. ఇది ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు 'క్రోధాకారాంకు శోజ్జ్వలాయై నమః' అని చెప్పాలి.

క్రోధ = క్రోధమును; ఆకార = స్వరూపముగా గలిగిన; అంకుశ = అంకుశముతో; ఉజ్జ్వల = ప్రకాశించుచున్నది.

క్రిందటి నామంలో అమ్మవారు ధరించిన పాశమును గూర్చి చెప్పబడింది. ఈ నామంలో అమ్మవారు కుడిచేతితో ధరించిన ఆయుధం గురించి చెప్పబడుతోంది.

కుడివైపున వున్న క్రింది చేతిలో అమ్మవారు 'అంకుశాన్ని' ధరించి వుంటుంది. పాశము – రాగంతో సంబంధం కలిగి వున్నట్లే, ఈ అంకుశం – క్రోధానికి సంబంధించినది. కావాలనుకున్నది పొందలేకపోయినపుడు కోపం వస్తుంది. క్రోధం కూడా కోపం లాంటిదే! కాని, కోప ప్రభావం తక్కువ కాలానికే పరిమితం. అంటే – కోపం తరుణవ్యాధి. (Acute disease) లాంటిది. కాని, క్రోధం అలాకాదు. ఇది దీర్ఘవ్యాధి (Chronic disease) లాంటిది. కొన్ని రోజుల వరకు కొనసాగబడి నిలవవున్న కోపాన్ని (Integrated Anger) క్రోధం అనవచ్చు. అంటే – ఇది నాగుపాము పగలాంటి దన్నమాట!

అంకుశానికి బీజాక్షరం 'క్రోం' అని ఇంతకు పూర్వం చెప్పబడింది. దీని ఋణాత్మక లక్షణం క్రోధం గాని, ధనాత్మక లక్షణం – 'సాధన'. తన క్రోధం తీరడం కోసం ఎంత వ్యయప్రయాసలను పెట్టుబడి పెడతారో – అంత శక్తినీ సద్వినియోగపరచే

సాధకునికి ఈ క్రోధ లక్షణం 'సాధన'గా మారి, ధ్యేయాన్ని చేరడానికి ఉపకరిస్తుంది. క్రోధం సాధనగా మారాలంటే – తగినంత నెమ్మదితనం, ఓర్పు, సహనం, సమన్వయశక్తి కావాలి. ఇలాంటి లక్షణాలు కల గ్రహం ఒకటుంది. అదే శనిగ్రహం. (Saturn) 'శనైః శనైః చరః – శనైశ్చరః' అంటే – 'నెమ్మది, నెమ్మదిగా చరించేవాడు' అని అర్థం. ఎంతో అనుభవం కలవాడు ఈ శని. ఈ శనిగ్రహాన్ని తెలియచేయడానికి జ్యోతిశ్శాస్త్రంలో అంతర్జాతీయంగా ఏర్పాటు చేసుకున్న సంకేతం (symbol or glyph) 'h'. అంకుశంకూడా ఈ ఆకారంలోనే వుంటుందన్న విషయం ఇక్కడ గుర్తు తెచ్చుకోవాలి.

ఉత్ + జ్వలా = ఉజ్జ్వలా. క్రోధం సాధనగా మారితే – 'ధ్యేయాన్ని చేరాలి' – అనే సాధకుడి తపనశక్తి ఉత్తేజితమై శిఖరాగ్ర స్థాయికి చేరుతుంది. శ్రీ విద్యలో (కుండలినీ యోగంలో) మూలాధారం వద్ద వున్న (కుండలినీ) శక్తిని సహస్రారంలో ఒంటరిగా వున్న శివునిలో ఐక్యం చేయించడమే ధ్యేయం. ఈ విషయం ధ్వని పూర్వకంగా ఈ 'ఉజ్జ్వలా' పదంలో ఇమడ్చబడింది. 'ఉజ్జ్వలమైన భవిష్యత్తును అందచేసే అమ్మవార'ని ఈ పదం సూచిస్తుంది.

మనలో సాధనాశక్తి పెరగాలంటే అమ్మవారిని ఈ నామంతో 'క్రోధాకారాంకుశోజ్జ్వలాయై నమః' అని జపించాలి. సాధకులు మాత్రమే ఇలా చెయ్యాలి. మొత్తంమీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చు.

(1) క్రోధమును స్వరూపముగా గల అంకుశముతో ప్రకాశించునది.

(2) క్రోధమును సాధనగా మార్చగలిగే సాధకునికి ఉజ్జ్వల భవిష్యత్తును కలుగచేయునది.

## 10. మనో రూపేక్షుకోదండా

ఇది అమ్మవారి పదవ నామం. ఇది ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు 'మనోరూపేక్షు కోదండాయై నమః' అని చెప్పాలి.

మనః = మనస్సును, రూప = రూపముగా గల్గిన, ఇక్షు = చెఱుకుగడ (అను) కోదండా = విల్లును (ధరించునది)

ఎడమవైపు పైకి వున్న చేతిలో అమ్మవారు విల్లును ధరించింది. ఈ విల్లు చెఱుకుగడతో చేసిన విల్లుట! మనస్సును ఒక రూపంగా వూహిస్తే – అది చెఱుకుగడలాగా వుంటుందనుకోవచ్చు. మనస్సుకు – చెఱుకుగడకు సామ్యమేమిటి ?

చెఱుకుగడ ఒక చివరి నుండి రెండవ చివరి దాకా ఒకే మాదిరిగా సాఫీగా వుండదు. మధ్య మధ్యలో కణుపులు వుంటాయి. ఈ కణుపులనే – 'పర్వములు' అంటారు. చెఱుకుగడలో వుండే రసం ఎంత తీపిగా వుంటుందో – మనస్సులో మనకు ఇష్టమయే కోరికలు అంత తియ్యగా వుంటాయి. ప్రతి ఒక కణుపునుండి ప్రక్క కణుపుకు నములుతూ పోతున్నపుడు – క్రొత్త కణుపు దగ్గర క్రొత్తరకమైన తీపి ఉత్పన్నమవుతున్నట్లు – మనస్సులో కలిగిన ఒక కోరిక తీరి ఆనందిస్తుండగా – మరో కోరిక కలుగుతుంది. ఈ రెండవ కోరిక మొదటి కోరిక కంటె ఎక్కువ ఆనందాన్ని కలుగచేస్తుందనిపిస్తుంది. (ఉదా:- రేడియో కొనుక్కొని ఆనందిస్తున్నపుడు T.V. కొనుక్కుంటే ఇంకా బాగుంటుందని, తీరా T.V. కొనుక్కున్నాక V.C.R. అయితే మరింత బావుంటుందని అనిపించదూ!) అంటే మనస్సుకు పాతకోరిక తీరగానే క్రొత్త కోరిక మొలకెత్తుతుంది. ఈ తీపికోరికల కణుపులతో కూడిన 'మనస్సు' అనే 'చెఱుకు గడ ధనుస్సు'ను అమ్మవారు ధరించింది. చెఱుకుగడ – కణుపుల దగ్గర ముడి పడి కూడా వుంటుంది. అలాగే ప్రతి క్రొత్త కోరిక కలిగినప్పుడల్లా మనస్సుకు స్వేచ్ఛ తగ్గి, బంధించబడినట్లౌతుంది.

ధనుస్సు బీజాక్షరం 'ఓం'. చంచలమైన మనస్సు ఋణాత్మక లక్షణం అయినా ధృడంగా, స్థిరంగా వున్న మనస్సు 'దృఢసంకల్పాన్ని' గూడా తెలియచేస్తుంది. అంటే– ధనుస్సుకు 'దృఢ సంకల్పం' ధనాత్మక లక్షణం అన్నమాట! దృఢ సంకల్పం సంకల్పసిద్ధికి దారితీస్తుంది. దృఢ సంకల్పం వల్ల వికాసమే గాని వికల్పం ఉండదు. పురోగమనమే కాని, తిరోగమనం వుండదు. ఆనందమే కాని అవరోధం వుండదు.

మనలో మనస్తత్వం భ్రూమధ్యంలో వున్న 'అజ్ఞాచక్రం' వద్ద వర్తిస్తుంది. (మనోఽపి భ్రూమధ్యే – 9వ శ్లోకం – సౌందర్యలహరి) భ్రూమధ్యానికి అటూ ఇటూ వున్న కనుబొమ్మలు ధనుస్సులాగా వుంటాయి. వీటి మధ్యలో సూక్ష్మంగా వుండే జ్ఞాన చక్షువు యొక్క దృష్టి– బాణం లాగా వుండి, లక్ష్యానికి ఉన్ముఖంగా వుంటుంది. ధ్యానం వల్లగాని ఈ జ్ఞాన చక్షువు తెరుచుకోదు. ప్రక్కన వుండే చర్మచక్షువులు మూతపడినపుడు,

ఈ జ్ఞానచక్షువు పని చెయ్యడం ప్రారంభిస్తుంది. అందుకే, ఎంతకీ ఒక విషయం అర్థం కాకపోతే – కళ్ళు మూసుకుని భ్రూమధ్యంలో దృష్టిని కేంద్రీకరిస్తాం.

జీవితంలో ఒక లక్ష్యాన్ని సాధించడానికై కావలసిన దృఢ సంకల్పం కావాలనుకున్నవారు అమ్మవారిని ఈ నామంతో 'మనోరూపేక్షుకోదండాయై నమః' అని జపించాలి.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

(1) మనస్సును రూపంగా కలిగిన చెఱుకుగడ అను విల్లును ధరించినది.

(2) లక్ష్యమును తెలుపదగిన జ్ఞాన కోదండమును ప్రసాదించునది.

## 11. పంచతన్మాత్రసాయకా

ఇది అమ్మవారి పదకొండవ నామం. ఇది ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు 'పంచతన్మాత్ర సాయకాయై నమః' అని చెప్పాలి.

పంచ = ఐదు, తన్మాత్ర = తన్మాత్రలు అను, సాయకా = బాణములు (ధరించినది)

అమ్మవారి నాలుగు చేతులలోను వుండే ఆయుధాలను చెప్తూ, ఇంతవరకు మూడు చేతులలో వుండే ఆయుధాలను చెప్పడం జరిగింది. ఇక నాల్గవ చేతిలో ధరించిన ఆయుధం గురించి ఈ నామంలో చెప్పబడుతోంది. కుడి వైపు పైకి వున్న చేతిలో ఐదు బాణాలు వున్నాయి! ఈ ఐదు బాణాలూ మామూలు బాణాలు కాదు. తన్మాత్రల రూపాలే ఈ బాణాలు. 'శబ్ద స్పర్శాదయో బాణా మనస్తస్యాభవద్ధనుః' (వామకేశ్వరతంత్రము) అంటే ''శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలైన పంచతన్మాత్రలే ఈ పంచబాణాలు, మనస్సే ధనుస్సు'' అని అర్థం. బ్రహ్మాండం ఒక whole sale shop లాంటిది, లేదా Godown లాంటిది అయితే – పిండాండం Retail shop (చిల్లర దుకాణం) లాంటిది. బ్రహ్మాండంలోని పంచభూతాలను, పిండాండంలోని పంచ జ్ఞానేంద్రియాలను సంధానపరిచేవే పంచతన్మాత్రలు. ఈ క్రింద తెలిపిన పట్టిక వాటి వాటి మధ్య సంబంధాన్ని తెలియ చేసుంది.

| పంచభూతాలు - | తన్మాత్రలు - | జ్ఞానేంద్రియాలు - | ఇంద్రియ వ్యాపారం |
|---|---|---|---|
| (1) పృథివి | గంధం | ఘ్రాణేంద్రియం (ముక్కు) | వాసన |
| (2) ఆపస్సు | రసం | రసనేంద్రియం (నాలుక) | రుచి |
| (3) తేజస్సు | రూపం | చక్షురింద్రియం (కన్ను) | దృష్టి |
| (4) వాయువు | స్పర్శ | త్వగింద్రియం (చర్మం) | స్పర్శ |
| (5) ఆకాశం | శబ్దం | శ్రోత్రేంద్రియం (చెవి) | వినడం |

'బాణాస్తు త్రివిధా ప్రోక్తాః స్థూలసూక్ష్మ పరత్వతః,
స్థూలాః పుష్పమయా సూక్ష్మా మంత్రాత్మ నస్సమీరితః,
పరాశ్చ వాసనాయాంతు ప్రోక్తా స్థూలాన్ శృణుప్రియే'.

అమ్మవారి చేతిలో వున్న బాణాలు మూడు రకాలట. అవి స్థూలములు, సూక్ష్మములు, కారణములు. పుష్పబాణాలు – స్థూలములు. మంత్రరూప బీజాక్షరములు – సూక్ష్మములు, వాసనారూపములు – కారణములు' అని ఈ శ్లోకార్థం. జీవి యొక్క జ్ఞానేంద్రియాలను సంధాన పరచేవే తన్మాత్రలు. ఇంద్రియ లౌల్యం కూడా ఈ పంచతన్మాత్రలవల్లనే! అయితే మిగతా జీవులలో పతనం చెందడం ఒక్కొక్క ఇంద్రియం వల్లనే వుంటుంది. కాని, మానవునికి మొత్తం ఐదు ఇంద్రియాలవల్లా పతనం సంభవించటానికి అవకాశం వుంటుంది. అంటే 'మిగిలిన జీవులకన్న మానవుడు ఐదురెట్లు జాగ్రత్త వహించవలసి ఉంటుంద' ని ఈ క్రింది శ్లోకం చెబుతుంది.

''కురంగ మాతంగ పతంగ భృంగ
మీనాః హతః పంచభిరేవపంచ
ఏకం ప్రమాదీ కథనం వహన్యతే
యస్సేవతే పంచభిరేవపంచ'' (గరుడపురాణం)

(లేడి – శ్రోత్రేందియ లౌల్యం, ఏనుగు – స్పర్శేంద్రియ లౌల్యం, మిడత – రూపేంద్రియ లౌల్యం, తుమ్మెద – రసనేంద్రియ లౌల్యం, చేప – ఘ్రాణేంద్రియ లౌల్యం వల్ల పతనం చెందుతాయి)

మన్మథుడు ముల్లోకవాసులందరికీ చిత్తక్షోభం కలుగచేసి, వారి మీద పెత్తనం చెలా యిస్తున్నాడు. అంటే – ఈ పంచేంద్రియ లౌల్యాలను ఆసరాగా తీసుకుని,

పంచతన్మాత్రలనే బాణాలతో వాళ్ళను జయిస్తున్నాడని అర్థం. (''ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచవిశిఖాః... జగదిద మనంగో విజయతే-'' (సౌందర్యలహరి 6వ శ్లోకం))

బాణానికి బీజాక్షరం 'క్లీం' అని పూర్వం చెప్పబడింది. 'క్లీం' అనేది కామకళా బీజం. ఇది ఆకర్షణకు, సమ్మోహానికి సంబంధించింది. శ్రీకృష్ణుని మంత్రానికి సంబంధించిన బీజాక్షరం గూడా ఇదే! దీని ఋణాత్మక లక్షణం 'విషయాభిలాష', ధనాత్మక లక్షణం - 'లక్ష్యము'. ఇంద్రియాలు - మనస్సుకు, ఆ - మనస్సు - బుద్ధికి, ఆ బుద్ధి - ఆత్మకు ఉన్ముఖంగా లోబడి వుంటే - 'ఆత్మజ్ఞానసిద్ధి' అనే జీవితలక్ష్యం సానుకూలమై, జీవి జననమరణాతీతమైన మోక్షానికి చేరువవుతాడు. లేకపోతే 'పునరపిజననం పునరపిమరణం' అనే జనన మరణ చక్రభ్రమణంలోపడి, జీవి సతమతమైపోతాడు. ఈ లక్ష్య సిద్ధికై అమ్మవారి నామాన్ని 'పంచతన్మాత్ర సాయకాయైనమః' అని జపించాలి.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

(1) శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు - అనే పంచతన్మాత్రలను బాణాలుగా ధరించినది.

(2) పంచ జ్ఞానేంద్రియాల ద్వారా పొందిన జ్ఞానశుద్ధిని బట్టి ఆత్మ జ్ఞాన లక్ష్యమునకు చేర్చునది.

## 12. నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండమండలా

ఇది అమ్మవారి పన్నెండవ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు 'నిజారుణ ప్రభాపూరమజ్జద్బ్రహ్మాండ మండలాయై నమః' అని చెప్పాలి. ఇది పదహారు అక్షరాల నామం. అందువల్ల ఈ నామాన్ని - 'నిజారుణ ప్రభాపూరా' అని 'మజ్జద్బ్రహ్మాండ మండలా' - అని, రెండుగా శ్లోకపాదాలను బాణీ కోసమని విరిచి చదవకూడదు. (అలా విరిచి చదివితే 'మజ్జద్బ్రహ్మాండమండలా' అన్నపుడు అమ్మవారు మునుగుతూ వున్న బ్రహ్మాండ మండల అయిపోతుంది.)

నిజ = తన సహజమైన, అరుణ = ఎఱ్ఱని, ప్రభా = కాంతుల (వర్చస్సు), పూర = నిండుదనమునందు, మజ్జత్ = మునుగుచూ (తేలుచూ) వున్న, బ్రహ్మాండమండలా = బ్రహ్మాండముల సముదాయము గలది.

అమ్మవారి వర్చస్సు గురించి ఈ నామంలో చెప్పబడుతోంది. అమ్మవారి ధ్యానశ్లోకం 'అరుణాం కరుణాతరంగితాక్షీం' అని ప్రారంభింపబడు తుంది. ధ్యానం చెయ్యడానికి కళ్ళు మూసుకుంటాం. అలా కళ్ళు మూసుకోంగానే ముందుగా దర్శనమయేది ఏదైతే వుందో దాన్ని – 'అరుణ వర్ణం పేరు పుట్టడానికి మూలంగా' – గుర్తించాలి. అలాగే – కళ్ళు తెరవడానికి ముందు వున్న దాన్ని గూడా అరుణవర్ణానికి మూలంగా గుర్తించాలి. అంటే – కళ్ళు తెరవ డానికి ముందు కనబడేది, కళ్ళు మూసుకోంగానే వెంటనే కనబడేది గూడా అరుణ వర్ణమే ! 'కన్ను తెరవడం' అంటే చీకటి నుండి వెలుగులోకి రావడం, 'కన్నుమూయడం' అంటే – వెలుగు నుండి చీకటిలోకి పోవడం. ఇవి ప్రాతః సంధ్యాకాలం, సాయం సంధ్యాకాలం లాంటివి. అంటే – ఇవి సూర్యోదయానికి ముందున్న స్థితి, సూర్యాస్తమయానికి తర్వాత ఉన్న స్థితి లాంటివి అన్నమాట! ఈ రెండు స్థితులలో గూడా ఆ ప్రాంత ఆకాశంలో అరుణ వర్ణమే కనిపిస్తుంది. కంటికి సూర్యునకు ఇలాంటి లక్షణం వున్నదిగాబట్టే ''చక్షోసూర్యో అజాయత'' అని పురుషసూక్తంలో చెప్పబడింది. (అంటే – 'పరమాత్మ నేత్రం నుండి సూర్యుడు పుట్టాడు' అని దీని అర్థం)

అమ్మవారి వర్చస్సు అరుణ వర్ణ ప్రభాసముద్రం. దాంట్లోనుంచే సమస్త సృష్టి ఉత్పన్నమైంది. తైత్తిరీయోపనిషత్తులోని నారాయణ ప్రశ్నలో గూడా ''తతో రాత్రిర్జాయత! తతః సముద్రో అర్ణవః, సముద్రాదర్ణవాదధి !.... సూర్యాచంద్ర మసౌధాతా, యథా పూర్వమకల్పయత్,'' అని చెప్పబడింది.

'రాత్రి పుట్టి అటుపైన సముద్రం, అర్ణవం, సంవత్సరం – దాని నుండి రేయింబవళ్ళు, సూర్యుడు, చంద్రుడు మొదలైన సృష్టి అంతా పూర్వకల్పంలో లాగానే ఏర్పాటయింది' – అని దీని భావం.

సూర్య కుటుంబం ఏర్పడేప్పుడు గూడా ఇలాగే ముందుగా సూర్యుని చుట్టూ వుండే సూర్యరశ్మి చిక్కబడి, ద్రవరూపం చెంది, అటుపైన ఇంకా చిక్కబడటం

ప్రారంభించి, చుట్టూ అక్కడక్కడ పలుకులు పలుకులుగా ఘనీభవించి, కుజగ్రహాదులు ఏర్పడతాయి. ఇటువంటి సూర్యకుటుంబాలకు నేపథ్యం(Back ground) లో వున్న బ్రహ్మాండ మండలాలన్నీ 'అమ్మవారి సహజవర్చస్సు' అనే 'అరుణ ప్రభాసముద్రంలో ' మునుగుతూ తేలుతూ వుంటాయి. ఇంకా బాగా అర్థమయేట్టు చెప్పుకోవాలంటే – సూర్య కుటుంబంలోని గ్రహాదులకు వాటి చుట్టూ వుండే సూర్యరశ్మి ఎలాటిదో - బ్రహ్మాండ మండలాలకు అమ్మవారి అరుణారుణ సహజ వర్చస్సు అలాంటిదన్నమాట !

ప్రాతఃకాలంలో, సూర్యోదయ సమయంలో– అమ్మవారిని అరుణారుణమూర్తిగా ధ్యానించి, ఈ నామాన్ని జపిస్తే సృష్టి విజ్ఞాన దర్శనం జరుగుతుంది.

'తన సహజమైన అరుణారుణ కాంతుల నిండుదనంలో - మునుగుతూ, తేలుచున్న బ్రహ్మాండమండలములు గలది' - అని ఈ నామానికి అర్థం.

## 13. చంపకాశోక పున్నాగ సౌగంధికలసత్కచా

ఇది అమ్మవారి పదమూడవ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు 'చంపకాశోకపున్నాగ సౌగంధికలసత్కచాయై నమః' అని చెప్పాలి. ఇది పదహారు అక్షరాల నామం. 'చంపకాశోక పున్నాగా' – 'సౌగంధికలసత్కచా' అని విడదీసి రెండు 'ఎనిమిది – అక్షరాలనామాలు' గా చెప్పకూడదు.

చంపక = సంపంగి, అశోక = అశోక, పున్నాగ = పున్నాగ, సౌగంధిక = చెంగల్వ పుష్పముల ( అలంకరణ ) చేత, లసత్ = ప్రకాశించుచున్న, కచా = శిరోజ సంపద కలిగినది.

సూర్యుడు ఉదయిస్తున్న తీరుగానే అమ్మవారి ఆవిర్భావాన్ని ఊహిస్తే - ముందుగా అమ్మవారి తలకట్టుతో ప్రారంభమై, పాదాంతముతో ఆవిర్భావము పూర్తవుతుంది. అందువల్ల ఈ నామంలో అమ్మవారి తల కట్టును గూర్చి చెప్పడం జరిగింది. అమ్మవారి శిరోజములు పుష్పాలవలె అతి మృదువుగా వుండి, పరిమళాలు విరజిమ్ముతూ వుంటాయి. పుష్పాలకు సుగంధం ఎంత సహజమో - అమ్మవారి శిరోజాలకు సుగంధం అంత సహజంగా వుంటుంది. ఖనిజ, వృక్ష, జంతు, మానవులందరూ ప్రకృతి మాతకు బిడ్డలే

కాబట్టి, పుష్పాలకుండే సువాసన అమ్మవారి వల్లనే వచ్చింది. అమ్మవారి శిరోజ సుగంధాన్ని పొంది, తాము 'సుగంధవంతమవాలని', 'అమ్మవారి వేణీ బంధంలో చేరాలనీ' - కల్పవృక్షపు పువ్వులన్నీ ఆతృత చెందుతాయని శంకరాచార్యులవారు సౌందర్యలహరిలో ''ధునోతుధ్వాంతం... వలమథన వాటీ విటపినామ్'' అనే 43వ శ్లోకంలో చెప్తారు. పూలవాసనలతో పరిమళిస్తూ, కాంతుల్ని విరజిమ్ముతున్న అమ్మవారి కబరీ బంధం (జుట్టుముడి) మనలోని అజ్ఞానతిమిరాన్ని తరిమి ప్రజ్ఞావంతుల్ని చేస్తుందిట! అమ్మవారి కబరీబంధ దర్శనం మన కర్మబంధ వినాశానికి దారితీస్తుందని దీని తాత్పర్యం.

చంపక, అశోక, పున్నాగ పువ్వులు వరుసగా ప్రధాన వర్ణాలైన (Primary Colours) - ఆకుపచ్చ (Green), ఎఱుపు (Red), నీలము (Blue) రంగులలో ఉంటాయి. ఈ మూడు ప్రధాన రంగుల వివిధ కలయికల వల్లనే మిగిలిన ఇతర వర్ణాలన్నీ ఏర్పడతాయి.

తలకట్టునందలి శిరోజాలు సుగంధ పరిమళాలు వెదజల్లాలంటే - ఆడవాళ్ళు అమ్మవారిని 'చంపకాశోక పున్నాగ సౌగంధికలసత్కచాయై నమః' అని ఈ నామం జపించాలి.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చు.

(1) సంపంగి, అశోక, పున్నాగ, చెంగల్వ పుష్పములు పరిమళించే శిరోజ సంపద కలిగినది.

(2) సంపంగి మొదలైన పువ్వులకు సుగంధాన్ని చేకూర్చగల శిరోజ సంపద కలిగినది.

(3) ప్రధాన వర్ణాలైన ఆకుపచ్చ, ఎఱుపు, నీలం రంగులు కల పుష్పాలను ధరించిన కేశ సంపద గలది.

## 14. కురువిందమణిశ్రేణీకనత్కోటీరమండితా

ఇది అమ్మవారి 14వ నామం. పదహారు అక్షరాల నామం. ఈ నామంతో నమస్కారం చేసేటప్పుడు 'కురువిందమణిశ్రేణీకనత్కోటీర మండితాయై నమః' అని చెప్పాలి.

కురువిందమణి = పద్మరాగముల, శ్రేణీ = వరుసచేత, కనత్ = ప్రకాశించుచున్న కోటీర = కిరీటముచే, మండితా = అలంకరింపబడినది.

అమ్మవారి శిరస్సుకు ఉన్న కిరీటం గురించి ఈ నామంలో చెప్పబడుతోంది.

కురువిందమణులంటే – పద్మరాగమణులు. ఇవి ఎఱ్ఱగా వుంటాయి. మంకెన పువ్వు, గురువిందపూస, ఆరుద్రపురుగు, మందార పుష్పం, లొద్దుగ పువ్వు, రక్తం – వీటి ఎఱ్ఱదనం ఎలా వుంటుందో – పద్మరాగమణులు కూడా అలా ఎఱ్ఱగా వుంటాయి. దానిమ్మగింజలు కూడా ఇలాంటి ఎఱుపురంగులోనే వుంటాయి.

పైన తెలిపిన ఎఱ్ఱని కాంతులు విరజిమ్మే పద్మరాగమణులచేత అమ్మవారి కిరీటం పొదగబడింది. శంకరాచార్యులవారు సౌందర్యలహరిలో అమ్మవారి కిరీటాన్ని – ''గతైర్మాణిక్యత్వం.....'' అన్న 42వ శ్లోకంలో వర్ణించారు. ద్వాదశ ఆదిత్యులచే చక్కగా కూర్పబడి, చెక్కబడినదట అమ్మవారి కిరీటం. ఈ ద్వాదశ ఆదిత్యుల కాంతుల నుండి వెలువడే వివిధ వర్ణాలు కిరీటంపైన వున్న చంద్రరేఖపైనబడి ప్రతి ఫలిస్తాయిట!

ఈ విధమైన అమ్మవారి కిరీట ధ్యానము పరమేశ్వరీ భక్తిని పెంపొందించి, చిత్తంలో స్థిరపరుస్తుంది. 'పద్మరాగమణులచే ప్రకాశించు కిరీటమును ధరించినది.' – అని ఈ నామానికి అర్థం.

## 15 అష్టమీచంద్రవిభ్రాజదళికస్థల శోభితా

ఇది అమ్మవారి 15వనామం. ఇది16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''అష్టమీ చంద్ర విభ్రాజ దళిక స్థలశోభితాయైనమః అని చెప్పాలి గాని ''అష్టమీ చంద్ర విభ్రాజా'' అని, ''దళికస్థలశోభితా'' అని రెండు భాగాలుగా విడదీసి చెప్పకూడదు.

అష్టమీ = అష్టమినాటి, చంద్ర = చంద్రునివలె, విభ్రాజత్ = ప్రకాశించుచున్న, అళిక + స్థల = ఫాలభాగము (నుదురు)చే, శోభితా = పవిత్రమైన సౌందర్యముతో అలరారుచున్నది.

అమ్మవారి ముఖము శరత్పూర్ణిమా చంద్రునిలాగా ఉంటుంది. ఒక విధంగా శరత్పూర్ణిమాచంద్రుడు అమ్మవారి ముఖము అనడం – సమంజసం (''పరిణతశరచ్చంద్ర

వదనా'' – సౌందర్యలహరి, ''శరచ్చంద్ర నిభాననా'' – లలితా సహస్రనామం) ముఖము పూర్ణబింబమైనపుడు అమ్మవారి ఫాలభాగం చంద్రుని అర్ధబింబం లాగా వుంటుంది! అనగా అష్టమినాటి చంద్రునివలె అమ్మవారి ఫాలభాగము ఉంటుంది. 'అష్టమినాటి చంద్రుడు'' అనగానే ''శుక్లపక్షమా?'' లేక కృష్ణపక్షమా ? – అనే సందేహం రావచ్చును. శుక్లపక్షము నాటి చంద్రుడు ''◡'' ఆకారములో ఉంటాడు. (ఇది ప్రథమ అర్ధ ఖండం) కృష్ణ పక్ష అష్టమి నాటి చంద్రుడు ''◠'' ఆకారములో వుంటాడు. (ఇది ద్వితీయ అర్ధఖండం ) దీనిని బట్టి కృష్ణ పక్ష అష్టమినాటి చంద్రుని ఆకారాన్నే ఉపమానంగా తీసుకోవాలని తెలుస్తోంది. సౌందర్యలహరిలో శంకరాచార్యులవారు అమ్మవారి లలాట భాగాన్ని వర్ణించేటప్పుడు ''లలాటం లావణ్యద్యుతి విమల..... ద్వితీయం తన్మన్యే....... పరిణయతి రాకాహిమకరః'' అనే శ్లోకంలో – కిరీటం చేత కూర్పబడిన అమ్మవారి ఫాల భాగాన్ని – చంద్రుని యొక్క ద్వితీయ అర్ధ ఖండంతో పోల్చారు.

అష్టమీ చంద్రుని భాగాన్ని – అనగా – అర్ధ చంద్రుని భాగాన్ని, అమ్మవారి ఫాల భాగాన్ని వ్యత్యస్తంగా – అనగా – కొమ్ములు కలిసే విధంగా (అనగ◡ +◠ = ◯) వూహిస్తే 'సంపూర్ణ అమృత కిరణములు ప్రసరించే పూర్ణిమా చంద్రుడౌతాడ' ని కూడా శంకరాచార్యుల వారు ఈ శ్లోకంలో చెప్పారు. అప్పటి చంద్రుడు షోడశ కళాప్రపూర్ణుడు. ఈ షోడశ కళాప్రపూర్ణుడైన పూర్ణచంద్ర బింబాన్ని అమ్మవారు తన ముఖంగా కలిగినందువలన ఈ సహస్రనామాల్లోనే మరొకచోట అమ్మవారు ''శరచ్చంద్రనిభాననా'' అనే నామంతో చెప్పబడింది.

అమ్మవారు పదహారు కళలు కలిగిన పరిపూర్ణ స్వరూపిణి. అందువల్లనే అమ్మవారిని ''షోడశీ'' అంటారు. చంద్రకళలను సూచించే తిథులకు, అమ్మవారి కళలకు, మన్వంతరాలకు, సమన్వయం ఉంది. చంద్రుడు పాడ్యమి నుండి క్రమక్రమంగా ఒక్కొక్క కళ చొప్పున వృద్ధిచెందుతూ, పూర్ణిమ నాటికి నిండు చంద్రుడౌతాడు. సూర్యుని నుండి పొందే వెలుగు శుక్ల పక్షములో క్రమక్రమంగా పెరుగుతూ చంద్రునికి సంక్రమించడం వలన – పూర్ణిమ రోజు చంద్రుడు పరిపక్వస్థితిని పొందుతాడు. కృష్ణ పక్షంలో చంద్రుడు ఒక్కొక్కరోజుకు ఒక్కొక్క కళ చొప్పున తగ్గుతూ, అమావాస్యనాడు పూర్తిగా తన కళను

కోల్పోతాడు. చంద్రుని యొక్క ఈ పదహారు కళలను శ్రీ విద్యలో 'నిత్య'ల పేర్లతో సంకేతిస్తారు. రెండు పక్షాలలోని తిథులకు, నిత్యల పేర్లకు మధ్య సమన్వయం ఈ క్రింద తెల్పబడింది.

| తిథిపేరు | శుక్ల పక్షములోని నిత్యపేరు | కృష్ణపక్షములోని నిత్యపేరు |
|---|---|---|
| పాడ్యమి | కామేశ్వరీ | చిత్రా |
| విదియ | భగమాలినీ | జ్వాలామాలినీ |
| తదియ | నిత్యక్లిన్నా | సర్వమంగళా |
| చవితి | భేరుండా | విజయా |
| పంచమి | వహ్నివాసినీ | నీలపతాకా |
| షష్ఠి | మహావజ్రేశ్వరీ | నిత్యా |
| సప్తమి | శివదూతీ | కులసుందరీ |
| అష్టమి | త్వరితా | త్వరితా |
| నవమి | కులసుందరీ | శివదూతీ |
| దశమి | నిత్యా | మహావజ్రేశ్వరీ |
| ఏకాదశి | నీలపతాకా | వహ్నివాసినీ |
| ద్వాదశి | విజయా | భేరుండా |
| త్రయోదశి | సర్వమంగళా | నిత్యక్లిన్నా |
| చతుర్దశి | జ్వాలామాలినీ | భగమాలినీ |
| పూర్ణిమ | చిత్రా | కామేశ్వరీ |

పై పట్టికలో తెలిపిన పదిహేను నిత్యలయందు – శుక్లపక్షంలో ఒక్కొక్క కళ చొప్పున పెరుగుతూ, కృష్ణ పక్షంలో ఒక్కొక్క కళ చొప్పున తగ్గుతూ వర్తించే 'మూలభూతమైన కళ'ను – 'మహానిత్యా' అంటారు. మహానిత్యను – లలిత, శ్రీకళ, నైసర్గికకళ, సంవిత్కళ, చిత్కళ, మొదలైన పేర్లతో కూడా పిలుస్తారు. ఈ మూలభూతమైన 'లలితా కళ'ను 'ఆద్యకళ' అని కూడా అంటారు. ఈ 'మహానిత్య' లలితాంగిగా వుండి, మిగిలిన నిత్యలయందు అంగములుగా వుంటుంది. అని 'తంత్రరాజ తంత్రము'లో ఈ క్రింది శ్లోకములో చెప్పబడింది.

శ్లో. ఆద్యాయా లలితాయాస్సు రన్యా పంచదశాంగగాః
లలితాంగి త్వరూపేణ సర్వాసామాత్మ విగ్రహా.

ఇంతకు ముందు తెలిపిన పట్టికను జాగ్రత్తగాపరిశీలిస్తే శుక్ల పక్షానికి సంబంధించిన నిత్యలే కృష్ణపక్షములో తారుమారైనట్లు ( అనగా వరుస తలక్రిందులైనట్లు) తెలుస్తుంది. అష్టమీతిథి ఒక్క దానికి తప్ప శుక్ల పక్షములోని ఒక తిథికి సంబంధించిన నిత్య – కృష్ణ పక్షములో అదే తిథికి రాదు, మారుతోంది. రెండు పక్షాలలోని అష్టమీ తిథికి సంబంధించిన ''త్వరిత'' మాత్రం మార్పు చెందదు. ఇది ఒక విశేషాన్ని సూచిస్తుంది. అష్టమి నాటి చంద్రునితో అమ్మవారి ఫాలభాగం పోల్చబడింది గదా. ఈ 'శుక్ల పక్ష – కృష్ణపక్షములు' రెండూ – 'వృద్ధి – క్షయము' లకు; 'వికాస – వికల్పము' లకు; 'సంతోష –– విషాదము' లకు ప్రతీకలైతే ఈ రెండు పక్షాలలోని అష్టమి తిథికి సంబంధించిన నిత్యపేరులో మార్పు రాకపోవడం గమనిస్తే – ఈ అష్టమీ చంద్రఫాల భాగం – 'సంతోష, విషాదముల ప్రభావము పనిచేయక, వాటికి అతీతంగా, సర్వదా, ఏకరీతిగా వుండే అమ్మవారి నిర్వికారతను తెలియచేస్తుందని' – తెలుస్తుంది. కృష్ణ అష్టమి నాటి, శుక్లపక్షం నాటి చంద్రుని ఆకార ప్రకాశాల్లో మార్పుఉండదు అని ఇక్కడ గుర్తు పెట్టుకోవాలి.

ఫాలభాగం విశాలంగాను, అర్ధచంద్రాకారంగాను వుండటాన్ని సాముద్రిక సల్లక్షణంగా పరిగణిస్తారని ఈ నామం ద్వారా తెలుసుకోవాలి.

''కృష్ణపక్ష అష్టమి నాటి చంద్రుని వలె ప్రకాశించు ఫాలభాగముతో శోభిల్లునది'' అని ఈ నామానికి అర్థం.

## 16 ముఖచంద్ర కళంకాభ మృగనాభివిశేషకా

ఇది అమ్మవారి 16వనామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''ముఖచంద్ర కళంకాభమృగ నాభి విశేషకాయైనమః' అని చెప్పాలి. ఈ నామాన్ని – ''ముఖచంద్ర కళంకాభా'' అని, ''మృగనాభివిశేషకా'' అని రెండు భాగాలుగా విడదీసి చదవకూడదు, చెప్పకూడదు. అలాచేస్తే అర్థం చాలా మారిపోతుంది. అమ్మవారి ముఖాన్ని చంద్రబింబంలోని మచ్చతో పోల్చి అవమానపరచినట్లౌవుతుంది గూడా ! తస్మాత్ జాగ్రత !

ముఖ = ముఖము అనెడి, చంద్ర = చంద్రునియందు, కళంక + ఆభ = మచ్చవలె ఒప్పెడు, మృగనాభివిశేషకా = కస్తురి బొట్టును కలిగినది.

అమ్మవారి ఫాలభాగాన్ని క్రిందటి నామంలో వర్ణించడం జరిగింది. ప్రస్తుత నామంలో అమ్మవారి నుదుటన వున్న కస్తూరీ తిలక సోయగాన్ని గూర్చి చెప్పడం జరుగుతోంది. అమ్మవారి ముఖం చంద్రబింబంలాగా వుంటే – ఆ ముఖంలోని నుదుటి మీద ఉన్న కస్తురి బొట్టు చంద్రబింబంలోని మచ్చలాగా వుందిట! ఇది ఎంతో చక్కని ఉపమానం. ఈ నామానికి ఇది స్థూలార్థమే!

విశేషార్థం: 'మృగము' అంటే జంతువు, లేడి, దుప్పి అనే అర్థాలు గాక, ఇంకొక అర్థం గూడా వుంది. అసలు, 'మృగము' అన్న పదానికి 'మార్గము' అని, లేనిది ఉన్నట్లు కలిగే 'భ్రమ' అనీ, 'లేకపోవడం' అనీ, 'మనకన్న ముందు వుండేది'(Always one step ahead) అనీ అర్థాలు ఉన్నాయి.

వేటాడేటప్పుడు వేటగాని కంటె జంతువు, లేదా – లేడి, లేదా – దుప్పి ఎప్పుడూ ముందు వుంటూ మార్గాన్ని నిర్దేశిస్తుంది కాబట్టి దానిని మృగము అనే పదంతో సూచించడం జరిగింది.

ఎడారుల్లో ప్రయాణం చేస్తున్నప్పుడు ఎండమావులను ప్రయాణీకుడు గమనిస్తాడు. తన కంటె కొంత దూరంలో ముందు నీళ్ళు ఉన్నట్లు, నీటి అలలను చూస్తున్నట్లు భ్రమ పడతాడు. నిజానికి అక్కడ జలాశయాలేమీ వుండవు. నీళ్లున్నాయని ముందుకుపోతే అవి ఇంకా ముందుకు పోతాయి. ఇలా ఎప్పుడూ ప్రయాణీకుని కంటె ముందు వున్నట్లు భ్రమ పెట్టే ఎండమావులను గూడా 'మృగతృష్ణ' అంటారు. అందుకనే లేనిది ఉన్నట్లుగా కలిగే 'భ్రమ'ను గూడా 'మృగము' అంటారు. దీని నుండే 'మృగ్యము' (లేకపోవడం) అనే పదం వచ్చింది. రామాయణంలో 'మాయలేడి' గూడా ఇలాంటిదే!

'మృగ' పదం నుండి ఉత్పన్నమైందే 'మార్గము' ప్రయాణించే ప్రయాణీకుని కంటె ముందుండి త్రోవను చూపిస్తుంది కాబట్టి దానిని గూడా 'మార్గము' అన్నారు, అంటే – 'మనకు ముందు వుండేది' అని అర్థం. మనకు తెలియవలసిన జ్ఞానం తెలిసిన జ్ఞానానికి ముందు వుంటుంది కాబట్టి తెలియవలసిన జ్ఞానం 'మృగము' వంటిదన్నమాట! ఇక

'నాభి' అంటే – కేంద్రం (గరిమనాభి అంటే ఆంగ్లంలో 'Centre of Gravity' అని అర్థంగదా!) కాబట్టి 'మృగనాభి' అంటే – 'తెలియవలసిన జ్ఞానానికి కేంద్రము' అని అర్థం వస్తుంది. మృగనాభికి వున్న ఈ అర్థాన్ని బట్టి అమ్మవారి ముఖానికి (నుదుటికి) మధ్యన వుండే బొట్టు – తెలియవలసిన జ్ఞానానికి కేంద్రంలాగా వున్నదన్నమాట ! ఇలా అర్థం చెప్పుకోవడం సబబే ! ఎందుకంటే – బొట్టు వుండే చోటే గదా జ్ఞానానికి సంబంధించిన ఆజ్ఞా చక్రం వుండేది.

నుదురుపై మనం బొట్టు పెట్టుకునే బిందువు మనకు తూర్పు దిశను సూచిస్తుంది. తూర్పున జరిగే సూర్యోదయంవలన ప్రపంచానికి వెలుగువిచ్చుకున్నట్లు – మనకు భ్రూమధ్య కేంద్రం నుండి సమస్త జ్ఞానం వికసనం చెందుతుంది. అందుకనే సద్గురువు శిష్యుణ్ణి అనుగ్రహించి, ప్రేరణ(Induction) ద్వారా విద్యను ప్రసాదించేటప్పుడు తన బొటన వ్రేలితో శిష్యుని భ్రూమధ్యంలో వుండే ఈ కేంద్రాన్ని స్పృశిస్తాడు. రామకృష్ణ పరమహంస వివేకానందునికి అలాగే చేశాడు.

కస్తూరి ధరిస్తే సువాసనతో పాటు తలనొప్పి వంటి బాధలను కూడా తొలగిస్తుంది. బొట్టు బిళ్ళల వలన ఇది సాధ్యం కాకపోగా తెల్లని మచ్చ గూడా ఏర్పడే ప్రమాదం ఉంది.

చంద్రకళల సంఖ్యలైన 15, 16 సంఖ్యల నామాలలోనే చంద్రునితో అమ్మవారి ఫాలభాగాన్ని పోల్చి వర్ణించడం ఒక ఔచిత్య విశేషం.

ఈ భ్రూమధ్యం వద్ద వుండే అమ్మవారి బొట్టును 'అ' కారంతోను, ముఖ వృత్తాన్ని 'ఆ' కారంతోను న్యాసం చేసుకోవాలి.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. ముఖమనే చంద్రబింబంలో మచ్చలాగా భాసిస్తున్న కస్తురి బొట్టు కలిగినది.
2. ముఖమనే చంద్రబింబంలో తెలియవలసిన జ్ఞానానికి కేంద్రంలాగా భాసించే కస్తురి బొట్టు కలిగినది.

## 17. వదనస్మర మాంగల్య గృహతోరణ చిల్లికా

ఇది అమ్మవారి 17వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''వదనస్మర మాంగల్య గృహతోరణ చిల్లికాయైనమః'' అని చెప్పాలి. రెండు భాగాలుగా విడదీసి చెప్పకూడదు.

వదన = ముఖమనెడు, స్మర = మన్మథుని, మాంగల్య = శుభమైన, గృహ = నివాసమునకు, తోరణ = తోరణముల వలె ఒప్పు, చిల్లికా = కనుబొమలు కలిగినది.

అమ్మవారి రెండు కనుబొమల గురించి చెప్పబడుతోంది. కిరీటం నుండి క్రమంగా క్రిందకు ఒక్కసారి చూస్తే దర్శనమయ్యే అమ్మవారి స్థూల విగ్రహాన్ని వర్ణిస్తున్నారన్నమాట!

మన్మథుడు తన కార్యక్రమ నిర్వహణానికి ఒక నిలయాన్ని ఏర్పరచుకోవాలనుకున్నాడు. ఇందుకు అమ్మవారి ముఖాన్ని మించింది ఏదీ మన్మథునికి నచ్చలేదుట. అన్ని రకాలుగా అందచందాలతో వున్న ముఖం అమ్మవారిది. ఈ అమ్మవారి ముఖాన్నే తన నివాసంగా చేసుకుంటే ఇంకొక అదనపు సౌకర్యం గూడా వున్నదిట! ఈ గృహానికి నిత్య కళ్యాణ శోభను కలుగజేసే పచ్చతోరణాలను వేరే కట్టవలసిన పనిలేదట. అమ్మవారి ముఖంలో ఎంతో రమణీయంగా కనబడే ఆమె కనుబొమలే ఈ తోరణాలుగా భాసిస్తాయి గదా! అంటే మన్మథుని ఇల్లు లాగా అమ్మవారి వదనం వుంటే – ఆ ఇంటికి తోరణాలుగా అమ్మవారి కనుబొమలు భాసిస్తున్నాయన్న మాట! మన్మథునికి అమ్మవారి ముఖము 'మాంగళ్యప్రదం' అంటే – 'శోభనాన్ని చేకూర్చేది' ఎందుకంటే –

ప్రళయంలో అయ్యవారు అమ్మవారి వదనాన్ని స్మరిస్తే ముందు పుట్టేవాడు మన్మథుడు. ఇలా స్మరిస్తే (అంటే గుర్తు చేసుకుంటే) పుట్టేవాడు కాబట్టే మన్మథుణ్ణి 'స్మరుడు' అన్నారు. అయ్యవారు తన కంటి మంటతో పూర్వం మన్మథుణ్ణి బూడిద చేశారు. కాని, అదే అయ్యవారికి అమ్మగారి వదనం గుర్తుకురాగానే తన కోర్కెకు బదులు ముందు ఆమె కోర్కెను తీర్చటం కోసం మన్మథుణ్ణి పునర్జీవుతుణ్ణి చెయ్యాల్సి వచ్చింది. అలా మాడిపోయి, బూడిద అయిన మన్మథునికి జీవం రావడానికి కారణమైన అమ్మవారి ముఖం అతనికి (మన్మథునికి) మంగళ గృహం కాదా మరి! ఆ వదనం మంగళ గృహం అనేందుకు తగ్గట్టుగా మంగళ తోరణాలు వేరే కట్టవలసిన అవసరం లేకుండా సహజ సిద్ధంగానే (By birth) మంగళ తోరణాల లాగా ఆమె రెండు కనుబొమలు ఉన్నాయి. అంటే ఒక విధంగా అయ్యగారి మూడవ కన్ను తెరవడం అంటే – 'మన్మథుని జన్మదినోత్సవం జరుపుకునే ఇంటి గృహ ద్వారం తెరవటం' అన్నమాట! ఇంకోవిధంగా చెప్పుకోవాలంటే – అయ్యవారి మూడో కన్ను జ్ఞాన నేత్రం కాబట్టి, 'జ్ఞానోదయం అయితే

– మన్మథ లీల భస్మ మౌతుంది' అని చెప్పుకోవచ్చు.

ఈ నామంలో ఇమిడి వున్న రహస్యాలను ఇంకా వెతికితే బీజాక్షరాలు గూడా తెలుసుకోవచ్చును.

వదన – వాగ్భవ బీజం – 'ఐం' బీజాక్షరాన్ని,
స్మర – మన్మథ బీజం – 'క్లీం' బీజాక్షరాన్ని,
మాంగళ్య – సౌభాగ్య బీజం – 'సౌః' బీజాక్షరాన్ని,
గృహ = సంపత్కరమైన, శుభకరమైన బీజం – 'శ్రీం' బీజాక్షరాన్ని,
తోరణ = హృల్లేఖ – 'హ్రీం' బీజాక్షరాన్నీ

తెలియ జేస్తాయి కాబట్టి, మొత్తం మీద ఈ నామంలో 'ఐం క్లీం, సౌః, శ్రీం, హ్రీం' అనే బీజాక్షరాలు ఇమిడి వున్నాయని తెలుస్తుంది. ''ఐం క్లీం సౌః'' ఈ మూడింటి కూటమి ముఖమైతే 'శ్రీం, హ్రీం' లు రెండూ కనుబొమలను సూచిస్తాయి.

1) 'ముఖమనే మన్మథుని మంగళ గృహానికి తోరణాలు లాగా భాసిస్తున్న సొంపైన కనుబొమలు కలిగినది' అని ఈ నామానికి అర్థం.

## 18. వక్త్రలక్ష్మీపరీవాహ చలన్మీనాభలోచనా

ఇది అమ్మవారి 18వ నామం. ఇది16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''వక్త్రలక్ష్మీపరీవాహచలన్మీ నాభలోచనాయై నమః'' అని చెప్పాలి.

వక్త్ర = ముఖదీప్తి అనెడు, లక్ష్మీ = సంపదప్రదమైన, పరీవాహ = స్రోతస్సునందు, చలత్ = చలించుచున్న, లేదా – కదలాడుచున్న, మీనా = చేపలవలె, ఆభ = ఒప్పుచుండు, లోచనా = కన్నులు కలిగినది ('లోచనా' బదులు కొన్ని పుస్తకాల్లో 'వీక్షణా' అని వుంటుంది. అప్పుడు 'వీక్షణా' అంటే 'చూపులు గలది' అని అర్థం మార్చుకోవలసి వస్తుంది)

అమ్మవారి ముఖ సౌందర్య కాంతులు అమృత ప్రవాహం లాగా వుంటే – ఆ ప్రవాహంలో కదులుతూ వుండే చేపల లాగా అమ్మవారి రెండు కళ్లూ (లేదా చూపులు) వున్నాయిట! ధ్యానంలో ఊహిస్తే ఈ వుపమానం సొగసు అర్థమై, ఆనందాన్నిస్తుంది.

కళ్లను చేపలతో పోల్చడంలో ఒక విశిష్టత వుంది. తల్లి చేపలు తమ కళ్ల చూపులతోనే తమ పిల్ల చేపలకు కడుపునింపి ఆకలి తీరుస్తాయి, స్తన్యంతో పనిలేదు. అంటే వంశాభివృద్ధి కేవలం చూపులపైనే ఆధారపడి వుంటుంది. దీన్నే ''మాత్స్యన్యాయం'' అంటారు. విశ్వంలోని జీవులందరికీ తల్లి అయిన జగజ్జనని యొక్క కళ్లను అటువంటి మీనాలతో పోల్చడం వలన ''ప్రపంచంలోని సమస్త జీవులను అనుగ్రహిస్తూ, సాకడానికి ఆమె'' కరుణార్ద్ర దృక్కులు చాలు'' అని గ్రహించాలి.

ఎవరైనా మాట్లాడుతున్నపుడు – వారి ముఖాన్ని, కళ్లనీ, జాగ్రత్తగా గమనిస్తే – వారి అంతర్యం 1/16వంతు తెలిసి పోతుందిట ! ఇది ముఖానికి, కళ్లకి వున్న విశిష్టత. వైఖరీ వాక్కు నోటి నుండే వెలువడినా – మనోభావం కళ్లల్లోంచి వెలువడుతుంది. 1) నోటి ద్వారా వెలువడిన వైఖరీ వాక్కు, 2) ముఖంలో కలిగే కవళికలు 3) కళ్లద్వారా వ్యక్తమయే కదలికలు – ఈ మూడింటిని కలుపుకుంటే మాట్లాడే వ్యక్తి అంతర్యం చాలా భాగం అవగత మౌతుంది. నోటి మాటలు అవసరం లేకుండానే – కేవలం కంటి చూపులతోనే – ఆజ్ఞలను జారీచేసి, భావాలను ప్రకటించే సామర్థ్యం ఈ కళ్లకుంటుంది.

చూడబడేవారి ముఖం ఎక్కువగా చూచేవాడికి అవసరంగాని, చూడబడేవాడికి కాదు. అంటే – మన ముఖం – మనకోసం కంటె ఎదుటి వారి కోసమే ఎక్కువ ఉపయోగపడుతోందని తెలుసు కోవాలి – ఈ విషయం 'శ్రీ నేత్రతంత్రం'లో చక్కగా వివరింప బడుతుంది. అందుకే శ్రోతలకు వక్తముఖాన్ని గూడా చూడాలనిపించడం.

ఈ నామంలో ఉపయోగించిన ఉపమానమైన ''మీనం'' మరొక సంకేతాన్ని సూచిస్తుంది. జల స్థితి లోంచి ఘనస్థితికి వచ్చే రీతిని – మత్స్యంతో పోలుస్తారు (మీనాలు 'జలపుష్పాలని', 'గంగా మాత ప్రసాదం' అనీ బెంగాలీ దేశస్థులు అంటారు. అందుకనే అక్కడ బ్రాహ్మణులు గూడా చేపలను శాకాహారంగా స్వీకరిస్తారు). ఈ మత్స్యమే వేదాలను ఉద్ధరిస్తుంది (మత్స్యావతారం). జలప్రళయంలో చెల్లా చెదరై మరుగున పడి, లీనమై, మాటుపడిన 'సృష్టి రహస్యాలు' – అనే 'వేదరహస్యాలు' – ఏ ద్రవ్యానికి ఆ ద్రవ్యంగా, ఏ లక్షణానికి ఆ లక్షణంగా మళ్ళీ ఘనీభవింపబడటాన్ని – 'నీళ్లల్లోంచి మీనం ఉద్భవించిన ప్రక్రియ'తో పోలుస్తారన్నమాట! ('నిన్ను గురించిన స్తోత్రం నీ మీద పొలుసుల్లాగా వుంటే – అది చదివాను' అన్నాట్ట విష్ణు చిత్తుడు. ఆముక్తమాల్యదలో. రాయలవారు వ్రాసిన ఈ విషయాన్ని ఇక్కడ సమన్వయం చేసుకోవచ్చును)

చేపలు ప్రవాహంలో స్థిరంగా వుండవు. చంచలంగా, తిరుగుతూ, మెరుస్తూ అత్యంత చైతన్యవంతంగా వుంటాయి. అమ్మవారి కళ్లు గూడా ఇంతటి చైతన్యాన్ని, అందాన్ని కలిగి వుంటాయి.

సృష్టి బయటకు పూర్తిగా వచ్చినప్పుడు ఆ సృష్టి రూపాన్ని 'మీనాక్షి' అనే పేరుతోను, సృష్టి సంకల్ప రూపంలో వున్నపుడు – ఆ సృష్టి రూపాన్ని 'కామాక్షి' (మహాకామేశ్వరి) అనే పేరుతోను అమ్మవారిని సంకేతిస్తారు.

అనంతత్త్వమనే సృష్టికి రూపకల్పనగా ఆకాశంలో 'మీన' రాశిలో రెండు చేపలు వుంటాయి. వీటి పేర్లు – ఆంగ్లంలో Zeta, Zona అని అంటారు. ఈ రెండూ వ్యతిరేక దిశలలో పోతూ దగ్గరగా వుండే చేపలు – ఈ రెండు చేపలతోనే జ్యోతిశ్శాస్త్రంలో 'మీనరాశిని' సంకేతిస్తారు. (పటం – 2) ఈ రాశి – అమ్మవారిని సూచించే శుక్రునికి ఉచ్ఛస్థానం గూడా! ఈ రెండు చేపలు 1) అనిమేషం (తెరచుకోవడం) 2) నిమేషం (మూసుకోవడం) అనే సృష్టి, ప్రళయ లక్షణాలను సూచిస్తాయి.



పటం–2

మీనరాశి సంకేతం –♓ ను

సూచించే మీనాలు (చేపలు)

అమ్మవారి కుడికన్నును 'ఇ' కారంతోను, ఎడమకన్నును 'ఈ' కారంతోను న్యాసం చేసుకోవాలి.

'ముఖదీప్తి అనే ప్రవాహంలో చలిస్తున్న మీనములవలె శోభిల్లు నయనములు (లేదా వీక్షణములు) కలది' అని ఈ నామానికి అర్థం.

## 19. నవ చంపక పుష్పాభ నాసాదండ విరాజితా

ఇది అమ్మవారి 19వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''నవ చంపక పుష్పాభ నాసాదండ విరాజితాయై నమః'' అని చెప్పాలి.

నవ = క్రొత్తగా వికసించుచున్న, చంపక = సంపెంగ (అడవి సంపెంగ), పుష్పాభ = పువ్వును పోలెడి, నాసాదండ = ముక్కు దూలముతో, విరాజితా = ప్రభవించునది లేదా ప్రకాశించునది, అనగా – అందముగా నున్నది.

రేక సంపెంగ పువ్వుకాకుండా ఇంకోరకమైన సంపెంగ పువ్వు గూడా వుంటుంది. ఇది ఎక్కువ పసుపు, తక్కువ ఎఱుపు కలిసిన రంగులో వుంటుంది. (ఈ పూలు సింహాచలంలో బాగాదొరుకుతాయి) దీని మొగ్గ సూటిగా, పొడవైన రేకులతో ముడుచుకొని వుంటుంది. క్రొత్తగా వికసిస్తున్నపుడు దీని రేకలు విడివడడం ప్రారంభిస్తాయి. రెండు వైపుల నుండి రేకులు విడుస్తున్నప్పుడు చూస్తే – అచ్చు రెండు రంధ్రాలు కలిగిన ముక్కులాగానే వుంటుంది. ఇలాంటి సంపెంగ పువ్వును పోలి – అమ్మవారి ముక్కు దూలం వుంటుందిట. అంటే – అమ్మవారి నాసిక సూటిగా, సొంపుగా, తీరుగా వుంటుందని అర్థం. సూటిముక్కు నిజాయితీని తెలియపరుస్తుంది. అందుకే 'ముక్కు సూటి మనిషి' అనే ప్రయోగం వచ్చింది. సంపెంగ వాసనలు అమ్మవారి శ్వాసలో వుంటాయని గూడా అభిప్రాయపడవచ్చును.

ఆడవాళ్ళ ముక్కు, సంపెంగ పువ్వులా వుంటుంది అనడానికి భట్టుమూర్తి (రామరాజ భూషణుడు) ఒక చక్కని పూర్వగాథను కల్పించి పద్యంలో చెప్పాడు. ('నానాసూన వితాన వాసనల నానందించు... మధుకరీ పుంజమ్ము లిర్వంకలన్' అనేదే ఆ పద్యం) ఈ సంగతి ఇక్కడ తెలుసుకోవడం సముచితమే!

''అన్నిరకాల పువ్వుల మీద వ్రాలి మకరందాన్ని గ్రోలు తుంది గాని, తుమ్మెద – సంపెంగ పువ్వు మీద వ్రాలదు. ఇందుకు సంపెంగ పువ్వు 'నామోషీ' అంటే – చిన్నతనంగా భావించి తపస్సు చేస్తే – బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడుట! అప్పుడు తుమ్మెద ఈ సంగతి చెప్పి పరిష్కారాన్ని కోరిందిట! అప్పుడు బ్రహ్మ సంపెంగ పువ్వును మరుజన్మలో ఆడదాని ముక్కుగా పుట్టమన్నాడుట! ఆడదాని ముక్కుగా పుట్టంగానే ఆ ముక్కు అన్నిరకాల పువ్వులను వాసన చూస్తుంది గాబట్టి వేరు వేరు వాసనలు గలిగిన పువ్వుల దగ్గఱకు వెళ్లవలసిన అవసరం లేకుండా, ఈ ముక్కు దగ్గఱే అన్ని వాసనలు లభిస్తున్నాయి కాబట్టి – తుమ్మెదలన్నీ ఈ ముక్కు దగ్గఱకు వచ్చి, అటూ ఇటూ వరుసల్లో నిలబడి తమ వంతుకై నిరీక్షిస్తున్నాయిట! అలా నిరీక్షించే తుమ్మెద వరుస లేమిటో

తెలుసా ? ముక్కు పైన రెండు వైపులా వున్న రెండు కళ్ళ నుండి ప్రసరించే వీక్షణాలే!'' అని ఎంతో చమత్కారంగా, సొగసుగా చెప్పాడు భట్టుమూర్తి. (సౌందర్యలహరిలో శంకరాచార్యులవారు అమ్మవారి ముక్కును వర్ణించిన శ్లోకంలో ఇంకా మరికొన్ని విశేషాల నిస్తారు. నేను వ్రాసిన సౌందర్యలహరి వ్యాఖ్యానంలో అవన్నీ వివరింపబడ్డాయి. వివరణకర్త)

విశేషార్థం :

సంపెంగ పువ్వు మీద తుమ్మెద వ్రాలదు. అలాంటి సంపెంగ పువ్వుతో ముక్కును పోల్చడంలో ఒక ఔచిత్యం వుంది. తుమ్మెదకు ఆరుపాదాలు వుంటాయి. అందుకే దాన్ని 'షట్పదం' అంటారు. పంచేంద్రియాలు + మనస్సు – ఈ ఆరింటినీ – ఆరుపాదాలు గలిగిన షట్పదం, అంటే – తుమ్మెదతో పోలుస్తారు. పంచేంద్రియాలు, మనస్సు ఇవి ఎవరిని ఇబ్బంది పెట్టవో అంటే – ఎవరి మీద వీటి ప్రభావం, ప్రలోభం పనిచెయ్యదో – వారిని సంసార లంపటం అంటని 'ముక్తులు' అంటారు. ముక్తులనే సంస్కృతంలో 'ముక్తాః' అంటారు. ముక్కుద్వారా ప్రాణాయామం జరిపే యోగ సాధకులను 'ముక్తులు' గా చేసే తల్లి యొక్క ముక్కును గూడా పంచేంద్రియ, మనస్సులచే సంకేతింపబడే తుమ్మెద యొక్క స్పర్శ అంటని సంపెంగ పువ్వుతో పోల్చడం ఔచిత్యమే కదా !

అమ్మవారి దక్షిణ నాసికను 'ఋ' కారంతోను వామనాసి కను 'ౠ' కారంతోను న్యాసం చేసుకోవాలి.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) అప్పుడే వికసించు సంపంగి పుష్పంలాగా వుండే ముక్కు దూలము కలిగి ప్రకాశించునది.
2) పంచేంద్రియ మనస్సులతో సంకేతింపబడే తుమ్మెద యొక్క స్పర్శ అంటని సంపెంగ పువ్వు వంటి ముక్కును కలిగి, సాధకులను ముక్తులుగా చేయునది.

## 20. తారాకాంతి తిరస్కారి నాసాభరణ భాసురా

ఇది అమ్మవారి 20వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''తారాకాంతి తిరస్కారి నాసాభరణ భాసురాయై నమః'' అని చెప్పాలి.

తారా = తారలు లేదా ఆకాశమునందు ప్రకాశించునట్లు కనబడు చుక్కల యొక్క, కాంతి = కాంతిని, తిరస్కారీ = తిరస్కరించుచున్న, నాసాభరణ = ముక్కు బులాకీ లేదా అడ్డబాస చేత, భాసురా = ప్రకాశించునది.

ఆకాశంలో పెద్దగా ప్రస్ఫుటంగా ప్రకాశిస్తున్నట్లు కుజ, శుక్ర గ్రహాలు కనబడతాయి. కుజుని కాంతి రంగు ఎఱ్ఱగాను, శుక్రుని కాంతిరంగు తెల్లగాను వుంటాయి.

ఈ రెండు గ్రహాలు మన భూమితో దాదాపు సమాన పరిమాణంలోనే వుంటాయి. బృహస్పతి గ్రహం గూడా ఆకాశంలో పచ్చగా కనబడుతుంది గాని దీని పరిమాణం చాలా ఎక్కువ. అన్ని గ్రహాలు ఈ బృహస్పతిలో వుంచినా ఇంకా స్థలం మిగిలేటంత పెద్దది.

అడ్డబాస (బులాకీ) లో పైన ఎఱ్ఱని కాంతులతో మెరిసే పగడం, దాని క్రింద తెల్లని కాంతులు విరజిమ్మే వజ్రం (లేదా ముత్యం) వుంటాయి. పగడం – కుజుని కాంతిని, వజ్రం – శుక్రుని కాంతిని సూచిస్తాయి. జ్యోతిశ్శాస్త్రంలో కుజానికి సంబంధించిన రత్నం (Gem) పగడం (Coral) గాను, శుక్రునికి సంబంధించిన రత్నం వజ్రం (Diamond) గాను చెబుతారు. ఈ రెండు గ్రహాలకు సంబంధించిన అంకెలు(Digits) వరుసగా 9, 6 ఇవి పురుష, స్త్రీ స్వభావాలను గూడా సూచిస్తాయి. ఈ రెండు గ్రహాలకు జ్యోతిశ్శాస్త్రంలో అంతర్జాతీయంగా ఇచ్చిన సంకేతాలు పటం – 3లో చూపబడ్డాయి. ఈ రెండు గ్రహాల సంకేతాలు వరుసగా 'అభయ ముద్ర' ను, 'వరద ముద్ర' ను గూడా సూచిస్తాయని జాగ్రత్తగా చూస్తే తెలుసుకోవచ్చును. (పటము – 3(a,b) లలో ఈవివరాలు గూడా ఇవ్వబడ్డాయి)



పటం – 3

నాసాభరణం అంటే అడ్డబాసయే కానక్కరలేదు. ముక్కుపుడకలు, లేదా ముక్కెరలు, బేసరి గూడా కావచ్చును. ముక్కుకు కుడివైపు కుజసంబంధమైన మాణిక్యాన్ని (ఎఱ్ఱగా వుండే రత్నం), ఎడమవైపు శుక్ర సంబంధమైన వజ్రాన్ని ధరించినదిగా చెప్పుకుంటే – అమ్మవారు ధరించినఈ మాణిక్య, వజ్రాల యొక్క కాంతి వాటికి సంబంధించిన, 'కుజ, శుక్ర గ్రహాల కాంతులను జయిస్తున్నట్లుగా వుంటాయి. అమ్మవారు అటువంటి నాసాభరణాలతో అందంగా వుంటుంది.

'తారల (కుజ, శుక్ర గ్రహాల) కాంతులను న్యూన పరచు నాసాభరణములతో ప్రకాశించునది' అని ఈ నామానికి అర్థం.

## 21. కదంబ మంజరీ క్లుప్త కర్ణపూరమనోహరా

ఇది అమ్మవారి 21వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''కదంబమంజరీ క్లుప్త కర్ణపూరమనోహరాయై నమః'' అని చెప్పాలి.

కదంబ = కడిమిపూల, మంజరీ = గుచ్ఛముల చేత, క్లుప్త = కూర్చబడిన, కర్ణపూర = చెవులపై సింగారించు కొను ఆభరణములచే, మనోహరా = మనస్సును దోచునంత అందముగా నున్నది.

చెట్లలో లక్ష్మీప్రదమైనవి కొన్ని వున్నాయి. వాటిలో రావి, తులసి, కడిమి, మారేడు ముఖ్యమైనవి. ఇవి సకల శుభాలను కలుగచేస్తాయి. రావిని – 'అశ్వత్థ' మని, తులసిని 'తులసి' అని, కడిమిని 'కదంబ' మని, మారేడును 'బిల్వము' ని సంస్కృతంలో అంటారు. వీటికి దళాలు గాని, పువ్వులు గాని మూడు చొప్పున గుత్తులు గుత్తులుగా వుంటాయి. ఈ నాలుగు చెట్ల పువ్వులు అమ్మవారికి ఇష్టం. వీటిలో కడిమి పూలు అరుణారుణ వర్ణంలో వుంటాయి కాబట్టి అమ్మవారికి మరింత ప్రీతికరం.

పువ్వును కాకుండా పూలగుత్తినే అమ్మవారు తన చెవుల పైన ధరించింది కాబట్టి అమ్మవారి చెవులు విశాలంగాను, సుదీర్ఘంగాను వుండి, పూల గుత్తులను భరించ గల దృఢత్వాన్ని గూడా కలిగి వుంటాయని గ్రహించాలి.

శ్వాస జరిగే సమయంలో 'సోహం' లోని ఓం కారాన్ని వినగలిగి, మనస్సు హరింపబడే స్థితికి తీసుకువెళ్ళ గలిగిన శ్రీకారాల్లాంటి చెవులు శ్రీకరము లౌతాయి.

అమ్మవారి కుడి చెవిని 'ఉ' కారంతోను, ఎడమ చెవిని 'ఊ' కారంతోను న్యాసం చెయ్యాలి.

'కడిమి పూలగుత్తుల చేత కూర్చబడిన కర్ణోపరితలములతో అందముగానున్నది' అని ఈ నామానికి అర్థం.

## 22. తాటంక యుగళీభూత తపనోడుపమండలా

ఇది అమ్మవారి 22వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తాటంక యుగళీభూత తపనోడుప మండలాయై నమః' అని చెప్పాలి.

తాటంక = చెవికమ్మలుగా, యుగళీభూత = జంటగా అయిన, తపన = సూర్య, ఉడుప = చంద్ర, మండలా = మండలములను గలది.

ఆద్యంతాలు లేని కాలగతి సూర్య చంద్ర మండల గమనం పైనే ఆధారపడి వుంటుంది. కాబట్టి, అమ్మవారి చెవుల కుండే తాటంకాలు గూడా అనంతత్వ లక్షణం గలిగి, అమ్మవారి సౌభాగ్యానికి అనంతత్వాన్ని చేకూరుస్తాయి. అందుకే అయ్యవారికి కాలవశం అయే ఇబ్బంది లేదు.

చూసింది చూసినట్లు చెప్పడానికి అమ్మవారి కన్నులతోను, విన్నది విన్నది విన్నట్లు చెప్పడానికి అమ్మవారి చెవి కమ్మలు గాను కర్మసాక్షులైన సూర్యచంద్రులను పోల్చడం గూడా ఒక ఔచిత్యం.

శ్రీ విద్య - కుండలినీ యోగ ప్రధానమైంది. కుండలినీ యోగంలో సూర్య చంద్రాగ్నుల ప్రసక్తి తప్పకుండా వస్తుంది. ఇడా, పింగళానాడులు వరుసగా చంద్ర సూర్యతత్త్వములకు సంబంధించినవే !

ఈ సూర్యచంద్రుల్ని అమ్మవారి స్తనయుగ్మంగాను, నయన యుగ్మంగాను, ప్రస్తుతం తాటంక యుగళంగాను సంకేతించడం శ్రుతి బద్ధమే అని ఈక్రింది శ్లోకం చెప్తుంది.

శ్లో. సూర్య చంద్రౌ స్తనౌ దేవ్యాః తావేవనయనే స్మృతా,
ఉభే తాటంక యుగళం ఇత్యేషా వైదికీ శ్రుతిః.

ఇది పింగళా, ఇడానాడులకు సంబంధించిన విభజనగా గ్రహించాలి. అమ్మవారు సూర్యచంద్రుల్ని సృష్టించి, వారియందు వెలుగుతూ వుంటుంది అని చెప్పడం గూడా

తప్పుకాదు. ఎందుకంటే "తత్సృష్ట్వా తదే వాను ప్రావిశత్" అన్నది శ్రుతి వాక్యం. ఈ జగత్తును సృష్టించి, ఆ సృష్టించిన జగత్తులోని ప్రతి అణువునందు తాను ప్రవేశం చేసింది. (మనమైతే వస్తువుల్ని తయారు చెయ్యగలంగాని, వాటిలోకి మనం ప్రవేశించలేము.) కాబట్టి, ఇటుపైన వచ్చే నామాల్లో 'భాను మండల మధ్యస్థా''. "చంద్రమండల మధ్యగా" అని చెప్పినా తప్పుకాదు.

ఆకాశం శబ్ద గుణకం, అలాంటి ఆకాశంలో సంచరించే సూర్య చంద్రమండలాలను – శబ్ద గ్రాహ్యమునకు సంబంధించే అమ్మవారి చెవుల ఆభరణాలుగా చెప్పడం సమంజసమే గదా!

'రవి, చంద్రమండలాలను చెవి కమ్మల జతగా కలిగినది' అని ఈ నామానికి అర్థం.

## 23. పద్మరాగ శిలాదర్శ పరిభావికపోలభూః

ఇది అమ్మవారి 23వ నామం. ఇది 16వ అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు "పద్మరాగ శిలాదర్శపరిభావికపోల భువే నమః" అని చెప్పాలి.

పద్మరాగ శిలా = పద్మరాగ మణుల, ఆదర్శ = అద్దమును, పరిభావి = పరిహసించు లేదా పరాభవించు, కపోల = చెక్కిళ్ల యొక్క, భూః = ప్రదేశము గలది.

అమ్మవారి కపోలాలు (చెక్కిళ్లు లేదా బుగ్గలు) పద్మరాగ మణులతో చేసిన అద్దాన్ని సైతం పరాభవించ గలిగినంత అందంగా వుంటాయిట! పద్మరాగమణులు పండు దానిమ్మ గింజల లాగా ఎఱ్ఱగా వుంటాయి. ఈ రంగు – ప్రేమకు, అనురాగానికి చిహ్నం. మాణిక్యాల్లో మేటి అయినవి పద్మరాగ మణులు. వీటికి సహజంగానే కాంతి ఎక్కువ, అయినా అమ్మవారి కపోలాలతో తులతూగ లేవుట! ఎందుకంటే –

అమ్మవారు నిత్య యౌవన సంపన్నురాలు. యుక్త వయస్సులో వుండే వారికి శరీరంలో లావణ్యం అధికంగా వుంటుంది. అందులో మగువలకైతే మరింత ఎక్కువ. అందులోను కాంతల కపోలాలు వారి మిగిలిన శరీర భాగాల కన్న మరింత లావణ్యంగా

వుంటాయి. నునుపుదనం, మృదుత్వం, ఎఱుపు దనం ఎక్కువగా వుండి అత్యంత నిర్మలంగా, ముద్దుపెట్టుకుందామని పించేటంత అందంగా వుంటాయి. పద్మరాగ మణులకు అమ్మవారి కపోలాల కాంతి వుండవచ్చునేమోగాని మృదుత్వం వుండదు. (శిలా అనే పదంలోనే పద్మరాగాలకు గట్టిదనం వుంటుందని కొట్టొచ్చినట్లు కనబడుతోంది గదా!)

నిరంతర పరమేశ్వర సాన్నిధ్యానుభూతిలో వుండే అమ్మవారి చెక్కిళ్ళ అనురాగరంజితమై వుంటాయి. ఈ రాగం – స్పందన, చైతన్యం లేని పద్మరాగాల రాగం లాంటిది కాదు. మధుర మైన ప్రేమ సంస్పర్శకు నోచుకునేది.

ఎటువంటి అద్దమైనా ఉపరితలం దుమ్ము పట్టి, మలినంగా వుండటానికి అవకాశం వుంది. అందుచేతనే ఎప్పటికప్పుడు ఆ దుమ్మును తుడుచుకుని అద్దం చూసుకోవలసి వస్తుంది. కాని, అమ్మవారి కపోలాలు ఎప్పుడూ నిర్మలంగా, నునుపుగా వుండి తుడుచుకోవలసిన పని వుండదు.

పద్మరాగాలు ఎంతటివైనా పగలక తప్పవు. ఆ పద్మరాగాలతో చేసిన అద్దాలు కాలక్రమేణా బీటలు వారక తప్పదు. కాని అమ్మవారి బుగ్గలు అన్ని కాలాల్లోను ఒకే రకంగా, నునుపుగా, సజీవంగా వుంటాయి.

పైన చెప్పిన కారణాల వలన అమ్మవారి కపోలాలు పద్మరాగ మణులతో చేసిన అద్దాలను గూడా పరాభవించే టంత కాంతి, నిరంతర మృదుత్వం, నిర్మలత్వం, లావణ్యం కలిగివుంటాయి అని చెప్పడం జరిగింది.

అమ్మవారికపోలాలను, చెవికి వున్నతాటంకాలను కలిపి శంకరాచార్యుల వారు సౌందర్యలహరిలో చాలా సొగసుగా ''స్ఫుర ద్గండా భోగ ... సజ్జితవతే'' అనే శ్లోకంలో వర్ణించారు. (నేను వ్రాసిన 'సౌందర్యలహరి' వ్యాఖ్యానంలో ఈ శ్లోక వివరణ చదువుకోవచ్చును – వివరణకర్త).

అమ్మవారి కుడి కపోలాన్ని మెత్తగా ఉచ్చరింపబడే 'ఇ' కారం తోను, ఎడమ కపోలాన్ని అంత మెత్తగానే ఉచ్చరింపబడే 'ఈ' కారంతోను న్యాసం చెయ్యాలి.

''పద్మరాగ మణులతో చేయబడిన అద్దాలను పరాభవించునంతటి అందమైన కపోలాలు కలిగినది'' అని ఈ నామానికి అర్థం.

# 24. నవవిద్రుమ బింబ శ్రీ న్యక్కారి రదనచ్ఛదా

ఇది అమ్మవారి 24వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నవ విద్రుమ బింబ శ్రీ న్యక్కారి రదనచ్ఛదాయైనమః' అని చెప్పాలి.

నవ = క్రొత్తదైన, విద్రుమ = పగడముల యొక్క, బింబ = దొండపండు యొక్క, శ్రీ = శోభను, న్యక్కారి = తిరస్కరించు, రదనచ్ఛదా = పెదవులు గలది.

స్త్రీల యొక్క రెండు పెదవులు ఎలా వుంటాయో చెప్పడానికి రెండు ఉపమానాలు సాధారణంగా కవులు ఉపయోగిస్తారు. ఒకటి విద్రుమము అంటే పగడము, రెండు - దొండ పండు. అయితే ఈ రెండు ఉపమానాలు అమ్మవారి పెదవులకు సాటిరావు అని ఈ నామం చెప్తుంది.

విద్రుమము, అంటే - పగడము, నవ విద్రుమము అంటే అప్పటికప్పుడు సాన బెట్టిన ముదురుపగడం. ఇది ఎఱ్ఱగా మెరుస్తూ కాంతులు విరజిమ్ముతుంది. తళుక్కుమంటుంది గూడా! ఇక రెండవది బాగా పండిన దొండపండు. అందరు కవుల్లాగానే ఈ రెంటినీ వరుసగా అమ్మవారి పైపెదవికి, క్రింది పెదవికి ఉపమానాలుగా చెప్పబోయి, సంశయించి, - 'ఇవి సాటిరావు, వీటిని మించిన లక్షణాలు అమ్మవారి పెదవులకు వుంటాయి' - అని, ఈ రెండింటి శోభను తిరస్కరిస్తున్నట్లు అమ్మవారి పెదవులుంటాయన్నారు వ్యాసులవారు. ఇలా అనడానికి ఈక్రింది కారణాలు చెప్పుకోవచ్చును.

పగడానికి ఎఱుపుదనం వుంటుంది గాని లాలిత్యం, మృదుత్వం ఉండవు. చాలా గట్టిగా రాయిలాగా వుంటుంది. సానబెట్టినప్పుడు తప్పకుండా కరుకుగా, గరుకుగా గీతలు గూడా పడతాయి. అలాంటి గీతలుగాని, పగుళ్ళుగాని, కరుకుదనంగాని అమ్మవారి పెదవికి వుండవు. చెట్టుకు కాసి, ఎండి, పండిన పగడం - నిత్యశోభతో సజీవంగా వుండే అమ్మవారి పై పెదవితో - రంగులో సరిపోవచ్చునేమోగాని ఇతర మృదుత్వ, లాలిత్య లక్షణాలతో సరిరాదు.

ఇక దొండపండు విషయానికి వస్తే - ఆ దొండపండు యొక్క పండుతనం, ఎఱ్ఱదనం ఎన్నోరోజులుండవు. తగినంత స్థితిస్థాపకత (Elasticity) వుండదు. ఆకుపచ్చగా వుండే దొండకాయ బాగా పండుగా మారినప్పుడే తగినంత ఎఱుపుదనం వస్తుంది. తీరా ఎఱుపుదనం పూర్తిగా వచ్చేటప్పటికి మెత్తగా గుజ్జుగా అయి పాడైపోతుంది. ఒక్కొక్కప్పుడు చేదు దొండ (కాకిదొండ) కూడా కావచ్చు. మరి అలాంటప్పుడు మృదుత్వాన్ని, స్థితిస్థాపకతను, ఎఱ్ఱదనాన్ని ఎన్నటికీ పోగొట్టుకోని అమ్మవారి క్రింది పెదవితో పోల్చడానికి - దొండపండు ఎలా సరిపోతుంది ? ఇలాంటి శుభమైన దివ్యలక్షణాలు ఉన్నాయి కాబట్టే అమ్మవారి పెదవులంటే పరమేశ్వరునికి అంత ఇష్టం. పైగా వీటన్నిటినీ మించి ఈ అమ్మవారి పెదవులు హాయిని గొలిపే తీయని పలుకులు పలకగలవు. మధురమైన ప్రేమ స్పర్శకు నోచుకోగలవు. మరి - పగడాలకు, దొండపండ్లకు ఆ గుణాలు ఎక్కడి నుంచి తెద్దాం ? అమ్మవారి అధరం మధురమే కాదు, సుధలను (అమృతాన్ని) గూడా నింపుకుని వుంటుంది. ఈ గుణం గూడా పై రెంటికీ లేదు గదా!

ఈ నామంలో ఉపయోగించిన 'రదనచ్ఛదా' అనే పదంలో 'రదన' అంటే - పళ్ల (Teeth) అని, 'ఛదము' అంటే ఆకు, ఈక, ఱెక్క, అనీ అర్థాలు. 'రదనచ్ఛదా' అంటే పండ్లకు (Teeth) తెరలాగా వుండేవి అంటేపెదవులు అనే అర్థం వస్తుంది. తెలుగులో ఈ పదాన్నే - 'వాతెఱ' అంటారు. 'పలువరుసకు తెరలాంటివి' అని ఈ పదానికి అర్థం. ఈ పెదవులకు, అమ్మవారికి సంబంధించిన 'వాగ్వాదినీ మంత్రం' ఒకటి వుంది.

''ఓష్ఠాపి ధానా నకులీ దంతైః పరివృతాపవిః
సర్వస్మై వాచ ఈశానా చారుమా మిహ వాదయేత్''
'ఓం ఐం క్లీం సౌః వద వద వాగ్వాదిని స్వాహా'

అనే ఈ మంత్రాన్ని జమదగ్ని, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, బాగా ఉపయోగించుకున్నారు. ఇది జమదగ్ని దత్తమైన మంత్రం. ఈ మంత్రాన్ని 'నకులీ వాగీశ్వరీ మంత్రం' అంటారు. మూలాధారంలో నాదాన్ని ధ్యానం చేస్తే ఈ మంత్రం సిద్ధిస్తుంది: దీనికి ఈ క్రింది యంత్రాన్ని ఉపయోగించవచ్చు.




( ఓష్ఠా = పెదవుల నుండి, పిధానా = భద్రపరచబడినది, నకులీ పదంలో – న = నాదం, కులీ = కులకుండం అంటే మూలాధారం. 'నకులం' అంటే 'ముంగిస' అని గూడా అర్ధం. సాధకుడనే ముంగిసకు చిక్కిన సర్పమే – ఈ కుండలినీ కులకుండం.)

దంతాల్ని కప్పుతూ వజ్రాయుధం లాగా పని చేసే మంత్రం ఇది. అందరిలోను అధిష్ఠించి, అందరికీ ఉపయోగపడే విధంగా వాక్కుగా పనిచేసే అమ్మవారి 'వాగ్వాదినీ నామం' తాలూకు మంత్రంగా గూడా ఈ మంత్రాన్ని చెప్పుకోవచ్చు.

ఎదుటివారి మనస్సును నొప్పించకుండా, వాఙ్నియమాన్ని పాటించే వారికి మాత్రమే ఈ మంత్రం శుద్ధిని, సిద్ధిని చేకూరుస్తుంది.

అమ్మవారిపై పెదవిని 'ఏ' కారంతోను క్రింది పెదవిని 'ఐ' కారంతోను న్యాసం చెయ్యాలి.

''అప్పుడే సానబెట్టిన పగడం యొక్క, దొండపండు యొక్క శోభను తిరస్కరించు పై పెదవి, క్రింద పెదవి కలిగినది''. అని ఈ నామానికి అర్ధం.

## 25. శుద్ధ విద్యాంకురాకార ద్విజ పంక్తిద్వయోజ్జ్వలా

ఇది అమ్మవారి 25వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''శుద్ధ విద్యాంకురాకార ద్విజపంక్తి ద్వయోజ్జ్వలాయై నమః'' అని చెప్పాలి.

శుద్ధ విద్యా = శుద్ధమైన విద్య, అనగా – 'బ్రహ్మ విద్య' లేదా శ్రీవిద్యకు, అంకుర = బీజప్రాయము వలె, ఆకార = ఆకారము గల, ద్విజ = రెండు జన్మలు కలిగిన లేదా పండ్ల యొక్క, ద్వయ = రెండు వరుసలచే, ఉజ్జ్వలా = ప్రకాశించునది.

స్వచ్ఛత, లేదా - శుద్ధత్వము ఉన్నచోట అన్నిటిలోను స్వ, పర భేద భావము ఉండదు. స్వ, పర భావభేదము లేని అద్వైత బుద్ధిని, అద్వైత స్థితిని కలిగించు బ్రహ్మవిద్యను 'శుద్ధవిద్యా' అని చెప్పుకోవచ్చును. అజ్ఞానము వలన స్వపర భేదము జనిస్తుంది. ఆ విధమైన అజ్ఞాన మాలిన్యాన్ని పోగొట్టే విద్య కాబట్టి, శ్రీవిద్యను గూడా ''శుద్ధవిద్యా'' అనవచ్చును. ఈ శ్రీవిద్యను ''షోడశీవిద్యా'' అని గూడా అంటారు. షోడశీవిద్య అంటే 16 బీజాక్షరాలు కలిగిన విద్య అని అర్థం.

పరిస్థితులను బట్టి - విస్తరించి, వృద్ధి అవడానికి కావలసిన శక్తి గూడా బిందు పరిమాణంలో ఇమిడి వుండే - బీజంలోని (విత్తనంలోని) సూక్ష్మభాగాన్ని - ''అంకురము'' అంటారు. దీన్నే మంత్రపుష్పంలో ''నీవార శూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా'' అని చెబుతారు.

విత్తనం వృక్షం ఎలా అవుతుందో జాగ్రత్తగా పరిశీలిస్తే ప్రస్తుత నామ వివరణకు ఉపయోగపడే కొన్ని విషయాలు తెలుస్తాయి. మొదట విత్తనం తడికి 1) 'ఉబ్బడం', అటుపైన 2) 'పగలడం' అటుపైన 3) పగులు మధ్య నుండి కలిసి వుండే రెండు దళాలుగా పైకి రావడం' అటుపైన 4) ఆ రెండు దళాలు వేరై వాటి మధ్య నుండి మనకు కనబడే వృక్షం తాలూకు 'మొక్క రావడం' మొదలు పెట్టి, అది క్రమ క్రమంగా విజృంభించి, విస్తరించి వృద్ధి చెందడం జరగుతుంది. అంటే - ఈ ప్రక్రియలో నాలుగు స్థితులున్నాయన్నమాటే గదా! అయితే మనం మొక్కను చూడగలిగేది నాల్గవ స్థితిలోనే అన్నది గుర్తు పెట్టుకోవాలి. మనలో నుండి వాక్కు గూడా ఇలాగే పరా, పశ్యంతీ మధ్యమా, వైఖరీ స్థితులలో వ్యక్తమౌతుంది. ఈ సందర్భంలో గూడా 'మనం - చక్కగా వినగలిగేది నాల్గవ స్థితిలోని వైఖరీ వాక్కునే' ! అన్న విషయం గుర్తు పెట్టుకోవాలి. అప్పుడే ఈ రెండు ప్రక్రియలకు గల సమన్వయం బాగా అర్థమౌతుంది. (ఈ పరా పశ్యంతీ మధ్యమా వాక్కుల గూర్చి పూర్తి వివరణ 366 నుండి 372 నామాలలో వుంటుంది.)

శ్రీ విద్యలో ప్రధాన భాగమైన ఈ వాగ్వికాస విలాసం గూర్చి ఈ లలితా సహస్ర నామాల్లో ఉంది. లలితా సహస్ర నామాల్లో శ్లోకాలన్నీ అనుష్టుప్ ఛందస్సులో వ్రాయబడ్డాయి. అనుష్టుప్ శ్లోకంలో- పాదానికి 8 అక్షరాల చొప్పున 4 పాదాలుంటాయి. మనకు వుండే దంతాలు - పై వరస, క్రింది వరస అని రెండు వరుసలుగా వుంటాయి.

పై వరుసలో 8 రకాల పళ్ళు సౌష్ఠవ రీతిలో ఇరువైపులా వుంటాయి. అలాగే క్రింది వరుసలో గూడా వుంటాయి. అంటే మొత్తం మీద 4 X 8 = 32 పళ్ళుంటాయి. దీనిని బట్టి ఒక్కొక్క పలువరుసకు 2X8 = 16 చొప్పున రెండు వరుసలుగా మనకు పళ్ళు వుంటాయి. అనుష్టుప్ శ్లోకాన్ని గూడా వరుసకు 2 X 8 = 16 అక్షరాల చొప్పున రెండు వరుసల్లో సర్వసాధారణంగా వ్రాస్తారు.

'అనుష్టుప్ ఛందస్సు ద్వారా వివరించే షోడశీవిద్యకు సంబంధించిన 16 బీజాక్షరాలను అమ్మవారు తన దంత పంక్తి ద్వయంగా (రెండు పలువరుసలుగా) కలిగి ప్రకాశిస్తోంది' ని ఈ నామానికి ఒక అర్థం.

సంస్కృత భాషలో 16 అచ్చులుంటాయి. వీటిని 'ప్రాణములు' అంటారు. ఈ 16 అచ్చుల సహాయంతోనే ఏ అక్షరాన్నైనా ఉచ్చరించడం జరిగేది. ఇలా ఉచ్చరించడానికి అవసరమైన 16 అచ్చులను తన దంత పంక్తిగా కలిగినది అని ఒక అర్థం.

సంస్కృతంలోని అక్షరాల్లో మాతృకావర్ణాలని 32 వుంటాయి. అవి – అ – ఇ – ఉ – ఋ –ఌ – క – ఖ – గ – ఘ – ఙ – చ – ఛ – జ – ఝ – ఞ – ట – ఠ – డ – ఢ – ణ – త – థ – ద – ధ – న – ప – ఫ – బ – భ – మ – స – హ – అనే అక్షరాలు. మిగిలిన అక్షరాలన్నీ ఈ 32 అక్షరాల్లోని ఏదో ఒక దాని యొక్క రూపాంతరాలే ! లేదా వీటిలో కొన్ని అక్షరాల కలయికతో ఏర్పడేవే, లేదా వీటిలో ఏదో ఒక అక్షరంతో ఒకే రకమైన ఉచ్చారణ గలిగినవే ! మిగిలిన అక్షరాలు ఎలా ఏర్పడ్డాయో చూద్దాం !

ఆ – 'అ' సంబంధమైనదే !

ఈ – 'ఇ' సంబంధమైనదే !

ఊ – 'ఉ' సంబంధమైనదే !

ౠ – 'ఋ' సంబంధమైనదే !

ఎ – 'అ + ఇ' లేదా 'అ + ఈ' }
ఏ

ఐ – 'అ + ఎ' లేదా 'అ + ఏ'

ఒ – 'అ + ఉ' లేదా 'అ + ఊ' }
ఓ
ఔ – 'అ + ఒ' లేదా 'అ + ఓ'
య – 'ఇ + అ'
ర – 'ఋ' కారంలాగానే ఉచ్చరింపబడుతుంది
ల – 'ఌ' కారం లాగానే ఉచ్చరింపబడుతుంది. ' '
వ – 'ఉ + అ'
ష – 'స' కారంలాగానే ఉచ్చరింపబడుతుంది
శ – 'స' కారంలాగానే ఉచ్చరింపబడుతుంది
ళ – 'ఌ కారంలాగానే ఉచ్చరింపబడుతుంది
క్ష – 'క' + 'ష' కలిపితే వచ్చే దానిగానే ఉచ్చరింపబడుతుంది.

వాస్తవానికి సంస్కృతంలో 'ఎ, ఏ' లు అని రెండు అక్షరాలుండవు. ఈ రెంటికీ ఒకే అక్షరం వుంటుంది. అలాగే – ఒ, ఓలకు గూడా ఒకే అక్షరం వుంటుంది.

పై వివరణను బట్టి సంస్కృత భాషకు మూలమైన లేదా అంకురము లైన(Original) లేదా మాతృకలైన అక్షరాలు 32 మాత్రమే వుంటాయి. అందుకే ఈ 32 అక్షరాలను 'మాతృకా వర్ణాలు' అంటారు.

అన్ని విద్యలకు మూలభూతమైన వేద విద్యను వ్యాప్తి చేసే వారు బ్రాహ్మణులు. ఉపనయన సంస్కారంతో రెండవ జన్మను పొందుతారు కాబట్టి బ్రాహ్మణులను 'ద్విజాలు' అంటారు. 'పళ్లు' (Teeth) గూడా రెండు సార్లు వస్తాయి. కాబట్టి పళ్లను 'ద్విజ' పదంతో వ్యవహరిస్తారు. కాబట్టి 'ద్విజపంక్తి ద్వయం' అంటే రెండు వరుసలుగా బారులు తీరి కూర్చున్న వేద బ్రాహ్మణులు'' అని ఒక అర్థం, 'రెండు వరుసలుగా వున్న పళ్లు' అని రెండో అర్థం వస్తుంది. వేద స్వస్తి జరుగుతున్నపుడు, ఇలాగే ఎదురుబదురుగా కూర్చుని ఒక వరుసలోని వాళ్లు ఒక వాక్యం లేదా పనస అంటే రెండో వరుసలోని వారు రెండోది అంటారు.

వేద విద్యా వ్యాప్తిని, షోడశీ విద్యావ్యాప్తిని చేయడానికి ఉపయోగించే 'ద్విజ పంక్తి ద్వయాన్ని' తన రెండు పలువరుసలుగా గలిగినది అని మరొక అర్థం.

'అనుష్టుప్ శ్లోకత్వం అమ్మవారి పళ్ల కూర్పులోనే ఇమిడ వుంద' ని ఇంకొక అర్థం.

ఇలా ఎన్నో రహస్యమైన అర్థాలు ఈ నామానికి వున్నాయి.

అమ్మవారి పై దంత పంక్తిని 'ఓ' కారంతోను, క్రింది దంత పంక్తిని 'ఔ' కారంతోను న్యాసం చెయ్యాలి.

## 26. కర్పూర వీటికా మోద సమాకర్షద్ది గంతరా

ఇది అమ్మవారి 26వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''కర్పూర వీటికా మోద సమాకర్షద్ది గంతరాయై నమః'' అని చెప్పాలి.

కర్పూర = కర్పూరపు, వీటికా = తాంబూలము యొక్క, ఆమోద = సువాసన లేదా పరిమళమును, సమాకర్షత్ = చక్కగా గ్రహించుచున్న, దిక్ + అంతరా = దిగంతరా = దిగంతముల వరకు ఆవరణములు గలది.

అమ్మవారి తాంబూల చర్వణం గూర్చి ఈ నామం వివరిస్తుంది. 'వీటికా' అనే సంస్కృత పదమే తెలుగులో 'వీడెము' అయింది. హిందూస్థానీలో దీన్నే ''బీడా' (పాన్ బిడా) అంటారు. తాంబూల చర్వణం గూడా చతుష్షష్టి లలితకళల్లో ఒకటి. ఎన్నోరకాల తాంబూలాలు వుంటాయి. (జరదా, కారా, మీఠా మొదలగునవి) కాని అమ్మవారు వేసుకున్నది కర్పూర తాంబూలం.

కర్పూర తాంబూలంలో ఏలకులు, లవంగాలు, పచ్చకర్పూరం, కస్తూరి, కుంకుమ పువ్వు, జాజికాయ, జాపత్రి, వక్కలు, చలువ మిరియాలు, కవిరి, తమలపాకులు మొదలైనవి వుంటాయి. వీటి వల్ల తాంబూలానికి పరిమళం వస్తుంది. అమ్మవారు ఈ తాంబూలం వేసుకున్నపుడు వచ్చిన పరిమళం దిగంతాల దాకా వ్యాపించిందిట !

తాంబూల చర్వణం వల్ల పళ్లకు గట్టితనం, వస్తుంది. తిన్న ఆహారం చక్కగా జీర్ణమవుతుంది. నాలుక, నోరు పండి ఎఱ్ఱని రంగులో అందంగా వుండడంతో పాటు పరిమళం తనకే కాక చుట్టూ వున్న వారికి గూడా ఆహ్లాదకరంగా గూడా వుంటుంది.

కర్పూరం – స్వచ్ఛంగా, తెల్లగా, నిర్మలంగా, చల్లగా, తేలికగా వుంటుంది. తన స్థూల అస్తిత్వాన్ని తక్కువ కాలంలో పోగొట్టుకుంటుంది. తనలోని అగ్నిని తక్కువ కాలంలో వ్యక్తం చేస్తుంది. వెలుగును, పరిమళాన్ని గూడా ఇస్తుంది. కర్పూరం – స్థూలస్థితి అయిన ఘనస్థితిలో వున్నా – ద్రవస్థితి చెందకుండానే సూక్ష్మ స్థితి అయిన వాయు స్థితిలోకి సూటిగా తక్కువ కాలంలో మారగలదు. అందువల్ల స్థూల లోకంలో వుండే వారి నుండి వారి సూక్ష్మ శరీరం వేరై తక్కువ కాలంలోనే సూక్ష్మ లోకాల్లో విహరించడానికి వారికి అనుభూతి పరంగా ఈ కర్పూరం దోహద పడుతుంది.

పచ్చ కర్పూరం – తాంబూలంలో చేరి పళ్లకి గట్టిదనాన్ని, కాటుకలో చేరి కళ్లకు చల్లదనాన్ని ఇస్తుంది.

అమ్మవారి 'నాలుక'ను 'ం' అనే అనుస్వారం (బిందువు) తో న్యాసం చెయ్యాలి.

'కర్పూర తాంబూల చర్వణము వలన దిగంతాల వరకు పరిమళములు వెదజల్లునది' – అని ఈ నామానికి అర్థం.

## 27. నిజసల్లాప మాధుర్య వినిర్భర్త్సిత కచ్ఛపీ

ఇది అమ్మవారి 27వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''నిజసల్లాప మాధుర్య వినిర్భర్త్సితకచ్ఛప్యై నమః'' అని చెప్పాలి.

నిజ = తన యొక్క, సల్లాప (సం + లాప) = సంభాషణ యొక్క, మాధుర్య = తియ్యదనము చేత, వినిర్భర్త్సిత = విశేషముగా లేదా అధికముగా అదలింపబడిన లేదా తిరస్కరింపబడిన, కచ్ఛపీ = కచ్ఛపీ (అనుపేరుగల) వీణ గలది.

అమ్మవారి పలుకులు అమృతపు చినుకులు. సంభాషణలోని తియ్యదనం మకరంద మాధుర్యాన్ని మించి వుంటుంది. సంగీతాన్ని పలికించే వీణా వేణారవాలు గూడా ఆ మాటల మాధుర్యానికి సాటి రావు. ఆ వీణ సాక్షాత్తు – సంగీత సాహిత్య అధిష్ఠాత్రి అయిన సరస్వతీ దేవి వీణ అయినా – సరే : అంతే ! సంగీత వాయిద్యాలు అక్షర ధ్వనులను పలికించగలవు గాని, స్పష్టంగా అక్షరాలను, మాటలను పలికించలేవు. చివరకు చిలకలు మొదలైన పక్షులు గూడా మాటల లాగా అనిపించేటట్లు పలుకుతాయి

గాని, అసలు మాటలను యథాతథంగా పలుకలేవు. మామూలు మాటలనే పలికించలేనప్పుడు – అమ్మవారి మాటలను పోల్చడానికి ఎలా సాటి వస్తాయి ?

'కచ్ఛపీ' అనేది సరస్వతీ దేవి యొక్క వీణ పేరు. అలాగే – విశ్వావసువు వీణ పేరు 'బృహతి', నారదుని వీణపేరు 'మహతి', తుంబురుని వీణ పేరు 'కళావతి'. 'కచ్ఛపీ' అంటే 'తాబేలు' అని అర్థం. తాబేలు డిప్పల లాగా వీణకు రెండు వైపులా వుండి వాటి మధ్య దండం వుంటుంది. ఈ దండంపై – వీణను మీటే తీగల క్రింద – మెట్లు వుంటాయి. ఇది చూడ్డానికి 'తల – జఘన భాగము' ఈ రెండూ వెన్నెముక దండంతో కలిపినట్లు'ంటుంది. (పటం – 4) వీణకైనా, వేణువుకైనా ఈ 'వెన్నెముక' తో సమన్వయం తప్పదు. (ఇవి రెండూ పూర్తిగా మన భారతీయ సంగీత వాయిద్యాలు. అందుకనే 'యోగదండం' పేరుతో పిలువబడే 'వెన్నెముక' తో వీటికి సమన్వయం వుండడం !)




1. తల భాగము 2. జఘన భాగము 3. వెన్నెముక

పటం – 4

సౌందర్యలహరిలో శంకరాచార్యుల వారు ఈ నామానికి సరిపోయే శ్లోకం వ్రాశారు ''విపంచ్యాగాయంతీ ... చోళేన నిభృతమ్'' అనేది ఆ శ్లోకం. అమ్మవారి కొలువు కూటంలో శివుని గాథలు వీణవాయిస్తూ సరస్వతీ దేవి వినిపిస్తుంటే అమ్మవారు ''బాగు, బాగు' అని మెచ్చుకోలుగా తీయని మాటలతో స్పందించిందిట ! అమ్మవారి ఆ మాటల మాధుర్యం తన వీణా స్వరాలకు గూడా లేదని సరస్వతీదేవి తన కచ్ఛపీ వీణకు గలీబును (Cover cloth) తొడిగిందిట. 'విసర్గమంటే – 'వెలువడడం' కాబట్టి అమ్మవారి నోటి నుండి వెలువడే వాక్కును విసర్గ (ః) తో న్యాసం చేయాలి.

''సరస్వతీ దేవి కచ్ఛపీ వీణపై వాయించే స్వరాల మాధుర్యాన్ని గూడా మించిన సల్లాప మాధుర్యం గలది'' అని ఈ నామానికి అర్థం.

## 28. మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశ మానసా

ఇది అమ్మవారి 28వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశమానసాయై నమః అని చెప్పాలి.

మందస్మిత = చిరునవ్వు యొక్క, ప్రభాపూర = నిండిన కాంతి ప్రవాహమునందు, మజ్జత్ = మునకలిడుచున్న, కామేశ = శివుని యొక్క, మానసా = మనస్సు కలిగినది.

అమ్మవారి అందాన్ని చూస్తేనే అయ్యవారు ఉబ్బితబ్బిబై పోతాడు. ఇక అమ్మవారు నవ్వితే వేరే చెప్పాలా ? అమ్మవారు – అంటే – ప్రకృతి యొక్క అందాన్ని చూసి తట్టుకోలేక పరమేశ్వరుడు కన్నుకొడతాడట! పరమేశ్వరుని ఎడమ కన్నైన చంద్రునికి– శుక్లపక్షంలో క్రమక్రమంగా పెరుగుతూ, పూర్తిగా విచ్చుకొని – 'పూర్ణిమ'; కృష్ణపక్షంలో క్రమ క్రమంగా తగ్గుతూ పూర్తిగా మూసుకుని 'అమావాస్య' అనేవి రావడానికి – ఇదే కారణం. (అయితే పరమేశ్వరుడు పెద్ద వన్నెలో వాడు కాబట్టి ఆయన కన్ను కొట్టడంలో 15 రోజులు కన్నుమూసే ప్రయత్నానికి, 15 రోజులు కన్ను తెరిచే ప్రయత్నానికి పడుతుందన్నమాట ! (ఇలా వేదార్థ ప్రతిపాదకంగా ఖగోళ విషయాన్ని ఇంత హాస్యస్ఫోరకంగా, గడుసుగా వ్రాసిన మహాకవి అస్మద్గురువరేణ్యులు 'శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు' – ఆ కావ్యం గోదా వైభవం – వివరణకర్త).

(అమ్మవారి నవ్వును గూర్చి ఆదిశంకరులు సౌందర్యలహరిలో – ''అమ్మవారి ముఖచంద్రుని నుండి వెలువడే నవ్వు అనే వెన్నెలను త్రాగిన చకోర పక్షులు – ఆ వెన్నెల అత్యంత మధురంగా వుండడంతో – నాలుక ఇంకో రుచిని చూడడానికి కూడా వీల్లేకుండా మొద్దు బారితే – అప్పుడు కాస్త మళ్లీ పుల్లటిదేమన్నా తింటే గాని నాలుక మళ్లీరుచులు తెలుసుకోలేదని ఆ పక్షులు – చంద్రుని వెన్నెలలు అనే అన్నపు గంజిని త్రాగాయి'' అని 'స్మిత జ్యోత్స్నా జాలం ... కాంచి కధియా' అనే శ్లోకంలో వివరిస్తారు. 'అమ్మవారి

చిరునవ్వు అనే కాంతి ప్రవాహంలో మునక లిడుతున్న శివుని మనస్సు కలిగినది' అని ఈ నామానికి అర్థం.

## 29. అనాకలితసాదృశ్య చుబుక శ్రీ విరాజితా

ఇది అమ్మవారి 29వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించే టప్పుడు ''అనాకలిత సాదృశ్య చుబుక శ్రీ విరాజితాయైనమః'' అని చెప్పాలి.

అనాకలిత = లభ్యము గాని లేదా దొరకని, సాదృశ్య = పోలిక గల, చిబుక = గడ్డము యొక్క శోభ చేత, విరాజితా = ప్రకాశించునది.

అవయువాల అందాన్ని చెప్పడానికి ఎన్నో ఉపమానాలను కవులు వాడుతూ వుంటారు. కళ్లకు, పెదవులకు, కనుబొమ్మలకు ... ఇలా అన్నిటికీ కవులు చక్కని ఉపమానాలను చెప్పగలిగారు గాని, గడ్డానికి ఎవరూ సరియైన ఉపమానం చెప్పలేకపోయారు. సౌందర్యలహరిలో శంకర భగవత్పాదులుగూడా 63వ శ్లోకం అయిన ''కరాగ్రేణ స్పృష్టం ...'' అన్న శ్లోకంలో ''కథంకార బ్రూమ స్తవ చుబుక మౌపమ్యరహితమ్'' (ఉపమానంచెప్పడానికి ఏదీ లేని నీ గడ్డం యొక్క అందాన్ని గురించి ఏం చెప్పగలను' ? అని అంటూనే కొద్దిగా ప్రయత్నించి, 'నీ ముఖం అనే అద్దానికి క్రింద పట్టుకోడానికి వుండేపిడిలాగా ఉన్న'దని ఏదో ఒక ఉపమానంచెప్పారు. (ఈ ఉపమానం చెప్పడంలో ఒక చిత్రమైన సూచన వుంది. అద్దంలో ఏర్పడే అమ్మవారి గడ్డం యొక్క ప్రతిబింబంతోనే అమ్మవారి నిజమైన గడ్డాన్ని పోల్చగలిగేది. మిగిలిన ఉపమానాలు సాటిరావు అనేది ఈ సూచన)

''విశ్వం దర్పణ బిందుమాననగరీ ....'' అనే శ్లోకాన్ని బట్టి, మనం చూస్తున్న మొత్తం విశ్వం అంతా పరమేశ్వరుని ప్రతి బింబమేనట ! ఆ ప్రతి బింబాన్ని ఏర్పరచేది అమ్మవారి ముఖం అనే అద్దంట ! అంటే - 'అమ్మవారి ముఖం అనే దర్పణంలో ఏర్పడే విశ్వరూపుడైన అయ్యవారి బింబం తాలూకు - ప్రతిబింబాల మయంగా సమస్త సృష్టిని పోల్చుకోవాలన్న మాట! బింబం ఒక్కటే ! ప్రతిబింబాలు ఎన్నైనా ఏర్పడవచ్చు ! ఆ ప్రతి బింబాలే వివిధ రకాల జీవులు.

''లభ్యము గాని పోలిక గల చిబుకము యొక్క శోభతో విరాజిల్లునది'' అని ఈ నామానికి అర్థం.

## ౩౦. కామేశ బద్ధ మాంగల్య సూత్ర శోభిత కంధరా

ఇది అమ్మవారి 30వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''కామేశ బద్ధ మాంగళ్య సూత్ర శోభిత కంధరాయై నమః'' అని చెప్పాలి.

కామేశ = పరమశివుని చేత, బద్ధ = కట్టబడిన , మాంగల్య సూత్ర = మంగళ సూత్రముచే, శోభితా = పవిత్ర సౌందర్యముతో ప్రకాశించుచున్న, కంధరా = మెడగలిగినది.

అమ్మవారి మెడ పరమశివుడు కట్టిన మంగళసూత్రం చేత పరమ రమణీయంగా శోభిల్లుతోందిట ! పెళ్లి జరగంగానే వధువుల మెడలకు ఈ మంగళ సూత్రంతో కళ పెరుగుతుంది. పవిత్రత, వ్యక్తిత్వం, బాధ్యతలతో కూడిన సౌందర్యం ద్యోతకమౌతుంది.

మంగళసూత్రం వివాహానికి చిహ్నం. పూర్వం శివపార్వతుల వివాహాన్నికోరి మన్మథుడు బాణం వేస్తే - వివాహానికి విముఖుడైన శివుడు తన కంటి మంటతో ఆ మన్మథుణ్ణి కాల్చి వేశాడు. మళ్ళీ అదే శివుడు వివాహ చిహ్నమైన మంగళసూత్రం అమ్మవారి మెడలో తరువాత కట్టాడు. అంటే మన్మథుడు మళ్లీతలెత్తుకుని తిరగేట్లుగా చేశాడు. (అంటే సృష్టికి సంబంధించిన కామం పునర్జీవనం పొందిందని అర్థం)

మెడ (కంఠం) వద్దనే 'విశుద్ధి చక్రం' వుంటుంది. ఇది వాక్కుకు సంబంధించిన చక్రం. వాక్కు 'అక్షర' సంబంధమైంది. అనగా నశించనిది. ఈ సూత్రం గూడా అలాగే ఈ 'వధూవరుల ప్రేమ బంధం' నశించకుండా వుండాలని సూచిస్తుంది. ఈ విశుద్ధి చక్రం వద్ద రెండు దళాల పద్మం వుంటుంది. ఈ రెండు దళాలు శివపార్వతులు. ఇవి 'వాక్కు - అర్థాలను' సూచిస్తాయి. ఇక్కడే హంసద్వంద్వం వుంటుంది. (ఒకటి 'స' కారం రెండోది 'హ' కారం) ఈ రెండూ ఉచ్ఛ్వాస, నిశ్వాసాలను సూచిస్తాయి.

మంగళసూత్రం మెడలో వుంటుంది. ఈ మెడ – 'తలను, మొండాన్ని' – కలిపే 'వంతెన (Bridge) లాంటిది. తల – కారణాన్ని(cause), మొండెం ( దేహం) – కార్యాన్ని (Effect) సూచిస్తాయి. ఈ 'కారణ – కార్యాలే' 'సంకల్ప – కల్పా'లైన 'శివ – పార్వతులు', 'పురుష – ప్రకృతులు! ఈ ఇద్దరూ ఈ సూత్రం చేత సంధింపబడతారు. పరబ్రహ్మ నుండి ఈ సృష్టి దాకా వుండే 'బ్రహ్మ సూత్రమే' ఈ సూత్రం.

మనలోపల మాట్లాడదామన్న అభిలాష అనే 'ఆనందం' నుండి మాట్లాడేవరకు వున్న 'అనుభవ'మే ఈ సూత్రం.

మంగళసూత్రధారణ దక్షిణ భారత దేశంలోనే గాని ఉత్తర భారతంలో లేదనుకునే వారికి ఈ నామం చక్కని సమాధానం చెబుతుంది. వ్యాసుడు ఉత్తర భారత దేశం వాడే ! అమ్మవారు గూడా ఉత్తరాన వున్న హిమవత్పర్వతపు పుత్రికయే ! ఉత్తర భారత వాసియే! అంటే – ఈ మంగళ సూత్ర నామం వ్రాసిన వారు, మంగళ సూత్రం కట్టించుకున్నవారు, కట్టినవారూ ముగ్గురూ ఉత్తర భారత దేశవాసులే! కాబట్టి, మంగళ సూత్రధారణ యావద్భారత దేశ సంప్రదాయబద్ధమైన ఆచారమే!

( వివాహాల్లో మంగళ సూత్రధారణ జరగబోయే ముందు ఈ లలితా సహస్ర నామ స్తోత్రంలోని – 'శ్రీమాతా' అనే మొదటి నామం నుండి 'కామేశ బద్ధ మాంగల్య సూత్ర శోభితకంధరా' అనే ఈ 30వ నామం దాకా చెప్పి, సూత్రధారణ కార్యక్రమాన్ని నిర్వహిస్తే, సందర్భ శుద్ధి కలిగి, నూతన వధూవరులకు ఆ 'శివ – పార్వతుల' పవిత్ర శుభాశీస్సులు నిండుగా వుంటాయి.)

''పరమశివుని చేత కట్టబడిన మంగళసూత్రముచే శోభిల్లు కంఠము కలిగినది'' అని ఈ నామానికి అర్థం.

ఈ నామంతో అమ్మవారి పంచదశీ మంత్రంలోని 'క ఏ ఈ ల హ్రీం' అనే 'కాది కూటము' అంటే 'వాగ్భవ కూటం' పూర్తవుతుంది.

## 31. కనకాంగద కేయూర కమనీయభుజాన్వితా

ఇది అమ్మవారి 31వ నామం. ఇది16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''కనకాంగద కేయూర కమనీయ భుజాన్వితా యైనమః'' అని చెప్పాలి.

కనక = బంగారు, అంగద = ఆభరణాలు, కేయూర = వంకీలతో లేదా భుజకీర్తులతో, కమనీయ = అందమైన, భుజ = బాహువులు, అన్వితా = కూడినది.

అంగదాలు, కేయూరాలు ఈ రెండూ భుజాలకు సంబంధించిన రెండు విధాలైన ఆభరణాలు. అమ్మవారి భుజాలకు ఈ రెండు రకాల ఆభరణాలు ఉన్నాయిట !

కోణానికి (Angle) అటు – ఇటు వుండే గీతలను 'భుజాలు' అంటారు. అమ్మవారు వెలుగు కేంద్రమైతే, ఆ కేంద్రం నుండి బయలు దేరే కిరణాలన్నీ భుజాలౌతాయి. అంటే 'అమ్మవారు' అనే – కేంద్రం నుండి, వ్యక్తమయే సౌందర్య కిరణాలు అనే – భుజాల యొక్క, 'వెలుగులే' – కీర్తులు.

'బంగారు అంగద కేయూరములతో రంగారు అందాల భుజములు గలది' అని ఈ నామానికి అర్థం.

## 32. రత్న గ్రైవేయ చింతాకలోల ముక్తా ఫలాన్వితా

ఇది అమ్మవారి 32వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''రత్నగ్రైవేయ చింతాకలోల ముక్తా ఫలాన్వితాయై నమః'' అని చెప్పాలి.

రత్న = రత్నముల చేత, గ్రైవేయ = కంఠము నందు ధరించు, చింతాక = చింతాకు అనే ఆభరణముతో, లోల = కదలుచున్న, ముక్తాఫల = ముత్యాలహారంతో , అన్వితా = కూడినది.

భారతదేశంలోని కొన్ని ప్రాంతాల్లో చింతాకు పతకాన్ని ఆభరణంగా ధరించడం వుంది. రత్నాలు పొదిగిన ఈ బంగారు చింతాకును మెడలో ఆభరణంగా ధరిస్తారు. అమ్మవారు గూడా ఈ చింతాకు పతకాన్ని మెడలో ధరించింది. ఈ చింతాకు పతకంతో పాటు అటూ ఇటూ కదులుతూ వుండే ముత్యాలహారం గూడా మెడలో వుందిట !

అమ్మవారి ఆపాదమస్తక స్వరూపంలో ఒక్కొక్క అవయవాన్ని ధ్యానం చేస్తే - ఒక్కొక్క ఫలం వస్తుంది. ఉదా : 'కబరీ బంధాన్ని ( జుట్టుముడి లేదా కేశ పాశం లేదా

కొప్పు) ధ్యానం చేస్తే మన కర్మ బంధం తొలగుతుంది. హృదయగతమైన గ్రంథులు (అజ్ఞానపు ముడులు) విడివడి, ప్రజ్ఞాన వంతవౌతాయి' అని సౌందర్యలహరిలో ''ధునోతుధ్వాంతం... వాటీవిటపినామ్'' అనే శ్లోకంలో ఆది శంకరులు తెలియపరుస్తారు. ప్రస్తుతం అమ్మవారి మెడకు సంబంధించిన నామంలో గూడా అలాంటి సూచన కొంత వుంది.

ధ్యాన లక్ష్యాన్ని, ధ్యాన శుద్ధిని బట్టి ప్రతిఫలం వుంటుంది. చంచల చిత్తులను సూచించడానికి ఈ నామంలో 'లోల' అనే పదం వాడబడింది. ముక్త సంగులను సూచించడానికి 'ముక్తా' అనే పదం వాడబడింది. ఈ రెండు రకాల వారికీ వచ్చే ప్రతి ఫలాలలోని తరతమ భేదాలను సూచించడానికి 'ఆ' 'ఫల' 'అన్వితా' అనే పదాలను వాడారు. ఇవి ''వారి వారి ధ్యాన శుద్ధిని బట్టి – ఆ యా ఫలాలను అన్వయించు కోవాలి'' అని చెప్పడం కోసం వాడబడ్డాయి.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. రత్నములచే పొదగబడిన చింతాకు పతక, ముత్యాలహారాది కంఠాభరణములతో కూడినది.

2. ధ్యానలక్ష్య శుద్ధిని బట్టి – ధ్యానించు వారికి ఆ యా ఫలములను ఇచ్చునది.

## 33. కామేశ్వర ప్రేమ రత్న మణి ప్రతి పణ స్తనీ

ఇది అమ్మవారి 33వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతి పణస్తన్యైనమః'' అని చెప్పాలి.

కామేశ్వర = కామేశ్వరుని యొక్క; ప్రేమ = ప్రేమ అనెడి; రత్న = శ్రేష్ఠమైన, మణి = మణిని పొందుటకై; ప్రతి పణ = బదులు ఇచ్చు వస్తువులుగా అయిన, స్తనీ = స్తనములు గలది.

కామేశ్వరుని (అంటే – శివుని) ప్రేమ అనే రత్నాన్ని పొందడం కోసం తన స్తన రత్నాలను అందుకు బదులుగా పరమేశ్వరునికి ఇవ్వడానికి అమ్మవారు అంగీకరించిందిట!

ఇద్దరూ ఇలా ఒకరి వస్తువులను మరొకరు ఇచ్చి పుచ్చుకోడానికి ఒప్పుకున్నారు. కాబట్టి, ఆయా వస్తువులపై పూర్తి అధికారం కొన్న వారికి చేకూరి, స్వంత మౌతాయి, ఇంకొకరికి వాటిపై హక్కు ఉండదు. కాబట్టి, అయ్యవారి ప్రేమ ఇంక అమ్మవారికొక్కదానికే ! ఇంకెవ్వరికీ ఆ ప్రేమ గాని, ప్రేమలో భాగం గాని లేదు. ఇది అయ్యవారి 'ఏక పత్నీవ్రతత్వాన్ని' తెలియజేస్తుంది. అలాగే అమ్మవారి స్తన రత్నాలు అయ్యవారికి మాత్రమే చెల్లుతాయి. ఇది అమ్మవారి 'పాతివ్రత్యాన్ని' సూచిస్తుంది.

ప్రతి పణంగా ఏ వస్తువులనైనా పెట్టవచ్చు. కాని, స్తనాలనే పెట్టడంలో ఔచిత్యం వుంది. అమ్మవారిపై గల తన ప్రేమనంతా వ్యక్తరూపంలో తీసుకు రావడానికి అయ్యవారు అమ్మవారి గర్భంలో ప్రవేశించి, పుత్రుడుగా (లేదా పుత్రికగా) జన్మిస్తాడు. ('ఆత్మా వై పుత్రనామాసి' అని గదా!) శైశవ దశలోని ఆ పుత్రరత్నాన్ని పెంచి, దక్కించుకోడం కోసం – అందుకు ప్రతిగా అమ్మవారు – ఆ శిశువుకు తన స్తన్యాన్ని జీవనాధారంగా ఇచ్చి పోషిస్తుంది. అంటే – తరువాత పుట్టబోయే తన కోసం శివుడు అమ్మవారి స్తన ద్వయాన్ని ముందే జాగ్రత్తపడి కొనుక్కున్నాడన్న మాట ! అలాగే ఆ కామేశ్వరుడే పుత్రునిగా తనకు పుట్టాలని, ఆయన ప్రేమను ఇంకొకరికి దక్కనీయకుండా స్తనాలనిచ్చి దక్కించు కుంది అమ్మవారు. అందుకే మిగతా అవయవాలు ఎన్ని వున్నా స్త్రీలకు స్తనాలే నిజమైన మాతృకా చిహ్నాలు. (అయ్యవారి, అమ్మవారి ఈ ఇచ్చి పుచ్చుకోడాల్లో ఒక రత్నానికి బదులు రెండు రత్నాలు తనకు వస్తాయి గాబట్టి కామేశ్వరుడు ఈ బేరాన్ని వదులుకోడు. పొందిన తరువాత తననుండి పోనివ్వడు. అలాగే 'ఎంతో అదృష్టం వుంటే గాని ఎవ్వరికీ దక్కని కామేశ్వరుని ప్రేమ అనే ఒకే ఒక దివ్యమైన రత్నాన్ని పొందేటప్పుడు – భౌతిక స్తనరత్నాలను బదులు ఇస్తే ఏమి?' అని – ఆనందంతో ఈ బేరానికి వప్పుకుని, కామేశ్వరుని ప్రేమరత్నాన్ని పూర్తిగా దక్కించుకుంది అమ్మవారు).

ఏతావతా చెప్పేదేమంటే ఈ 'అయ్యవారి – అమ్మవారి' దివ్యమైన, పవిత్ర మైన దాంపత్య ఫల సంతానమే ఈ ప్రపంచం. ఈ ప్రపంచములోని భార్య భర్తలైన వారందరూ గూడా ఇదే రకంగా పాతివ్రత్యాన్ని, ఏకపత్నీ వ్రతాన్ని కలిగి వుండాలనే సూచన గూడా ఈ నామంలో వుంది.

ఇంకొక చిత్రమైన అన్వయం గూడా ఈ నామంలో వుంది. వ్యక్త సృష్టికి కావలసిన ఆకార, గుణ, పరిమాణ, శబ్ద స్పర్శ రూప రస గంధాలతో వుండే భౌతిక సంపదను

సూచించే 'తన స్తనాలను' అమ్మవారు పరమేశ్వరుని కిస్తే – వీటి భౌతికత్వానికి అతీతంగా వుండి, వాటికి సార్థకతను చేకూర్చే హృదయ (లేదా – ఆత్మ) సౌందర్య గుణాన్ని సూచించే 'తన ప్రేమను' అయ్యవారు అమ్మవారికిచ్చాడన్నమాట ! ఈ రెంటి కలయిక వలన వ్యక్త సృష్టిసాధ్యమై, పరిపూర్ణత్వం పొందినదౌతుంది. 'జీవికి దేహం ఉండాలి, ప్రేమ వుండాలి. ఈ రెంటిలో ఏ ఒక్కటి లేకపోయినా సృష్టి పరిపూర్ణ మవదు' అని అర్థం.

1. కామేశ్వరుని యొక్క ప్రేమ అనే శ్రేష్ఠమైన రత్నాన్ని పొందడం కోసమై, అందుకు బదులుగా తన స్తన రత్నాలను ఇచ్చినది.
2. భౌతికమైన స్తన రత్నాలను ఇచ్చి, భౌతికానికి అతీతమైన పరమేశ్వరుని ప్రేమ రత్నాన్ని పొందినది.

అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 34. నాభ్యాలవాల రోమాళి లతాఫల కుచద్వయీ

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''నాభ్యాల వాల రోమాళి లతా ఫల కుచద్వయ్యైనమః'' అని చెప్పాలి.

నాభి = బొడ్డు అనెడి, ఆలవాల = పాదునందలి; రోమాళి = (రోమ +ఆళి) నూగారు అనెడు; లతా = తీగకు; ఫల = పండ్ల వలె ఒప్పు; కుచద్వయీ = స్తనముల జంట కలిగినది.

తీగను పెంచడం కోసం భూమిని త్రవ్వి, గుంట చేసి గుంటచుట్టూ మట్టి వేసి ఎత్తుగా చేస్తే – దాన్ని 'పాదు' అంటారు. అమ్మవారి బొడ్డు అలాంటి పాదులాగా వుందిట! అయితే ఇక్కడ తీగ ఏమిటంటే – అమ్మవారి బొడ్డు పైన తిన్నగా నిలువుగా పైకి వున్న సన్నని రోమాళి. ఈ 'రోమాళి'నే తెలుగులో 'నూగారు' అంటారు. ఇది సన్నగా వుండి తిన్నగా ఊర్ధ్వముఖంగా నాభి నుండి వక్షం క్రింది దాకా వుంటుంది. అయితే – తీగకు అంతంలో, అంటే – పై చివరి కొనవద్ద పళ్ళు (Fruits) వుండాలి గదా (ద్రాక్ష తీగకు ద్రాక్ష పళ్ళు వున్నట్లు) అంటే – అమ్మవారి 'స్తన యుగమే' – ఆ రోమాళి అనే తీగకు 'రెండు పళ్ళు' అంటున్నారు వ్యాసులవారు. ఈ స్తనాలు రెండు పళ్ల లాగా నూగారనే తీగకు కుడివైపున ఒకటి, ఎడమవైపున ఒకటి వున్నాయిట !

ఈ నామంలో చెప్పిన నాభి – మణి పూర చక్రస్థానాన్ని, స్తన మధ్యం – అనాహత చక్రస్థానాన్ని, స్తనాలు – ఇడా, పింగళానాడుల స్థానాన్ని సూచిస్తే, సన్నని రోమాళి – సుషుమ్నానాడిని సూచిస్తుందని గ్రహించాలి.

మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర చక్రాలు మూడింటిని అడుగువైపు శీర్షం గల త్రిభుజంగాను; విశుద్ధి, ఆజ్ఞ, సహస్రార చక్రాలు మూడింటిని ఊర్ధ్వముఖంగా శీర్షంగలిగిన త్రిభుజంగాను పటం5 లో చూపిన విధంగా ఒక దాని మీద ఒకటి వుండి ఒక షట్ బిందు యంత్రంలాగా వూహిస్తే – ఆ షట్ బిందు యంత్రానికి మధ్యలో గరిమనాభి (Centre of Gravity) వద్ద అనాహత చక్ర స్థానం వుండి, ఈ యంత్రానికి ఆధారబిందువు (Fulcrum) లాగా వుంటుంది. ఈ యంత్రంలో పైకి శీర్షంగల త్రిభుజాన్ని 'ఆనంద త్రిభుజము' అనీ, క్రిందికి శీర్షం వున్న త్రిభుజాన్ని 'ఆవేశ త్రిభుజ' మనీ అంటారు. వీటినే ఆంగ్లంలో Higher Triad అని, Lower Triad అనీ సంకేతిస్తారు.




నాభి – ఆవేశాన్ని, హృదయం – ప్రేమను సూచిస్తాయి. తల్లీ బిడ్డల మధ్య భౌతిక బంధాన్ని నాభి ( మణిపూరక) సూచిస్తే, ప్రేమబంధాన్ని హృదయం ( అనాహతం) సూచిస్తుంది. భౌతిక బంధం తెగవలసినది – అందుకే బొడ్డు కోస్తారు. ప్రేమబంధం – కోయ్యడంతో సంబంధం లేనిది – అని గ్రహించాలి. శివుని కంటికి కాలిన మన్మథుడు – తాపం తీరడం కోసం అమ్మవారి బొడ్డు అనే సరస్సులో దూకితే – అప్పుడు ఆ బొడ్డు అనే సరస్సు నుండి సన్నని తీగలాగా పైకి లేచిన పొగతీగలాగా అమ్మవారి 'నూగారు' ఉంటుందని ఆది శంకరులు ''స్థిరోగంగా వర్తం ....'' అన్న శ్లోకంలో (సౌందర్యలహరి) వ్రాస్తారు.

'నాభి అనే పాదులో నూగారు అనే తీగకు పళ్ళు లాగా ఒప్పుచున్న స్తన ద్వయం గలిగినది' అని ఈ నామానికి అర్థం.

# 35 లక్ష్యరోమలతాధారతా సమున్నేయమధ్యమా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''లక్ష్య రోమలతాధారతా సమున్నేయ మధ్యమాయైనమః'' అని చెప్పాలి.

లక్ష్య = కనబడుచున్న, రోమలతా = నూగారు అనెడు తీగను; ఆధారతా = అనుసరించి; సమున్నేయ = ఉద్ధరింపబడిన; మధ్యమా = నడుముగలది.

(ఈ నామాన్ని 'లక్ష్యరోమలతా ధారా', 'తా సమున్నేయ మధ్యమా' అనే విధంగా విడదీసి చదవకూడదు. 16 అక్షరాలు కలిపే చదవాలి లేదా విరామం తీసుకోదలచినట్లైతే – 'లక్ష్య రోమలతాధారతా, సమున్నేయమధ్యమా' అనే విధంగా 9 అక్షరాల తరువాత కొద్దిగా విరామంతో, మొత్తం నామాన్ని ఒకేసారైనా చదవాలి. అనుష్టుప్ చందస్సులో వ్రాయబడిన లలితా సహస్రనామ శ్లోకాల్లో – ఈ శ్లోక ప్రథమ పాదానికి కొద్దిగా ఛందో నియమంలో మార్పు వచ్చింది. ఈ ఒక్క శ్లోకంలోనే ఇలా వచ్చింది. న్యాయానికి ప్రతి పాదాంతానికి పదం పూర్తయిపోవాలి. కాని, ప్రథమ పాదంలో 8 అక్షరాలతో కాకుండా 9 అక్షరాలతో (లక్ష్య రోమలతాధారతా) పాదం పూర్తవుతోంది. ఈ విధంగా రావడం వల్ల, రెండో పాదానికి 'సమున్నేయ మధ్యమా' అని 7 అక్షరాలే వస్తున్నాయి. '2, 3 పాదాల మధ్య ఇలా పదం విరవబడ కూడదు గాని, 1, 2 పాదాల మధ్య ఫర్వాలేదు' అని కొందరంటారు. ఎలా వ్రాసినా గూడా ఈ నామాన్ని 16 అక్షరాలు కలిపి ఒకే సారి చదవడమే మంచిది. అప్పుడు ఏ దోషమూ రాదు.)

ఏదైనా ఒక తీగ – పైకి ప్రాకడానికి ఒక ఆధారం వుండాలి గదా! ఆధారం లేక పోతే పైకి ప్రాకడం కుదరదు. మరి, అమ్మవారి నాభి అనే పాదు నుండి పుట్టిన నూగారు ( సన్నని రోమరాజి) పైకి ప్రాకుతూ పోతున్నట్లుగా కనబడుతుంది కాబట్టి – 'ఈ నూగారు లతకు వెనక తప్పకుండా ఏదో ఆధారం వుండి తీరాలి' – అనే ఊహ కలుగుతుంది. ఈ ఊహకు ఆధారంగా అమ్మవారి నడుము ఉన్నదిట ! అంటే – ఆ నూగారు తీగ – పైకి పోతున్నట్లుగా కనక ఉండకపోతే – నడుము అనే ఆధారం లేదనుకోవలసి వచ్చేది. మొత్తానికి – 'అసలు ఏమీ లేదనడానికి వీల్లేకుండాను, కనబడేట్టు ఉంటుందని గట్టిగా నొక్కి చెప్పడానికి వీల్లేకుండాను ఉన్నంత సన్నగా' – అమ్మవారి నడుం వున్నదన్నమాట !

నడుం సన్నగా వుండడం వలన చూలాలుగా వున్నపుడు లోపల బిడ్డను ధరించడం (Child Bearing) కష్టంగా వుండదు. అందుకనే ఇలా వుండడం మంచి సాముద్రిక లక్షణం అంటారు.

ఈ నామంలో వున్న 'సమున్నేయ' అనే పదానికి 'చక్కగా ఉద్ధరింపబడిన' అని అర్థం. 'నాభికి దిగువ వున్న అధోలోకాలకు' – 'నాభికి పైన వున్న ఊర్ధ్వ లోకాలకు' మధ్య సంధిలాగా నడుం వుంటుంది. అధోలోకాలను చక్కగా ఊర్ధ్వ లోకాలకు ఉద్ధరించేందుకు వీలుగా ఈ సన్నని నడుము ఏర్పాటైన దన్నమాట. (This waist region is a line of demarcation or balance between lower instincts and higher faculties)

నడుము తులారాశికి సంబంధించిన శరీర భాగం. 'తుల' అంటే 'సరిపోల్చడం' లేదా 'సమన్వయం' అనే అర్థాలు చెప్పుకోవచ్చు. అందుకనే ఈ కటిప్రదేశం 'ఊర్ధ్వలోకాలకు – అధో లోకాలకు' మధ్య సమన్వయ కర్తగా వుంటుంది. (మధ్యమా అనే పదంలోనే ఒక సౌష్ఠవం(symmetry) వుంది.) ఈ తులారాశిలో సూర్యుడు ఉన్నపుడే పగలు రాత్రి సమానంగా వుండే దక్షిణ విషువద్దినం(Autumn Equinox day) వస్తుంది. పగలు – వెలుగులోకాలని పిలవబడే దివ్యలోకాలను, రాత్రి – చీకటి లోకాలని పిలవబడే పాతాళలోకాలను సూచిస్తాయి. వీటినే వరుసగా దేవలోకాలు లేదా ప్రజ్ఞాలోకాలు (Planes of Light or Conciousness), రాక్షస లోకాలు లేదా పదార్థ లోకాలు(Planes of materialisation or Matter) అంటారు.

స్త్రీ శరీరంలో – 'స్తనాలతో వుండే వక్షస్థల భాగాన్ని', 'పిఱుదులతో వుండే మొలకట్టు భాగాన్ని' చక్కగా వేరుచేస్తూ – రెంటినీ తులతూగేటట్లు చూసేది గూడా ఈ నడుం భాగమే !

'కనబడే నూగారు అనే తీగకు ఆధారంగా వుండే సన్నని నడుముగలది' అని ఈ నామానికి అర్థం.

## 36. స్తన భారదళన్మధ్య పట్టబంధవళిత్రయా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''స్తనభార దళన్మధ్య పట్ట బంధవళిత్రయాయై నమః'' అని చెప్పాలి.

స్తనభార = వక్షముల బరువు చేత, దళత్ = విరుగుచున్న, మధ్య = నడుమునకు, పట్టి = (కట్టిన) పట్టీల యొక్క; బంధ = చుట్టు బంధములవలె కనబడు, వళిత్రయా = మూడు ముడతలు గలది.

అమ్మవారి స్తనములు బరువైనవి, దృఢమైనవి. నడుము సన్ననిది. అందువలన 'పైన గల స్తన భారానికి క్రింద వున్న సన్నని నడుము విరిగినా విరగవచ్చునేమో' అని, 'ఆ విధంగా విరగకుండా వుండటానికి ఆ నడుంచుట్టూ గట్టిగా కట్టారా' అన్నట్లు అమ్మవారి పొట్టమీద మూడు చుట్లు (మూడు ముడతలు) ఉన్నాయిట !

ఉత్తమ సాముద్రిక లక్షణాల ప్రకారం - ఘనస్తనాలు, సన్నని నడుము, వళిత్రయం ఈ మూడూ - ఉత్తమ స్త్రీ లక్షణాలు. ఇటువంటి వళిత్రయం - ఒక్క పొట్ట దగ్గరే కాదు - నుదురు మీద, కంఠం దగ్గఱ కూడా ఉండడం స్త్రీ పురుషులిద్దరికీ సౌభాగ్య లక్షణాలే అని ఈక్రింది శ్లోకం చెబుతుంది.

శ్లో. లలాటేచ గళే చైవ మధ్యే చాపివలిత్రయమ్
స్త్రీ పుంస యోరిదం జ్ఞేయం మహా సౌభాగ్యలక్షణమ్.

నడుం సన్నగా వుండి, పొట్ట దగ్గఱ మూడు ముడుతలు లేకుండా వుంటే - గర్భధారణలో ఇబ్బందులుంటాయి. ముడుతలు వుండి, నడుం లావుగావుంటే - చాకిరీ చేయడంగాని, చేయించుకోవాల్సిన అవసరం గాని వుంటుంది. ముడుతలు వుండి, నడుము సన్నగా కూడా వుంటే - ఏ ఇబ్బందులూ వుండవు. ఇలా వుండడం మంచి సౌభాగ్య లక్షణం అని సాముద్రిక శాస్త్రం చెబుతుంది.

ఆజ్ఞా చక్రం వుండే నుదురు మీద మూడు ముడుతలు వుంటే - భూత, భవిష్యత్, వర్తమాన కాలజ్ఞానాన్ని ఇస్తాయి. విశుద్ధి చక్రం వుండే కంఠం వద్దమూడు ముడుతలు వుంటే - మంద్ర, మధ్యమ, తారస్థాయిలలో గూడా చక్కగా సంగీతం పాడగల అవకాశం

వుంటుంది. ఇక మణిపూర చక్రం వుండే నాభి వద్ద మూడు ముడుతలు వుంటే – ఊర్ధ్వ, మధ్యమ, అధోలోకాలకు; కారణ, సూక్ష్మ, స్థూల దేహాలకు గల సమన్వయం సుబోధక మౌతుంది. స్త్రీలకు గర్భదారణలో ఇబ్బందులుండవు. పురుషులకు క్రీడల్లో(Sports & Games) ఇబ్బంది వుండదు. లోపల $3\frac{1}{2}$ చుట్ల కుండలిని, బయట ఈ త్రివళులు – వీటికి సంబంధించిన జ్ఞానం ఉపాసకునకు అవసరమే!

''స్తనముల బరువునకు సన్నగా వున్న నడుము విరుగునేమో అని నడుము చుట్టును పట్టీలు కట్టినట్లుగా నున్న త్రివళులు కలది'' అని ఈ నామానికి అర్థం.

## 37. అరుణారుణ కౌసుంభ వస్త్రభాస్వత్కటీ తటీ

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''అరుణారుణ కౌసుంభవస్త్ర భాస్వత్కటీ తట్యైనమః'' అని చెప్పాలి.

అరుణారుణ = ఉదయ సూర్యుని రంగువలె; కౌసుంభ = కుంకుమ పువ్వు రంగువలె అగుపడు, వస్త్ర = వస్త్రముతో వున్న, భాస్వత్కటీ తటీ = వెలుగొందు కటిప్రదేశము గలది.

ఉదయిస్తున్న సూర్యుని రంగును, కుంకుమరంగును కలిగి మిక్కిలి ఎఱ్ఱగా వుండే వస్త్రముతో ప్రకాశించు కటి ప్రదేశము గలది అమ్మవారు. అమ్మవారికి ఇష్టమైన రంగు 'ఎఱుపు' – అని, 'దాడిమీ కుసుమ ప్రభా', 'జపాకుసుమసంకాశా', 'మందార కుసుమ ప్రియా' (ముందురాబోయే నామాలు) అనే నామాలు తెలుపుతాయి. తాను ఎఱుపు, తన కిష్టమైన రంగు ఎఱుపు, తాను కట్టిన చీర ఎఱుపు. ఇందువల్లనే ధ్యాన శ్లోకం – ''అరుణాం కరుణాతరంగి తాక్షీం'' అని ప్రారంభించబడుతుంది.

ఎఱుపురంగు జ్ఞానోదయానికి, అనురాగానికి, సృష్టికి, జాగ్రదవస్థకు చైతన్యానికి, రక్తానికి తత్ఫలితంగా శక్తికి – గుర్తు. అమ్మవారు జ్ఞానస్వరూపిణి; మాతృమూర్తి; జగజ్జనని, అనురాగవల్లి, సృష్టిస్వరూపిణి, చైతన్యస్వరూపిణి, శక్తిస్వరూపిణి – కాబట్టి, ఎఱుపురంగుకు – అమ్మవారికి వర్ణ సమన్వయం (Matching) బాగా ఒప్పుతుంది. అందుకే ఈ నామాన్ని 'అరుణ', 'అరుణ', 'కౌసుంభ', 'భాస్వత్' అనే ఎఱుపు వెలుగులకు

సంబంధించిన మూడు పదాలతో కూర్చడం జరిగి వుండవచ్చు. ఇంకోచోట ''సర్వారుణా'' అనే నామం గూడా వస్తుంది.

'ఉదయిస్తున్న సూర్యుని రంగును, కుంకుమ రంగును - కలిగి, మిక్కిలి ఎఱ్ఱగా వుండే వస్త్రముతో ప్రకాశించు - కటి ప్రదేశం గలది' అని ఈ నామానికి అర్థం.

## 38. రత్నకింకిణికా రమ్య రశనాదామ భూషితా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''రత్న కింకిణికారమ్య రశనాదామ భూషితాయైనమః'' అని చెప్పాలి.

రత్న = రత్నములతో కూడిన, కింకిణికా = చిరుగంటలతో, రమ్య = అందమైన, రశనా + దామ = ఒడ్డాణపుత్రాటి చేత; భూషితా = అలంకరింపబడినది.

అమ్మవారి నడుముకు వున్న ఒడ్డాణం - అంచుల ఎద్ద చిరుగంటల గజ్జెలతోను, పొదగబడిన రత్నాలతోను అత్యంత రమణీయంగా వుంటుందిట !

భూమికి - భూమధ్యరేఖలాగా, మగవారికి - మొలత్రాడు లాగా, స్త్రీలకు వడ్డాణం నడుము చుట్టూరా వుంటుంది. చీర కుచ్చిళ్ళు బయటకు చెదరకుండా పట్టి వుంచడమే కాకుండా, ఒడ్డాణం - స్త్రీల సన్నని నడుముకు శోభను, అందాన్ని చేకూరుస్తుంది. మొత్తం నిలువెత్తు మనిషిని రెండు భాగాలుగా మంచి సౌష్ఠవరీతిలో సర్దుబాటు చేసినట్లుంటుంది. కటి ప్రదేశం 'తులారాశి'కి సంబందించినది. అన్ని రాశులలోకి 'తులారాశి' అందానికి సంబంధించినది. ఆంగ్లంలో ఈ రాశిని 'Lovely Libra' అంటారు.

ఈ రాశికి అధిపతి గూడా శుక్రుడు. శుక్రుడంటేనే 'శుభము' అని వేరే చెప్పక్కర్లేదు. కాబట్టి, ఈ కటిప్రదేశ మేఖల ( ఒడ్డాణం) చేత అమ్మవారు మరింత శోభాయ మానంగా వుంటుంది.

అమ్మవారి నడుముకు ఉండే ఈ ఒడ్డాణాన్నే శంకరాచార్యుల వారు సౌందర్యలహరిలో ''క్వణత్కాంచీదామా'' అన్నారు. ఈ ఒడ్డాణంతో ప్రారంభించి, అమ్మవారి సుందర వ్యక్త స్వరూపాన్ని ఎంతో చక్కగా వర్ణిస్తారు.

'రత్నాలతోను, చిరుగజ్జెలతోను అత్యంత రమణీయంగా వుండే ఒడ్డాణపు త్రాడు గలిగినది' అని ఈ నామానికి అర్థం.

అమ్మవారిని తెలుసుకోవడం కోసం చేసే ప్రయత్నంలో ఇంతవరకు అమ్మవారి జ్ఞాత భాగం చెప్పబడింది.

## 39. కామేశ జ్ఞాత సౌభాగ్య మార్దవోరుద్వయాన్వితా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''కామేశ జ్ఞాత సౌభాగ్యమార్దవోరుద్వయాన్వితాయైనమః'' అని చెప్పాలి.

కామ + ఈశ = కామేశ = కామేశ్వరునికి మాత్రమే, జ్ఞాత = తెలిసిన, సౌభాగ్య = సౌభాగ్యవంతమైన, మార్దవ = మెత్తని లేదా మృదువైన, ఊరుద్వయ = తొడల జంటను, అన్వితా = కూడినది.

'కామేశ్వర' పదం ఎప్పుడు వచ్చినా సృష్టిసంకల్పం కలిగిన శివునిగా చెప్పుకోవాలి. ''సోऽకామయత, బహుస్యాం ప్రజాయేయేతి'' అన్నది శ్రుతి వాక్యం. ఒంటిగ ంటి = రామలింగం లాగా వున్న పరమేశ్వరునికి ఒక కోరిక గలిగిందిట. ఒంటరిగా, ఒక్కడుగా ఉన్న తాను – ఎక్కువ మందిగా అవాలనేదే – ఆ కోరిక. ఆ కోరిక ఫలితంగానే యావత్ప్రపంచం వ్యక్తమైంది. ఇలా – ఎక్కువమందిగా అవాలనే కోరిక (కామం) నిండుగా వున్న స్థితిలోని పరమేశ్వరుణ్ణి 'కామేశ్వరుడు' అంటారు. ఆ కామాన్ని 'మహాకామం' అంటారు. అందుకు సహకరించిన ఆయన శక్తిని 'మహాకామేశ్వరి' అంటారు. మహాకామేశ్వరియే అమ్మవారు. ఈ అమ్మవారిని కేశాది నాభి పర్యంతం ఇంతకు పూర్వం వర్ణించడం జరిగింది. నాభివరకు ఉన్న అవయవాలన్నిటికి – అవి ఎలా వుంటాయో ఉపమానాలు చెప్పినా, ప్రస్తుత నామం విషయంలో ఉపమానం చెప్పలేదు. అలా చెప్పక పోవడం లోనే వుంది ఔచిత్యమంతా ! కేవలము సర్వజ్ఞుడైన కామేశ్వరునికి మాత్రమే తెలిసిన ఊరువులు అమ్మవారివి. అందుచేత ఉపమానాలు వెయ్యకుండా ముక్తసరిగా 'లావణ్యము, లాలిత్యముతో కూడిన, సౌభాగ్యవంతమైన – అనే విశేషణాలే వేసి, కామేశ్వరునికి మాత్రమే తెలిసిన ఊరువులు అని ఊరుకున్నారు వ్యాసమహర్షి.

రాశి చక్రంలో 9వ రాశి అయిన ధనుస్సు - 'తొడలను, ఉపదేశాన్ని గూడా సూచిస్తుంది. విద్యాశిక్షణలో సాధారణంగా మనం వినే 'తొడపాశం', 'చెవి మెలిపెట్టడం' లాంటి మాటలు ఉపదేశానికి సంకేత పద బంధాలుగా అర్థం చేసుకోవాలి. 'అమ్మవారికి సంబంధించిన 'సౌభాగ్య' 'మార్దవ' మంత్రోపదేశాలు వాటి సమన్వయం అయ్యవారికే తెలుసు' అనే సూచన ఈ నామంలో ఉంది.

రెండు ఊరువులను, 'ఉ, ఊ' ల తో సంకేతిస్తే - ఆ రెంటిలో 'ఉ' - సౌభాగ్యాన్ని, 'ఊ' - మార్దవాన్ని సూచిస్తాయి. ఈ సౌభాగ్య మార్దవాల సంధాన కర్త్రి అయిన అమ్మవారు అయ్యవారికే సమగ్రంగా తెలిసేది' అని ఈ నామానికి అర్థంగా చెప్పుకోవచ్చును.

## 40 మాణిక్యమకుటాకార జానుద్వయ విరాజితా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''మాణిక్య మకుటాకార జానుద్వయ విరాజితాయైనమః'' అని చెప్పాలి.

మాణిక్య = మాణిక్య సంబంధమైన, మకుటాకార = కిరీటము వంటి ఆకారముతో ఒప్పు, జానుద్వయ = మోకాళ్ళ జంటతో; విరాజితా = ప్రకాశించునది.

ఒక పెద్ద మాణిక్యంతో ఒక మకుటాన్ని, అంటే - కిరీటాన్ని (Cap) తయారు చేస్తే - ఆ కిరీటం యొక్క ఆకారం ఎలా వుంటుందో అమ్మవారి మోకాటి చిప్పలు అలా వుంటాయిట ! అలాంటి మోకాళ్ళతో అమ్మవారు అందంగా వుందని ఈ నామానికి అర్థం.

క్రిందటి నామంలోని 'ఊరుద్వయం' ఈ నామంలోని 'జానుద్వయం' ఈ రెండు గుహ్యమైనవే ! ఈ రెంటిలో ఊరుద్వయం గుహ్యతమం అందుకే ప్రస్తుత నామంలోని జానువులకు 'మాణిక్యమకుటాకారాన్ని' ఉపమానంగా చెప్పి, పూర్వపు ఊరుద్వయానికి విశేషణాలే చెప్పారు గాని ఉపమానాలు చెప్పలేదు.

## 41. ఇంద్రగోప పరిక్షిప్త స్మర తూణాభ జంఘికా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''ఇంద్రగోప పరిక్షిప్త స్మర తూణాభజంఘికాయై నమః'' అని చెప్పాలి.

ఇంద్రగోప = ఆరుద్ర పురుగుల చేత, పరిక్షిప్త = చుట్టును పొదగబడిన (తాపబడిన), స్మర = మన్మథుని యొక్క, తూణ = అమ్ముల పొదులతో, ఆభ = ఒప్పు, జంఘికా = పిక్కలు గలది.

ఈ నామంలోని 16 అక్షరాలు కలిపి ఒకేసారిగా చెప్పాలి. 'ఇంద్ర గోప పరిక్షిప్తా' అన్ని 8 అక్షరాల భాగాన్ని విడదీస్తే అమ్మవారు – 'ఆరుద్ర పురుగుల చేత పొదగబడినది' అనే అర్థం వస్తుంది. తస్మాత్ జాగ్రత !

ఆరుద్ర పురుగులు గురివింద గింజల్లాగ బాగా ఎఱ్ఱగా వుంటాయి. మన్మథుడు వాడే అమ్ముల పొదుల మీద ఆరుద్ర పురుగులు పొదగబడి వుంటాయి. అప్పుడు అవి చూడ్డానికి చాలా అందంగా కనబడతాయి. అమ్మవారి రెండు పిక్కలు సరిగ్గా అంత రమణీయంగా వుంటాయిట !

శంకరాచార్యులవారు గూడా సౌందర్యలహరిలో అమ్మవారి పిక్కల్ని ఇలాగే మన్మథుని అమ్ముల పొదులతోనే పోలుస్తారు. అమ్ముల పొదులలో బాణాలు వుండాలిగా అంటే – ఒక్కొక్క పిక్క క్రింద పాదానికి ఐదు ఐదుగా వున్న వేళ్లే ఆ బాణాలు అంటారు. అయితే మన్మథుడు ఉపయోగించేది ఐదే బాణాలు గదా అంటే – సామాన్యుల మీదకు ఐదు బాణాలు చాలు గాని అసామాన్యుడైన శంకరుని జయించాలంటే – రెట్టింపు బాణాలుండాలని – పది బాణాలను రెండు అమ్ముల పొదుల్లో 5, 5 చొప్పున పెట్టుకుని శంకరునిపై యుద్ధానికి వెళ్ళాడు అంటారు. అయితే బాణాలకు చివర సానబెట్టబడిన ములుకులు వుండాలి గదా అంటే – వేళ్ళ గోళ్ళుచూడండి – సకల దేవతా మూర్తులు అమ్మవారికి శిరస్సు వంచి నమస్కరించినపుడు వారి కిరీటాలకు వున్న రత్నాలచేత అమ్మవారి గోళ్ళు బాగా సానబెట్ట బడ్డాయి అంటారు. శంకరులను ఇంకేం ప్రశ్నిస్తాము?

పిక్కలు బాగా లావుగా వుంటే మధుమేహ వ్యాధి(Sugar Complaint) రావచ్చును. మరీ సన్నంగా, పొడవుగా వుంటే ఎక్కువ దూరం నడవగలుగుతారు.

'మాణిక్య కిరీటాకారాన్ని పోలిన మోకాలి చిప్పలు కలిగినది' అని ఈ నామానికి అర్థం.

## 42. గూఢగుల్ఫా

ఇది 4 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''గూఢ గుల్ఫాయై నమః'' అని చెప్పాలి.

గూఢ = నిండైన; గుల్ఫా = చీలమండలు గలది.

'గూఢగుల్ఫా' అంటే ఇంపైన చీలమండలు గలది అని అర్థం. అయితే 'గూఢ' అంటే = రహస్యమైన అనే అర్థం గూడా వుంది. (ఉదా : గూఢచారులు) ఈ రెండో అర్థాన్ని బట్టి అమ్మవారి చీలమండలు 'రహస్యంగా' అంటే కనబడకుండా వుంటాయి అని అర్థం. అయితే కనబడకుండా ఎలా వుంటాయి ? అమ్మవారు పద్మాసన స్థితిలో కూర్చుని వుంటుంది గదా! అలాంటప్పుడు ఈ చీల మండలు కనబడవు. అయితే ఒక కాలు పీఠం మీద వుంచి, రెండోకాలు పద్మాసన స్థితిలో లాగా మడిచి వున్నప్పుడు ? – 'అప్పుడు గూడా అమ్మవారి చీర అంచు పూర్తిగా చీల మండలను కప్పే విధంగానే వుంటుంది కాని చీలమండలపైకి వుండదు'. అని ఈ 'రహస్య' అర్థాన్ని బట్టి అర్థం చేసుకోవాలి. కుల స్త్రీలు గూడా – చీర కట్టుకున్నప్పుడు గాని, కూర్చున్నప్పుడు గాని – ఈ విషయాన్ని గుర్తు పెట్టుకోవాలనే సూచన గూడా ఈ నామంలో వుంది.

'నిండైన, అందమైన' నిగూఢంగా వుండే చీలమండలు గలది' అని ఈ నామానికి అర్థం

## 43. కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా

ఇది 12 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితాయైనమః'' అని చెప్పాలి. అంతేగాని 'కూర్మపృష్ఠా' అని విడదీయకూడదు. అలా ఆ నాలుగు అక్షరాలు విడదీస్తే అమ్మవారిని తాబేలు వీపుతో పోల్చినట్లౌతుంది. తస్మాత్ జాగ్రత!

కూర్మ = తాబేలు యొక్క, పృష్ఠ = ఉపరితలం అనగా వీపు భాగపు నునుపును; జయిష్ణు = గెలుచు స్వభావము గల; ప్రపద = పాదాగ్రములు (పారాణి పెట్టే పాదాల ఉపరితల భాగాలు), అన్వితా = కూడినది లేదా కలిగినది.

(నీటి) తాబేలు యొక్క పృష్ఠభాగము అనగా పై డిప్ప ఎత్తుగాను, నునుపు గాను వుంటుంది. గాబట్టి సాధారణంగా స్త్రీలముంగాళ్ళను తాబేలు వీపు భాగాలతో పోలుస్తారు. ఆ పృష్ఠ భాగం చాలా గట్టిగా దృఢంగా వుంటుంది. కాని – అమ్మవారి ముంగాళ్ళు అంత

గట్టిగా వుండవు. చిగురుటాకుల మెత్తదనం వాటి కుంటుంది. నునుపుదనం, ఉబ్బెత్తుతనం ఈ రెంటిలోను తాబేలు పృష్ఠ భాగాలు అమ్మవారి ముంగాళ్ళను పోల్చడానికి సరిపోతాయి గాని, మెత్తదనం విషయంలో అమ్మవారి ముంగాళ్లే జయిస్తాయి. అందుకనే 'తాబేలు పృష్ఠభాగమును జయించు స్వభావము గల పాదాగ్రాలు (మీగాళ్ళు) గలది' అని ఈ నామంలో చెప్పారు.

ఈ నామంలోని 'ప్రపద' పదానికి ఇంకో అర్థం గూడా నిగూఢంగా వుంది. 'పదము' – అంటే 'పాదము' అనే అర్థమే గాక 'మాట'(Word) అనే అర్థం గూడా వుంది. 'ప్ర' అనేది ఉపసర్గ కాబట్టి ''ప్రపదములు' అనే పదానికి ''ప్రశస్తమైన పదములు'' లేదా ''ప్రధానమైన లేదా ప్రారంభ పదములు లేదా '' ప్రశస్తమైన వాక్యాలు'' అని చెప్పుకోవచ్చును. ఆ వాక్యాలే నాలుగు వేదాలకు సంబంధించిన నాలుగు మహా వాక్యాలు (అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, ప్రజ్ఞానం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ). అంటే 'ఈ మహావాక్యాలు అమ్మవారి పాదాలను ప్రస్తుతించే – వేదాలకు చెందినవే' అని అర్థం.

మందర పర్వతం లాంటిదాన్ని క్షీర సముద్రంలో దిగబడి పోకుండా పైకి ఉద్ధరించగలిగింది లోగడ కూర్మపృష్ఠం (కూర్మావతారం). మరి, అలాంటి కూర్మ పృష్ఠాన్ని గూడా జయించ గల ప్రపదములు గలది, అంటే – మందర పర్వత మంత భౌతికత కలిగి, సంసార సముద్రంలో దిగబడి పోయే వారిని గూడా ఉద్ధరించి, మోక్షాన్ని ప్రసాదించగల గుణం అమ్మవారి పాదాగ్రాలకు ఉన్నది. ఆదికూర్మం – పూర్వం ఎప్పుడో, ఒకసారి, ఒక్క మందర పర్వతాన్నే ఉద్ధరించింది. కాని అమ్మవారు తన పాదాలను నమ్ముకున్న వారినందరినీ – ఎప్పుడైనా, ఎన్నిసార్లైనా, ఉద్ధరించి, మోక్షాన్ని ప్రసాదించగలదు. అందుకనే అమ్మవారి పాదాలు మహానిర్వాణ సౌభాగ్యదాయినులు. అంటే – 'మోక్ష ప్రదాలు' అని చక్కని ఆధ్యాత్మిక అర్థాన్ని గూడా ఈ నామానికి చెప్పుకోవచ్చును.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) తాబేలు పృష్ఠభాగములను జయించు పాదాగ్రములు గలది.

2) నాలుగు వేదములకు సంబంధించిన మహావాక్యములచే అన్వయింపబడిన పాదాగ్రములు గలది.

3) సంసార సముద్రములో మునుగు మందర పర్వతము వంటి భౌతిక తత్త్వ జీవులను గూడా - ఆది కూర్మమును మించి ఉద్ధరించి, మోక్షము నిచ్చు సామర్థ్యము గల ప్రముఖ పాదములు గలది. (మోక్షప్రదమైన అమ్మవారి పాదాలను సూచించే బీజాక్షరం - సౌః)

## 44 నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''నఖ దీధితి సంఛన్న నమజ్జన తమోగుణాయైనమః'' అని చెప్పాలి.

నఖ = గోళ్ళయొక్క, దీధితి = కాంతులచేత; సంఛన్న = చక్కగా కప్పి వేయబడిన; నమత్ = నమస్కరించుచున్న; జన = జనుల యొక్క; తమోగుణా = అజ్ఞానము గలది (ఈ అర్థాల వరుసను సరిగా అర్థం చేసుకోవాలి లేకపోతే - అమ్మవారు అజ్ఞానం గలది ఏమిటా' అని అనిపిస్తుంది.

''తనకు నమస్కరించే జనుల యొక్క 'అజ్ఞానము' అను చీకటిని కప్పి వేయగలిగిన లేదా పోగొట్టగలిగిన కాలిగోళ్ళ కాంతులు గలది'' అని పదాల క్రమాన్ని సరిగ్గా మార్చి అర్థం చేసుకుంటే పెడర్థాలు రావు.

అమ్మవారి పాదాలకు - కిరీటాలతో దేవతామూర్తులందరూ నమస్కరిస్తూ వున్నపుడు, వారికిరీటాల్లో పొదగబడిన వివిధ రత్నాలు అమ్మవారి పాదాలకు వుండే గోళ్ళకు తగిలి, ఆ గోళ్ళు సానబెట్టినట్లు అవుతాయి. సహజంగానే కాంతులు విరజిమ్మే అమ్మవారి కాలిగోళ్ళు - ఇప్పుడు మరింత ప్రకాశవంతంగా కాంతులు విరజిమ్ముతాయి. అలాంటి గోళ్ళు కలిగిన అమ్మవారి పాదాలకు శిరస్సు వంచి ప్రణమిల్లే వారికి - వారి అజ్ఞాన తిమిరాన్ని పటాపంచలు చేయగల ప్రజ్ఞాన కాంతులు అమ్మవారి పాదనఖాలకు వుండవా మరి !

అమ్మవారి పాదాలు షట్చక్రాలకు పైన వుండి, చక్రాలపై అనంతమైన అమృత కిరణాలవు వర్షిస్తాయి. అయితే ఆ కిరణాల్లో అగ్నికి సంబంధమైనవి 108, . సూర్యసంబంధమైనవి 116, చంద్ర సంబంధమైనవి 136, చొప్పున మొత్తం 360 కిరణాలు

మాత్రమే ఆ షట్చక్రాలు గ్రహిస్తాయి. ఈ 360 కిరణాలే సౌర సంవత్సరానికి రోజులు.

శంకరా చార్యులవారు సౌందర్యలహరిలో ఈ విషయాలు 1) ''సుధాధారాసారైః చరణ యుగ ళాంతర్విగళితైః....'' అనే శ్లోకంలోను ''క్షితౌ షట్పంచాశత్ .....'' అన్న శ్లోకంలోను వివరిస్తారు.

తనకు నమస్కరించు జనుల యొక్క 'అజ్ఞానము' అను చీకటిని పోగొట్టగల కాలి గోళ్ళ కాంతులు గలది – అని ఈ నామానికి అర్థం.

## 45. పద ద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''పద ద్వయ ప్రభా జాల పరాకృత సరోరుహాయైనమః'' అని చెప్పాలి.

పదద్వయ = పాదముల జంట యొక్క; ప్రభాజాల = కాంతి సముదాయముచేత; పరాకృత = తిరస్కరింపబడిన; సరోరుహా = పద్మములు గలది.

పద్మాల కాంతులను మించిన కాంతులు గల పాదములు గలది. అని ఈ నామానికి అర్థం.

పాదాలను సాధారణంగా పద్మాలతో పోలుస్తారు గాని అమ్మవారి పాదాల విషయంలో పోల్చడానికి పద్మాలు అంతగా సరిరావు. ఎందుకంటే – 1) పద్మాలు నీళ్ళల్లో ఉన్నప్పుడే – కాంతివంతంగా వుంటాయి. అమ్మవారి పాదాలు ఎక్కడైనా, ఎప్పుడైనా గూడా కాంతులు విరజిమ్ముతూనే వుంటాయి. 2) పద్మాలు చలికి, రాత్రికి ముడుచుకు పోతాయి. ఇంకా అలాంటప్పుడు ఆ పద్మాల నుండి ఆ సమయాల్లో కాంతులు ఎలా వస్తాయి ? కాని, అమ్మవారు పుట్టినిల్లు హిమవత్పర్వతం మీద – అంటే – మంచు కొండ మీద. అందుకే, పుట్టిన దగ్గఱ నుండీ గూడా చల్లదన ప్రభావం అమ్మవారి పాదాలపై వుండదు. మెట్టినిల్లు కైలాసం. అదీ అంతే ! అందుకని ఎంత చల్లగా వున్నా అమ్మవారి పాదపద్మాలు ముడుచుకుపోవు. పగలు, రాత్రి గూడా పాదాలు వికాసవంతంగానే వుంటాయి. 3) పద్మాల వికాసం కొన్ని రోజులు మాత్రమే, అటుపైన వాడిపోతాయి. కాని, అమ్మవారి పాదాలు సుస్థిరంగా, శాశ్వతంగా ప్రకాశవంతంగానే వుంటాయి. 4)

పద్మాలు సాధారణంగా తెలుపురంగులోను, ఎఱుపురంగులోను వుంటాయి. ఈ రెండు రంగులకు చిహ్నాలుగా అమ్మవారి రెండు పాదాలూ వుంటాయి. ఈ పాదాలు ఇటు పగటి పూట వేరాజుకు (సూర్యునికి), అటు రాత్రి పూట 'రేరాజుకు' (చంద్రునికి) గూడా ఆప్తులే - అంటే - బంధువులే - అంటే - కావలసినవే. [అమ్మవారు (సుషుమ్నా) సహజంగా మాత్రం అగ్నితత్త్వం]

''బ్రహ్మ విష్ణు మహేశాన వేద పూజితాంఘ్రుద్వయే'' అని వశిష్ఠుల వారంటారు. అంటే బ్రహ్మ విష్ణు మహేశ్వరుల చేత, వేదాల చేత పూజింపబడే పాదాలు గలది (అమ్మవారు) అని అర్థం. ఈ సహస్ర నామాల్లోనే -

''శ్రుతి సీమంత సిందూరీ కృత పాదాబ్జ ధూళికా'' అనే నామం గూడా ఇదే విషయాన్ని వెల్లడిస్తుంది.

ఈ నామానికి అర్థం ముందే చెప్పబడింది.

## 46 శింజానమణి మంజీర మండిత శ్రీపదాంబుజా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''సింజాన మణిమంజీర మండిత శ్రీ పదాంబుజాయైనమః'' అని చెప్పాలి.

సింజాన = ధ్వని చేయుచున్న; మణి మంజీర = మణులు గల అందెలచేత; మండిత = అలంకరింపబడిన, శ్రీ = శోభగల; పదాంబుజా = పద్మముల వంటి పాదములు గలది.

అమ్మవారి మస్తకం నుండి పాదాల వరకు వుండే అన్ని అవయవాలు సౌందర్యవంతమే కాదు, చైతన్య వంతం గూడా! పద్మాల లాగా అందమైనవి మాత్రమే కాక అమ్మవారి పాదాలు మణి మంజీర మండితాలు. అంటే - మణులు పొదిగిన అందెలతో అలంకరింపబడి వుంటాయి. ఈ అందెలు మళ్ళీ చిఱు గజ్జెలను గూడా కలిగి వుంటాయి. అందువలన అమ్మవారి పాదం ఏ మాత్రం కదిలినా శ్రవణానంద కరంగా వుంటుంది. భక్తుల కోర్కెలను మించి ఫలాలను ఇవ్వగలిగిన సామర్థ్యం అమ్మవారి పాదాలకు వుంటుందని శంకరులు సౌందర్యలహరిలో ''శరణ్యేలోకానాం తవహిచరణావేవనిపుణౌ'' అన్నారు 'ఇటువంటి పాదాలకు పూజ చేస్తే పూజనీయులైన అందరికీ పూజ జరిగినట్లే

అవుతుంది'. ఎందుకంటే ఆ పూజనీయులందరూ శిరస్సులు వంచి అమ్మవారు పాదం ఆన్చిన పీఠం చుట్టూ ఎప్పుడూ మ్రొక్కుతూ వుంటారు కాబట్టి.

ఈ నామంలోని 'శ్రీ పదాంబుజా' అనే సమాసం అమ్మవారి రెండు పాదాలను సూచిస్తుంది. ఈ సమాసాన్ని ' శ్రీపద + అంబుజా' అని రెండు పదాలుగా విడదీస్తే అప్పుడు – ఈ పదాలలోని మొదటి పదం 'శ్రీపద' రెండో పదం 'అంబుజా' అవుతాయి. ఇవే అమ్మవారి రెండు పాదాలు. ఈ రెండూ 'ముక్తిని, భుక్తిని' ప్రసాదించేవిగా కూడా గ్రహించవచ్చును. ఈ నామం – 'శింజాన మణి మంజీర' అంటే 'శ్రావ్యమైన, 'శ్రీ' – అంటే 'శుభకరమైన' 'పద – అంటే మాటలు గలది' అనే అర్థాన్ని కూడా సూచిస్తుంది. (మహాపాదుకా మంత్రాలకు రూపాలే ఈ పదాలు) 'శ్రీపద' అంటే – 'శ్రీదేవి' ని, 'అంబుజా' అంటే నీటి నుండి పుట్టేది (అద్భ్యఃపృథివీ– తైత్తిరియం) అంటే 'భూదేవి' ని సూచిస్తాయి. ఇవే 'శ్రీదేవి', 'భూదేవి' అని అర్థం చేసుకోవాలి.

ఇంకా – ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చు.

1) చిరుసవ్వడి చేసే అందమైన మణి మంజీరాలతో అలంకరింపబడిన పాదములు గలది.
2) ముక్తిని, భుక్తిని, ప్రసాదించే పాదాలు గలది.
3) శ్రావ్యమైన, శుభకరమైన పద ధ్వనులు (పాదుకా మంత్ర పదములు) గలది.
4) శ్రీదేవిని, భూదేవిని తన పాదాలుగా గలది. కాబట్టి – భాగ్యలక్ష్మిని, రాజ్యలక్ష్మిని ప్రసాదించే పాదాలు గలది.

## 47. మరాళీమందగమనా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''మరాళీమందగమనాయైనమః'' అని చెప్పాలి. 'మరాళీ' అని 'మందగమనా' అని విడదీసి చెప్పకూడదు. అలా విడదీస్తే అమ్మవారిని 'ఆడహంస' తోను 'మందగమనం' తోను పోల్చినట్లుఔతుంది.

అమ్మవారి నడకలో హడావుడి, తత్తరపాటు వుండవు. పక్షులన్నిటిలో ఉత్తమజాతి లక్షణాలు కలవి హంసలు. ఆ హంసల నడక గూడా ఠీవిగా నిదానంగా వుంటుందిట! అందులోను, ఆడు హంసల నడక మరింత శోభాయమానంగా వుంటుందిట! స్త్రీలకు ఆడుహంసలు నడకలు ఉండడం ఉత్తమజాతి స్త్రీ సాముద్రిక లక్షణం. మందగమనమే మగువలకు మర్యాదాలంకారం.

కుండలినీ శక్తి యొక్క సుషుమ్నా మార్గ ఊర్ధ్వ గమనం – నిదానంగానే ఉండడం – ఉత్తమ ఉపాసనా లక్షణం. 'ఏదో తక్కువ కాలంలోనే కుండలినీ శక్తిని సహస్రారంలోని శివునితో కలిపి ముక్తిని సాధిద్దాం' అనే తొందర స్వభావం ఉండకూడదు. ఈ లక్షణం వ్యాపార లక్షణం అవుతుంది గాని, ముముక్షు లక్షణం కాదు.

శ్వాసలోని 'సో' 'హం' అనే అక్షరాలనే ''హంస'' అనే పక్షితో సంకేతిస్తారు. అయితే శ్వాసలోని 'ఉచ్ఛ్వాస నిశ్వాసా' లను సంకేతించే హంసలు రెండూ ఆడ హంసలే (మరాళీ) శ్వాసల లెక్కల మీద జీవితాయుర్దాయం ఆధారపడి వుంటుంది. త్వరితగతిలో శ్వాసప్రక్రియ వుంటే – ఆయుర్దాయ కాలం తగ్గిపోతుంది. కాబట్టి, ఈ 'శ్వాస' అనే – 'హంస గమనం' నిదానంగానే జరగాలని ఈ నామం సూచిస్తుంది. యోగంలో 'ప్రాణాయామ' ప్రక్రియ గూడా అందుకే!

ఉద్రేక, ఉల్లాస, ఉత్తేజ సమయాల్లో మనకు తెలియకుండానే ఈ హంస గమనం – వేగం అందుకొంటుంది. కాబట్టి, అనవసరంగా ఉద్రేకపడకుండా, మితిమీరిన ఉత్తేజ ఉల్లాసాలతో శ్వాసగతిని పరుగు లెత్తించకుండా చూచుకోండని గూడా ఈ నామం సూచిస్తుంది.

'ఆస్త్మా' వ్యాధితో బాధపడేవారు 'మరాళీమందగమనాయై నమః' అని జపిస్తే ఉపశమనం పొందవచ్చును.

1. ఆడహంసనడకలవలె నుండు నిదానమైన నడక గలది.
2. ఆడహంస నడకవలెనుండు నిదానమైన శ్వాస ద్వారా లక్ష్యమును చేర్చగలది.
3. ఆడహంస నడకవలె ఉండు నిదానమైన శ్వాస ప్రక్రియ ద్వారా ఆయుర్దాయమును పెంచునది – అనే అర్థాలను ఈ నామానికి గ్రహించవచ్చును.

# 48. మహాలావణ్యశేవధిః

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''మహాలావణ్యశేవధయేనమః'' అని చెప్పాలి.

ఈ నామాంతంలో గల 'శేవధి' అనే పదం పుంలింగపదం. స్త్రీలింగ పదమైతే 'శేవధ్యైనమః' అనాలి గాని పుంలింగపదం కాబట్టి 'శేవధయేనమః' అనే చెప్పాలి.

'మహాలావణ్యశేవధిః' అనేది షష్ఠీ తత్పురుష సమాసం. తత్పురుష సమాసాల్లో ఉత్తర పదాన్ని బట్టే లింగం నిర్ణయించాలి. ఈ సమాసంలో ఉత్తర పదం – శేవధిః – ఇది పుంలింగం గాబట్టి 'మహాలావణ్య శేవధయే నమః' అనే చెప్పాలి.

మహాలావణ్య = అతిశయించిన అందమునకు, శేవధిః = గని లేదా నిధి

అమ్మవారు చైతన్యంతో కూడిన అద్భుతమైన సౌందర్యనిధి. నిండివున్న దానిని – 'నిధి' అంటారు. జగత్తు అంతటా నిండి వుంది కాబట్టి అమ్మవారు నిధి. జగత్తులో ఎక్కడో ఒక చోటే అమ్మవారు కనబడదు. అంతా ఆమెలోనే వుంది. వస్తువుల ద్వారా వ్యక్తుల ద్వారా ఆమెలో ఒక ఆకారం, పరిధులు, పరిమాణాలు ఏర్పడుతున్నాయి గాని ఇవేవీ లేకపోతే అంతా ఆవిడే! అందుకని ఆమె నిధి. అయితే మామూలు నిధి కాదు, సౌందర్య నిధి, లావణ్య నిధి.

(ఒక శిలలో కృష్ణుని విగ్రహం చెక్కినపుడు ''శిల్పి ఎంత బాగా కృష్ణుని విగ్రహం చెక్కాడు'' అనడం – కంటె ''శిలలో అంతకు పూర్వమే కృష్ణుడున్నాడు. శిల్పి చేసిందల్లా – అనవసరమైన శిలాభాగాన్ని నేర్పుగా తొలగించాడు.'' అనడమే సబబు. అలా చెక్కినపుడు కృష్ణుని రూపంగా అమ్మవారు ఆ శిలలోంచి వ్యక్తమౌతుంది. రాముడి విగ్రహం చెక్కితే రాముని రూపంగా వ్యక్తమౌతుంది. ఇంకో విగ్రహం చెక్కితే ఇంకో విగ్రహంలాగా .... కాని, ప్రతి విగ్రహం చెక్కినప్పుడూ – అనవసరమనుకుని తొలగించిన శిలాభాగాలు ఇంకో విగ్రహం చెక్కుతున్నపుడు అవసరం అవచ్చు. అంతేగాని, 'ఆ శిలలో పనికి రానిభాగం కొంతవుంటుంది'. అనుకోవడం పొరపాటు. అలాంటి శిలలాంటిది అమ్మవారు. అన్ని రూపాలు, అన్ని విగ్రహాలు, వ్యక్తులు, పరిధులు, పరిమాణాలు

అమ్మవారే ! ఆమెలోంచే అన్నీ వేరు వేరుగా వ్యక్తమౌతున్నాయి. ఆమె మూల ప్రకృతి 'అదితి' అన్నా ఇదే అర్థం. ఇంకా భాగాలుగా వేరు చేయుబడని స్థితిలోని చపాతీల పిండిలాంటిది. ఈ చపాతీల పిండిని భాగాలుగా వేరు వేరుగా చేయునంతవరకు పిండిలోని ఏ భాగమైనా, ఏ చపాతీ అయినా కావచ్చు.)

పైథాగరస్ ఈ చోటు అనే అమ్మవారిని గూర్చి -

"Space is self concious; power of synthesis and symmetry is beauty. It is Dormant or subjective when there is no creation, but it is active or objective relative to the created entity" అంటాడు.

శిల్పానికి సౌందర్యమే గాని చైతన్యం వుండదు. చైతన్యంతో కూడిన సౌందర్యమే లావణ్యాన్ని సూచిస్తుంది. సందర్భాన్ని బట్టి వ్యక్తులకు ఒక విశేషం వస్తుంది. ఈ సందర్భాలు - వయస్సు, చేతనత్వము అయితే - ఆ వ్యక్తిలో వచ్చేది లావణ్యం. అమ్మవారు కేవలం సౌందర్యరాశియే కాదు లావణ్య నిధి గూడా! ఎంత అందాలరాశి అయినా చలించని అందం ఫలించదు. ఈ చలించే అందంతో ప్రపంచమంతా ఆమె నిండి వుంటుంది. ఆమె అరుణారుణ కాంతి కిరణాలే ప్రపంచం అంతా నిండి, వివిధ రూపాలుగా వ్యక్తమౌతాయి. అలాంటి చైతన్య, సౌందర్య, సౌకుమార్య, సౌజన్య, లావణ్యనిధి ఆమె.

'అతిశయించిన అందానికి గని (లేదా నిధి) వంటిది' అని ఈ నామానికి అర్థం.

## 49 సర్వారుణా

ఇది 4 అక్షరాల నామం. అమ్మవారికి ఈ నామంతో నమస్కరించునపుడు ''సర్వారుణాయైనమః'' అని చెప్పాలి.

సర్వ + అరుణా = సర్వారుణా = సర్వము అరుణ వర్ణంగా భాసించునది.

అమ్మవారి పాదపద్మాల నుండి వెలువడే కిరణ పుంజంలోనే ప్రపంచం అంతా నిండి వుంటుంది. ఆమె శరీరచ్ఛాయ - ఎఱుపు, ధరించే ఆభరణాలు - ఎఱుపు, దంతాల చిగుళ్ళు - ఎఱుపు, కట్టిన వస్త్రం - ఎఱుపు, పెదవులు - ఎఱుపు ఇలా, సర్వం

అరుణమయం (సరస్వతీ దేవి అయితే – సర్వం శుక్లవర్ణం). ఆమె సాన్నిధ్య ప్రకాశం – సహస్ర సూర్యోదయాల సమన్వయం. ఆమె హిరణ్య వర్ణ. సర్వము అరుణమవడం వలన ఆమె ''సర్వారుణ''. ఇలా వుండడం ఆమె నిష్పక్షపాత అనురాగ ప్రభకు నిదర్శనం. అరుణ వర్ణం చైతన్యాన్ని, అనురాగాన్ని, జ్ఞానోదయాన్ని సూచిస్తుంది. అమ్మవారు ఈ లక్షణాలు వున్నది కాబట్టి 'సర్వారుణ'

1) సర్వమూ అరుణ వర్ణంగా భాసించునది.

2) అనురాగపు ముద్ద

3) చైతన్య రాశి – అని ఈ నామానికి అర్థాలుగా చెప్పుకోవచ్చును.

## 50 అనవద్యాంగీ

ఇది 5 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''అనవద్యాంగ్యైనమః'' అని చెప్పాలి.

అనవద్య + అంగీ = నిందింపబడని, అనగా – వంక పెట్టుటకు వీలులేని అవయువములు గలది.

49వనామం 'సర్వారుణా' ఈ నామం 'అనవద్యాంగీ'తో కలిసినపుడు సవర్ణదీర్ఘసంధి వలన ''సర్వారుణానవద్యాంగీ'' అయి మొత్తం 8 అక్షరాలుగా అనిపిస్తుంది. కాని విడదీస్తే 4, 5 అక్షరాల చొప్పున ఈ రెండు నామాలు విడివిడిగా వుంటాయి.

అమ్మవారి సర్వఅవయువాలు సాముద్రిక శాస్త్రంలో చెప్పిన రీతిలోనే సులక్షణంగా, వంక పెట్టడానికి వీల్లేకుండా వుంటాయి. 'అమ్మవారి అవయువాల అమరిక, పొందికలను ప్రమాణంగా తీసుకునే – సాముద్రిక శాస్త్రం వ్రాయబడింది' అని చెప్పుకోడం ఎక్కువ సత్యం.

'వంకపెట్టుటకు వీలులేని అవయువములు గలది' అని ఈ నామానికి అర్థం.

## 51. సర్వాభరణ భూషితా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''సర్వాభరణ భూషితాయైనమః'' అని చెప్పాలి.

సర్వ = సమస్తమైన; ఆభరణ = నగలచేత; భూషితా = అలంకరింపబడినది.

శిరస్సు మీద పెట్టుకునే చూడామణి మొదలు కాలివ్రేళ్ళకు పెట్టుకునే మట్టెల వరకు సమస్తమైన ఆభరణాల చేత అమ్మవారు అలంకరింపబడి వుంటుంది. ఇవన్నీ సౌందర్యకరమైనవి, సౌభాగ్యకరమైనవి. ఒక్కొక్క ఆభరణానికి ఒక్కొక్క విశేషం, సంకేతం వుంటాయి.

ముత్యం – చంద్రునికి సంబంధించినది. ఇది చంద్రనాడి అయిన ఇడానాడిని సూచించేది.

పగడం – కుజగ్రహానికి సంబంధించినది. ఇది రక్తాన్ని, ఉష్ణాన్ని, ''అభయా''న్ని సూచిస్తుంది.

వజ్రం – శుక్రగ్రహానికి సంబంధించినది. ఇది ప్రకాశ వికాసాన్ని, ప్రమోద ప్రసారాన్ని ''వరద'' ముద్రను సూచిస్తుంది.

ఇలా ఎన్నెన్నో, విశేషాలు సంకేతాలు ఉంటాయి. ఈ ఆభరణాల్లో. అన్నిజాతుల వారు, అన్నిరీతుల వారు ధరించే ఆభరణాలన్నీ అమ్మవారికి ఆభరణాలే! అనగా వెలుగునిచ్చేవే! సర్వ జగత్తును ఆభరణంగా గలిగినది. జగత్తులో ఏ అందం చూసినా; ఆనందాన్ని కలిగించే – ఏ వ్యక్తిని, ఏ సన్నివేశాన్ని, ఏ వస్తువును చూసినా అవన్నీ ఆవిడ ఆభరణాలే!

ఈ నామానికి 1) సమస్తమైన ఆభరణముల చేత అలంకరింపబడినది. 2) సర్వజగత్తును ఆభరణముగా గలిగినది – అనే అర్థాలు చెప్పుకోవచ్చును.

## 52 శివకామేశ్వరాంకస్థా

ఇది 8 అక్షరాలనామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'శివ కామేశ్వరాంక స్థాయైనమః'' అని చెప్పాలి.

శివ = శివస్వరూపుడు; కామ = కామస్వరూపుడు అగు; ఈశ్వర = శంకరుని యొక్క; అంక = తొడయందు; స్థా = ఉన్నది.

ఈ నామానికి చాలా ప్రాముఖ్యం ఉంది. ఇది అమ్మవారి నివాస స్థలాన్ని గురించి చెప్పేనామం. ఈ నామంలో అయ్యవారైన ఈశ్వరునికి రెండు నామాలు చెప్పబడ్డాయి. అవి – 1) శివుడు 2) కాముడు. శివుడు మంగళస్వరూపుడు, శుభకరుడు. కాముడు – కామస్వరూపుడు. ఈశ్వరుని – ఈ రెండు రకాల నామాలకు అంతరార్థాలు వున్నాయి. శివకామేశ్వరుని తొడమీద అమ్మవారి నివాసమట ! సౌందర్యలహరిలో శంకరాచార్యుల వారు ''సుధాసిందోర్మధ్యే .... పరమ శివ పర్యంక నిలయాం .. చిదానందలహరీ'' అనే 8వ శ్లోకంలో గూడా అమ్మవారి చిరునామా (Address) లేదా నివాసం గూర్చి చెప్తూ ''పరమశివ పర్యంక నివాసిని'' గా వర్ణించి చెప్పారు (నేను వ్రాసిన సౌందర్యలహరి వ్యాఖ్యానం చదివితే ఈ శ్లోకానికి పూర్తి వివరణ తెలుస్తుంది (గ్రంథకర్త)

శివునికి తల్లి దండ్రులు లేరు. ఎప్పుడు, ఎక్కడ పుట్టాడో తెలియదు. అందుకే ఆయన ప్రపంచానికే ప్రథముడు (Absolute Origin) ఈ శివుని నుండియే అమ్మవారు అను – భౌతిక ప్రపంచం వ్యక్తమైంది. సంఖ్యాత్మకంగాను(Numerical), ప్రాదేశాత్మకం గాను (Spatial) గూడా అమ్మవారు ఈ శివునినుండియే విశ్వముగా విస్తరిల్లింది.

సంఖ్యాత్మక విస్తరణ -

ప్రపంచానికే ప్రథముడు కాబట్టి 'శివుడు' అనే పదం అంకెలలో మొదటిదైన 1 (ఒకటి)ని సూచిస్తుంది. 'అంకము' అంటే 'అంకె' అని అర్థం. అంకెలలో పరిపూర్ణమైనది 9 (తొమ్మిది) (అంకె అంటే Digit, సంఖ్య అంటే Number; సంఖ్యలు తొమ్మిది కన్నా పెద్దవి ఉండవచ్చును కాని అంకెలలో పెద్దది తొమ్మిది మాత్రమే అవుతుంది)

''సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి ...... '' అని తైత్తిరీయోపనిషత్తు చెబుతుంది. దీని అర్థం ఏమిటంటే – ఒంటి గింటి రామలింగం లాగా వున్న శివునికి ఎక్కువ మందిగా అవాలని కోరిక కలిగిందిట! అప్పుడు ఈ ప్రపంచం ఉద్భవించిందిట! ఈ కోరిక కలగని శివుణ్ణి –'0' (Zero)తోను, కోరిక కలిగిన క్షణంలో వున్న శివుణ్ణి'1' (one) తోను సంకేతించాలి. అన్ని రకాల జీవులతోను పూర్తి ప్రపంచంగా విచ్చుకొన బోయే

స్థితిలోని శివుణ్ణి – 'కోరిక పూర్తిగా నిండిన 'లేదా' కామము పూర్తిగా నిండిన ఈశ్వరుడు' అంటారు. ఈ 'కామేశ్వరుణ్ణి – 9 నెలలు నిండి సృష్టిని ప్రసవించబోయే పూర్ణ గర్భిణిగా వూహించుకోవాలి. అందువల్లనే ఈ 'కామేశ్వరుడు' '9' అంకెను సూచిస్తాడు. అంటే 1 నుండి 9 వరకు జరిగే విస్తరణ వ్యక్త సృష్టికి సంబంధించినది గాను, '0' అవ్యక్త స్థితికి సంబంధించినది గాను సమన్వయం చేసుకోవాలి. ఇప్పుడు 'శివకామేశ్వరాంకస్థా'' అన్న నామానికి – ఒకటి నుండి తొమ్మిది వరకు జరిగే సంఖ్యాత్మక సృష్టిగా స్థాపింపబడినది''. అని అర్థం చెప్పుకోవాలి.

ప్రాదేశాత్మకంగా ....

విశ్వం వ్యక్తంకానప్పుడు, మొట్ట మొదటిగా ఒంటరిగా వున్న శివుడు – ఒక బిందువు (Point)ను సూచిస్తాడు. 'అంకము' అంటే ఉనికి 'మచ్చ' 'చోటు' అనే అర్థాలు గూడా వున్నాయి. కాబట్టి, 'శివుని అంకము' – అంటే 'బిందువు' అని అర్థం. ఇదే విధంగా 'కామేశ్వరుని అంకం' – అంటే పూర్తిగా విస్తరించిన బిందువు లేదా చోటు 'అనగా బ్రహ్మాండం' అని అర్థం. ఈ విధంగా 'శివుని అంకస్థితి' నుండి 'కామేశ్వరుని అంకస్థితి' వరకు అంటే 'బిందువు లేదా 'కేంద్ర పరిమాణం' నుండి 'బ్రహ్మాండ పరిమాణం' దాకా జరిగే ప్రాదేశాత్మక సృష్టిగా స్థాపింపబడినది' అనే అర్థం వస్తుంది. అంటే – 'ఈ విశాల విశ్వమంతా తన నిలయంగా గలది.' అని గూడా అర్థం వస్తుంది.

మన చిత్తం (మనస్సు)లో గూడా అత్యంత సూక్ష్మమైన బిందువు నుండి, ఊహించలేనంత విశ్వం గూడా ఇమడ గలదు. ఆ విధంగా 'అతిస్వల్పం నుండి అత్యధికం వరకు మన చిత్తంలో ఇమిడి, స్థాపింపబడేది' అనే అర్థం గూడా వస్తుంది.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) శివస్వరూపుడు, కామస్వరూపుడు అయిన ఈశ్వరుని యొక్క (ఎడమ) తొడ యందు తన నివాసము గలది.
2) 'ఒకటి' నుండి 'తొమ్మిది' వరకు జరిగే సంఖ్యాత్మక సృష్టిగా స్థాపించబడినది.
3) 'బిందు' పరిమాణంనుండి 'బ్రహ్మాండ' పరిమాణం' దాకా జరిగే ప్రాదేశాత్మక సృష్టిగా స్థాపింపబడినది.

4) 'అతిస్వల్పం' నుండి 'అత్యధికం' వరకు మన చిత్తంలో ఇమిడి స్థాపింపబడునది.

5) ఈ విశాల విశ్వమంతా తన నిలయంగా గలది.

## 53 శివా

ఇది 2 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''శివాయైనమః'' అని చెప్పాలి.

శివా = వ్యక్తమైన శివుని రూపము.

విశ్వం వ్యక్తం కాక పూర్వం ఒంటరిగా వున్న శివుడు' బహురూపాలుగా వ్యక్తమవుదాం' అనే కోరిక గలిగి, అలా ఉచ్చరిస్తే వచ్చింది – ఈ విశ్వం. ఇలా ఉచ్చరించక పూర్వం 'శివుడ'నే పేరుతో పిలువబడే శివుడే – ఉచ్చరించిన తరువాత 'శివా' అనే పేరుతో పిలవబడతాడు. ''నేను ఈ రెండు విధాలుగాను ఉంటాను'' అని అమ్మవారితో శివుడు చెప్తాడు'' (మహానిర్వాణ తంత్రం).

'శివా' అనే పదాన్ని 'శ్ + ఇ + వ్ + ఆ' గా విడదీసి వ్రాస్తే – మధ్యలో వున్న 'ఇ + వ్' = ఈవ్ (Eve)ను బైబిల్‌లో గూడా సృష్టికి మొదటి స్త్రీగా చెబుతారు.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. శివస్వరూపిణి
2. శుభగుణ స్వరూపిణి
3. ముక్తి స్వరూపిణి

## 54. స్వాధీన వల్లభా

ఇది 6 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''స్వాధీన వల్లభాయై నమః'' అని చెప్పాలి.

స్వ + అధీన = తనకులోబడిన; వల్లభా = భర్తగలది. ''స్వ'' అనేది ఆధీనమైన వల్లభుని గలది అని ఒక అర్థం. ''ఏంచేసినా – నాదేంలేదు అంతా మా ఆవిడే'' అంటాడు

పరమేశ్వరుడు. అందుకే ఆయన అమ్మవారికి స్వాధీన వల్లభుడు. పంచకృత్యాలను నిర్వహించే పరమేశ్వరిని – ఉదాసీనంగా, కేవలం ఒక సాక్షీమాత్రునిగా – చూసేవాడు పరమేశ్వరుడు అయినపుడు, ఆ పరమేశ్వరుడు స్వాధీనవల్లభుడు కాక మరేమౌతాడు.

పరమేశ్వరి ఆశించే వాటికి, ఆదరించేవాటికి, ఆదేశించే వాటికి, ఆశీర్వదించేవాటికి, అనుగ్రహించే వాటికి – ఎప్పుడూ అభ్యంతరం తెలిపిన వాడు కాడు పరమేశ్వరుడు. అందుకే – ఆయన స్వాధీనవల్లభుడు. 'An obedient Wife commands her husband' అంటే – 'విధేయురాలైన భార్య భర్తను ఆదేశించగలదు' అని అర్థం. ''పరమేశ్వరుడు పరమేశ్వరికి స్వాధీనుడు అవడానికి అసలైన రహస్యం ఇది'' అని అందరి స్త్రీలు పరమేశ్వరి నుండి తెలుసుకోవాలి. అప్పుడు వారికి గూడా భర్తలు స్వాధీనులౌతారు. అంటే – పరమేశ్వరిని ఆశ్రయించిన స్త్రీలకు భర్తలు స్వాధీనులౌతారు' అని అర్థం.

ఈ నామానికి ఈ అర్థాలు చెప్పుకోవచ్చును.

1. తనకులోబడిన భర్తగలది
2. ఇతర స్త్రీలకు కూడా వారి భర్తలను వారికి స్వాధీనము చేయునది.

## 55. సుమేరు శృంగమధ్యస్థా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'సుమేరు శృంగ మధ్య స్థాయై నమః' అని చెప్పాలి.

సుమేరు = మేరు పర్వతము యొక్క; శృంగ = శిఖరము యొక్క; మధ్యస్థా = మధ్యప్రదేశము నందు ఉన్నది.

మన వెన్నెముకను 'బ్రహ్మదండం' లేదా 'మేరుదండం' అని గూడా అంటారు. వెన్నెముకపై కొన మనకి 'మేరు శృంగం' అవుతుంది. భూగోళం యొక్క దక్షిణ ఉత్తర ధ్రువాలను కలిపే ధ్రువాక్షము (Polar Axis) భూగోళానికి మేరుదండం అవుతుంది. ఇది భూమి మీద జీవుల సామూహిక 'మేరువు' ను సూచిస్తుంది. అల్లాగే భూమిలాంటి ఇతర గ్రహాలకు గూడా వాటి వాటి మేరు దండాలు వాటి వాటికి వుంటాయి. ఈ గ్రహాలన్నిటికీ ఒక 'సామూహిక మేరు దండాన్ని' ఊహిస్తే – అది మనసూర్య కుటుంబానికి

మేరుదండం అవుతుంది. ఇదే విధంగా బ్రహ్మాండంలోని వివిధ సూర్య కుటుంబాలకు ఒక సామూహిక మేరు దండాన్ని ఊహిస్తే – అది బ్రహ్మాండానికంతటికీ మేరుదండం అవుతుంది. ఈ బ్రహ్మాండ మేరుదండాన్నే ''సుమేరువు'' అంటారు. ఈ సుమేరువు యొక్క ఉత్తరపు కొన కేంద్రాన్ని – బ్రహ్మాండంలో అమ్మవారి స్థానంగా సమన్వయ పరచుకోవాలి.

చీకటి వున్న రాత్రి పూట ఆకాశంలో మనం చూసే 'పాలపుంత' ను(Milky Way) బ్రహ్మాండం యొక్క అక్షం (Axis) గా అర్థం చేసుకోవాలి. మనలో వుండే వెన్నెముక లాగానే ఈ పాలపుంత గూడా ఆకాశంలో ఉత్తర దక్షిణ దిశలవైపుగా విస్తరించి వుంటుంది. దీని ఉత్తర దిశవైపు కొన బ్రహ్మాండ మేరువుకు 'శిఖరం' లేదా 'శృంగం' అవుతుంది. (వెన్నెముకను ఆధారంగా చేసుకొని జీవి దేహము ఏర్పాటయే విధంగానే – ఈ పాలపుంతను ఆధారంగా చేసుకుని బ్రహ్మాండం ఏర్పడుతుందని ఊహించుకోవాలి. (బ్రహ్మాండంలోని ఈ పాలపుంతనే పురాణాల్లో క్షీర సముద్రంగా సంకేతిస్తారు).

మన వెన్నెముకలో వుండే సుషుమ్నామార్గం పైకొనవద్ద సహస్రార కమలం వుంటుంది. ఈ సహస్రారకమల మధ్యస్థానమే మనలోని సుమేరు శృంగ మధ్యస్థానం. ''మేరు'' అనే పదంలో 'మ్ + అ + ఇ + ర్ + ఉ' అనే ఐదు అక్షరాలు ఉన్నాయి. వీటిని 5 శృంగాలుగా భావిస్తే మధ్య అక్షరం ''ఇ'' సూచించే శృంగ మధ్యస్థానంలో అమ్మవారుంటుంది.

శ్రీ చక్రంలోని బిందువే మేరుశృంగం. ఇక్కడ వుండే త్రిభుజంలో తూర్పుకోణం వద్ద ఇచ్ఛాశక్తి, నైఋతి కోణం వద్ద క్రియాశక్తి, వాయవ్య కోణం వద్ద జ్ఞానశక్తి ఉంటాయి. ఈ మూడింటి మధ్య బిందుస్థానమే మేరు శృంగం. ఇక్కడే పరమశివుని అంకస్థానంలో అంటే ఎడమ తొడ మీద పరమేశ్వరి వుంటుంది.

సుమేరులోని ఐదు వర్ణాల్లో అటూ, ఇటూ వుండే నాలుగు వర్ణాలూ నాలుగు వాక్ స్థితులను (పరా, పశ్యంతీ, మధ్యమా,వైఖరీ) సూచిస్తే – మధ్య వున్న 'ఇ' – అమ్మవారి నాద రూపాన్ని సూచిస్తుంది.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. మేరు పర్వత శృంగ మధ్య స్థానంలో ఉన్నది.
2. శ్రీ చక్రంలోని బిందు స్థానంలో ఉండునది.
3. పాలపుంత ఉత్తర కొనవద్ద వుండునది.
4. సహస్రార కమల మధ్య స్థానంలో ఉండునది.

ఈ 'సుమేరు శృంగమధ్యస్థా' అనే నామం నుండి 'సుధాసాగర మధ్యస్థా' అనే నామం దాకా మనలో అమ్మవారి నివాసం చెప్పబడుతుంది.

## 56 శ్రీమన్నగరనాయికా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు "శ్రీమన్నగరనాయికాయైనమః" అని చెప్పాలి.

శ్రీమత్ = శుభప్రదమైన ఐశ్వర్యములతో కూడిన, నగరనాయికా = నగరమునకు అదిష్ఠాత్రి, అనగా – ప్రభువురాలు.

శ్రీ చక్రమే శ్రీమన్నగరం. పూర్వ నామములో చెప్పిన సుమేరువు ఉత్తర కొన వద్ద ఉండే సుధాసాగరము నందలి మణిద్వీపంలో వుండే నగరమే శ్రీమన్నగరం. ఇది దేవశిల్పి మయునిచే నిర్మింపబడిన నగరం. దీన్నే 'శ్రీవిద్యానగరం' అంటారు. ఇదియే బ్రహ్మవిద్యానగరం. విశ్వ ప్రణాళికను ఇక్కడ నుండే అమ్మవారు ఆదేశాలు ఇస్తూ, నిర్వహిస్తుంది. వ్యక్తిలోని శ్రీచక్రం వున్న స్థానం నుండే ఆ వ్యక్తికి సంబంధించిన కార్యకలాపాలకు – ఆజ్ఞలు, సంకల్పాలు కలిగి – ఆదేశాలు, ఆజ్ఞలు ఇవ్వబడతాయి. అంటే Head Quarters లాంటి దన్నమాట ! సంస్థలలోను, ప్రభుత్వంలోను ప్రధాన నిర్వహణాధికారి Supreme Head కూర్చునే చోటన్న మాట! (శ్రీనగర వర్ణనను ఇక్కడ వివరించుట లేదు)

'శుభప్రదమైన ఐశ్వర్యములతో కూడిన నగరమునకు అధిష్ఠాత్రి' అని ఈ నామానికి అర్థం.

# 57 చింతామణి గృహాంతఃస్థా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''చింతామణి గృహాంతఃస్థాయై నమః'' అని చెప్పాలి.

పూర్వనామంలో తెలిపిన నగరంలోని మణిద్వీపంలో చింతామణి గృహంలో అమ్మవారు ఉంటుంది.

చింతామణి = చింతామణుల చేత నిర్మింపబడిన, గృహ + అంతః + స్థా = గృహము యొక్క లోపల వున్నది.

'మణి' అంటే 'రత్నం' అని అర్థం. 'రత్నం' అంటే స్వయం ప్రకాశ, ప్రసార, ప్రచోదన లక్షణాలు (Self or Auto radiating, communicating and stimulating characterstic) కలది. ఈ మణుల లక్షణం మనలో అంతః స్ఫురణాన్ని, మేధాశక్తిని తేజస్సును సూచిస్తుంది.

చింతామణిలో 'చింతా' అంటే – 'ఒక విషయాన్ని గురించి మనస్సును అమితంగా ఆలోచింప చేసే ప్రక్రియ' (The Process of making the mind thinking about a thing immensely) అని చెప్పుకోవచ్చును. కోరినవి ఇచ్చే గుణం కలిగినవే చింతామణులు. అమ్మవారు చింతామణులు అనే ఇటుకలతో కట్టిన ఇంటి లోపల వుంటుందిట! అమ్మవారు ఉండే ఇంటి ఇటుకలకే దాన గుణం అంతగా వుంటే – ఆ ఇంటి ఇల్లాలైన అమ్మవారు ఎల్లాంటి అనుగ్రహం కలదై వుంటుందో ఊహించుకోవచ్చు. అంటే – ఆమె దాతృత్వ గుణం ఆమె ఇంటి గోడలకు గూడా అబ్బిందన్న మాట! ప్రతి వ్యక్తిలోని దాతృత్వ గుణాన్ని ఈ చింతామణులు సూచిస్తాయి. అసలు చింతామణులకు ఆ దానగుణం అమ్మవారు తమ మధ్య ఉండడం వల్లనే వచ్చి వుండాలి.

ఒక చింతామణి వుంటేనే అది ఎన్నో కోరికలను తీరుస్తుంది. మరి, ఇలాంటి ఎన్నో చింతామణులతో కట్టిన గృహం అయితే ఆ ఇంటికి 'ప్రదాన గుణం' ఎంత వుంటుందో ఊహించలేము. ఇలాంటి చింతామణి గృహంలో అమ్మవారుంటుందిట. మనలో ఈ గృహం సహస్రారంలో వుంటుంది. సుధాసాగరమే సహస్రారం. సుమేరు శృంగమే

సహస్రారం. ఈ సుధాసాగరంలోనే మణిద్వీపంలో చింతామణి గృహం వుంటుందన్న మాట! ఇవన్నీ సంకేతాలే !

(చింతామణితో కూడిన సంకల్పాన్ని – 'కల్పవృక్షం' అనీ, చింతామణితో కూడిన వాక్కును – 'కామధేనువు' అనీ అంటారు)

య, ర, ల, వ – అక్షరాలను 'అంతస్థములు' అంటారు. చింతామణీ మంత్రానికి – 'క్లీం' తో పాటు ఈ అంతఃస్థాలైన యం, రం, లం, వం గూడా కలుస్తాయి.

''చింతామణులచే నిర్మింపబడిన గృహములోపల నివసించునది'' అని ఈ నామానికి అర్థం.

## 58 పంచబ్రహ్మాసనస్థితా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''పంచ బ్రహ్మాసన స్థితాయై నమః'' అని చెప్పాలి.

పంచ = ఐదుగురు, బ్రహ్మ = బ్రహ్మలచే (నిర్మింపబడిన), ఆసన =(మంచం వంటి) ఆసనము నందు, స్థితా = ఉన్నది.

బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు ఐదుగురినీ 'పంచబ్రహ్మలు' అంటారు. వీళ్ళల్లో మొదటి నలుగురినీ నాలుగు కోళ్ళుగాను, సదాశివుణ్ణి పానుపుగాను ఒక మంచాన్ని వూహిస్తే – ఆ మంచం 'పంచ బ్రహ్మాసనం' ఔతుంది. ఈ మంచం మీద ఆశీనురాలై అమ్మవారు ఉంటుంది. సౌందర్యలహరిలో శంకరాచార్యుల వారు 'శివాకారే మంచే పరమశివ పర్యంక నిలయాం' అంటారు ('పరమశివుడు అంటే సదాశివుడని, 'పర్యంకం' అంటే ఒక అర్థంలో 'తల్పం' లేదా 'పానుపు', ఇంకో అర్థంలో ''తొడ'' అనీ అర్థం) అసలు ముందు ఈ 'మంచం', అంతరార్థం ఏమిటో చూద్దాం.

నాలుగు కోళ్ళ మంచము అనంగానే సహజంగా మనం ఎఱుగున్న మంచము(cot) లాగా వుంటుందనుకుంటాం. కాని, అలావుండదు. ఇది సంకేత భాష. కుండలినీ శక్తి – వెన్నెముక లోని 'సుషుమ్న' ద్వారా – ఊర్ధ్వగతిని పొందుతున్నపుడు – మూలాధార,

స్వాధిష్ఠానములకు సంబంధించిన ''బ్రహ్మగ్రంథిని'' (Brain of instincts, reflexes and desires), మణిపూర, అనాహత చక్రాలకు సంబంధించిన ''విష్ణుగ్రంథిని'' (Brain of affections and emotions), విశుద్ధి, ఆజ్ఞా చక్రాలకు సంబంధించిన ''రుద్రగ్రంథిని" (Brain of intellect and wisdom), లలాటానికి, శిరోమధ్య భాగానికి సంబంధించిన ఈశ్వర స్థానమును - అధిగమిస్తుంది. అంటే సుషుమ్నా మార్గంలో ఇవి మైలు రాళ్ళ వంటివి. (రైల్వే భాషలో రైల్వే స్టేషన్లవంటివి. ఆర్.టి.సి భాషలో స్టేజ్ ల్లాంటివి. ఆంగ్లంలో వీటిని (Cardinal points అనవచ్చును). ఈ నాల్గింటిని నాలుగు మంచపు కోళ్ళతో సూచించారన్నమాట ! ఇంక మనలో వుండే సహస్రార కమల స్థానంలో వుండే సదా శివుణ్ణి - మంచం తల్పంగా సూచించారన్నమాట.

ఈ పంచబ్రహ్మలు దిక్కుల పరంగా - తూర్పు, దక్షిణం, పడమర, ఉత్తరం ఊర్ధ్వ దిశలను సూచిస్తారు. పంచభూతాల పరంగా - పృథివి, ఆపస్, తేజస్సు, వాయువు, ఆకాశాలను సూచిస్తారు. హల్లుల్లో ఐదు వర్గాల ప్రథమాక్షరాలైన క, చ, ట, త, ప లను సూచిస్తారు. పంచ ప్రణవాలైన ''శ్రీం, హ్రీం, క్లీం, ఐం, సౌః'' లను గూడా సూచిస్తారు. ఇన్ని విధాలుగా అమ్మవారు 'పంచ బ్రహ్మాసనస్థితా' అవుతుంది.

'పంచబ్రహ్మలచే సూచింపబడే ఆసనమునందు ఉన్నది' - అని ఈ నామానికి అర్థం.

## 59 మహాపద్మాటవీసంస్థా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''మహాపద్మాటవీ సంస్థాయైనమః'' అని చెప్పాలి.

మహత్ = మహిమగల లేదా గొప్పవైన; పద్మ = పద్మములు గల, అటవీ = అడవియందు; సంస్థా = చక్కగా ఉన్నది.

సూర్యుని తేజస్సుకు పద్మాలు వికసిస్తాయి. శుక్రము యొక్క సూక్ష్మ స్థితిలో వుండే.ధాతువులనే - ఓజస్సు, సహస్సు, భ్రాజస్సు, తేజస్సులు - అంటారు. సుషుమ్నా మార్గం ద్వారా ఊర్ధ్వ గతిలో పోయే కుండలినీ శక్తి అంటే ఈ తేజస్సే ! సుషుమ్నా

మార్గం ద్వారా ఈ తేజస్సుపైకి పోతున్నపుడు - మార్గమధ్యంలో వుండే మూలాధారాది షట్చక్రాలను స్పృశిస్తూ, చివరకు సహస్రారం చేరుతుంది. అక్కడ నుండి అమ్మవారి పాదాల ద్వారా స్రవింపబడే అమృత ధారలు - సుషుమ్నా మార్గం ద్వారా క్రిందకు వస్తూ - షట్చక్రాలను స్పృశించి, తడుపుతాయి. అప్పుడు ఆ చక్రాలు పద్మాల్లాగా వికసనం చెందుతాయి. అందుకని షట్చక్రాలను 'షట్ పద్మాలని' గూడా అంటారు. వీటికి పైన వున్న సహస్రారాన్ని 'మహాపద్మం' అంటారు. ఈ మహాపద్మంతో కూడుకుని వున్న షట్ పద్మమార్గాన్ని 'మహా పద్మాటవీ' అంటారు. ఈ మహా పద్మాటవి లోనే ఎప్పుడూ - పైకి, క్రిందకు చరిస్తూ వుంటూ - సహస్రార పద్మంలో అయ్యవారితో కూడి, సుస్థిర ఆనందాన్ని చేకూరుస్తుంది గాబట్టి ''మహా పద్మాటవీ సంస్థా'' అనే నామం అమ్మవారికి సార్థకమైంది. సౌందర్యలహరిలోని ''తటిల్లేఖాతన్వీం ... ఆనందలహరీం'' అనే శ్లోకాన్ని ఇక్కడ సమన్వయం చేసుకోవాలి.

1) మహిమగల షట్చక్ర పద్మాటవి యందు ఉండునది.

2) మహా పద్మమైన సహస్రారము నందు ఉండునది.

అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## ౬౦ కదంబ వనవాసినీ

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''కదంబ వనవాసిన్యై నమః'' అని చెప్పాలి.

కదంబ = కడిమి చెట్ల యొక్క; వన = తోటయందు, వాసినీ = వసించునది (సంస్కృతంలో కడిమి చెట్టును 'నీప వృక్షం' అని అంటారు)

వర్షముతోను, మబ్బులతోను ప్రత్యేక సంబంధాన్ని కలిగి వుండేవి - చెంగల్వ, కడిమి, నెమలి. వీటిలో కడిమి చెట్లు ముఖ్యమైనవి. దివిని, భువిని వర్షధారలు కలుపుతాయి. ఈ వర్షధారలలోని ఆపస్సులు సృష్టికి దోహదపడతాయి. ఈ సత్సంధానాన్ని నిరంతరం కోరుకునేవి కడిమి చెట్లు. అందుచేతనే సృష్టిస్వరూపిణి అయిన అమ్మవారికి ఈ చెట్లు, ఈ చెట్లుగల ఉద్యానవనము ఇష్టము. ఈ కడిమి వృక్షాలతోట మధ్యలోనే ఇంతకు

పూర్వనామంలో చెప్పిన చింతామణి గృహం వుంటుంది. ఆ గృహంలోనే అమ్మవారు వుంటుంది. అందుకని ''కదంబవన వాసినీ'' అనే నామం అమ్మవారికి సార్ధకమైనది.

'కడిమి చెట్ల తోటలో వసించునది' అని ఈ నామానికి అర్థం.

## 61 సుధాసాగర మధ్యస్థా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''సుధాసాగర మధ్యస్థాయైనమః'' అని చెప్పాలి.

'సుధా' అనేపదానికి – 'వెన్నెల', 'అమృతం' – అనే అర్థాలే గాక చివరకు 'సున్నం' అనే అర్థం గూడా వుంది. ప్రస్తుతం 'అమృతం' అనే అర్థానికి సంబంధించిన మాటగానే తీసుకోవాలి. 'సాగరము' అంటే 'సముద్రము'. 'సముద్రము' అంటే 'ముద్ర' లను తన యందు కలిగినది. 'ముద్రలు' అంటే 'అచ్చులు' (Moulds) అని అర్థం. ప్రతి సృష్టికి అవసరమైన వాటి యొక్క మౌళికమైన అచ్చులను(Original Moulds) అన్నిటినీ 'మృతం' (వినాశము) కాకుండా, తనలో ఉంచగలుగునది కాబట్టి దీనిని 'అమృత సముద్రము' అంటారు. ('సాగర' పదాన్ని విడదీస్తే 'స + అగరం' అవుతుంది 'గరం' అంటే 'విషం' అని అర్థముంది. దీన్ని బట్టి 'అగరం' అంటే 'అమృతం' అనుకోవచ్చు.

'సు' అంటే చక్కగా 'ధా' అంటే ధారణ చేయునది – అనే అర్థాలను బట్టి 'సుధా' అంటే – ''చక్కగా గుర్తుంచుకొని తనయందు ధరించి, అవసరమైనపుడు వ్యక్తము చేయగలుగునది'' అనే అర్థం వస్తుంది. ఈ అర్థాన్ని బట్టే 'సుధా' అనే పదానికి పైన వివరించిన 'అమృతము' అనే అర్థం వచ్చింది.

సుధాసాగరాన్ని మధిస్తే దానిలో ఇంతకు పూర్వం వున్న వన్నీ బయటపడతాయి. (ద్రావణాన్ని వేడి చేస్తే – పునః స్ఫటికీకరణ జరిగి, ఆ ద్రావణంలో కరిగి వున్న పూర్వపు లవణాలన్నీ వేరు, వేరు దశల్లో స్ఫటికాలుగా వేరుపడినట్లన్న మాట! క్షీరసాగరాన్ని మథించినపుడు గూడా ఇలాగే ఒక్కొక్కటీ బయట పడ్డాయి గదా!) అందుకే సృష్టి జరిగే విధానాన్ని గుఱించి –

''తతః సముద్రోఅర్ణవః, సముద్రా దర్ణవా దధి!
సంవత్సరో అజాయత ! సూర్యా చంద్రమసౌధాతా,
యథాపూర్వమ కల్పయత్.''

అని 'మహానారాయణమ్'లో చెప్పబడింది. (పూర్వ కల్పంలో లాగానే ఈ కల్పంలో గూడా సంవత్సరము, సూర్యుడు, చంద్రుడు మొదలైనవన్నీ సముద్రంలోంచి బయటకు రాబట్ట బడ్డాయి' అని దీని భావం)

సాగరాన్నే 'సింధువు' అని గూడా అంటారు. అసంఖ్యామైన బిందువుల(Drops) చేరిక అనంతమైన 'సింధువు'ను రూపొందిస్తుంది, లేదా – అనంతమైన సింధువులో (Ocean) అసంఖ్యామైన బిందువులు ఉంటాయి. అందుకే సౌందర్యలహరిలో శంకరాచార్యుల వారు 'సుధాసాగర మధ్యంలో' అని అనకుండా 'సుధాసింధోర్మధ్యే' అని వ్రాశారు.

మనలో ఈ 'సుధా సింధువు' లేదా 'సుధాసాగరం' ఎక్కడ వుందో తెలుసుకోవాలి. మనం గుర్తు పెట్టుకోవలసిన సన్నివేశాలు, సంఘటనలు, వ్యక్తులు, వస్తువులు మొదలైనవన్నీ మన మెదడులో బిందురూప ముద్రలలో ఉంటాయి. ఈ బిందురూపముద్రల ఉత్పత్తి స్థానాన్ని ('Place of birth' or 'Source' or 'Origin') ''యోని'' అంటారు. ఈ 'యోని' గుఱించి తైత్తిరీయోపనిషత్తులో

''సేంద్రయోనిః, యత్రాసౌకేశాంతో వ్యపోహ్య శీర్షకపాలే'' అని చెప్పబడింది. మెదడులో ఈ 'యోని' ఉండే ప్రదేశాన్నే ''సుధాసముద్రము'' అని అనవచ్చును. ధారణ చేయవలసిన అనగా గుర్తు పెట్టుకోవలసిన విషయాలు, సన్నివేశాలు, సంఘటనలు, వ్యక్తులు మొదలైన వాటి వివరణాదులు అత్యంత సూక్ష్మ పరిమాణంలో ఈ యోని యందు వుంటాయి. [కంప్యూటర్‌లో (Random axis memory లాగా, మైక్రోఫిల్మ్ (Micro Film)లో వుండే విషయంలాగా అన్నమాట !] ఇవి విత్తనాల లాగా మెదడులో సూక్ష్మ స్థితిలో ఉండి, అవే తరువాత స్థూలస్థితిలో బయటకు వ్యక్తమౌతాయి. (The potential spots of information within the brain will manifest out ward physically afterwards). విషయ విజ్ఞాన వ్యూహమంతా బుద్ధిలో ఇమిడి వుంటుంది కాబట్టి, ఈ సుధా

సింధు స్థానాన్ని మనలో 'మానసిక' లేదా 'బుద్ధి స్థానము' అని అనుకోవాల్సి ఉంటుంది. కల్పలోకంలో భౌతికంగా జరిగే వాటికి ఇక్కడ నుండియే వాటి సంకల్పాలకు ప్రేరణ జరుగుతుంది. కుండలినీ యోగంలో 'ఆజ్ఞా చక్రస్థానాన్ని' 'మనస్తత్త్వ స్థానం' గా (మనోపి భ్రూమధ్యే - 9, సౌందర్యలహరి) చెప్పడం ఇందువల్లనే.

అమ్మవారు సహస్రార మందు వుండే అయ్యవారి (శివుని) పర్యంకంపై - ఆసీనురాలయే ముందు, ఆసీనురాలైనపుడు, క్రిందకు దిగేటప్పుడు గూడా ఈ 'ఆజ్ఞా చక్ర స్థానం' అనే పీఠంపైనే పాదం మోపుతుంది. ఈ ఆజ్ఞాచక్రము వద్ద వుండు అమ్మవారి పాదాన్ని ఆశ్రయించి, ఆజ్ఞా బద్ధులై, కార్య నిర్వహణా ప్రేరితులై - త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు రుద్రులు వరుసగా తమ సృష్టి, స్థితి, లయ కార్యాలను నిర్వర్తిస్తారు. ఈ విషయాన్ని సౌందర్యలహరిలో 'తనీయాం సంపాంసుం ....' అనే రెండవ శ్లోకంలో శంకరులు వివరిస్తారు.

చర్మ చక్షువులను మూసి, ఆజ్ఞా చక్ర స్థానాన్ని (భ్రూమధ్య ప్రదేశాన్ని) ధ్యానిస్తే - అమ్మవారి పాదాన్ని ధ్యానించినట్లే ఔతుంది. తత్ఫలితంగా జ్ఞప్తికి రావలసిన విషయాలకు అవగాహన కలుగుతుంది. ఈ మనస్తత్వ స్థానాన్ని ''బిందు సరము ''మానస సరోవరము'' అని గూడా అంటారు. (దేవశిల్పి 'మయుడు' ఈ బిందుసరం లోంచే మయసభను, అలాగే సృష్టింప బడవలసిన వాటిని బయటకు తీసుకు వస్తాడు. ఈ విషయం భారతంలో చదవవచ్చు).

అమ్మవారు ఆసీనురాలైన 'శివపర్యంకం' అమ్మవారి 'మెట్టినిల్లు' (మూలాధారం పుట్టిల్లు). దీనిని శ్రీ చక్రంలో కేంద్ర బిందువుగా సంకేతిస్తారు ఈ లలితా సహస్ర నామాల్లోనే ముందు ముందు వచ్చే ''బైందవాసనా'' అనే నామం, ఇంతకు పూర్వమే వచ్చిన ''సుమేరు శృంగ మధ్యస్థా'' అనే నామం - ఈ బిందు స్థానాన్నే సూచిస్తాయి. ఒకే తలంలో నలుపలకల వలే ఉండేది కాకుండా, మేరువుతో వుండే దృఢమైన (Three dimensional) శ్రీ చక్రం - చూడ్డానికి ఒక గోపురంలాగా వుంటుంది. ఆ గోపురం నడినెత్తిన కేంద్రం వద్ద ఒక బిందువు వుంటుంది. అమ్మవారి ఆసనం శ్రీ చక్రంలో ఇదే! ఇది మనలో సహస్రార చక్ర స్థానమే! బ్రహ్మరంధ్ర ప్రాంతములోనే సహస్రార కమల స్థానం వుంటుంది. అమ్మవారు పాదము ఉంచే పీఠస్థానము మనలో ఆజ్ఞాచక్రం వద్ద వుంటుంది.

''సుధాసాగరం లేదా సుమేరు శృంగ మధ్యము, లేదా శ్రీచక్రము లోని కేంద్రబిందువు సూచించు సహస్రార కమల మధ్యమున ఉండునది'' అని నామానికి అర్థం.

''సుమేరు శృంగ మధ్యస్థా నామం నుండి సుధాసాగర మధ్యస్థా'' అనే ఈ నామం దాకా అమ్మవారు మనలో సూక్ష్మంగా వుండే నివాసం గూర్చి చెప్పబడినది.

## 62 కామాక్షీ

ఇది 3 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''కామాక్ష్యై నమః'' అని చెప్పాలి.

కామ = అందమైన; అక్షి = కన్నులు గలది

''కామ'' అనే పదానికి కమనీయమైన, అంటే – 'అందమైన' అనే అర్థమే కాకుండా 'కామేశ్వరుడు' అని, 'మన్మథుడు' అనీ గూడా అర్థాలు వున్నాయి. సృష్టి సంకల్పం కలిగి, తాను సృష్టిగా అవాలనే నిండు కోరిక (కామం) తో వున్న శివుని వ్యక్త స్వరూపాన్ని ''కామాక్షి''తో సంకేతిస్తారు.

క – బ్రహ్మసంబంధమైన సరస్వతిని, మ – విష్ణు సంబంధమైన లక్ష్మిని సూచిస్తాయి కాబట్టి, కామాక్షి అంటే 'సరస్వతీ' 'లక్ష్మీ' లను తన కన్నులుగా గలది అనే అర్థం వస్తుంది. కాంచీపుర పీఠానికి అధిదేవత అని గూడా అర్థం.

మొత్తం మీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) కమనీయమైన కన్నులు గలది.
2) కామేశ్వరుని తన కన్నులుగా గలది.
3) మన్మథుని తన కన్నులుగా గలది.
4) సృష్టిగా తాను మారవలెననే నిండు కోరికతో వుండే శివుని వ్యక్త స్వరూపము.
5) లక్ష్మీ సరస్వతులను తన కన్నులుగా గలది.
6) కాంచీపుర పీఠాధిదేవత

## 63. కామదాయినీ

ఇది 5 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''కామదాయిన్యై నమః'' అని చెప్పాలి.

కామ = కోరికలను; దాయినీ = ఇచ్చునది (నెఱవేర్చునది)

కామములు అంటే కోరికలు కాబట్టి 1) భక్తుల కోరికలను నెఱవేర్చునది' అని ఒక అర్థం.

'కామ' అంటే 'కామేశ్వరుడు' అని అర్థం కాబట్టి, 'కామేశ్వరుని ఇచ్చునది'. అనగా 2) శివుని ప్రాపు కలుగజేయునది'' అని ఇంకొక అర్థం.

'దాయము' అంటే 'ఆస్తి' అనే అర్థాన్ని బట్టి 3) 'కామేశ్వరునే తన ఆస్తిగా గలది' అనే అర్థం గూడా చెప్పుకోవచ్చును.

అమ్మవారికి 'వరదముద్ర' లేకపోయినా ఈ నామమే ఆ ముద్రను తెలియజేస్తుంది.

## 64 దేవర్షిగణ సంఘాతస్తూయమానాత్మవైభవా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''దేవర్షి గణ సంఘాతస్తూయ మానాత్మవైభవాయైనమః'' అని చెప్పాలి.

దేవ = దేవతల యొక్క, ఋషి= ఋషుల యొక్క; గణ = గణదేవతల యొక్క, సంఘాత = సముదాయము చేత, స్తూయమాన = స్తోత్రము చేయబడుచున్న, ఆత్మ = తన యొక్క, వైభవా = గొప్పతనము గలది.

ఈ నామం దగ్గఱ నుండి అమ్మవారు చేసిన దేవ కార్య వివరాలు చెప్పబడతాయి. 'బ్రహ్మాది దేవతలు, నారదాది దేవ ఋషులు, వసిష్ఠాది ఋషులు, ఆదిత్యాది గణములచే స్తుతింపబడు తన వైభవము గలది'. (భండాసుర వధార్థం వీరందరూ కలసి, సామూహికంగా, అమ్మవారి ఆవిర్భావ నిమిత్తం స్తుతించారు.) – అని ఒక అర్థం.

ఏ స్తుతి అయినా, స్తోత్రమైనా మాటలతోనే గదా వుండేది, చేసేది. ఆ మాటలు అక్షరాలతో ఏర్పడతాయి. ఆ అక్షరాలు అచ్చులు, హల్లులతో ఏర్పడతాయి. అచ్చులు - 16, హల్లులు 34 మొత్తం 50 అక్షరాలు (పంచాశత్). ఈ అక్షరాలే రకరకాలుగా రూపాలు మారుతూ ఎన్నో రకాల పదాలు వస్తాయి. ఈ పదాలలోనే ఏ స్తోత్రమైనా వుండేది. అందుకని-

16 అచ్చుల్ని - 'దేవ గణం' అని, 34 హల్లుల్ని - 'ఋషిగణం' అని, ప్రత్యేకంగా 'క్ష' కారాన్ని 'సంఘాత' అక్షరంగాను సంకేతిస్తే ఈ ''దేవ, ఋషి, సంఘాత పదాలు సూచించే 50 అక్షరాల వివిధ కూర్పులతో స్తుతింపబడు వైభవము గలది'' అని గూడా అర్థం చెప్పుకోవచ్చును.

## 65 భండాసురవధోద్యుక్త శక్తిసేనా సమన్వితా

ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''భండాసుర వధో ద్యుక్త శక్తిసేనా సమన్వితాయైనమః'' అని చెప్పాలి.

భండ + అసుర = 'భండుడు' అను రాక్షసుని యొక్క; వధ = సంహరించుట యందు; ఉద్యుక్త = ప్రయత్నించు; శక్తి = స్త్రీ దేవతల; సేనా = సేనలతో, సం (సమ్యక్) + అన్వితా = చక్కగా కూడియున్నది.

తన యొక్క వివిధ అంశలతో వుండే శక్తి సైన్యాలతో కూడుకుని, అమ్మవారు తన స్థూల స్వరూపంతో సాధించే దేవకార్యాలే - భండాసుర, మహిషాసురాది వధలు.

మనలోని అజ్ఞాన భావాలకు ప్రతీకలే అసురులు. అలాగే మనలోని ప్రజ్ఞాన భావాలకు ప్రతీకలే దేవతలు. ఈ రెంటికీ మనలో ఎప్పుడూ సంఘర్షణే. అహంకార సంబంధమైనవి - అజ్ఞాన భావాలు; ఆత్మ సంబంధమైనవి - జ్ఞాన భావాలు. ఈ రెంటి సంఘర్షణే దేవాసుర సంగ్రామాలు. ఈ సంఘర్షణలు అనే 'సంగ్రామాల్లో' ఒక్కొక్కప్పుడు రెండింటి మూల నాయకులు గూడా రంగంలోకి దిగవలసి రావచ్చును.

'అజ్ఞానానికి మూలకారణము; మద, అహంకారాల స్వరూపము అయిన భండాసురుని వధించడానికి - జ్ఞాన సంపర్క భావాలకు ప్రతీకమైన శక్తిసేనలతో సన్నద్ధురాలైన జ్ఞాన చైతన్యచిద్రూపిణి' అని ఈ నామానికి విపులమైన అర్థం.

## ౬౬ సంపత్కరీ సమారూఢ సింధుర వ్రజసేవితా

ఇది అమ్మవారి 66వ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సంపత్కరీ సమారూఢ సింధుర వ్రజసేవితాయైనమః' అని చెప్పాలి. ఇది 16 అక్షరాల నామం. 8 అక్షరాల భాగాలుగా, రెండుగా ఈ నామాన్ని విడగొట్టకూడదు.

సంపత్కరీ = సంపత్కరీ దేవి చేత; సమారూఢ = చక్కగా అధిరోహింపబడిన; సింధుర వ్రజ = ఏనుగుల సముదాయము చేత; సేవితా = సేవింపబడినది.

భండాసురుని వధించడానికి ప్రబలమైన శక్తిసేన కావాలి. ఆ శక్తి సేనలో గజ, తురగ, రథాది బలాలుంటాయి. వాటిలో ముందుగా గజ బలం గూర్చి ఈ నామంలో చెప్పబడుతోంది.

గజ విద్యలో ఆరితేరిన వారే గజారూఢులు కాగలరు, గజాలను ముందుకు నడపగలరు, గజాలవలన పొందవలసిన సహాయము పొందగలరు. అమ్మవారి వద్ద 'సంపత్కరీ' అనే దేవి ఈ గజ విద్యలో మంచి ప్రావీణ్యము గలది. అమ్మవారి యొక్క 'అంకుశము' నుండి 'సంపత్కరీ దేవి' పుట్టింది. అందుకే ఏనుగులకు ఈదేవి అంకుశము లాంటిది. ఈ దేవి 'రణ కోలాహలం' అనే ఏనుగును అధిష్ఠించి వుంటుంది. భద్ర, మంద్ర, మృగ గజాది జాతులకు సంబంధించిన అన్ని రకాల ఏనుగులను ఈ దేవి మచ్చిక చేసుకోగలదు. వాటిని ఎక్కి, నడిపించగలదు. ఈ గజసేనతో సంపత్కరీ దేవి చేత అమ్మవారు సేవించబడుతుంది.

చిత్తానికి వృత్తులుంటాయి. సుఖ సంపత్తులతో కూడిన ఈ చిత్త వృత్తులను 'సంపత్కరీ' అనే పేరుతో సంకేతిస్తారు. శబ్ద స్పర్శ రూప రస గంధ తన్మాత్రల వలన చిత్త వృత్తులు ఏర్పడతాయి. ఈ శబ్దాది విషయాలనే 'సింధుర వ్రజము' అంటే 'ఏనుగుల సముదాయము' గా సంకేతిస్తారు. ఈ సంపత్కరీ దేవి ఈ సింధుర వ్రజాన్ని అదుపులో పెట్టి, వాటి ద్వారా ఉపయోగకరమైన పనులు చేయించి, శాశ్వత జ్ఞాన సముపార్జనకు, తద్వారా ఆనందానికి దారితీస్తుంది. ('సంపత్కరీ' – అనే పేరులోనే. ఈ విషయం సూచన ప్రాయంగా వుంది.)

ఎక్కడ తాను ఉండాలో అక్కడ తాను లేకుండా పోతే, ఇక ఉన్నదంతా, మిగిలిన దంతా దారిద్ర్యమే ! అదొక్కటీ వున్నా సంపద వున్నట్లే ! ఈ నామంతో అమ్మవారిని ధ్యానిస్తే ఇలాంటి 'సంపదనిచ్చే సంపత్కరిని' అనుగ్రహిస్తుంది.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చు.

1. సంపత్కరీ దేవి ఎక్కిన ఏనుగుల సముదాయముచే సేవింపబడేది.
2. చిత్తవృత్తులు – అనే ఏనుగులను అదుపులో పెట్టి, జ్ఞాన సముపార్జనకు దారితీసే వాటిచే సేవింపబడేది.
3. అసలైన సంపదను ప్రసాదించే వారిచే సేవింపబడేది.

## 67. అశ్వారూఢాధిష్ఠితాశ్వకోటి కోటిభిరావృతా

ఇది అమ్మవారి 67వ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు "అశ్వారూఢాధిష్ఠితాశ్వకోటి కోటి భిరావృతాయైనమః' అని చెప్పాలి. ఇది గూడా 16 అక్షరాల నామం. కాబట్టి, మధ్యలో ఎక్కడా విడగొట్టి చదవగూడదు.

అశ్వారూఢా = 'అశ్వారూఢ' అనే దేవిచేత, అధిష్ఠిత = ఎక్కబడిన, అశ్వ = గుఱ్ఱముల యొక్క; కోటి కోటి భిః = కోటానుకోట్లచే; ఆవృతా = చుట్టుకొనబడినది లేదా ఆవరింపబడినది.

అమ్మవారి వద్ద అశ్వవిద్యలో ఆరితేరిన దేవి 'అశ్వారూఢ'. అమ్మవారి 'పాశము' నుండి ఈ దేవి పుట్టింది. అందుకే గుఱ్ఱాలకు ఈ దేవి పాశము (చెర్నాకోలు) వంటిది. ఈ దేవి 'అపరాజిత' అనే గుఱ్ఱాన్ని అధిష్ఠించి వుంటుంది. అన్ని జాతులకు సంబంధించిన గుఱ్ఱాలనూ ఈ 'అశ్వారూఢా' దేవి అదుపులో పెట్టి ముందుకు నడిపించగలదు. అందుకే – ఈమెకు అశ్వసేనను అమ్మవారు అప్పచెప్పింది. ఈ అశ్వారూఢా దేవి అపరాజితాశ్వము ఎక్కి, దానితో పాటు మిగిలిన వివిధ జాతి గుఱ్ఱాల సమూహంతో కూడి అమ్మవారిని సేవిస్తుంది. అశ్వసైన్యంతో ఈ అశ్వారూఢా దేవి అమ్మవారికి ముందుంటుంది. అందుకే 'అశ్వ పూర్వాం రథమధ్యాం' అని అమ్మవారి సూక్తం చెబుతుంది.

ఇంద్రియాలకు అశ్వాలనే సంకేతం వుంది. ఇంద్రియాల ద్వారానే కోర్కెలు పుట్టి,

ఇంద్రియ లౌల్యానికి గురికాబడి, పతన మవడం జరుగుతుంది. ఈ అశ్వారూఢాదేవి ఇంద్రియాలనే గుఱ్ఱాలనెక్కి, వాటిని అదుపులో పెట్టి, వాటి వలన జరగవలసిన పనులు చేయించి, శాశ్వత జ్ఞాన సముపార్జనకు - తద్వారా ఆనందానికి దారితీస్తుంది.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చు.

1. 'అశ్వారూఢ' అనే దేవత చేత అధిష్ఠించబడిన అధిక సంఖ్య గల గుఱ్ఱాలచే ఆవరింపబడినది.
2. ఇంద్రియాలను అదుపులో పెట్టి, శాశ్వత జ్ఞాన సముపార్జనకు దారితీయించగల వాటిచే సేవింపబడునది.

## 68. చక్రరాజరథారూఢసర్వాయుధపరిష్కృతా

ఇది అమ్మవారి 68వ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించే టప్పుడు 'చక్రరాజరథారూఢసర్వాయుధపరిష్కృతాయై నమః' అని చెప్పాలి. ఇది 16 అక్షరాల నామం. మధ్యలో విడగొట్ట కూడదు.

చక్రరాజ = 'చక్రరాజము' అను పేరుగల; రథ = రథమునందు, ఆరూఢ = అధిష్ఠించిన లేదా ఉంచబడిన, సర్వాయుధ = సమస్తమైన ఆయుధములచే, పరిష్కృతా = అలంకరింపబడినది.

గజ, తురగ సైన్యాలు అయిన తర్వాత, రథాల గురించి చెప్ప బడుతోంది. రథాల్లో వివిధ రకాలున్నాయి. చక్రరాజము, గేయ చక్రము, కిరిచక్రము మొదలైనవి. ప్రస్తుతం చక్రరాజ రథం గురించి చెప్పబడుతోంది. దీనికి తొమ్మిది పర్వాలు, పదియోజనాల ఎత్తు, నాలుగు యోజనాల వైశాల్యం ఉంటుంది. ఈ చక్రరాజ రథములో యుద్ధ సన్నద్ధురాలగు దేవికి అవసరమగు అన్ని రకముల ఆయుధ సామగ్రి ఉంచబడి వుంటుంది. ఇది స్థూల రథము.

'శ్రీ చక్రాన్ని' గూడా 'చక్రరాజ రథ'మంటారు. ఈ శ్రీచక్రరాజ రథంలో జ్ఞానసాధకములైన అన్ని రకాల ఆత్మగుణ సూచిత సూక్ష్మ అయుధాలూ వుంటాయి. అజ్ఞాన నిర్మూలనకు, వేద విరుద్ధ చర్యలకు - ప్రతి క్రియలను చేయగలిగే ప్రతి కృత

పరివార దేవతలు, ఆమ్నాయ దేవతలు, నిత్యాదేవతలు, ఆవరణ దేవతలు, ఆయుధ దేవతలు, అంగదేవతలు, సంకేత పూర్వకంగా వుంటాయి. వీటినే రథంలో వుండే పర్వాలంటారు. (వీటి వివరణ సంపూర్ణంగా తెలియాలంటే అనుబంధ శీర్షిక చూడండి)

మూలాధారాది చక్రాలలో సహస్రార చక్రం బ్రహ్మరంధ్ర స్థానంలో మానవ ప్రజ్ఞకు అతీతంగా వుంటుంది. దీనిలో బిందు స్థానం వద్ద అమ్మవారు వుంటుంది. పిండాండంలోని సహస్రార చక్రాన్నే చక్రరాజ రథమంటారు. మిగిలిన షట్చక్రాలు దీనికి అనుబంధంగా వుంటాయి.

సూర్యుడు కేంద్రంగా వుండి, ఈ సూర్యుని చుట్టూ తిరిగే గ్రహ, ఉపగ్రహాది వ్యూహాన్ని గూడా – చక్రరాజ రథంతో సంకేతిస్తారు. ఈ విధమైన చక్రరాజ రథానికి ఒకే చక్రం వుంటుంది. సూర్యుడే ఈ చక్రానికి కేంద్రం వద్ద గల ఇరుసుగా వూహించుకోవాలి.

మొత్తం మీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. చక్రరాజ రథము నందు ఉంచబడిన ఆయుధాలచే అలంకరింపబడినది.
2. శ్రీచక్రములో ఆత్మజ్ఞాన సాధనా సంపత్తితో అలంకరింపబడినది.
3. సూర్యుణ్ణే ఇరుసుగా గలిగి, ఖగోళంలో అలంకరింపబడిన సూర్య కుటుంబమనే ఏక చక్రమును అధిరోహించి వుండునది.

## 69. గేయ చక్ర రథారూఢమంత్రిణీ పరిసేవితా

ఇది అమ్మవారి 69 వ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గేయ చక్రరథా రూఢ మంత్రిణీ పరిసేవితాయై నమః' అని చెప్పాలి. ఇది గూడా 16 అక్షరాల నామం.

గేయ చక్ర = గేయ చక్రమను పేరు గల, రథ = రథమును, ఆరూఢ = అధిష్ఠించిన; మంత్రిణీ = మంత్రిణిచే; పరిసేవితా = అన్ని వైపుల నుండి సేవింపబడునది.

అమ్మవారి రథములలో గేయ చక్ర రథానికి ప్రాధాన్యం ఉంది. ఇది అమ్మవారికి మంత్రిణి అయిన శ్యామలాదేవి అధిరోహించే రథం. అమ్మవారి సామ్రాజ్యంలో 16 మంది

# 70. కిరి చక్ర రథారూఢ దండనాథా పురస్కృతా

ఇది అమ్మవారి 70వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''కిరిచక్రరథారూఢ దండనాథాపురస్కృతాయై నమః'' అని చెప్పాలి.

కిరిచక్ర = కిరిచక్రమను పేరు గల; రథ = రథమును; ఆరూఢ = ఎక్కిన, దండనాథా = దండము చేతి యందు ఎల్లప్పుడూ వుండు దేవి చేత, పురస్కృతా = ముందు ఉండి సేవింపబడునది.

'కిరిచక్రరథం' అంటే – వరాహాల చేత లాగబడే రథం అన్నమాట. ఇక్కడ 'కిటి' అనే పదం 'కిరి' గా మారినట్లు గుర్తించాలి. 'కిటి' అంటే 'అడవి పంది'. అడవి పంది తలను బోలిన తల వున్న – అమ్మవారి దూతికను – 'వారాహి' అంటారు. ఇలాగే – వార్తాళి, భగళాముఖి ఇత్యాది నామాలు గల అమ్మవారి దూతికలుంటారు. వీరిని తప్పుగా ఆరాధించి, క్షుద్ర శక్తుల సంపాదనకై ప్రయత్నించే వాళ్ళున్నారు. వారి ఆరాధనా లక్ష్యాలను అనగా ఉద్దేశ్యాలను (Motives) బట్టే వారికి ఫలితాలు వస్తాయి. ( నిజానికి క్షుద్రశక్తులు ఎందుకు ? – ఏదో దుర్బుద్ధి వుంటే తప్ప) ఈ వారాహి చేతిలో ఎప్పుడూ దండం వుంటుంది. అందుకే ఈమె 'దండనాథ' పదానికి అర్హురాలు. అమ్మవారికి 12 మంది సేనానులుంటారు. వీరిలో వారాహి దేవి ముఖ్యురాలు. మిగిలిన వారి పేర్లు అనుబంధంలో తెలుపబడ్డాయి.

ఈ వారాహీదేవికి బీజాక్షరం – 'హూం' మన లోపల పనిచేసే వారిలో పోట్లాడే స్వభావం గలది ఈ 'వారాహి'. అందుకే ఎవరన్నా కోప మొచ్చినప్పుడు 'హుం' కరిస్తారు. అంటే – అనుకోకుండానే ఈ బీజాక్షరాన్ని ఉచ్చరిస్తారు. బీజాక్షరం గూడా మామూలు అక్షరమే ! అయితే – గొంతుతో ఉచ్చరిస్తే అది 'గుణింతాక్షరం' అవుతుంది. బుద్ధి (Consciousness)తో ఉచ్చరిస్తే అది 'బీజాక్షరం' అవుతుంది. ఉచ్చరిస్తే 'బీజాక్షరం' – అవుతుంది గాని, పుస్తకంలో వున్నప్పుడు కాదు.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. వరాహములచే లాగ బడు చక్రములు గల రథము నెక్కిన 'వారాహి' అను పేరు గల దండనాథచే సేవింపబడునది.
2. అవసరమునకై పోరాడుటకు సిద్ధమగు దేవతచే సేవింపబడునది.

## 71. జ్వాలామాలినికాక్షిప్త వహ్ని ప్రాకారమధ్యగా

ఇది అమ్మవారి 71వ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జ్వాలామాలిని కాక్షిప్త వహ్నిప్రాకార మధ్యగాయై నమః' అని చెప్పాలి. ఇది 16 అక్షరాల నామం.

జ్వాలా మాలినికా = జ్వాలా మాలిని అను పేరు గల నిత్యాదేవత చేత, ఆక్షిప్త = వెదజల్లబడి నిర్మింపబడిన, వహ్నిప్రాకార = అగ్నిప్రాకారము యొక్క, మధ్యగా = మధ్యనున్నది.

తిథులకు సంబంధించిన నిత్యాదేవతలలో శుద్ధ చతుర్ధశికి, కృష్ణ విదియకు సంబంధించిన నిత్యపేరు 'జ్వాలామాలిని'. ఈమె అగ్నిస్వరూపురాలు. అందుచే ఈమెను చేరడం, ఈమెను దాటడం ఎవ్వరికైనా అసాధ్యమే ! దరి జేరినా, దాటడానికి ప్రయత్నించినా మాడిపోవలసిందే ! అందుకని అమ్మవారు ఈమెను సైన్యాని కంతకూ చుట్టూరా ప్రాకారంలాగా విస్తరిల్లమని చెప్పింది. ఈ ప్రాకారం విస్తీర్ణం – నూరు యోజనాలు, ఎత్తు – 30 యోజనాలు కలిగి వుంటుంది.

శ్రీ చక్రంలో వసుకోణ మధ్యభాగంలో త్రికోణాకారంగా ఏర్పడే భాగాన్ని ఈ వహ్నిప్రాకారంతో సంకేతిస్తారు. ఈ వహ్ని ప్రాకారం లోపల భాగాన్ని 'అంతరావరణం' అంటారు. బయట భాగాన్ని 'బహిరావరణం' అంటారు. భండాసురుణ్ణి చంపగలిగే అమ్మవారి సైన్యాలు అంతరావరణంలోను, భండసైన్యాన్ని చంపగలిగే అమ్మవారి సైన్యాలు బహిరావరణం లోను ఉంటాయి.

దెబ్బకొడితే మనలో ఏ భాగానికైనా తగల వచ్చేమో కాని దెబ్బ తగలనిభాగం ఒకటుంది. అదే 'నేను'తో పిలవబడే 'ఆత్మ'. మనలో ఈ నేను వుండే చోటునే వహ్నిప్రాకారంగా సంకేతించుకోవాలి.

మనలో ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు ఎక్కడ లీనమై ఎక్కడ నుండి ప్రారంభమౌతున్నాయో అది వహ్ని ప్రాకార మధ్యం అని తెలుసుకోవాలి. ఇక్కడ ఉచ్ఛ్వాసానికి సంబంధించిన 'సో',లో నిశ్వాసానికి సంబంధించిన 'హం' – లీనమై,

కలిసిపోయి వుంటుంది. ఈ సోహం దంపతులిద్దరికీ వేరే ఉద్యోగం, సద్యోగం ఉండదు. అది వారి యోగస్థితి. వాళ్ళ అనుకుంటే తప్ప యోగస్థితిని చెడగొట్టడం ఎవరి వల్లా కాదు. ఈ స్థితి ఆనందానికి చివరి మెట్టు. ఈ ఆనంద స్థితి ఘనీభవించిన ఆనంద స్థితి (Static Bliss) కాదు – చైతన్యవంతమైన ఆనందస్థితి.(Dynamic Bliss)

మొత్తంమీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) 'జ్వాలామాలిని' అనే నిత్యాదేవతచే అవరింపబడిన అగ్నిప్రాకారంలో మధ్యగా వుండునది.
2) మనలో 'నేను' 'తాను' పదాలతో చెప్పబడే 'ఆత్మ' స్థానంలో వుండేది.
3) ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు మనలో ఎక్కడలీనమై, ఎక్కడ నుండి ప్రారంభింప బడతాయో అక్కడ వుండునది.

## 72. భండసైన్యవధోద్యుక్త శక్తివిక్రమహర్షితా

ఇది అమ్మవారి 72వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''భండసైన్య వధోద్యుక్తశక్తి విక్రమహర్షి తాయైనమః'' అని చెప్పాలి.

భండసైన్య = భండాసురుణ్ణి, అతని సైన్యాన్ని, వధోద్యుక్త = సంహరించడానికి సిద్ధమై ఉద్యుక్తమైన, శక్తి విక్రమహర్షితా = తన శక్తి సైన్యాల విక్రమాన్ని చూచి ఆనందించినది.

అజ్ఞానానికి సంబంధించిన ఆసురీ ప్రవృత్తులను సంకేతించే భండాసురాదులను, వారి అనుచరులను నశింపచేసి, సుజ్ఞాన వంతంగా మనలను తీర్చి దిద్ది, ఆత్మజ్ఞానాన్ని కలుగజేసే – మనలోని జ్ఞానసంపర్క భావాలే – అమ్మవారి సైన్యంగా తెలుసుకోవాలి.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) భండాసురుణ్ణి, అతని సైన్యాన్ని వధించడం కోసం సంసిద్ధులై వున్న తన శక్తి సైన్యాల విక్రమాన్ని చూసి ఆనందించినది.
2) అజ్ఞానాన్ని నిర్మూలించి, ఆత్మజ్ఞానాన్ని కలగ చెయ్యడం కోసం మనలో పనిచేసే జ్ఞాన సంపర్క భావాలను చూసి ఆనందించేది.

## 73. నిత్యాపరాక్రమాటోప నిరీక్షణ సముత్సుకా

ఇది అమ్మవారి 73వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''నిత్యాపరాక్రమాటోప నిరీక్షణ సముత్సుకాయై నమః'' అని చెప్పాలి.

నిత్యా = నిత్యాదేవతల యొక్క, పరాక్రమ + ఆటోప = పరులను ఆక్రమించు కోగల శక్తి సామర్థ్య, ఉత్సాహాలను చూసి; సముత్సుకా = చక్కగా సంతోషించినది.

భండాసురునికి 15 మంది సేనాధిపతులుంటారు. (వీరిపేర్లు అనుబంధంలో తెలుపబడినవి). ఈ 15 మంది సేనాధిపతులను అమ్మవారి 15 మంది నిత్యాదేవతలు సంహరిస్తారు.

అజ్ఞానానికి సంబంధించిన వారే భండాసురుడు, అతని సైన్యం. అజ్ఞానం చీకటి లాంటిది. అందుకని వీళ్ళు రాత్రిపూట బాగా విజృంభిస్తారు. అయినప్పటికీ నిత్యలలో జ్వాలా మాలినీ, వహ్నివాసినీ – అనే దేవతలు అగ్నిస్వరూపులు. వీళ్ళ ప్రకాశంలో భండాసుర సైన్యాధిపతులు గుర్తింపబడి, సూర్యుడు రాగానే చీకటి మాయమైనట్లు – ఓడింపబడతారు.

1) 'నిత్యాదేవతల పరాక్రమ ఆటోపాన్ని చూసి సంతోషించినది' – అని ఈ నామానికి అర్థం.

## 74. భండపుత్రవధోద్యుక్త బాలా విక్రమనందితా

ఇది అమ్మవారి 74 వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''భండపుత్రవధో ద్యుక్త బాలా విక్రమనందితాయై నమః'' అని చెప్పాలి.

భండపుత్ర = భండాసురుని పుత్రులను; వధ + ఉద్యుక్త = సంహరించుటకు సంసిద్ధురాలైన; బాలా = బాలదేవి యొక్క; విక్రమ = విక్రమమునకు; నందితా = సంతసించినది.

బాలా త్రిపుర సుందరియే బాలాదేవి. అమ్మవారి అంశయే ఈ బాలాదేవి. అమ్మవారి అనుజ్ఞతో ఈ బాలాదేవి భండపుత్రులను వారి సైన్యంతో సహా అందరినీ సంహరించింది. భండపుత్రులు 30 మంది వుంటారు. వీళ్ళు మనలో 'భ్రమల'ను కలుగజేసే వాళ్ళు. ఈ భ్రమ లకు లోనై, మనం వంచింపబడతాము. (వారి పేర్లు అనుబంధంలో తెలుపబడ్డాయి) ఈ బాలాదేవిని ఉపాసన చేస్తే అన్నికోరికలు తీరుతాయి. ఈ బాలాదేవి వయస్సు 9 సంవత్సరములు. అందుకే బాలామంత్రంలో గూడా 9 బీజాక్షరాలుంటాయి. ఆ మంత్రాన్ని ఈ క్రింది విధంగా

''ఐం క్లీం సౌః
సౌః క్లీం ఐం
ఐం క్లీం సౌః''
'శ్రీ బాలాయైనమః' లేదా 'శ్రీ బాలా త్రిపురసుందర్యై నమః' అని జపించాలి.

ఈ మంత్రంలోని ప్రధాన బీజాక్షరాలు ఐం, క్లీం, సౌః. 'ఐం' అనేది వాగ్భవ బీజం. ఇది సరస్వతీ అనుగ్రహ ప్రాప్తిని చేకూర్చే బీజాక్షరం. 'క్లీం' అనేది కామకళాబీజం. ఆకర్షణకు, సర్వకళలకు, లక్ష్యసిద్ధికి సంబంధించినది. 'సౌః' = మంగళప్రదమైన మోక్షానికి సంబంధించినది. అందుకనే ఈ బాలా మంత్రం సర్వాభీష్ట ప్రదమైన మంత్రంగా చెబుతారు. బాలా ఉపాసన ఉన్నవారి ఇళ్ళల్లో - వాళ్ళ ఆడపిల్లల మధ్య బాలా దేవి తిరుగుతూ వుంటుంది. (మా యింట్లో 'బాలా ఉపాసన' వున్నది. ఒకసారి పండక్కి ఇంట్లో వున్న ఆడపిల్లలందరికీ గాజులు వేయించారు. అప్పుడు ఇంట్లో వున్నది 8 మంది. గాజుల అబ్బాయి తొమ్మిది మందికి గాజులు వేశానని అంటాడు. మానాన్న గారికి మొదట్లో అర్థం కాలేదు. ముందు డబ్బిచ్చి పంపి, తర్వాత ఆలోచించారు. అప్పుడు తెలిసింది 'బాలాదేవి' అలా ఇంకొక ఆడపిల్లలాగా వచ్చిందని - గ్రంథకర్త)

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) భండపుత్రులను వధించడానికి ఉద్యుక్తురాలయ్యే బాలాదేవి విక్రమానికి సంతసించినది.
2) మనలో భ్రమలను పుట్టించి, మనలను వంచించే ఆసురీ శక్తులను నిర్మూలించి, మనలను కాపాడే బాలా త్రిపురసుందరీ విక్రమానికి సంతసించు జగన్మాత.

## 75. మంత్రిణ్యంబా విరచిత విషంగ వధతోషితా

ఇది అమ్మవారి 75వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''మంత్రిణ్యంబా విరచిత విషంగ వధతోషితాయై నమః'' అని చెప్పాలి.

మంత్రిణ్యంబా = మంత్రిణీ దేవి చేత, విరచిత = చేయబడిన, విషంగ వధ = విషంగవధను (విని), తోషితా = సంతసించినది.

'సంగం' అంటే – రాగం, 'విషంగం' అంటే – వికటించిన రాగం. విషంగుడు, విశుక్రుడు – ఈ ఇద్దరూ భండాసురుని సోదరులు. విషంగుడు మనలో విషయ లంపటత్వాన్ని రెచ్చగొట్టేవాడు. ఈ విషంగుణ్ణి తన మంత్రిణి అయిన శ్యామలాదేవి వధించడం చూసి అమ్మవారు సంతోషించింది.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) మంత్రిణి అయిన శ్యామలాదేవి చేత జరిగిన విషంగుని వధకు సంతోషించినది.
2) మనలో వికృత భావాలను రెచ్చగొట్టే ఆసురీ గుణ సంకేతుడైన 'విషంగుణ్ణి' వధించే మంత్రిణి అయిన శ్యామలాదేవిని చూసి సంతోషించునది.

## 76. విశుక్ర ప్రాణహరణ వారాహీ వీర్యనందితా

ఇది అమ్మవారి 76 వ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు, ''విశుక్ర ప్రాణహరణ వారాహీ వీర్యనందితాయైనమః'' అని చెప్పాలి. ఇది 16 అక్షరాల నామం.

విశుక్రప్రాణహరణ = విశుక్రుని ప్రాణాలను హరించిన అనగా – చంపిన, వారాహీ = వారాహీదేవి యొక్క; వీర్య = పరాక్రమానికి, నందితా = సంతోషించినది.

విశుక్రుడు గూడా భండాసురుని సోదరుడే! ఈ విషంగ, విశుక్రులు భండాసురుని బాహువుల నుండి పుట్టినవారు. బాహువులు ఏ విధంగా ఈ శరీరరక్షణకు ఉపయోగిస్తాయో, అలాగే ఈ విషంగ, విశుక్రులు భండాసురునికి ఇరువైపులా ఉండి,

రక్షించే ప్రధాన సైన్యాధిపతులు. ఈ విశుక్రుడు అమ్మవారి దండనాథ అయిన వారాహీదేవి చేత హతుడవుతాడు. ఈ సంగతి తెలిసి అమ్మవారు సంతోషిస్తుంది.

మనలోని శుక్రధాతువునకు వికారాలు కలిగించేవాడు – ఈ విశుక్రుడు. అంటే – మనలో కామాన్ని ప్రకోపింప జేసి, వ్యభిచారాది దోషాలను చేయించడానికి కారణమైన ఆసురీ గుణానికి సంకేతుడన్నమాట ! ఇతనిని వారాహీదేవత చంపుతుంది. వారాహీ మంత్రం ''హూం''. బ్రహ్మచర్యవ్రతదీక్షతో కామాన్ని జయించాలంటే ఈ వారాహీ దయలేకపోతే రాదు. కామ మయ శరీరంతో సాధకుడు కామాన్ని దాటి పైకి పోడు.

కామం వదలని ఈ జీవుణ్ణి పురాణాల్లో 'యయాతి' తో సంకేతిస్తారు. 'యయాతి' అంటే మనలో జన్మనెత్తుతూ, మరణిస్తూ జీవనయానం చేసేవాడు. ఇలా 'యానము' చేయువాడు కాబట్టే 'యయాతి' అన్నారు. ఇతనికి ఇద్దరు భార్యలు. దేవయాని, శర్మిష్ట. దేవయాని – దేవయాన మార్గానికి, అంటే – ఊర్ధ్వమార్గానికి, – అంటే – బ్రహ్మచర్య వ్రతానికి; శర్మిష్ట– పితృయాన మార్గానికి, అంటే – అధోమార్గానికి అంటే – గృహస్థా శ్రమ ఆశయానికి – సంకేతాలు. ఈ శర్మిష్ట ద్వారానే యయాతి 'యదువు' గా పుడ్తాడు.

శుక్రం వలన పునర్జన్మ కలగడానికి సంబంధించిన విద్యనే 'మృతసంజీవనీ విద్య' అంటారు. ఈ 'మృతసంజీవనీ విద్య' శుక్రాచార్యునికే తెలుసు. శుక్రుడు జీవ సృష్టి ప్రణాళికకు దోహదపడేవాడైతే – విశుక్రుడు శుక్రానికి వికార గుణాలను కలుగజేసి, అహంకార, వ్యభిచారాది గుణాలకు ప్రేరకుడౌతాడు. వీణ్ణి చంపాలంటే 'దండనాథ' అయిన 'వారాహీదేవత' వల్లనే జరుగుతుంది. ఇక్కడ 'దండనాథ' పదంలో 'దండ' అంటే – మనలో 'యోగదండము,' 'బ్రహ్మదండము', 'మేరుదండము' మొదలైన పేర్లతో పిలవబడే 'వెన్నెముక' అని అర్థం. ఈ శుక్రాన్ని అధో మార్గం పట్టించకుండా – వెన్నెముక వెంబడి వుండే షట్చక్ర కుండలినీ యోగ మార్గం ద్వారా ఊర్ధ్వగతిని పట్టించినపుడు – ఈ విశుక్రుని అంతంజరుగు తుందని ఈ మంత్ర రహస్యార్థం.

ఈ నామంలో 'వీర్యం' అనే పదానికి – 'శుక్రము', 'తేజస్సు' అనే అర్థాలున్నాయి. స్థూల రూపంలో వుంటే ఈ ధాతువు 'శుక్రాన్ని' తెలియ జేస్తుంది. ఇదే ధాతువు

సూక్ష్మరూపంలో వుంటే 'తేజస్సు'ను తెలియజేస్తుంది. ఈ నామంలో "వారాహీ" 'వీర్య' నందితా" అన్నారు. వ్యాసులవారు, అంతేగాని - 'వారాహీ బలనందితా' అని గాని, 'వారాహీశక్తినందితా' అని గాని, 'వారాహ్యాటోపనందితా' అని గాని అనలేదు. 'వీర్యము' అంటే 'శుక్రము', 'తేజస్సు' అని అర్థాలు గదా! శుక్ర సంబంధమైన రుగ్మతలకు లేదా రోగాలకు కారకుడైన 'విశుక్రుణ్ణి' చంపడానికి - శుక్రసంబంధ విశేషణమైన 'వీర్య' పదంతో వారాహీదేవి పరాక్రమాన్ని చెప్పడం సమంజసం, సముచితం గూడా! మహాభారతంలోని 'చిత్రాంగదుడు' - 'విచిత్రవీర్యుడు' వరుసగా ఈ 'విషంగ' - 'విశుక్రుల' వలలో పడినవారే అయి వుంటారని వారి వారి పేర్లను బట్టి గుర్తించ వచ్చు.

ఇక 'వరాహ' పదం. 'వరాహం' అంటే అడవి పంది అని మామూలు అర్థమైనప్పటికీ, 'వర + అహం' అని విడదీస్తే 'శ్రేష్ఠమైన అహం' అనే అర్థం వస్తుంది. 'అహం' అనేది జీవులకు సంబంధించిన పరిమితత్వాన్ని, ఖండత్వాన్ని సూచిస్తే - 'వరాహం' అనే పదం సర్వేశ్వరునికి సంబంధించిన 'అపరమితత్వాన్ని', 'అఖండత్వాన్ని' సూచిస్తుంది.

సంసారంలో దిగబడిపోయిన వారిని ఉద్ధరించడంలో అమ్మవారు వరాహమూర్తి యొక్క దంష్ట్ర (కోర) అని సౌందర్యలహరిలో "అవిద్యానాం... జన్మ జలధౌని మగ్నానాం దంష్ట్రాముర రిపువరాహస్యభవతి" అని శంకరులు అన్నారు. ఇక్కడ లలితా సహస్ర నామంలో గూడా - సంసార లంపటంలోకి దిగబడి పోవడానికి కారణమైన 'విశుక్రుని' బారినుండి రక్షింపబడటానికి - 'వారాహీ' అనే అమ్మవారి అంశ దేవతే కారణభూతురాలౌతుందని చెప్పడంలో ఔచిత్యం వుంది. ఎక్కడైనా, ఎప్పుడైనా 'అహాన్ని' శ్రేష్ఠ వంతం చెయ్యగలిగేది 'వరాహమే' అని అటు సౌందర్యలహరిలోని శ్లోకంలో ఆది శంకరులు, ఇటు 'విశుక్ర ప్రాణ హరణ వారాహీ వీర్యనందితా" అనే నామంలో వ్యాసుల వారూ చెప్పారని తెలుసుకోవాలి.

సంసారమనే సాగరంలో దేహమనే భూమిదిగజారిపోతున్నపుడు, అలా దిగజారడానికి కారణమైన హిరణ్యాక్షుని (హిరణ్యాక్షుడంటే - 'బంగారం మీదకు దృష్టిని మళ్ళించే గుణానికి' - సంకేతుడన్నమాట! అంటే - భౌతిక సంపద వైపుకు, వాంఛల

వైపుకు మన దృష్టిని మళ్ళించే గుణానికి సంబంధించిన వాడు) బారి నుండి రక్షించే అవతారమూర్తే 'ఆది వరాహమూర్తి' అని ఈ సందర్భంలో గుర్తు చేసుకోవడం గూడా సముచితమే !

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) విశుక్రుని చంపిన వారాహీదేవత యొక్క విక్రమానికి సంతసించినది.

2) శుక్ర వికార ఆసురీగుణాన్ని - యోగ దండం పట్టి, యోగ మార్గం ద్వారా అరికట్టే - దండనాథ అయిన వారాహీదేవి పరాక్రమానికి సంతోషించునది.

## 77. కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరా

ఇది అమ్మవారి 77వ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరాయైనమః'' అని చెప్పాలి. ఇది 16 అక్షరాల నామం.

కామేశ్వర = కామేశ్వరుని యొక్క; ముఖాలోక = ముఖమును చూచినంత మాత్రమున; కల్పిత = కల్పింపబడిన, శ్రీ గణేశ్వరా = గణపతిని గలది.

విశుక్రుడు 'జయవిఘ్నము' అనే శిలాయంత్రాన్ని ప్రతిష్ఠిస్తే - శక్తి సైన్యం అంతా చైతన్య రహితం అయింది. ఆ సంగతిని శ్యామలా, వారాహీ దేవతలు అమ్మవారికి తెలిపితే - అప్పుడు అమ్మవారు గణేశ్వరోత్పత్తిని ఉద్దేశించి, కామేశ్వరుణ్ణి మందస్మితంతో ఒక్కసారి చూచింది. ఆ చూపు ఫలితంగా గణపతి ఆవిర్భావం జరిగింది.

ఒక పనిని తలపెట్టి కార్యోన్ముఖులమైనప్పుడు - అవరోధాలు రావచ్చు. ('శ్రేయాంసు బహువిఘ్నాని' - అని గదా ఆర్యోక్తి''' విఘ్నాలు రాకుండాను, లేకుండాను కార్యం సంపూర్ణమయేందుకు - విఘ్నేశ్వరుణ్ణి ఆహ్వానించి, ఆరాధించాలి''. అనే విషయం ఈ నామం ద్వారా వ్యాసుల వారు మనకు సలహా ఇస్తున్నారని తెలుసుకోవాలి.

1) 'కామేశ్వరుని ముఖాన్ని ఆలోకించినంత మాత్రాన గణేశ్వరుని పుట్టించినది. లేదా కామేశ్వరుడు అమ్మవారి ముఖమును చూచుటతోడనే పుట్టిన గణపతి గలది'. - అని ఈ నామానికి అర్థం.

## 78. మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా

ఇది అమ్మవారి 78వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితాయై నమః'' అని చెప్పాలి.

మహాగణేశ = మహా గణపతి చేత, నిర్భిన్న = నశింపచేయబడిన, విఘ్నయంత్ర = జయ విఘ్నయంత్రమునకు; ప్రహర్షితా = మిక్కిలి సంతోషించినది.

విశుక్రుడు ప్రయోగించిన విఘ్నయంత్రాన్ని గణపతి నశింపచెయ్యడం చూసి, అమ్మవారు బాగా సంతోషించింది. గణపతి చేసిన ఈ సత్కార్య సహకారానికి సంతోషించిన సమయంలోనే ''ఏ కార్యానికైనా ముందుగా గణపతిని పూజించాలి'' అని, గణపతికి కృతజ్ఞతా పూర్వకంగా ఒక వరాన్ని ప్రసాదించి, ఆశీర్వదించింది. సర్వ కర్మలకు ఆరంభంలో విఘ్నేశ్వర పూజ చెయ్యడం మన అందరికీ తెలిసిన విషయమే గదా!

1. 'విశుక్రుడు ప్రయోగించిన జయ విఘ్న యంత్రాన్ని గణేశుడు నశింప జేసినందుకు మిక్కిలి సంతోషించినది' - అని ఈ నామానికి అర్థం.

## 79. భండాసురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్ర వర్షిణీ

ఇది అమ్మవారి 79వ నామం. ఇది16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''భండాసురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్ర వర్షిణ్యై నమః'' అని చెప్పాలి.

భండాసురేంద్ర = రాక్షసరాజైన భండాసురుని చేత, నిర్ముక్త = ప్రయోగింపబడిన, శస్త్ర = శస్త్రములకు, ప్రత్యస్త్ర = విరుగుడు అస్త్రములను, వర్షిణీ = కురిపించునది.

విశుక్రుడు ప్రయోగించిన విఘ్న యంత్రాన్ని మహా గణేశుడు నశింప చెయ్యంగానే - దేవతా శక్తి సైన్యాలు చైతన్యవంతమై, భండాసురుని సైన్యంపై తిరగబడి, యుద్ధం చేశాయి. భండాసురుడు, ఇంకా అతని కొంత సైన్యం మాత్రమే మిగిలింది. ఇక భాధం

లేదని భండాసురుడు రంగంలోకి దిగాడు. ఎన్నో రకాల అస్త్ర శస్త్రాలను ప్రయోగించాడు. వాటన్నిటికీ అమ్మవారు ప్రతికూలమైన అస్త్రాలను ఒక్కుమ్మడిగా వర్షింపచేసి, వాటన్నిటినీ నిరోధించి, నాశనం చేసింది.

శస్త్రం వేరు, అస్త్రం వేరు. ''ధృత్వా ప్రహరణం శస్త్రం'', ముక్త్వాత్వస్త్ర మితీరితమ్'' అనే శ్లోకం ఈ రెంటికీ గల భేదాన్ని వివరిస్తుంది. ఈ శ్లోకార్థాన్ని బట్టి 'చేత్తో పట్టుకుని ప్రయోగించే దాన్ని' – 'శస్త్రం' అనీ, 'మంత్ర యుక్తంగా ప్రయోగించే సూక్ష్మమైన దానిని' 'అస్త్రం' అనీ అంటారు.

ఆధునిక వైజ్ఞానిక యుగంలో కేవలం మిసైల్స్, యాంటీ మిసైల్స్, క్షిపణులు, ఫిరంగులు మొదలైన శస్త్రాలే తెలుసుగాని అస్త్రాలకు సంబంధించిన జ్ఞానం ఇంకా పరిశోధింపబడలేదు. శస్త్రాలు భౌతికం కాబట్టి అప్పుడప్పుడు పనిచెయ్యడంలో తేడా రావచ్చును. కాని మంత్రయుక్తమైన అస్త్రాలు పనిచెయ్యక పోవడం వుండదు. సంకల్పించి చేత్తో ప్రయోగించిన తరువాత భౌతికంగా కల్ప జగత్తులో పని చేసేవి శస్త్రాలు. అసలు సంకల్పాన్నే నిరోధించేవి అస్త్రాలు. (అయితే అస్త్రానికి సంబంధించిన 'మంత్రం' గుర్తు రాకపోతే అస్త్రంగూడా పనిచెయ్యదు (భారతంలో కర్ణుడికి జరిగినట్లు))

మంత్ర వాఙ్మయము, జ్ఞప్తి, ఇవన్నీ అమ్మవారే కాబట్టి, అమ్మవారికి అస్త్రం పనిచెయ్యకపోవడం వుండదు. అవతల భండాసురుడు ప్రయత్నంతో సాధించినవి కాబట్టి – పనిచెయ్యకపోవడం జరగవచ్చును. భండాసురుడు ప్రయోగించిన అస్త్రాలు – అందుకు విరుగుడుగా అమ్మవారు ప్రయోగించిన ప్రత్యస్త్రాలు – అనుబంధంలో ఇవ్వబడ్డాయి.

ఈ నామానికి ఈ అర్థాలు చెప్పుకోవచ్చు.

1. భండాసురుడు ప్రయోగించిన అస్త్ర శస్త్రాలకు ప్రత్యస్త్రములను వర్షించినది.

2. 'దుస్సంకల్పములు' – అనే అసురాస్త్ర, శస్త్రాలను మూలంలోనే వికల్పంచేయునది.

# 80. కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః

ఇది అమ్మవారి 80 వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''కరాంగుళినఖోత్పన్ననారాయణ దశాకృత్యై నమః'' అని చెప్పాలి.

కరాంగుళి = చేతివ్రేళ్ళ; నఖోత్పన్న = గోళ్ళనుండి పుట్టిన, నారాయణ = విష్ణుమూర్తి యొక్క; దశాకృతిః = దశావతారములు గలది.

అమ్మవారి రెండు చేతివ్రేళ్ళ పదిగోళ్ళనుండి నారాయణుని పది అవతార మూర్తులు – అంటే – మత్స్య, కూర్మ, వరాహాది అవతార మూర్తులు ఉత్పన్నమైనట్లు ఈ బ్రహ్మాండ పురాణంలో వుంది. అటువైపు నుండి భండాసురుడు 'సర్వాసురాస్త్రాన్ని ప్రయోగించినపుడు – సోమక, హిరణ్యాక్ష, హిరణ్యకశిపు, రావణాది రాక్షసులు పుట్టి – శక్తిసేనలతో యుద్ధానికి సన్నద్ధులైతే – అమ్మవారి చేతి వ్రేళ్ళ గోళ్ళనుండి పుట్టిన ఆ పది అవతారమూర్తులు వారిని సంహరించారు. అంటే – అమ్మవారు నోరు గూడా మెదపకుండా, చెయ్యివ్రేలు గూడా ఉపయోగించకుండా, అవసరమైనపుడు గోరు కదిపితే చాలు గొప్ప గొప్ప అవతారమూర్తులే పుట్టి 'ఏం చెయ్యమంటారు' ? అని ఎదురుగా నిలబడతారన్నమాట ! అమ్మవారు అంతటి శక్తి స్వరూపిణి అని తెలుసుకోవాలి.

'దశ' – అంటే 'అవస్థ' అని, 'కృతి' – అంటే 'కృత్యం' అనీ అర్థాలు చెప్పుకుంటే – ఈ నామానికి వేరొక అర్థం చెప్పుకోవచ్చును. దేవుడైన నారాయణుని అంశలే జీవులు. కాబట్టి, అటు – దేవుని పరంగా నారాయణునికి పంచకృత్యాలుంటాయి. వాటిని – 'సృష్టి, స్థితి, లయ, తిరోధాన అనుగ్రహా'లంటారు. ఇటు – జీవుని పరంగా పంచ అవస్థలుంటాయి. వాటిని – 'జాగ్రత్, స్వప్న, సుషుప్తి, మూర్ఛ, మరణాలు' అంటారు. కాబట్టి, మొత్తం మీద నారాయణునికి దైవలక్షణంగా ఐదు కృత్యాలు, జీవి లక్షణంగా ఐదు అవస్థలు వుంటాయి. ఈ పదీ – అమ్మవారి రెండు చేతి వ్రేళ్ళపది గోళ్ళనుండి రూపుదాల్చినట్లుగా అర్థం చెప్పుకోవచ్చును.

మొత్తం మీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) రెండు చేతుల వ్రేళ్ళ గోళ్ళ నుండి – ఉద్భవించిన నారాయణుని పది అవతార మూర్తులను కలిగినది.

2) రెండు చేతుల వ్రేళ్ళ నుండి అటు – జీవుని పరముగాను, ఇటు – దేవుని పరము గాను నారాయణుని దశా (అవస్థల) కృతుల (కృత్యముల) పుట్టుక కలిగినది.

## 81. మహాపాశుపతాస్త్రాగ్ని నిర్ధగ్ధాసుర సైనికా

ఇది అమ్మవారి 81వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''మహాపాశుపతాస్త్రాగ్ని నిర్ధగ్ధా సురసైనికాయై నమః'' అని చెప్పాలి.

మహాపాశుపత = మహాపాశుపతము అను; అస్త్ర = అస్త్రము యొక్క, అగ్ని = అగ్నిచేత; నిర్దగ్ధ = నిశ్శేషంగా దహింపబడిన, అసుర సైనికా = రాక్షస సైన్యము గలది.

చాలామంది యుద్ధంలో పోయినప్పటికీ, భండాసురుని సైన్యం ఇంకా కొంత మిగిలి వుంది. మిగిలిన సైన్యంలో ఒక్కరు గూడా మిగలకుండా – ఒకే ఒక అస్త్రంతో అమ్మవారు అందరినీ దహించి వేసింది. ఆ అస్త్రమే 'పాశుపతాస్త్రము' పాశుపతాస్త్రాలు రెండు విధాలైనవి వుంటాయి. ఒకటి – 'పాశుపతం'. దీనికి 'శివుడు' లేదా ఈశ్వరుడు అధిదేవత. రెండవది 'మహాపాశుపతం' దీనికి 'సదాశివుడు' అధిదేవత. ఇది పరమాణు బాంబు, (Atombomb), హైడ్రోజన్ బాంబు (Hydrogen bomb) లాంటిది. ఎంతో అవసరమైన సందర్భాల్లోగాని దీనిని ప్రయోగించకూడదు. అందుకే విజ్ఞత, వివేకము గల వారికి మాత్రమే ఈ అస్త్రాన్ని ఉపదేశించాలి. (పరమాణు బాంబును ఉపయోగించకూడని సందర్భంలో, ఉపయోగించకూడని చోట రెండవ ప్రపంచ యుద్ధములో ప్రయోగించడం వల్లనే జపాన్ దేశంలోని హీరోషిమా, నాగసాకీ పట్టణాలు, పట్టణ ప్రజలు అందరూ ధ్వంసమయ్యారు. ఇప్పటికీ దాని ప్రభావం ఇంకా వుందనే అంటారు.)

అజ్ఞాన, ఆసురీభావాలు పెచ్చు పెరిగిపోయి, జీవుని అస్థిత్వానికే ముప్పు కలిగేట్లుగా వున్నప్పుడు మాత్రమే అమ్మవారు అనే 'జ్ఞానదేవత' ఈ మహాపాశుపతాస్త్రాన్ని ప్రయోగించి, వాటిని నిర్మూలన చేసి, జీవుని ఒడ్డున పడేస్తుంది.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) మహా పాశుపతాస్త్ర అగ్నికి నిశ్శేషంగా ఆహుతి అయిన అసురసైన్యం గలది.
2) అజ్ఞాన, ఆసురీ భావాలను ఒకే ఒక అద్వితీయమైన సంకల్ప శక్తితో అంతం చేసినది.

## 82. కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ సభండాసుర శూన్యకా

ఇది అమ్మవారి 82వ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు "కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ సభండాసుర శూన్యకాయైనమః" అని చెప్పాలి. ఇది16 అక్షరాల నామం.

కామేశ్వరాస్త్ర = కామేశ్వరాస్త్ర ప్రయోగముతో, నిర్దగ్ధ = నిశ్శేషంగా దహింపబడిన, సభండాసుర శూన్యకా = భండాసురునితో కూడిన శూన్యక నగరము గలది.

భండాసురుని వైపు వున్న రాక్షస సైన్యం అంతా వధింపబడింది. ఇంక ఒక్క భండాసురుడు మిగిలాడు. అతనితో పాటు పట్టణమైన 'శూన్యకానగరము' మిగిలింది. ఈ శూన్యకానగరంతోసహా భండాసురుడు అమ్మవారు ప్రయోగించిన అస్త్రరాజమైన కామేశ్వరాస్త్రంతో నిశ్శేషంగా దహింపబడతాడు. ఈ కామేశ్వరాస్త్రం ప్రళయాగ్నిలాంటిది. ప్రళయం వస్తే ఇంకా ఏదీ ఎలా మిగలదో - ఈ అస్త్రం ప్రయోగిస్తే గూడా అంతే! బ్రతకాలంటే మళ్ళీ పుట్టవలసిందే! పుట్టగతుల్లేకుండా గూడా చేసేది ఈ కామేశ్వరాస్త్రం.

మనలో అజ్ఞాన ఆసురీభావాలకు మూలకారణమైన వాడే ఈ భండాసురుడు. 'అసలు వుండకూడని దాన్ని తాత్కాలికంగా ఉన్నట్టుగా భ్రమింప జేసేవాడే' ఈ భండాసురుడు. అలా ఉండకూడనిది ఉన్నట్టుగా వుండే అతని నగరాన్ని 'శూన్యకా' అనే పేరుతో పిలుస్తారు. ఈ కామేశ్వ రాస్త్ర ప్రయోగానికి 'సహేంద్ర తక్షకాయ స్వాహా!' అన్నట్లు భండాసురునితో పాటు, అతని నగరం గూడా నామరూపాల్లేకుండా దహించుకుపోయింది. అంటే - వాడు, వాడి నగరం - కామేశ్వరునిలోకి లీనమై

పోయాయని అర్థం. 'చీకటి పోవడం' అంటే – 'చీకటి వెలుగుగా మారడం' అనే అర్థం. సూర్యుని సన్నిధిలో చీకటి పటాపంచలై, సూర్యుని వెలుగులోకి లీనమై పోతుంది గదా! అలాగే, జ్ఞాన ప్రబోధం వలన తెలివికి మెలకువ వస్తే, ఇంక అజ్ఞానానికి తావు వుండదు. అలాగే, స్వచ్ఛమైన ప్రేమామృతంలో ద్వేషం లీనమౌతుంది. మొత్తం మీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) కామేశ్వరాస్త్ర ప్రయోగానికి నిశ్శేషంగా భండాసురునితో పాటు దగ్ధమై పోయిన శూన్యకా పట్టణం గలది.
2) స్వచ్ఛమైన ప్రేమామృతంలో, నిర్మలమైన జ్ఞానాగ్నిలో – లీనమైన అహంకార, అజ్ఞాన స్థావరం కలిగినది.

## 83. బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవ సంస్తుత వైభవా

ఇది అమ్మవారి 83వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు "బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవ సంస్తుత వైభవాయైనమః" అని చెప్పాలి.

బ్రహ్మ + ఉపేంద్ర, మహేంద్రాది = బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలైన; దేవ = దేవతల చేత; సంస్తుత = స్తుతింపబడిన; వైభవా = పరాక్రమ వైభవం గలది.

దేవకార్య నిమిత్తమై చిదగ్ని కుండంలో ఉద్భవించిన జగజ్జనని – భండాసురుణ్ణి, వాడి సైన్యాన్ని, వాళ్ళుండే పట్టణంతో సహా నామరూపాల్లేకుండా దహించి వెయ్యడం జరిగింది. అసురుని బాధలు పడలేక మొరపెట్టుకున్న బ్రహ్మోపేంద్ర మహేంద్రాదులందరూ అమ్మవారికి కృతజ్ఞత తెలుపుకుంటూ స్తుతించారు. ఈ నామంతో ఒక ఘట్టం పూర్తయినట్లు లెక్క వేసుకోవచ్చును.

'బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలైన దేవతల చేత స్తుతింపబడిన వైభవము గలది' అని ఈ నామానికి అర్థం.

## 84. హరనేత్రాగ్ని సందగ్ధ కామ సంజీవ నౌషధిః

ఇది అమ్మవారి 84వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో

అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''హర నేత్రాగ్ని సందగ్ధ కామ సంజీవ నౌషధ్యై నమః'' అని చెప్పాలి.

హర = శివుని యొక్క; నేత్రాగ్ని = లలాట నేత్రాగ్నికి (మూడవ కంటికి) సందగ్ధ = నిశ్శేషంగా దహింపబడిన; కామ = మన్మథునికి, సంజీవన = సంజీవనము వంటి; ఔషధిః = మందువలె పనిచేయునది, అనగా – పునర్జీవనమును ప్రసాదించునది.

ఈ నామం నుండి అమ్మవారి మంత్రరూపానికి సంబంధించిన వివిధ నామాలు, వాటి అంతరార్థాలు చెప్పబడతాయి. ఇందుకు ముందుగా – 'అయ్యవారి ఆగ్రహం', 'అమ్మవారి అనుగ్రహం' గురించి తెల్పే నామం చెప్పబడుతుంది. ఆ నామమే ''హరనేత్రాగ్ని సందగ్ధ కామ సంజీవ నౌషధిః'' అనే ప్రస్తుత నామం. ఈ నామానికి సంబంధించిన ఒక కథ ఉంది.

ఇంద్రుని ఆజ్ఞపై మన్మథుడు రతీదేవితో కలిసి, శివునికి పార్వతిపై మోహాన్ని కలుగజేయడానికి ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో శివుని ఫాలనేత్రానికి ఆహుతి అయి, శరీరాన్ని కోల్పోతాడు. రతీదేవి విలపించి, పార్వతిని పతి భిక్షపెట్టమని ప్రాధేయపడుతుంది. అప్పుడాతల్లి కరుణించి, ఇతరులకు కనబడకపోయినా – రతీదేవికి మాత్రం మన్మథుడు సశరీరంగా కనబడేటట్లు వరమిస్తుంది. ఆనాటి నుండి మన్మథుడు 'అనంగుడు', అంటే – శరీరం లేనివాడయ్యాడు. కాని, రతీదేవికి మాత్రం కనబడతాడు. కాబట్టి, ఆమెకు వైధవ్యం తప్పింది – ఇదీ కథ. తండ్రి శిక్షిస్తే పిల్లవాణ్ణి తల్లి సముదాయించడాన్ని తెలిపే ఈ కథలో రెండు రకాల అంతరార్థాలున్నాయి.

హరుడు అంటే – 'శివుడు'. ఈ శివునికి మూడు నేత్రాలు. మూడో నేత్రం ఫాలభాగంలో వుంటుంది. కుడికన్ను సూర్యాత్మకమైతే, ఎడమకన్ను చంద్రాత్మకం, ఈ ఫాలనేత్రం అగ్ని తత్త్వాత్మకం. అగ్ని శుద్ధి జరిగితే అసలు విషయం తెలుస్తుంది. అందుకే, శివుని ఈ మూడో కన్ను జ్ఞానాగ్ని. (ఈ ప్రాంతం వద్దే ఆజ్ఞా చక్రం వుంటుంది). కామం నిండి వున్నప్పుడు – కన్నూ, మిన్నూ కానరాదు. మంచి చెడులను విడమరచి చెప్పే విచక్షణ వుండదు. మన్మథుణ్ణే 'కాముడు' అని గూడా అంటారు. ఈ కాముడు కామానికి సంకేతం. శివుని మూడోకన్ను జ్ఞానాగ్నికి సంకేతం. హరనేత్రాగ్నికి కాముడు దగ్ధమవడమంటే – శివుని ఆగ్రహం ద్వారా కామదహనం జరిగి, జ్ఞానోదయం కలగడం–

అని అర్థం. కాబట్టి, కామదహనానికి అయ్యవారైన శివుని ఆగ్రహం అవసరం అని తెలుస్తోంది.

ఇక అమ్మవారి అనుగ్రహం. మన్మథుడు దహింపబడిన తరువాత, రతీదేవి ప్రార్థించగా, రతీదేవికి మాత్రమే కనబడేట్టుగా వరమిచ్చి, రతీదేవికి వైధవ్యాన్ని తొలగించటం – అమ్మవారి అనుగ్రహాన్ని సూచిస్తుంది. ఈ అనుగ్రహం ఎంతటిదంటే – నిశ్శేషంగా దహింపబడి, బూడిద అయిపోయిన మన్మథుణ్ణి గూడా – తిరిగి పునర్జీవితుణ్ణి చేయగలిగినంతటిది. మరి, అలాంటప్పుడు ఈ అనుగ్రహం మాడిపోయిన మన్మథుని పట్ల సంజీవని ఔషధం వంటిది అనడంలో తప్పేముంది.

ఈ నామంలో ఈ ఆగ్రహ, అనుగ్రహాల రెంటికీ సంబంధించిన గాథలు కూర్పు చేయబడ్డాయి. ఇక 'రతీ – మన్మథుల' గురించిన అంతరార్థం చూద్దాం.

మన్మథుని భార్య – రతీదేవి. అందానికి, ఆనందానికి వీరిది చాలా అనుకూల దాంపత్యము – 'రతి' అంటే 'ఆసక్తి'. 'మన్మథము' అంటే 'మానసిక మథనము' – అంటే – 'అనుభూతి'. కాబట్టి, ప్రతి వ్యక్తిలోను ఆసక్తిని రేకెత్తించేది 'రతి' కాగా – 'అనుభూతి'ని ప్రసాదించేది 'మన్మథుడు'. అందువల్లనే ఈ 'రతీ – మన్మథు'లిద్దరూ ప్రతి వ్యక్తిలోని 'ఆసక్తి – అనుభూతులకు' ప్రతీకలు, అంటే – సంకేతాలు.

ఆసక్తి అంటే కోరిక లేదా కుతూహలం. ఆసక్తి కలిగినవాడు – ఆ ఆసక్తి దేని మీద కలిగిందో దాన్ని పొంది, అనుభవించినపుడు – వాడికే ఆనందం కలుగుతుంది. అంటే – అనుభూతి అనే మన్మథుడు, ఆసక్తి అనే రతీదేవికే తెలుస్తాడు గాని ఇతరులకు తెలియడు. ఇది నిజమే! ఒక అనుభూతి మరి ఒకరికి ఎలా తెలుస్తుంది? అనుభూతి కేవలం వ్యక్తిగతం(Purely Personal and Subjective) అని చెప్పడం కోసమే 'అనుభూతి అనే మన్మథుడు – ఆసక్తి అనే రతీదేవికి తప్ప ఇతరులకు కనబడడు' – అని ముందు చెప్పి కథలో చెప్పడం. కలలో అయినా, ఇలలో అయినా ఇది సత్యమే! ఉదా : ఒకే మంచంలో కలిసి నిద్రించే ఇద్దరిలో ఒకరు కలలో తుపాకీ పేలిన ధ్వని విన్నప్పటికీ – ప్రక్కనే నిద్రించే రెండవ వానికి ఏమాత్రం వినిపించదు. ఉదా: ఒకడు ఒక పండు తిని ఆనందానుభూతిని పొందితే, ఆ అనుభూతి పండు తినే వాడికే తెలుస్తుంది గాని, ఎదుటివాడికి తెలియదు. ఈ రెండు ఉదాహరణల్లో రెండో వాడికి తెలియనంత మాత్రాన

మొదటి వాడికేమీ నష్టం లేదు. అలాగే ఇతరులకు మన్మథుడు కనబడకపోయినా, రతీదేవికి నష్టం జరగలేదు. శరీరం అస్థిరం, ఆత్మసుస్థిరం అని కూడా ఈ మంత్రం సూచిస్తుంది. 'సృష్టి పునరావృతం అవుతూనే వుంటుంది' అని గూడా సూచిస్తుంది. ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) హరుని ఫాలనేత్రాగ్నికి నిశ్శేషంగా దహింపబడిన మన్మథుణ్ణి పునర్జీవితుని చేయుటలో 'సంజీవని ఔషధము' వంటిది.

2) హరుని ఆగ్రహంతో అంతమైన సృష్టికార్యానికి – పునర్జీవనాన్ని అనుగ్రహించినది.

3) హరుని వల్ల కామదహనం జరిగితే – ప్రేమౌషధంతో ఉపశమనాన్ని కలుగజేయునది.

4) కామ ప్రకోపాన్ని తొలగించి, ప్రేమ ప్రమోదాన్ని కలుగజేయునది.

## 85. శ్రీమద్వాగ్భవ కూటైక స్వరూప ముఖపంకజా

ఇది అమ్మవారి 85వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు "శ్రీమద్వాగ్భవకూటైక స్వరూపముఖ పంకజాయై నమః" అని చెప్పాలి.

శ్రీమత్ = మంగళకరమైన, లేదా – మహిమాన్వితమైన, వాగ్భవ = 'వాగ్భవము' అను పేరుగల, కూట = అక్షర సముదాయమే, ఏక = ముఖ్యమైన; స్వరూప = స్వరూపముగాగల; ముఖపంకజా = పద్మము వంటి ముఖము గలది.

అమ్మవారి స్వరూపాన్ని నాలుగు విధాలుగా గుర్తించవచ్చును. 1. స్థూలరూపం 2. సూక్ష్మరూపం 3. సూక్ష్మతర రూపం 4 సూక్ష్మతమ రూపం

1. భౌతికమైన అవయువాలతో కూడిన అమ్మవారి దేహం స్థూలరూపాన్ని తెలియజేస్తుంది. 2. పంచదశీ మంత్రాక్షరాలచే సూచింపబడేది అమ్మవారి సూక్ష్మరూపం. 3. కామకళాక్షరాలచే సూచింపబడేది అమ్మవారి సూక్ష్మతర రూపం. 4. కుండలినీ రూపమే అమ్మవారి సూక్ష్మతమ రూపం.

స్థూలరూపంతో అమ్మవారు ఏం చేసినది ఇంతకు ముందు నామాల్లో చెప్పబడింది. ఇక నుండి పంచదశాక్షరీ, మంత్రాక్షరాలచే సూచింపబడే సూక్ష్మ రూపాన్ని గురించి చెప్పబడుతుంది.

''క, ఏ, ఈ, ల, హ్రీం - స, క ల హ్రీం - హ, స, క, హ, ల, హ్రీం'' అని మూడు కూటములుగా 15 అక్షరాలతో కూడిన ఈ మంత్రాక్షరాలకు ఒక రూపాన్ని ఊహిస్తే - ఆ రూపం అమ్మవారి సూక్ష్మరూపం ఔతుంది.

వ్యక్తమయే సృష్టిని శుక్ల పక్ష తిథులతోను, అవ్యక్తమయే సృష్టిని కృష్ణపక్ష తిథులతోను సమన్వయ పరిస్తే - శుక్ల పక్ష తిథులు 15, కృష్ణపక్ష తిథులు 15 వరుసగా బ్రహ్మాండంలోను, పిండాండములోను; ఆదిభౌతిక, ఆధ్యాత్మిక అంగాలను తెలియ జేస్తాయి. ఇవి ఐదు చొప్పున మూడు వర్గాలుగా బ్రహ్మాండంలోను, 5 చొప్పున మూడు వర్గాలుగా పిండాండములోను వుంటాయి. 'పృథివి, అంతరిక్షము, వెలుగుల లోకము, దిక్కులు, అవాంతర దిక్కులు' - ఈ ఐదు - లోక పాంక్తాన్ని; 'అగ్ని, వాయువు, ఆదిత్యుడు, చంద్రుడు, నక్షత్రాలు' - ఈ ఐదు - దేవతా పాంక్తాన్ని; 'జలములు, ఓషధులు, వనస్పతులు, ఆకాశము, ఆత్మ' - ఈ ఐదు - భూపాంక్తాన్ని తెలియజేస్తాయి. ఇలా పాంక్తాలుగా చెప్పిన మూడు వర్గాలను - ఆదిభౌతికమైన లేదా 'బాహ్య పాంక్త త్రయం' అంటారు. (పాంక్తం అంటే ఐదు అని అర్థం)

'ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము' - ఈ ఐదు - 'వాయుపాంక్తాన్ని; నేత్రము, శ్రోత్రము, మనస్సు, వాక్కు, శరీరం' - ఈ ఐదు - ఇంద్రియ పాంక్తాన్ని; చర్మము, మాంసము, స్నావ, అస్థి, మజ్జా' - ఈ ఐదు - ధాతుపాంక్తాన్ని తెలియజేస్తాయి. ఇలా పాంక్తాలుగా చెప్పిన మూడు వర్గాలను 'ఆధ్యాత్మిక పాంక్తత్రయుం' అంటారు. ప్రపంచమంతా ఈ ఆదిభౌతిక, ఆధ్యాత్మిక పాంక్తత్రయ రూపాల చేతనే ఉంటుంది.

అమ్మవారు సృష్టిస్వరూపిణిగా 5X 3 = 15 అక్షరాలతో సంకేతింపబడే మంత్రమే - పంచదశాక్షరీ మంత్రం. (పక్షంలోని తిథులకు, మన్వంతరాలకు గూడా సమన్వయం వుంది) ఈ మంత్రరూపం అమ్మవారి సూక్ష్మరూపాన్ని తెలియజేస్తుంది. ఈ పంచదశాక్షరీ

మంత్రంలోని మొదటి వర్గానికి లేదా కూటానికి చెందిన ''క, ఏ, ఈ, ల, హ్రీం'' అనే ఐదు అక్షరాల కూటమును ''వాగ్భవ కూటము'' అంటారు. ఈ కూటమి 'క' అనే అక్షరంతో ప్రారంభం అయినది కాబట్టి, 'కాది కూటము' అని గూడా అంటారు. ఈ కూటము కంఠం నుండి పై భాగంలో వుండే అమ్మవారి వదనాన్ని సూచిస్తుంది. ఈ కూటములో అమ్మవారి కంఠము, పెదవులు, కన్నులు, చెవులు – వీటితో కూడి వాక్కులను కలిగించే ముఖాన్ని – సూచిస్తుంది. ఈ ముఖాన్ని పద్మంతో పోల్చారు. 'కాడతో ఉన్న పద్మంతో' – 'కంఠంతో కూడిన అమ్మవారి ముఖాన్ని' – సరి పోల్చుకోవాలి. వెలుగు యొక్క వైభవమంతా – పద్మం యొక్క వికాసంతో ఎలా తెలుస్తుందో, వాగ్వైభవమంతా – ముఖం (ముఖం అంటే సంస్కృతంలో నోరు అని అర్థం) ద్వారా వ్యక్తమౌతుంది. పంచాదశాక్షరీ మంత్రంలోని వాగ్భవకూటమును ''శ్రీ'' తో కూర్పుచేసినపుడు 'శ్రీమత్ వాగ్భవకూటము'' అవుతుంది. ఈ కూటమును సూచించే అమ్మవారి ముఖాన్ని ధ్యానించినా, దర్శించినా సమస్త విద్యలను ప్రసాదిస్తుంది. వాక్కుతో సాధించగలిగే సమస్త వ్యాపారాలను లాభదాయకంగా, శుభదాయకంగా సాధించి పెడుతుంది. మోక్షాన్ని ప్రసాదిస్తుంది. వాగ్భవ బీజాక్షరం – 'ఐం'. ఇక రెండవ కూటము గురించి తర్వాత నామంలో వివరింపబడుతుంది.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) శ్రీ తో కూడిన లేదా మంగళకరమైన వాగ్భవ కూటము ద్వారా సూచింపబడే ముఖ పద్మాన్ని కలిగినది.

2) వాగ్వైభవ సంపన్నతను, విద్యాసముపార్జనను, శుభకర మైన మోక్షప్రాప్తిని సూచించు – వాగ్భవ కూట మును – సూక్ష్మ రూపమునందు ముఖముగా కలిగినది.

## 86. కంఠాధః కటిపర్యంత మధ్యకూటస్వరూపిణీ

ఇది అమ్మవారి 86వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''కంఠాధః కటిపర్యంత మధ్యకూట స్వరూపిణ్యై నమః'' అని చెప్పాలి.

కంఠ = కంఠము యొక్క, అధః = క్రిందనుండి, కటి = నడుము లేదా నాభి ప్రదేశము, పర్యంత = వఱకు గల శరీరమును, లేదా – దేహమును, (పంచదశీ మంత్రములోని) మధ్యకూట స్వరూపిణీ = మధ్యకూట స్వరూపముగా గలది.

పంచదశీ మంత్రములో మధ్యగా ఉన్న కూటము అయిన ''హసక హలహ్రీం'' అను బీజాక్షర సముదాయము – కంఠం క్రింది భాగం నుండి నడుము, లేదా – నాభివరకు ఉండే అమ్మవారి సూక్ష్మ శరీర భాగాన్ని సూచిస్తుంది. 'హ'తో ప్రారంభమయే ఈ కూటాన్ని 'హాది కూటము' అంటారు. దీనినే 'కామరాజ కూటము' అని గూడా అంటారు. 'కామరాజు' అంటే 'కామేశ్వరుడు' అని అర్థం. సృష్టి ప్రక్రియను సూచించే కామాన్ని ''మహాకామం' అంటారు. ఈ మహా కామానికి అధిపతి మహాకామేశ్వరుడు. ఈ కామేశ్వరునికి స్థానం మనలో హృదయంలోని దహరాకాశమే !

'ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి' – గీత. కంఠానికి కటి ప్రదేశానికి మధ్యనే హృదయం వుంటుంది. ఆ హృదయ దహరాకాశంలోనే కామేశ్వరుడుంటాడు. కాబట్టి, ఈ మధ్యకూటాన్ని 'కామారాజ కూటము' అంటారు. ఆపేక్షలకు, అనురాగాలకు, ప్రేమకు, రాగానికి ఈ హృదయమే కేంద్రం కాబట్టి, ఈ హృదయం – 'కంఠం, కటి భాగాల మధ్యలో' వుంది కాబట్టి, ఈ మధ్య కూటాన్ని 'కామరాజ కూటము' అంటారు.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) కంఠం క్రింది నుండి నడుము వరకు గల భాగాన్ని పంచదశీ మంత్రంలోని మధ్యకూట స్వరూపముగా గలది.

2) కామరాజైన కామేశ్వరునికి స్థానమైన, లేదా – ఆపేక్ష అనురాగాలకు కేంద్రమైన హృదయస్థానం వుండే – 'కంఠం, కటి ప్రదేశ మధ్య భాగాన్ని' – మధ్యకూట స్వరూపంగా గలది.

## 87. శక్తి కూటైక తాపన్న కట్యధోభాగ ధారిణీ

ఇది అమ్మవారి 87వ నామం. ఇది 16 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''శక్తికూటైకతాపన్న కట్యధోభాగధారిణ్యై నమః'' అని చెప్పాలి.

శక్తికూట = శక్తి కూటముతో; ఏకతా = సామ్యమును; ఆపన్న = పొందిన; కటి= నడుము యొక్క; అధోభాగ = క్రింది ప్రదేశమును, ధారిణీ = ధరించినది.

పంచదశీ మంత్రములోని మూడవ కూటము అయిన ''సకలహ్రీం'' అనే అక్షర సముదాయాన్ని – 'శక్తి కూటము' అంటారు. ఇది అమ్మవారి కటి ప్రదేశము నుండి క్రిందుగా వున్న దేహభాగాన్ని సూచిస్తుంది. సృజనాత్మక శక్తులుండుటవలన ఈ కూటాన్ని 'శక్తికూటమన్నారు.

ఇంతవరకు చెప్పిన ఈ మూడు కూటములు వరుసగా సువర్లోక, భువర్లోక, భూలోకాలతోను; దేవలోక, మర్త్యలోక, పాతాళలోకాల తోను గూడా సమన్వయ పరచుకొన వచ్చును. పురాణ కథలను ఆధ్యాత్మికంగా చెప్పుకునేప్పుడు గూడా ఈ సమన్వయాన్నే పాటించాలి.

షట్చక్రాలు సహస్రారంతో కలిసి ఏడుచక్రాలౌతాయి. ఈ ఏడు చక్రాలను పటం –5లో చూపించిన విధంగా గూడా రెండు త్రిభుజాలు, మధ్య కేంద్ర బిందువులాగా సమన్వయిస్తారు.




సహస్రార, ఆజ్ఞా, విశుద్ధి చక్రాలతో కూడి, పైకి శీర్షం (Apex) వుండే త్రిభుజాన్ని 'ఊర్ధ్వ త్రికం' (Higher Triad) అనీ, మణిపూరక, స్వాధిష్ఠాన, మూలాధారాలతో కూడి, క్రిందికి శీర్షం వుండే త్రిభుజాన్ని అధో త్రికం(Lower Triad) అనీ, ఈ రెండు త్రిభుజాలకు ఆధార బిందువు (fulcrum) లాగా వుండే కేంద్రాన్ని 'అనాహతం' అనీ సమన్వయించుకుంటే –

ఊర్ధ్వ త్రికం – 'వాగ్భవ కూటాన్ని', అధో త్రికం – 'శక్తి కూటాన్ని', అనాహత కేంద్రంతో మధ్య వుండే భాగాన్ని – 'కామరాజ కూటము' లేదా 'మధ్యకూటాన్ని – సూచిస్తాయి

'సృజనాత్మక శక్తులు గల నడుము క్రింది భాగమును శక్తి కూటముగా గలది' అని ఈ నామానికి అర్థం.

## 88. మూలమంత్రాత్మికా

ఇది అమ్మవారి 88వ నామం. ఇది 6 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''మూలమంత్రాత్మికాయైనమః'' అని చెప్పాలి.

మూలమంత్ర = మూలమంత్రమును, అనగా – పంచదశాక్షరీ మంత్రమును; ఆత్మికా = ఆత్మస్వరూపముగా కలది.

పంచదశాక్షరీ మంత్రాన్నే 'మూలమంత్రం' అంటారు. సర్వసిద్ధి ప్రదమవడం వలన దీన్ని మూలమంత్రంగా స్వీకరిస్తారు. అన్ని మంత్రాలూ ఈ పంచదశీ మంత్రానికి అంగ మంత్రాలే అవుతాయి. కాబట్టి, ఈ పంచదశీ మంత్రాన్ని మూలమంత్రం (మూలవిరాట్‌లాగా) అంటారు. ఈ మంత్రంలోని బీజాక్షరాలను – శరీరంలోని ఆయా స్థానాలతో న్యాసం చేసుకొని – మంత్ర దేవతతో ఐక్యరూపాన్ని భావించినవాడు తానుగూడా మంత్రదేవతా స్వరూపుడౌతాడు. అప్పుడు ఆ మంత్రదేవతను అర్చించడానికి సర్వ విధాలా తగినవాడౌతాడు.

'మూలమంత్రమైన పంచదశాక్షరీ మంత్రమే ఆత్మస్వరూపముగా గలది' అని ఈ నామానికి అర్థం.

## 89. మూలకూట త్రయకళేబరా

ఇది అమ్మవారి 89 వ నామం. ఇది 10 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''మూలకూట త్రయ కళేబరాయైనమః'' అని చెప్పాలి.

మూల = మూలమంత్రము యొక్క; కూటత్రయ = కూట త్రయమును, కళేబరా = తన శరీరముగా గలది.

మూలకూట త్రయాలంటే – 'మూలమంత్రమైన – పంచదశాక్షరీ మంత్రం యొక్క మూడు కూటాలు'. అని అర్థం. ఈ మూడు కూటాలను అమ్మవారు తన సూక్ష్మ శరీరంగా కలిగినది.

ఏ మంత్రాన్నైనా, ఏ బీజాక్షరాన్నైనా, మూడుగా విభజించగలిగితే ఆ మూడు భాగాలను మూడు కూటాలుగా అర్థం చేసుకోవాలి. అలాగే ప్రస్తుతం అమ్మవారికి సంబంధించిన పంచదశాక్షరీ మంత్ర బీజాక్షరాలను గూడా మూడు భాగాలు కలిగిన శరీరంగా వూహిస్తే – ఆ శరీరానికి, అమ్మవారి స్థూల శరీరానికి – భేదం లేదని గుర్తించాలి. అప్పుడు మంత్రదేవతా ఉపాసన, అర్చన సార్ధకమౌతాయి.

ఇంతకు పూర్వం చెప్పిన నామంలో 'మూలమంత్రం' ఆత్మలాగాను, ఇప్పుడు చెప్పే నామంలో ఉన్న మూలకూట త్రయాన్ని – కళేబరం, అంటే – 'శరీరం' గాను గూడా సమన్వయం చేసుకోవచ్చును.

ఈ నామానికి – 'మూలమంత్రములోని మూడు కూటాలను తన సూక్ష్మ శరీరంగా కలిగినది' అని అర్థం.

[ఇంతవరకు చర్చింపబడిన మూలమంత్రాన్ని త్రికరణ శుద్ధిగా జపించి, మంత్రదేవతను హృదయంలో స్థాపించుకుంటే – ఆ మంత్రం మనస్సును నడిపే చైతన్యం లాగా పనిచేసి, మనస్సు పరిశుద్ధమౌతుంది. అటువంటి పరిశుద్ధ మనస్సు – ఆత్మలో లీనమైనపుడు ఉండే స్థితిని 'అమావాస్య' తోను (ఆత్మ – సూర్యుడు, మనస్సు – చంద్రుడు), ఆ చైతన్యం – సంపూర్ణ వ్యక్త స్థితిని పొందితే – ఆ స్థితిని 'పూర్ణిమ' తోను సమన్వయ పరచుకోవాలి.]

## ౯౦. కులామృతైక రసికా

ఇది అమ్మవారి 90వ నామం. ఇది 8 అక్షరాల నామం. ఈ నామంలో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''కులామృతైక రసికాయైనమః'' అని చెప్పాలి.

కుల = కులమునకు సంబంధించిన; అమృత = అమృతము నందు, ఏకరసికా = మిక్కిలి ఆసక్తి కలది.

'కులం' అనే పదానికి చాలా అర్థాలున్నాయి. కాని ప్రస్తుత సందర్భాన్ని బట్టి 'కులం' అనే పదానికి మూడు రకాలు అర్థాలు చెప్పుకోవాలి. 1) కు – అంటే 'కువలయం' అంటే – 'భూమి' లేదా పృథివి, ల – అంటే లయం చెందునది. పృథివీతత్త్వం లయం చెందే చోటు మూలాధార చక్రం. ఇది ఒక అర్థం 2) ఈ మూలాధార చక్ర సంబంధం గలిగిన సుషుమ్నామార్గాన్ని గూడా 'కులం' అంటారు. ఇది రెండో అర్థం. ఇక మూడవది 3) సహస్రారంలో ఉండే సహస్ర దళ పద్మాన్ని 'కుల పద్మ' మంటారు. అంటే కులమనే పదానికి 1) మూలాధారం 2) సుషుమ్నామార్గం 3) సహస్రారపద్మం – అని, మూడింటిని అర్థాలుగా చెప్పుకోవచ్చును.

సహస్రార చక్రంలోనే చంద్రమండలం వుంటుంది. ఈ చంద్రమండలం నుండే అమృతం స్రవింపబడి శరీరంలోని సమస్త నాడీ మండలాన్ని చైతన్య వంతం చేస్తుంది. (ఈ విషయం ''సుధాధారాసారైః ... స్వపిషికుల కుండే కుహరిణి'' అనే 10 శ్లోకంలో శంకరచార్యుల వారు సౌందర్యలహరిలో చెప్తారు.) ఇలా సహస్రార పద్మంలో వుండే చంద్రమండలం నుండి స్రవింపబడే అమృతానికి సుషుమ్నామార్గం అంతా చైతన్య వంతమౌతుంది కాబట్టి, కుండలినీ శక్తి అనే అమ్మవారికి ఆ అమృతం అంటే చాలా ఇష్టం.

సంప్రదాయాన్ని అనుసరించి వాళ్ళ వాళ్ల కులాచారంగా నాలుగు వర్ణాలవాళ్ళూ తర్పణ హోమాదుల్లో – పాలను, నెయ్యిని, తేనెను, చెఱకు కల్లును – అర్చనామృతాలుగా ఉపయోగిస్తారు. వీటిని గూడా అమ్మవారు ప్రీతిగా అమృతం లాగానే, వాళ్ళు చూపే భక్తిశ్రద్ధలను బట్టి ఆసక్తిగా స్వీకరిస్తుంది. ఈ అర్చనామృతాలను కులామృతాలు అంటారు. 'ఈ కులామృతాల యందు ఆసక్తి కలిగినది' అని ఈ నామానికి ఇంకో అర్థంగా చెప్పుకోవచ్చును. కులాలలో 'మృతం' కాకుండా తరతరాలుగా వస్తున్న 'కీలక జీవ లక్షణ సారాన్ని' కొనసాగించడంలో గూడా అమ్మవారి ప్రమేయం వుంటుంది.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) సహస్రార పద్మంలోని చంద్రమండలం స్రవించే అమృతమునందు ఆసక్తి కలిగినది.

2) కులాచారాన్ని బట్టి నాలుగు వర్ణాల వాళ్లా సమర్పించే అర్చనా మృతాల యందు ఆసక్తి కలిగినది.

3) అమృతత్వాన్ని పొందే కులమార్గమునందు ఆసక్తి గలిగినది.

4) కులములందలి కీలక జీవలక్షణాన్ని కొనసాగించడంలో ఆసక్తి గలిగినది.

## 91. కులసంకేతపాలినీ

ఇది అమ్మవారి 91వ నామం. ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''కుల సంకేతపాలిన్యైనమః'' అని చెప్పాలి.

కుల = కులసంబంధమైన; సంకేత = ఏర్పాటులను, పాలినీ = పాలించునది.

ఇక్కడ గూడా 'కుల' అనే పదానికి మామూలుగా చెప్పుకునే అర్థం చెప్పుకుంటే – 'కులధర్మాలను – వర్ణ ధర్మాలను, ఆశ్రమ ధర్మాలను, వంశ ధర్మాలను వారి వారి కులాలను బట్టి ఆచరించునట్లుగా పరిపాలించునది' అని ఈ నామానికి అర్థంగా చెప్పుకోవాలి.

ప్రస్తుత సందర్భాన్ని బట్టి 'కుల' అనే పదాన్ని కుండలినీ యోగపరంగా చెప్పుకుంటే–

''కుల' లేదా 'కౌలాచార సంబంధ' రహస్యాలను రక్షించునది' అని అర్థం చెప్పుకోవాల్సి వుంటుంది. 'కుల', అంటే – కులపథానికి, లేదా – కులమార్గానికి, లేదా– సుషుమ్నా మార్గానికి సంబంధించిన 1) సూర్యుడు 2) చంద్రుడు 3) అగ్ని 4) మూలాధారాది చక్రాలు 5) పృథివ్యాది పంచభూతాలు – ఇవన్నీ వస్తాయి. వీటన్నిటినీ పోషిస్తూ, శాసిస్తూ, పాలించేది – అని ఈ నామానికి అర్థం చెప్పుకోవాలి. ఈ సంకేతాలు కులమార్గానికి మైలురాళ్ళు (Mile Stones). రైల్వే మార్గాలో రైల్వే స్టేషన్లు, బస్సు మార్గాల్లో స్టేజ్‌లు (Stages) లాంటివన్నమాట.

ఈ నామానికి 1) కులసంబంధమైన ఏర్పాటులన్నిటినీ పాలించునది , 2) కులవిద్య అనగా కౌలవిద్యకు సంబంధించిన రహస్యములను రక్షించునది – 3) కులసంబంధమైన వృత్తి, ప్రవృత్తి రహస్యాలు సమసి పోకుండా తరతరాలుగా వచ్చునట్లు కాపాడునది – అనే అర్థాలు చెప్పుకోవచ్చును.

# 92. కులాంగనా

ఇది అమ్మవారి 92 వ నామం. ఇది 4 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కులాంగనాయైనమః' అని చెప్పాలి.

కుల = కులసంబంధమైన; అంగనా = స్త్రీ

'కులాంగనా' అంటే – 'కులస్త్రీ' అని, 'కులస్త్రీ' అంటే – 'కులము, వంశము, శీలము, మానము, మర్యాద, పాతివ్రత్యము మొదలైన వాటి యందు, సత్ప్రవర్తనా స్వభావాదులు గలిగిన స్త్రీ అని అర్థం. కుండలినీ యోగానికి సంబంధించిన 'కుండలినీ శక్తి' అనే అమ్మవారు గూడా ఇన్ని ఉత్తమ జాతి స్త్రీ లక్షణాలు కలిగినది కాబట్టి 'కులాంగనా' అన్నారు. ఈ కుండలినీ యోగానికి సంబంధించిన 'శ్రీవిద్య' గూడా గోప్యంగా, శుచిగా, పవిత్రంగా నియమ నిబంధనలతో అభ్యసింపబడుతుంది. కులార్ణవతంత్రంలో

''అన్యాస్తు సకలా విద్యా ః ప్రకటాగణికా ఇవ
ఇయంతు శాంభవీ విద్యా గుప్తా కులవధూరివ''

అని చెప్పబడింది. ''ఇతర విద్యలు వేశ్యలవలె బాహ్య ప్రకటన రీతిలో వుంటాయి. కాని, శ్రీవిద్య మాత్రము కులాంగన వలె గుప్తంగా వుంటుంది'' అని ఈ శ్లోకానికి అర్థం.

శ్రీ విద్యను అతి పవిత్రమైన భావంతో, మాతృస్వరూపిణిని ఆరాధించినట్లు అభ్యసించి, ఆరాధించాలి. కాళికా తంత్రంలో ఈ విద్యాభ్యాసం గురించి చిత్రంగా చెప్పబడుతుంది. 'ముందు స్వశక్తి యందు, తర్వాత పరశక్తి యందు గూడా అభ్యాసం చెయ్యాలిట' ''గార్హపత్య ధర్మాన్ని ఆచరిస్తున్నపుడు తప్ప, మిగిలిన సమయాల్లో స్వశక్తిని – అనగా – భార్యను, అన్ని సమయాల్లోను పరశక్తిని అనగా – ఇతరుల భార్యలను – తల్లిగా భావించిన వారికే శ్రీవిద్య పవిత్రంగా అందుతుంది'' అని దీని అర్థం. రామకృష్ణ పరమహంస తన భార్య అయిన శారదాదేవిని ఈ విధంగానే భావించి కాళికాదేవిని ఉపాసించాడు. ఈ కాళికా దేవి బీజాక్షరం ''క్రీం''.

('కర్పూరం మధ్యమంతం' అంటే 'కర్పూర' పదంలో మధ్య వున్న అక్షరాన్ని 'అంతం' చేస్తే – అంటే మినహాయిస్తే వచ్చే 'కరం' తెలిపే బీజాక్షరం కాళికా బీజాక్షరం అవుతుంది అంటే ''క్రీం'' అన్నమాట !)

(''సరో మాస్తి స్వైరం' అనంగానే 'రోమాలతోను' 'ఎముకల తోను' – వున్న జంతువులను బలి ఇవ్వడం' అని కాక, కాళీ ఉపాసనలో మీ కృషి – మీ ఎముకలకు, వెంట్రుకలకు గూడా ఎక్కాలి' – అంటే అంత పరిపూర్ణంగా ఉపాసన ఉండాలి అని అర్థం. అప్పుడే పరిపూర్ణ ఫలం దక్కుతుంది. ఉపయోగం దక్కాలంటే ఉపసాన బలంగా వుండాలి.)

1) ''కులస్త్రీవలె గోప్యముగా, పవిత్రముగా నుండునది''
2) ''వివిధ కులములకు, జాతులకు చెందిన స్త్రీలయందు ప్రకృతి రూపముగా నున్న పరదేవత''
3) 'ప్రతికులంలోను కనబడకుండా అంగభూతంగా వుంటూ – కులస్త్రీ వలె అన్ని పనులూ నిర్వర్తించేది' – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 93. కులాంతఃస్థా

ఇది అమ్మవారి 93వ నామం. ఇది నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కులాంతఃస్థాయై నమః'' అని చెప్పాలి.

కుల + అంతః + స్థా = కులము యొక్క మధ్య మందు ఉన్నది.

కులవిద్య, లేదా – శాస్త్ర మందు తెలియబడునది.

భవిష్యోత్తర పురాణంలో

''పూజనీయా జనైర్దేవీ స్థానే స్థానే పురే పురే
గృహే గృహే శక్తి పరైః గ్రామే గ్రామే వనే వనే''

అని చెప్పిన దానిని బట్టి ప్రతి గృహమునందు, ప్రతిదేశమునందు, ప్రతిగ్రామమునందు, ప్రతివనమునందు పూజింపబడునది.

'కుల' అనగా మూలాధార నివాసములో 3 1/2 చుట్లతో కుండలినీ ఆకారముగా నున్నది. (స్వపిషి కులకుండే – కుహరిణి – సౌందర్యలహరి)

'కుల' అనగా మూలాధార చక్రము నందు - అంతస్థములు అయిన అక్షరములచే ధ్యానము చేయబడునది. అనగా అచ్చులలో ''ఇ, ఉ, ఋ, ఌ'; హల్లులలో వరుసగా వీటికి సంబంధించిన ''య,వ,ర,ల'' అను అక్షరములచే ధ్యానము చేయబడునది.

1) కుల విద్యయందు తెలియబడునది.
2) సకల ప్రదేశములందు పూజింపబడునది.
3) మూలాధార చక్రమందు అంతస్థములను తెలుపు అక్షరములచే ధ్యానింపబడునది.
4) కులం అంతం కాకుండా సంతానాన్ని ప్రసాదించి 'వంశవృక్షానికి' లోపల 'తల్లివేరు' వలె అక్షం లాగా (Axis) వుండి, కులస్థాపనకు దోహదపడునది.

అనే అర్థాలను ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 94. కౌలినీ

ఇది అమ్మవారి 94వ నామం. ఇది 3 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు - ''కౌలిన్యైనమః'' అని చెప్పాలి.

కులాకులముల మధ్య సంబంధమును కలిగినది కాబట్టి, 'కౌలిని'. 'కుల' మంటే 'మూలాధారం' అనీ, 'అకుల' అంటే 'సహస్రారం' అనీ, అలాగే కుల - అంటే 'శక్తి' అనీ, అకుల - అంటే 'శివుడు' నీ సంకేతార్థాలు వున్నాయి.

''కులం శక్తి రితి ప్రోక్తం అకులం శివ ఉచ్యతే
కులే కులశ్చ సంబంధః కౌల మిత్యభి ధీయతే

అమ్మవారి ఉపాసన నాలుగు విధాలుగా చెబుతారు. అవి 1. సమయాచారము 2. కౌలాచారము 3. దక్షిణా చారము 4. వామాచారము. సమయాచారము, దక్షిణాచారము కొంచెం దగ్గరగా వుంటాయి. కౌలాచారము, వామాచారము ఒక రకంగా వుంటాయి. కౌలాచారాన్ని అనుసరించే వారిని 'కౌలులు' అంటారు. సమయాచారాన్ని పాటించేవారిని 'సమయాచారులు' అంటారు. కౌలాచారులు మూలాధారశక్తికి ప్రాధాన్యం ఇస్తారు. వామాచారంలో బాహ్య పూజకు ప్రాధాన్యం ఇస్తారు. భౌతికమైన, కొంత

జుగుప్సాకరమైన పదార్థ వినియోగ, నైవేద్యాలతో వీరి పూజ వుంటుంది. ఈ పూజా విధానం వారి వారి సంస్కారాలను బట్టి వుంటుంది. ఏమైనప్పటికీ భక్తి శ్రద్ధలతో చేసే పూజలలో ఆరాధ్య దైవంగా అమ్మవారుంటుంది. కులసంబంధమైన అనగా కుండలినీ యోగ సంబంధమైన పూజకు సంబంధించిన దేవత కాబట్టి అమ్మవారు ''కౌలినీ'' అనే పేరుతో గూడా పిలువబడుతుంది. ప్రతి వారికి వారి వారికుల దేవత లుంటారు. ఆ కుల దేవతల రూపంలో ఆరాధింపబడుతుంది.

1) శివశక్తుల సామరస్యాన్ని, సమన్వయాన్ని తెలిపే కులవిద్యకు అధిష్ఠాత్రి.
2) కౌలాచారులు కొలిచే శక్తి దేవత.
3) కులదేవతల రూపంలో ఆరాధింపబడునది - అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 95. కులయోగినీ

ఇది అమ్మవారి 95వ నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కులయోగిన్యైనమః'' అని చెప్పాలి. ఇది 5 అక్షరాల నామం.

కులయోగినీ = కుండలినీ యోగదేవతా స్వరూపిణి

శరీరం మొత్తము చేత సాధన చేసే వారుంటారు. వాళ్ళు భౌతికారాధనకు ఎక్కువ ప్రాధాన్యాన్ని యిస్తారు. మూలాధార శక్తికి వీరి పూజలో ఎక్కువ ప్రాధాన్యం వుంటుంది. ఈ మార్గంద్వారా గూడా యోగాన్ని అంటే ముక్తిని సాధించిన వారుంటారు. వారు ఆరాధించే ఈ కుండలినీ యోగదేవతను 'కులయోగినీ' అనవచ్చును. 'కుల శబ్దార్థములన్నిటితో సంబంధము గలది' అనవచ్చును. జీవులందరూ వేరు వేరు కులాలుగా (అంటే - వర్గాలుగా, జాతులుగా) వైవిధ్యంతో వున్నప్పటికీ, అన్నిటినీ 'ప్రాణ సూత్రం' తో జీవులుగా యోగించిన దేవతా స్వరూపిణి అనవచ్చును.

'కులామృతైక రసికా' నామం దగ్గఱ నుండి ఈ 'కులయోగినీ' నామం వరకు గల ఆఱునామాల్లోను కౌలాచారులకు ప్రాధాన్యం వహించే 'బహిర్యాగ పద్ధతి' కి సంబంధించిన నామాలు చెప్పబడ్డాయి. ఇక రాబోయే 'అకులా' నామం నుండి 'బిసతంతు

తనీయసీ' అనే నామం వరకు గల 14 నామాల్లో సమయాచారులకు ప్రాధాన్యం వహించే 'అంతర్యాగ పద్ధతి' కి సంబంధించిన నామాలు చెప్పబడతాయి. ముందు మూడు నామాల్లో క్లుప్తంగా 'సమయాచార జ్ఞాన రూపానికి', అటుపైన 11 నామాల్లో 'కుండలినీ విశిష్ట రూపానికి' సంబంధించిన విషయాలు చెప్పబడతాయి.

## 96. 'అకులా'

ఇది అమ్మవారి 96వ నామం. ఇది 3 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''అకులాయై నమః' అని చెప్పాలి.

అకులా = అకులా స్వరూపురాలు లేదా కులము లేనినది.

1) మూలాధార చక్రం వద్ద అనగా సుషుమ్నానాడికి దిగువ కొసవద్ద వుండే శక్తిని 'కుల'దేవత అని, సహస్రారం వద్ద అనగా సుషుమ్నానాడికి ఎగువ కొసవద్ద శివునిలో అంతర్లీనమై వుండే శక్తిని ''అకులా'' దేవత అనీ అంటారు.

2) కుల శబ్దార్థము లేవీ వర్తించని, అనగా - కులాతీతంగా పనిచేసే శక్తిదేవత, అంటే - 'వైవిధ్యంగా, విశ్లేషణాత్మకంగా వుండే సృష్టిలో సమష్టిరూపంగా, విశ్వశక్తిగా పనిచేయు ప్రాణదేవత'

3) అన్ని కులములను ఒకే దృష్టితో చూచునది.

4) 'అ' తో ప్రారంభమగు అక్షరకుల దేవత.

5) ''అక్షరాణాం 'అ' కారోస్మి'' అనుదానిని బట్టి ''అ''చేత సంకేతుడగు పరమేశ్వరుని కులమునకు చెందినది.

అని పై అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 97. సమయాంతఃస్థా

ఇది అమ్మవారి 97వ నామం. ఇది 5 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''సమయాంతఃస్థాయైనమః'' అని చెప్పాలి.

సమయాంతస్థా = సమయాచార అంతర్వర్తిని.

కౌలాచారాన్ని పాటించే వాళ్ళలాగానే సమయాచారాన్ని పాటించే వారుంటారు. ఈ సమయాచారులు ఆరాధించే కుండలినీ యోగ దేవతను 'సమయా' అంటారు.

గుండ్రంగా తిరిగే చక్రానికి ఇరుసు (అక్షం) లాగా, పంచభూతాత్మకమైన దేహానికి కేంద్రం లాగా వసించే దానిని ''అంతఃస్థా'' అంటారు. ఈ కేంద్రం హృదయ మధ్యంలో వుండే దహరాకాశంలో వుంటుందని, శ్రీ చక్ర పూజాదులన్నీ ఈ కేంద్ర స్థిత దేవతకే చెయ్యాలని, ఆ దేవత పేరే ''సమయా'' అని, ఈ సమయాదేవతను ఆరాధించే వాళ్ళనే సమయాచారులనీ – శుక, సనక సనందన, సనత్కుమార, వసిష్ఠ తంత్రాలు – బోధిస్తాయి. ఈ ఆరాధన 'అంతర్యాగపరంగా' వుంటుంది.

1) 'సమయాచార పద్ధతిలో అంతస్సూత్రంగా ఆరాధింపబడే అమ్మవారు'. 2) మనలోనే ఉండి అవసరమైన సమయాల్లో మనచేత కావల్సిన పనులు చేయించేది' – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

(శివునితో 5 విషయాల పరంగా అమ్మవారు సమంగా వ్యవహరింపబడుతుంది కాబట్టి అమ్మవారిని 'సమయా' అన్నారు. ఆ 5 విషయాలు

1. అధిష్ఠాన సామ్యము : శ్రీ చక్రంలో ఇద్దరూ వుండి పూజలు పొందబడటం.
2) అనుష్ఠాన సామ్యం : సృష్టి, స్థితి, లయ, తిరోధాన అనుగ్రహాలనే పంచ కృత్యాలలో సామ్యం.
3. అవస్థాసామ్యం : నర్తకాది విషయంలో సామ్యం.
4) నామ సామ్యం : శివ – శివా; భైరవ – భైరవీ; మొదలైన పేర్లలో సామ్యం.
5) రూప సామ్యం : ఇద్దరూ రూపవంతులు, అరుణవర్ణం, తలపై నెలవంక, మూడు కన్నులు – మొదలైనవాటితో రూప సామ్యం)

## 98. సమయాచార తత్పరా

ఇది అమ్మవారి 98వ నామం. ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కారం చేసేటప్పుడు ''సమయాచారతత్పరాయై నమః'' అని చెప్పాలి.

సమయాచార = 'సమయ' అనే ఆచారమునందు; తత్పరా = ఆసక్తి కలది.

ఈ సమయాచారంలో అంతర్ముఖధ్యానం, దీక్ష, శ్రద్ధ ఏకాగ్రత ప్రాధాన్యం వహిస్తాయి. శరీరంలో వుండే మూలాధారాది షట్చక్రాలతో శ్రీచక్ర స్వరూప సమన్వయం – ఈ పద్ధతి యొక్క ధ్యేయం. 'మంత్రానికి – మంత్రదేవతకు; దేవతకు – ఆదేవతను ఆరాధించే ఉపాసకునికి' – చక్కని ఏకత్వ భావనా సిద్ధి – ఈ అర్చనా విధానంలో లక్ష్యంగా వుంటుంది. అంతర్ముఖంగా జరిగే ఈ సమయాచారంలో జగుప్సాకరమైన, హేయమైన సన్నివేశాలుగాని, అంశాలు గాని వుండవు. ఉపయోగించే ద్రవ్యాలు గూడా ఉపాసకుణ్ణి సూక్ష్మ లోకాల్లో విహరింపచెయ్యడానికి అనుకూలంగా వుంటాయి తప్పితే, మత్తులోను, మైకంలోను, నిషాలోను, ఆవేశంలోను ముంచెత్తవు. ఈ కారణం వల్లనే ఈ సహస్ర నామాల్లో 'అంతర్ముఖ సమారాధ్య బహిర్ముఖ సుదుర్లభా' అనే నామం గూడా ముందు ముందు చెప్పబడుతుంది.

ఈ సమయా చార పూర్ణ దీక్షలో చిట్ట చివరకు మనలోని కుండలినీ శక్తిని – సహస్రారంలో వుండే శివునితో చేర్చి, అటుపైన మళ్ళీ మూలాధారంలో ప్రవేశించే 'సమయం' వరకు వేచి వుండాలి. అందుకని ఈ పద్ధతిని 'సమయా'చారం అన్నారని గూడా అనుకోవచ్చును. (ఈపూర్ణ దీక్షా విధాన వివరాలు సద్గురు ముఖంగా తెలుసుకోవడమే మంచిదని ఇక్కడ వివరించడం లేదు)

'సమయాచారమునందు, సమయాచారాన్ని పాటించే వారి యందు ఎక్కువ ఆదరాన్ని చూపించునది' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 99. మూలాధారైక నిలయా

ఇది అమ్మవారి 99వ నామం. ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మూలాధారైక నిలయాయైనమః' అని చెప్పాలి.

మూలాధార = మూలాధార చక్రమే; ఏక = ముఖ్యమైన, నిలయా = నివాసముగా గలది.

మన శరీరంలో వెన్నెముక క్రింది కొసకు అడుగున వుండే చక్రాన్ని ‘ మూలాధారం’ అంటారు. శిరస్సు నుండి పాదాల వరకు 27 నక్షత్రాలను న్యాసం చేస్తే – వెన్నెముక క్రింది కొసవద్దకు ‘‘మూలా’’ నక్షత్రం వస్తుంది. అందువల్ల ఈ చక్రాన్ని ‘మూలాధార చక్రం’ అన్నారు. మనశరీరంలోని భౌతిక పరమైన బలంయావత్తు మనం కూర్చున్నపుడు ఈ బిందువు వద్ద ఒత్తిడి కలిగి, కేంద్రీకృత మౌతుంది. భౌతికమైన బలానికి ఆధారబిందువు అవటం చేత మూలాధార చక్రం అన్నారు. దీన్ని ఆంగ్లంలో (Base centre) అంటారు. ఇది భౌతికమైనది కాదు. శక్త్యాత్మకమైన చక్రం(Vital centre). కాని, ఇది మనలోని పృథివీతత్త్వాన్ని (Solid matter) నియంత్రణం చేసే ‘స్విచ్’ లాంటి చక్రం (Steering wheel) దీనికి సంబంధించిన పూర్తి వివరణ అనుబంధ శీర్షికలో ఇవ్వబడింది.

అమ్మవారి పుట్టినిల్లు మూలాధారమే ! భౌతిక శరీర ధారణకు తల్లి గర్భంలో జీవికి పునాది – ‘మూలాధారం’ వద్దే జరుగుతుంది. ఒక శరీరం కావలసి వచ్చినప్పుడల్లా ‘మూలాధారం’ కావల్సివస్తుంది. అంటే – ఇంటికి పునాది ఎలాగో కుండలినీ యోగ సాధానికి ఈ మూలాధారం అలాంటిదన్నమాట ! వెన్నెముక లేని జీవులకు కూడా భావాతీతమైన శక్తి కేంద్రంగా (Supra Psycological Force) ఈ మూలాధారం ఉంటుంది.

ఈ మూలాధారాన్నే ‘కులకుండం’ అని అంటారు. ‘కుండలినీ శక్తి’ అనే అమ్మవారు ఇక్కడ (3 1/2 చుట్లు చుట్టుకుని) సాధారణంగానిద్రిస్తూ వుంటుంది.’ అని శంకరాచార్యుల వారు గూడా సౌందర్యలహరిలో ‘స్వపిషికుల కుండేకుహరిణి’ అని తెలియపరుస్తారు. సామాన్య మానవుడు దీని సంగతి గుఱించి స్పందించడు గాని, ఉపాసకుడు, యోగసాధకుడు ఈ శక్తిని జాగృతం చేసి, యోగసిద్ధిని సాధిస్తాడు. యోగసాధన ఈచక్రంతోనే ప్రారంభమౌతుంది. అందుచేత, ఈ చక్రం అమ్మవారికి నివాస స్థానంగా, ప్రారంభ బిందువుగా సంకేతిస్తారు. ఇది సుషుమ్నానాడికి ‘ప్రారంభ’ ‘లేదా’ ‘మూలబిందువు’ అవడం వలన గూడా దీన్ని ‘మూలాధారం’ అన్నారు.

రాబోయే చెట్టు యొక్క పూర్తి వృత్తాంతం ఏవిధంగా బీజంలో నిక్షిప్తమై, నిద్రాణమై, గుప్తంగా (Potential) వుంటుందో, అలాగే – మనకు సంబంధించిన శక్తి సామర్థ్య వికాస లక్షణాలన్నీ ఈ కుండలినీ శక్తిలో నిక్షిప్తమై, సుషుప్తి స్థితిలో (Deep Sleep

State) ఈ మూలాధారం వద్ద వుంటాయి. కాబట్టి, కుండలినీ శక్తికి ఈ మూలాధారం నివాసస్థానం అవుతుంది అన్నారు.

'మూలాధార చక్రమే తననివాస స్థానంగా గలది' అని క్లుప్తంగా ఈ నామానికి అర్థం.

## 100. బ్రహ్మ గ్రంథి విభేదినీ

ఇది అమ్మవారి 100వ నామం. ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''బ్రహ్మగ్రంథివిభేదిన్యైనమః' అని చెప్పాలి.

బ్రహ్మగ్రంథి = బ్రహ్మగ్రంథిని; విభేదినీ = విడగొట్టునది. వెన్నెముక వెంబడి వుండే 6 చక్రాల్లో మొదటి దైన మూలాధారం, రెండవ దైన స్వాధిష్ఠానం చక్రాలకు పైన ఒక గ్రంథి వుంటుంది. గ్రంథి అంటే 'ముడి' అని చెప్పుకోవచ్చు. దీన్ని ఆంగ్లంలో Gland అంటారు. ఈ గ్రంథి వుండే చోటే Prostrate Gland వుంటుంది.

ఈ గ్రంథిని కుండలినీ యోగ విద్యలో 'బ్రహ్మగ్రంథి' అంటారు. అంతరిక్షంలో నుండి అణువులను రూపొందించే శక్తికి సంకేతమే బ్రహ్మ(Creator or Emerger). అంటే భౌతికమైన సృష్టి ఈ బ్రహ్మద్వారానే జరుగుతుంది. అందుచేత ఈ బ్రహ్మను 'సృష్టికాగు' డంటారు. ఈ బ్రహ్మ రజోగుణ ప్రాధాన్యం వహించే శక్తిని కలిగినవాడు. ఈ రజోగుణం వల్లనే మనలో 'కళ్ళకు కనబడే దృశ్యమాన ప్రపంచము, దేహేంద్రియాలు మాత్రమే తప్ప ఇతర మేమీ లేద'నుకొనే ఒక అజ్ఞానానికి సంబంధించిన 'ముడి' ఏర్పడుతుంది. ఈ 'ముడి' యొక్క స్వరూపమే బ్రహ్మ గ్రంథి. ఎప్పటికైనా ఇది తెగవలసిన లేదా - విడిపోవలసిన ముడే!

మానవ సృష్టికి, దైవసృష్టికి చాలా తారతమ్యం వుంటుంది. మానవుడు దేనిని నిర్మించినా, తయారుచేసినా ఆ వస్తువులోకి తాను ప్రవేశించలేడు. ఉదా: గడియారాన్ని తయారు చేయగలడే గాని, ఆ గడియారంలో తానుప్రవేశించలేడు. అన్ని వస్తువుల విషయంలోనూ అంతే! కాని, సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారు దేన్నైనా సృష్టిస్తే ఆ సృష్టించిన దాంట్లోకి గూడా 'అనుప్రవేశం' చేయగలదని -

''తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్'' అనే ఉపనిషద్వాక్యం (తైత్తిరీయోపనిషత్) తెల్పుతుంది. అంటే 'దైవం చేత సృష్టింపబడే ప్రతి వస్తువులోను, జీవిలోను ఆ దైవం గూడా ప్రవేశిస్తాడు' అని దీని అర్థం. ఇలా మనలో ప్రవేశించిన సృష్టి స్వరూపిణి అనుగ్రహం వల్లనే – ఎప్పుడో ఒకప్పుడు మనలో అజ్ఞానానికి సంబంధించిన బ్రహ్మ గ్రంధివిభేదనం జరుగుతుంది. అందువల్ల అమ్మవారిని 'బ్రహ్మ గ్రంథివిభేదినీ' అనే నామంతో ఇక్కడ చెప్పడం జరిగింది. ఈ బ్రహ్మ గ్రంథివిభేదనం వల్లనే – మనలో అజ్ఞాత పాతాళ శక్తులు గూడా పనిచేస్తాయి. ఈ అజ్ఞాత శక్తుల్నే ఆంగ్లంలో (Instincts, Impulses, Reflexes) అంటారు. వీటిని కుండలినీ యోగ విద్యలో 'భైరవులు' అంటారు. ఈ భైరవులకు కాలజ్ఞానం వుంటుంది. కాబట్టి వీళ్ళని 'కాలభైరవు' లని గూడా అంటారు. ఒక సన్నివేశం భౌతికంగా జరిగిన తరువాత గాని మనకు తెలియదు. కాని, సన్నివేశం జరగటానికి పూర్వం – 'ఈ సన్నివేశం జరగబోతోంది' అనే సన్నివేశానికి సంబంధించిన పూర్వజ్ఞానం – ఈ భైరవులకు వుంటుంది. ఎవరైనా మన మీదకు రాయి విసరినపుడు, మనం ఆ సంగతి గుర్తించక పూర్వమే ' ఈ సంఘటన జరగబోతోందని మనలో పనిచేసే భైరవులకు తెలుస్తుంది. అందువల్లనే కళ్ళు మూయడం, తప్పుకోవడం, చెయ్యి అడ్డు పెట్టుకోవడం – అప్రయత్నంగా మనచేత చెయ్యబడతాయి. ఇవి (Reflex Actions) అన్నమాట! రాత్రిపూట కుక్కలు దీనంగా, సాగదీసినట్లు అరుస్తుంటే – మన పెద్దవాళ్ళు వెంటనే వాటిని తోలేస్తారు. 'ఎవరన్నా చనిపోయే ముందే అలా అవి అరుస్తాయి' అని వాళ్ళు చెప్తారు. పూర్వ జ్ఞానానికి సంబంధించిన ''మెదడు'' మనలో ఈ బ్రహ్మ గ్రంథి విభేదనం జరుగుతున్నపుడు పనిచేస్తుంది.. కాబట్టి,ఈ బ్రహ్మగ్రంథిని Brain of Instincts, Impulses and Reflexes" అని అనవచ్చును. సామాన్యుడిలో అప్పుడప్పుడు మాత్రమే పనిచేసే ఈ శక్తులు – సాధకునిలో సాధన వలన ఎప్పుడూ సిద్ధంగా వుండేలా మార్పు చెందుతాయి.

1) భౌతికమైన జగత్తే తప్ప ఇతరమేమీలేదనే అజ్ఞానానికి సంబంధించిన 'బ్రహ్మగ్రంథి' అనే ముడిని ఛేదించునది.
2) మనలో అజ్ఞాత పాతాళ శక్తులుగా పనిచేసే అసంకల్పిత ప్రతీకార చర్యలను ప్రేరేపించునది.

అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

# 101. మణిపూరాంతరుదితా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'మణిపూరాంతరుది తాయై నమః' అని చెప్పాలి.

మణిపూర = మణిపూర చక్రము యొక్క; అంతః = లోపలినుండి, ఉదితా = ఉదయించినది, లేదా - ప్రకటమగునది.

మణిపూర చక్రం - వెన్నెముక లోని సుషుమ్నా మార్గం వెంబడి వుండే షట్చక్రాల వరుసలో మూడవది. ఇది నాభి వద్ద వుంటుంది. దీన్నే ఆంగ్లంలో Solar Plexus"లేదా 'Naval Centre' అంటారు. దీనిని పది దళాలు కలిగిన పద్మంలాగా భావిస్తారు. తల్లిని బిడ్డను కలిపే భౌతిక బంధంగా నాభి వుంటుంది గాబట్టి, పిండోత్పత్తి, అభివృద్ధి ఈ మణి పూరచక్రం వల్లనే జరుగుతుంది. బ్రహ్మాండ పరిధిలో గూడా, విశ్వ పురుషుని నాభి నుండి అంతరిక్షం ఉద్భవించినట్లు ''నాభ్యా ఆసీదంత రిక్షమ్'' అని పురుషసూక్తం చెబుతుంది. అందుకని 'మణిపూరాంతరుదితా' అనే నామంతో అమ్మవారు చెప్పబడింది.

సమయాచారులు ఈ చక్రస్థానం వద్ద రకరకాల మణులతో అలంకరించి, అమ్మవారిని పూజిస్తారు. అందుకని ఈ చక్రానికి 'మణిపూర చక్రం' అనే పేరు వచ్చి వుండవచ్చును. మణిలాగ ప్రకాశించే గుణం గల సోమసూర్యాగ్నులకు ఈ చక్రం ఉత్పత్తి స్థానమని అరుణోపనిషత్తు చెబుతుంది. అందుకని ఈ చక్రాన్ని 'మణిపూరం' అని ఉండవచ్చును.

''మణిపూర చక్రం - పంచభూతాల్లో దేనికి సంబంధించినది?'' అన్న విషయంలో రెండు రకాల అభిప్రాయాలున్నాయి. ఇది అగ్నితత్త్వం అని కొందరు, జలతత్త్వం అని కొందరు అంటారు. ఎవరి వాదనలు ఎలా వున్నా, శంకరాచార్యుల వారు సౌందర్యలహరిలో ''కమపిమణిపూరే'' అని 9వ శ్లోకంలో ఈ చక్రాన్ని జలతత్త్వానికే అన్వయించారు. కాబట్టి, ప్రస్తుత వివరణలో గూడా ఆ పద్ధతినే అనుసరించడం జరిగింది. అయితే ఈ చక్రం పంచభూతాల వరసను బట్టి రెండవ చక్రమే అయినా, సుషుమ్నా మార్గం వెంబడి వుండే వరుసను బట్టి మాత్రం మూడవది. దీనికి సంబంధించిన పూర్తి వివరాలు అనుబంధంలో తెలుపబడ్డాయి.

''మణిపూర చక్రం నుండి ప్రకటమగునది'' అని ఈ నామానికి అర్థం.

# 102. విష్ణుగ్రంథివిభేదినీ

ఇది 8 అక్షరాల నామం ఈ నామంతో అమ్మవారికి నమస్కరించు నపుడు ''విష్ణుగ్రంథి విభేదిన్యైనమః'' అని చెప్పాలి.

విష్ణు గ్రంథి = విష్ణు గ్రంథిని; విభేదినీ = విడగొట్టునది.

ఇంతకు పూర్వం చెప్పిన బ్రహ్మ గ్రంథి పూర్తిగా భౌతికత్వాన్ని కలిగి వుండే అన్నమయు కోశం, స్థూల శరీరాలకు సంబంధించింది. స్థూలమయు శరీరంలోనే భౌతికత్వానికి అతీతంగా సూక్ష్మ శరీరం వుంటుంది. ఇది ప్రాణమయు, మనోమయు, విజ్ఞానమయ కోశాల సమన్వయం మీద ఆధారపడి ఉంటుంది. వీటికి సంబంధించినదే 'విష్ణు గ్రంథి'. దీన్ని ఆంగ్లంలో "Brain of Emotions and Affections" అనవచ్చును. బ్రహ్మ గ్రంథి భేదనం కానంతవరకు స్థూలదేహమే – నిజమైన దేహం, కనబడే భౌతిక ప్రపంచమే – ప్రపంచం అనిపిస్తుంది. ఆ గ్రంథి భేదనం జరిగిన తరువాత, సూక్ష్మ శరీర జ్ఞానం కలుగుతుంది. భౌతికత అంతా 'మాయ' అని అనిపిస్తుంది. అయితే 'మాయ' ఎవరిది? ఎందుకు ? అనేది తెలియదు. అదే 'విష్ణుమాయ'. 'కలయో నిజమో వైష్ణవ మాయో' అన్నట్లుంటుంది. ఈ స్థితి అర్థమవాలంటే విష్ణు గ్రంథి విభేదనం జరగాలి. విష్ణు గ్రంథి అనాహత చక్రప్రాంతంలో కొద్దిగా పైన వుంటుంది.

విష్ణు గ్రంథి విభేదనమైనపుడు సూక్ష్మశరీరానికంటె వేరుగా 'కారణ శరీరము'న్నదని తెలుస్తుంది. అప్పుడు విష్ణుమాయ తొలగుతుంది. ఉద్రేక ఉద్వేగ, ఆవేశాలకు వడపోత జరిగి అవి ఉత్తేజ, ఉత్సాహాలుగా మారతాయి. (All the emotion is distilled in to inspiration)

సామాన్యులకు అప్పుడప్పుడు సిద్ధించే ఈ స్థితి – ఈ విష్ణుగ్రంథి విభేదనంతో సాధకునిలో శాశ్వతంగా నిలిచి పోతుంది. అందుకే నిజమైన యోగసాధకుడు ఎప్పుడూ ఉత్సాహంగా, ఉత్తేజంగా వుంటాడు. ఈ స్థితి వచ్చిందీ లేనిదీ తెలియాలంటే ఇదే పరీక్ష.

1) విష్ణుగ్రంథిని విడగొట్టునది.

2) మాయను పోగొట్టునది.

3) ఉత్సాహస్థితిలో నుంచునది.

అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 103. ఆజ్ఞా చక్రాంతరాళస్థా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'ఆజ్ఞా చక్రాంతరాళస్థాయై నమః' అని చెప్పాలి.

ఆజ్ఞ + చక్ర = ఆజ్ఞాచక్రము యొక్క; అంతరాళ = మధ్యలో, స్థా = ఉండునది.

వెన్నెముక లోని సుషుమ్నా మార్గంలో వుండే షట్చక్రాల వరుసలో ఇది క్రింద నుండి ఆరవ చక్రం. ఇది భ్రూమధ్య స్థానంలో వుంటుంది. ఆంగ్లంలో దీన్ని 'Eye Brow Centre' అంటారు. దీనిని రెండు దళాలు కలిగిన పద్మంలాగా భావిస్తారు.

ఇక్కడ విభ్రాంతి, వికల్పం లేని స్వచ్ఛమైన మనస్సు వర్తిస్తుంది. అంతవరకు తెలియని విషయాలకు కొంతవరకు సమన్వయం కుదురుతుంది.

'' ఆజ్ఞాచక్రము యొక్క లోపల వుండునది'' అని ఈ నామానికి అర్థం. (ఈ చక్రం గురించి వివరంగా అనుబంధంలో చెప్పబడింది.)

## 104. రుద్రగ్రంథి విభేదినీ

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''రుద్రగ్రంథి విభేదిన్యై నమః'' అని చెప్పాలి.

రుద్రగ్రంథి = రుద్రగ్రంథిని, విభేదినీ = విడగొట్టునది.

ఆజ్ఞాచక్ర స్థాన ప్రాంతములో కొద్దిగా పైగా ఈ గ్రంథి వుంటుంది. దీనిని ఆంగ్లములో "Brain of Intellect" అనవచ్చును. త్రినేత్రత్వం రావాలంటే - ఇక్కడ వుండే మూడవ నేత్రం పని చెయ్యడం ప్రారంభించాలి. ఇది జరగాలంటే - ఈ రుద్రగ్రంథి విభేధనం జరగాలి. అలా జరిగితే - తెలివి (Intelligence) అంతా జ్ఞానం (Wisdom)గా మారుతుంది, మనస్సు బుద్ధిగా వికసిస్తుంది. ఇవన్నీ జరిగినపుడు వివేకోదయం జరిగి

సృష్టి రహస్యాలు ద్యోతకమౌతాయి. దూరదృష్టి, దూరశ్రవణం రెండూ సిద్ధిస్తాయి. ఈ స్థితి వచ్చినపుడు

"భిద్యతే హృదయ గ్రంథి ః! ఛిద్యంతే సర్వసంశయాః!

క్షీయంతే చాస్య కర్మాణి ! తస్మిన్ దృష్టే పరావరే".

అన్న శ్రుతి వాక్యం నిజమౌతుంది.

సృష్టి ప్రణాళికలో వైరుధ్యం గాను, వైవిధ్యంగాను కనబడే అన్ని విషయాలకు సమన్వయం ద్యోతకమై, సర్వసంశయ నివృత్తి జరుగుతుంది. కర్మబంధము అంటని ప్రవర్తన అబ్బుతుంది. అత్యంత సూక్ష్మ విషయాలకు - అత్యధిక స్థూల విషయాలకు మధ్య వుండే ఇహలోక - పరలోక విజ్ఞానం పట్ల సదవహగాహన కలిగి, మెట్ట వేదాంతం గాక అసలైన వేదాంత బుద్ధి ఏర్పడుతుంది. రామకృష్ణ పరమహంస, కంచి కామకోటి పరమాచార్యులైన చంద్రశేఖర సరస్వతీ స్వాములవారి లాంటి వారికి ఇలాంటి స్థితి వుంటుంది.

వైద్య శాస్త్రంలో చెప్పే 1) Pineal Gland 2) Pituitary body 3) Medulla Oblangata అనే మూడింటిని కలిపి ఒక ముడిగా వూహించుకుంటే దాన్నే 'రుద్రగ్రంథి' అనవచ్చును.

ఈ నామానికి ఈ క్రింద తెలిపిన అర్థాలు చెప్పుకోవచ్చును.

1. రుద్ర గ్రంధిని విడగొట్టునది.
2. తెలివిని జ్ఞానముగా మార్చునది.
3. హృదయ గ్రంథులను విడగొట్టునది.
4. సర్వసంశయ మోక్షసిద్ధిని కలుగజేయునది.
5. సర్వశాస్త్ర, సర్వలోక, సర్వజ్ఞాన సమన్వయ కారిణి
6. త్రినేత్రత్వఫలప్రదాయిని

## 105. సహస్రారాంబుజారూఢా

ఇది 8 అక్షరాలనామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు "సహస్రారాంబుజారూఢాయై నమః" అని చెప్పాలి.

సహస్రార = వెయ్యిదళముల గల; అంబుజా = పద్మమును, ఆరూఢా = అధిష్ఠించి యున్నది.

వెన్నెముకలో సుషుమ్నా మార్గంలో వుండే షట్చక్రాలు కాకుండా, బ్రహ్మరంధ్రానికి (శిరస్సుపైన వుండే మాడు ప్రాంతం) క్రిందుగా ఇంకో చక్రం వుంటుంది. దీన్ని చక్రం అనడం కంటే 'పద్మం' లేదా 'కమలం' అనడమే సమంజసం. ఈ పద్మానికి వెయ్యి దళాలు వుంటాయి. ఈ పద్మం యొక్క కర్ణికలోనే చంద్రమండలం వుంటుంది. ఇదే సుధా సముద్రం.

ఈ పద్మం – ఒక అనంతమైన విజ్ఞాన, ప్రకాశ, ప్రసార – కేంద్రం. ఇక్కడే సదాశివుడనే మూల ప్రజ్ఞ (Origin of Consciousness) వుంటుంది. యోగసాధనలో 'కుండలినీ శక్తి' అనే అమ్మవారు సుషుమ్నా మార్గం ద్వారా ఊర్ధ్వగతిని అనుసరించి, మార్గమధ్యంలో ఉండే మూలాధారాది షట్చక్రాలను ప్రచోదనచేస్తూ ; బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంథుల్ని విభేదనం చేసుకుంటూ; చిట్టచివరకు ఈ సహస్రార పద్మంలో వున్న సదాశివుడనే అయ్యవారిని చేరుతుంది. జగత్తుకే జననీ జనకులైన వీరి కలయిక సాధకునికి యోగ లక్ష్యసిద్ధిగా ముక్తిని ప్రసాదిస్తుంది. కొందరు సిద్ధులు, యోగులు వారి కుండలినీ శక్తి ఈ స్థితి లోనే వుండి పోవడానికి ఇష్టపడతారు. కాని, ద్రష్టలు ఋషులు ఇక్కడ నుండి మళ్ళీ ఆశక్తిని తిరుగు మార్గం పట్టించి, అనాహతాన్ని చేర్చి, అక్కడ వుండటానికే ఇష్టపడతారు. ఆ స్థితిలో వున్న అనాహతాన్ని ''హృత్పుండ రీకం'' అంటారు.[భారతంలో నరుడు (అర్జునుడు) తన శక్తిని తపస్సాధనలో స్వర్గమనే సహస్రార స్థానానికి చేర్చి, అక్కడ వుండి పోకుండా మళ్ళీ క్రింది అనాహతానికి (హస్తినకు) తీసుకువచ్చి, సోదరులతో కలిసి, ధర్మ సంస్థాపనకై యుద్ధాన్ని చేస్తాడు.]

[మూలాధారం నుండి సహస్రారం దాకా వెళ్ళి, అటుపైన మళ్ళీ క్రిందకు అనాహతం దాకా వచ్చినపుడు జరిగిన ప్రయాణ మార్గాన్ని సూచించే విధంగానే – క్రిష్టియన్లు – క్రింద నుండి పైకి నిలువుగాను(Vertical), అట్నుంచి మళ్ళీ పై నుండి హృదయం దాకాను, హృదయం దగ్గఱ (Horizontal) అడ్డంగాను చేతిని జరుపుతారు. ఇది శిలువను(Cross) సూచిస్తుందని కొందరు అనుకోవచ్చు గాని, 'యదార్థానికి ఇది యోగ సిద్ధిని పొంది తిరిగి మళ్ళీ ప్రపంచం లోని దీనులైన ప్రజల సేవకై దిగిరావడానికి సంకేతం' అని చెప్పేవారు

గూడా వుంటారు. ఈ సంకేత మార్గంలోని నిలువు గీత - ఋజుత్వ ప్రవర్తనను(Up-right Behaviour), అడ్డగీత 'సమానత్వాన్ని', (Equality) ని సూచిస్తాయి]. ఈ నామానికి ఈక్రింద తెలిపిన అర్థాలు చెప్పుకోవచ్చును.

1) సహస్రార పద్మాన్ని అదిష్ఠించినది.

2) సదాశివ ప్రజ్ఞతో తన శక్తిని చేర్చినది.

# 106. సుధాసారాభివర్షిణీ

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి సమస్కరించేటప్పుడు ''సుధాసారాభివర్షిణ్యై నమః'' అని చెప్పాలి.

సుధా = అమృతము యొక్క, ఆసార = ధారాపాత వర్షమును, అభివర్షిణీ = కురిపించునది.

యోగసాధనా ప్రక్రియలో కుండలినీ శక్తి అనే అమ్మవారు సుషుమ్నా మార్గాన్ని అనుసరించి, షట్చక్రాలను ప్రచోదన చేసి, బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంథులను విభేదన చేసి, చిట్టచివరకు సహస్రారకమలం జేరుతుంది. ఈ సహస్రార కమల కర్ణిక పూర్తిగా చంద్రమండలమే ! ఈ చంద్ర మండలం అత్యంత శీతలంగా వుంటుంది. సహజంగా అగ్నితత్త్వమైన కుండలినీ శక్తి అనే అమ్మవారు - ఘనస్థితిలో శీతలంగా వుండే చంద్రమండలాన్ని చేరంగానే - ఆ ఘనస్థితి కరిగి ద్రవ స్థితి పొందుతుంది. అలా ద్రవస్థితిలోకి వచ్చిన ఆ చంద్రుని వెన్నెలనే అమృతం అంటారు. ఇలా అమృతత్వాన్ని పొందుతుంది. కాబట్టే దీన్ని 'సుధాసింధువు' (సుధాసాగరం) అన్నారు. సహస్రారంలో చేరిన అమ్మవారి పాద స్పర్శ వల్లనే ఇవన్నీ జరిగేది.

అమ్మవారి పాద స్పర్శ వలన ద్రవించిన అమృతం - సహస్రారం నుండి ధారాపాతంగా వర్షింపబడుతుంది. ఈ అమృత వర్షాన్నే 'సుధాసారా' అంటారు. ఈ సుధాసారాభి వర్షానికి కారకురాలు కాబట్టి, అమ్మవారిని 'సుధాసారాభివర్షిణీ' అని అన్నారు. ధారాపాతంగా స్రవింపబడే ఈ సుధాధారలతో - సుషుమ్నా మార్గం, దాంట్లోని షట్చక్రాలు, గ్రంథులు, సమస్త నాడీమండలం - తడుపబడతాయి. ఈ విషయాన్నే

సౌందర్యలహరిలో శంకరాచార్యులవారు ''సుధాధారాసారైః... కుహరిణి'' అనే శ్లోకంలో వర్ణించారు. ఈ అమృత స్రవంతి నుండి షట్చక్రాలు గ్రహించే కిరణాల సంఖ్యలను గూడా ''క్షితౌషట్పంచాశత్ ... తవ పాదాంబుజ యుగమ్'' అనే శ్లోకంలో తెలియపరిచారు. అమ్మవారి అగ్నితత్త్వం, చంద్రుని శీతలత్వం కలవగా వచ్చిన అమృతం చేత తడపబడిన శరీరం అంతటికీ - ఒక సంతులనత(Balance) చేకూరి, ఆరోగ్యవంతంగా వుంటుంది. ఈ రెంటికీ మధ్య నిష్పత్తి (Proportion)లో తేడా వచ్చినప్పుడే లేదా రెంటికీ మధ్య సామరస్యం, సమన్వయం, చెడినప్పుడు - ఆరోగ్యంలో మార్పులు వచ్చి, వ్యాధులకు దారితీస్తుంది. ఈ విధంగా జీవనమంతా అమ్మవారి చైతన్య అనుగ్రహాల మీద ఆధారపడి వున్నదని, సమస్తము అమ్మవారే నని, జ్ఞాన దృష్టి చేత గ్రహించి, తదను గుణంగా నడుచుకునే వారే జీవన్ముక్తులు.

''అమృతాన్ని ధారావర్షంగా కురిపించునది'' అని ఈ నామానికి అర్థం.

## 107. తటిల్లతా సమరుచిః

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించు నపుడు''తటిల్లతా సమరుచ్యై నమః'' అని చెప్పాలి.

తటిత్ + లతా = మెఱపుతీగతో, సమ = సమానమగు, రుచిః = కాంతిగలది. కర్బన చాపదీపం (Cabon Arc Lamp)లో రెండు కర్బన కడ్డీలుంటాయి. వాటి మధ్య విద్యుత్ శక్మాన్ని (Electrical Potential) కలుగజేస్తే వాటి కొనల మధ్య చాపంలాగా, తెల్లగా మిరుమిట్లు గొలిపే 'కాంతి దీపం' ఏర్పడుతుంది. వెన్నెముకలో ఉండే 'ఇడా, పింగళా' నాడుల మధ్య సహస్రారం దగ్గఱ నుండి మూలాదారం దాకా వుండే సుషుమ్నా నాడి గూడా, సరిగ్గా ఇలాగే, రెండు కర్బన కడ్డీల మధ్య ఏర్పడే చాపదీపం లాగానే అత్యంత కాంతివంతంగా ఈ సాధన ప్రక్రియలో మిరుమిట్లు గొలుపుతూ ప్రకాశిస్తుంది. దీనిని నల్లని రెండు మేఘాల మధ్య జరిగే విద్యుత్ ఉత్సర్గంలో (Electrical Discharge) వెలువడే మెఱుపుతీగ (Lightning Thunder) లాగా గూడా పోల్చి, మంత్రపుష్పంలో

''నీల తోయద మధ్యస్థా ద్విద్యుల్లే ఖేవ భాస్వరా'' అని చెప్పబడింది. 'కంటికి మెఱుపు తీగ ఎలాంటిదో - సాధకునకు అమ్మవారు అలాంటిది' అని అర్థంచేసుకోవాలి.

''మెఱుపు తీగతో సమానమైన కాంతిగలది'' అని ఈ నామానికి అర్థం.

## 108. షట్చక్రోపరి సంస్థితా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''షట్చక్రోపరిసంస్థితాయైనమః'' అని చెప్పాలి.

షట్ = ఆరువిధములైన; చక్ర = మూలాధారాది చక్రముల యొక్క, ఉపరి = పైభాగమందు, సంస్థితా = చక్కగా నున్నది.

ఉపాసకుని సాధనలో ''కుండలినీ శక్తి అనే అమ్మవారు సుషుమ్నా మార్గం గుండా, మూలాధారాది షట్చక్రాలను అధిగమించి, వాటన్నిటికీ పైన వున్న సహస్రార పద్మంలోని సుధాసాగరంలో, శ్రీనగరంలో, మణిద్వీపంలో వుండే చింతామణి గృహంలో, శివుని పర్యంకం మీద హాయిగా, స్థిరంగా వుంటుంది కాబట్టి – 'షట్చక్రోపరి సంస్థితా' అని ఈ నామం చెప్పబడింది.

'ఆరు చక్రాలకు పైన చక్కగా వున్నది'' అని ఈ నామానికి అర్థం.

## 109. మహా సక్తిః

ఇది 4 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''మహాసక్త్యై నమః'' అని చెప్పాలి.

మహా = బ్రహ్మమునందు; ఆసక్తిః = ఆసక్తి గలది.

ఈ జగత్తులో అన్నిటి కన్న విశిష్టమైన మహత్వం గలవారు ఎవరు ? అని ప్రశ్న వేసుకుంటే – ఈ జగత్తుకు కారకుడు, జగత్తును సృష్టించినవాడు, జగత్తులో అంతర్యామిగా వున్నటువంటివాడు, జగత్తును తనలోకి చక్కగా లీనం చేసుకొనేవాడు ఎవరైతే వున్నారో – ఆయన – అని సమాధానం చెప్పుకోవాల్సి వుంటుంది. అటువంటి ''బ్రహ్మము'' నందు ఆసక్తి తప్ప ఇతరములైన వాటి మీద అసక్తి లేనిది అమ్మవారు.

ఒకరి మీద ఆసక్తి పెరిగిన కొద్దీ, చివరకు పరాకాష్ఠగా – ఇష్టము వుండేవారికి, ఇష్టాన్ని పొందబడేవారికి – దూరం, భేదం తగ్గి – ఐక్యం అయిపోతారు. బ్రహ్మములో అటువంటి అభేదస్థితిని పొందినదిగాబట్టి ''మహాసక్తిః'' అనే నామంతో చెప్పబడింది.

మహాద్భుతమైన ఈ ప్రపంచం అంతటిలోను విడదీయలేని సంబంధము గలిగినది కాబట్టి ''మహాసక్తిః'' అని చెప్పబడింది.

ఈ నామాన్ని ''మహాశక్తిః'' అనే విధంగా కూడా కొందరు చెబుతారు. అన్ని రకాల శక్తులకు మూలమైనది, అన్ని శక్తులు తన అంశములుగా సంబంధమును కలిగినది కాబట్టి ''మహాశక్తిః'' అని గూడా చెప్పవచ్చును.

''మహా'' అంటే ''బ్రహ్మ'' అని చెప్పుకుంటే 'మహాశక్తి' అంటే బ్రహ్మయొక్క శక్తి ''సరస్వతి'' అవుతుంది. గంగా, యమునా, సరస్వతులు – ఇడా, పింగళ, సుషుమ్నా నాడులకు ప్రతీకలు. అగ్నితత్త్వానికి చెందిన సుషుమ్నానాడికి, అగ్నితత్త్వానికి చెందిన అమ్మవారికీ అభేదమే కాబట్టి ''మహాశక్తిః'' అనే నామం అమ్మవారికి చెప్పబడింది.

ఈ నామానికి ఈ క్రింద తెలిపిన అర్థాలు చెప్పుకోవచ్చును.

1) బ్రహ్మము నందు ఆసక్తి కలిగినది

2) బ్రహ్మముతో అభేదమైనది

3) మహాద్భుతమైన ప్రపంచములో విడదీయ లేని సంబంధము గలది.

4) వాగ్దేవితో విడదీయలేని సంబంధము గలది.

5) అన్ని శక్తులకు మూలకారణమైన శక్తి.

6) అన్ని శక్తులు తన అంశములుగా గల మహాశక్తి

7) సుషుమ్నానాడిచే సూచింపబడు అగ్నితత్త్వ సరస్వతితో విడదీయలేని సంబంధము గలది.

## 110. కుండలినీ

ఇది 4 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''కుండలిన్యై నమః'' అని చెప్పాలి.

కుండలినీ = పాము వంటి ఆకారము గలది.

పండితులు చెవులకు పెట్టుకునే ఆభరణాల్లో కుండలాలు ప్రధానమైనవి. మండలాకారంలో పాము చుట్టవలె వుంటుంది. కాబట్టి – ''కుండలము'' అంటారు.

జీవశక్తి – మూలాధార చక్రం దగ్గఱ మూడున్నర చుట్లు చుట్టు కొన్న పాములాగా, తోకచేత ముఖాన్ని కప్పుకొని వుంటుంది. అందువలన ఈ జీవశక్తిని గూడా ''కుండలినీ శక్తి'' అన్నారు. ఈ కుండలినీ శక్తి సమస్త జ్ఞానానికి, సమస్త శక్తి మహిమలకు ఆధార భూతమైన కేంద్రము. దీని వినియోగము తెలియనంత కాలం – అది 3 1/2 చుట్లు చుట్టు కొని మూలాధారం దగ్గఱ నిద్రావస్థలో వుంటుంది. వినియోగం తెలిసి, సాధన జరుగుచున్నప్పుడు – ఇది మేల్కాంచి, సుషుమ్నా మార్గం ద్వారా, ఊర్ధ్వగతిని చరించి, అన్నింటి కన్న పైన వున్న సహస్రార కమలాన్ని చేరి, అక్కడ వున్న శివునితో జేరి, సాధకునికి జీవన్ముక్తిని ప్రసాదిస్తుంది.

వ్యక్తిలోని కుండలినీ శక్తిని 'వ్యష్టికుండలినీ' అంటారు. ఈ వ్యష్టి కుండలినికి – సర్పదేవత అయిన సుబ్రహ్మణ్యస్వామి లేదా కుమారస్వామిని అధిపతిగా చెబుతారు. వలయాకారంలో వుండే ఈ కుండలినికి అధిపతి కాబట్టి 'వల్లీ నాధునిగా సుబ్రహ్మణ్యస్వామిని సంకేతిస్తారు.

బ్రహ్మాండానికి ఉండే కుండలినీ శక్తిని ' సమష్టికుండలినీ' అంటారు. ఈ సమష్టి కుండలినికి '' అనంతుడు'' లేదా ''ఆదిశేషువు'' ను అధిపతిగా చెబుతారు.

కుండలినీ శక్తి సహజంగా అగ్నితత్త్వం కలిగినది. ఇడానాడి – చంద్రతత్త్వం, పింగళానాడి – సూర్య తత్త్వం, సుషుమ్నానాడి అగ్నితత్త్వం కలిగినవి. ఈ మూడింటిని వరుసగా గంగా, యమునా, సరస్వతీ నదులతో సమన్వయిస్తారు. అంటే సరస్వతి అగ్నితత్త్వం కలిగినదన్నమాట! దీనిని బట్టి సరస్వతి (వాగ్దేవత), కుండలినీ శక్తి – ఒకే తత్త్వం కలిగినవి. కాబట్టి, కుండలినీ శక్తి ప్రధానంగా వాక్కుకు సంబంధించిన శక్తి ఔతుంది. ఈ వాక్కుకు సంబంధించిన బీజాక్షరం ''ఐం'' దీన్ని 'వాగ్భవ బీజం' అంటారు. ఈ బీజాక్షరంలో వున్న అక్షరాలను విడదీస్తే 'ఐం = అ + ఎ + మ్' అవుతుంది. 'ఎ' అనే అచ్చును మళ్ళీ విడదీస్తే 'ఎ = అ + ఇ' అవుతుంది. కాబట్టి 'ఐం' లో 'అ, ఇ, అ, మ్' అక్షరాలు వుంటాయి. వీటిలో 3 అక్షరాలు పూర్తిగా వున్నాయి కాబట్టి – మూడు పూర్తి చుట్లను; చివరిదైన 'మ్' సగమే వుంది కాబట్టి – సగం చుట్టును సూచిస్తుంది. 'ఐం' అనే కుండలినీ శక్తిలో 3 1/2 చుట్లు వున్నాయి అనడంలో ఔచిత్యం ఇదే! ఇది మంత్ర శాస్త్ర పరమైన సమన్వయం.

జీవి మానవ జన్మను పొందక పూర్వం - ఖనిజస్థితి, (Mineral State), వృక్షస్థితి (Plant State), జంతుస్థితి (Animal State)కి సంబంధించిన కక్ష్యలను - దాటడం జరిగింది. కాబట్టి మూడు పూర్తి కక్ష్యలు పూర్తయినట్లు లెక్క. ఇక మానవ జన్మను పొందినందుకు మాత్రం 1/2 చుట్టు గూడా పూర్తవుతుంది. మానవ జన్మను పొంది నంత మాత్రాన పూర్తి చుట్టు పూర్తవదు. ఆ జన్మను పొంది, తన సాధన ద్వారా మిగిలిన సగం చుట్టును గూడా పూర్తి చేసుకుంటే - నాలుగు రకాల కక్ష్యలను దాటి జీవన్ముక్తుడౌతాడు. అంటే పూర్తికావలసిన 1/2 చుట్టు - యోగ సాధన ద్వారా పూర్తి కావాలన్నమాట! ఈ విషయాన్ని తెలియ చెయ్యడం కోసమే జీవశక్తి అయిన కుండలిని - అందరు మానవులలో '3 1/2 చుట్లు చుట్టుకొని వుంటుంది' అనడం. ఇది జీవపరిమాణ శాస్త్ర సమన్వయం.

1. పాము ఆకారము గలది.

2. వాగ్భవ బీజ స్వరూపురాలు - అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 111. బిసతంతు తనీయసీ

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''బిసతంతుతనీయస్యై నమః' అని చెప్పాలి.

బిసతంతు = తామరకాడలోని ప్రోగువలె, తనీయసీ = సన్నని స్వరూపము గలది.

కుండలినీ శక్తి యొక్క రూపం ఎలావుంటుందో ఈ నామంలో చెప్పబడింది. 'శక్తి' అంటే స్థూల పదార్థం కాదు, సూక్ష్మమైనదే అవుతుంది. ఈ సూక్ష్మత్వాన్ని అర్థం చేసుకోడానికి ఈ నామంలో ఒక ఉపమానం చెప్పబడింది. తామరకాడను విరిచినప్పుడు సన్నని దారపుపోగులు (Fibres) లాగా వస్తాయి. అవి ఒక్కొక్కటి అత్యంత సూక్ష్మంగా సన్నగా వుంటాయి. ఇది కేవలం మనం అర్థం చేసుకోడానికి ఇచ్చిన ఉపమానం మాత్రమే! వాస్తవానికి అలా గూడా వుండదు. తేజస్సు (Aura or Illumination) ఎలా వుంటుందో - అలా వుంటుంది. సరిగా అవగాహన కలగాలంటే బిసతంతు తనీయసీ కంటె ''సూర్యకిరణం'' లాగా వుంటుంది అనడం సమంజసమేమో అనిపిస్తుంది. సూర్యకిరణం

1) చాలా సూక్ష్మంగా వుంటుంది 2) తేజస్సుకు సంబంధించినది 3) స్థూలమైన పదార్థం కాదు. ఈ మూడు లక్షణాలు కుండలినీ శక్తికి గూడా అన్వయిస్తాయి. కుండలినీ శక్తి యొక్క సూక్ష్మత్వాన్ని మంత్రపుష్పంలో చెప్పిన ''నీవార శూక వత్తన్వీ ! పీతాభాస్వత్య ణూపమా!'' అనే మంత్రాల అర్థంగా గ్రహించడం సమంజసంగా వుంటుంది. ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. తామరకాడలోని పోగువలె సూక్ష్మమైన స్వరూపం గలది.

2. సూర్య కిరణం వలె, నివ్వరి ధాన్యపు అంకురము వలె, పీల్చ బడిన సూక్ష్మ వెలుగువలె వుండునది.

బ్రహ్మ – పద్మంలోంచి పుట్టాడు. కాబట్టి, 'బిస' – పదం 'బ్రహ్మ'ను సూచిస్తుంది. ''తంతు'' – పదం సూత్రాన్ని' సూచిస్తుంది. కాబట్టి ''బిసతంతు'' అంటే బ్రహ్మసూత్రంలో, 'తనీయసీ' అంటే సూక్ష్మమైనది. అంటే 3) బ్రహ్మసూత్రాలో సూక్ష్మంగా ప్రతిపాదింప బడేది' అని ఇంకొక అర్థం. 4) ''బ్రహ్మ సృష్టిలో సూత్ర ప్రాయంగా, సూక్ష్మంగా వుండేది'' అని మరో అర్థం గూడాచెప్పుకోవచ్చును.

## 112. భవానీ

ఇది 3 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'భవాన్యైనమః' అని చెప్పాలి.

భవానీ = భవుని భార్య

''భవః'' అనే సంస్కృత పదానికి అర్థాలు తెలియాలంటే – దేవీ పురాణంలో ఈ పదానికి నిర్వచనంగా ఇచ్చిన శ్లోకం తెలియాలి.

''రుద్రోభవోభవః కామో భవ స్సంసార సాగరః
తత్ర్పానాది యం దేవీ భవానీ పరికీర్తితా''.

''భవు'' డంటే రుద్రుడు, మన్మథుడు, సంసార సముద్రము – అని అర్థము. ఈ ముగ్గురినీ జీవింప చెయ్యడం మూలంగా అమ్మవారు ''భవానీ'' అని చెప్పబడింది.

'భవం' అంటే పుట్టుక. సమస్త ప్రపంచం పుట్టడానికి, జీవించడానికి కారకురాలు కాబట్టి – అమ్మవారు 'భవానీ' అని చెప్పబడింది.

శివుని అష్టమూర్తులలో ఎనిమిదవ మూర్తి అయిన జలమూర్తి పేరు భవుడు. భవుని జీవింప జేయునది కాబట్టి – అమ్మవారు 'భవానీ' అని చెప్పబడింది. 'స్థానేశ్వరం' అనే క్షేత్ర పీఠాధి దేవత పేరు 'భవానీ'.

మొత్తం మీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) భవుని భార్య.
2) రుద్రుని జీవింప జేసినది.
3) సంసారమును జీవింప జేయునది.
4) మన్మథుని జీవింప జేసినది.
5) జల రూపుడైన భవుని జీవింప జేసినది.
6) పుట్టుకకు కారణ భూతురాలు.
7) స్థానేశ్వర క్షేత్ర పీఠాధిదేవత.

## 113. భావనాగమ్యా

ఇది 5 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు "భావనాగమ్యాయై నమః" అని చెప్పాలి.

భావనా = భావన చేత, గమ్యా = పొందదగినది, అగమ్యా = పొంద శక్యము గానిది.

ఒక 'విషయపరమైన' ధ్యానాన్ని 'భావన' అంటారు. ఇక్కడ విషయం వాక్కు సంబంధమైనది అయితే – వాక్కుకు రెండు లక్షణాలుంటాయి. కాబట్టి, దాంట్లో మళ్ళీ రెండు రకాల భావనలుంటాయి. 1) వాక్కును రూపొందించు 'ధ్వని' లేదా 'శబ్దము' 2) వాక్కు యొక్క 'అర్థము' దీనిని బట్టి వాక్కు పరంగా వుండే భావనలు 1) 'శబ్ద' భావన 2) 'అర్థ' భావన.

భావనా విషయం 'వస్తువు' లేదా 'విగ్రహం' అయితే విగ్రహానికి మూడు లక్షణాలుంటాయి. కాబట్టి, దాంట్లో మళ్ళీ మూడు రకాల భావనలుంటాయి. 1) స్థూలం 2) సూక్ష్మం 3) కారణం. దీనిని బట్టి 1) విగ్రహం యొక్క స్థూల రూపానికి సంబంధించిన 'స్థూలభావన'. 2) విగ్రహాన్ని సంకేత పూర్వకంగా తెలిపే మంత్ర భావన. 3) ఈ రెంటికీ అతీతంగా వుండి, రెంటికీ కారణభూతమైన 'కారణ భావన' అని మూడు రకాల భావన లుంటాయి. 'స్థూల భావన' – తామ సత్వాన్ని; సూక్ష్మభావన – రాజసికత్వాన్ని, కారణ భావన – సాత్త్వికత్వాన్ని సూచిస్తాయి.

అన్ని భావనలకు గమ్యమైనది– ''భావనలను కలిగించునది.'' అవుతుంది గాబట్టి, అమ్మవారు – 'భావనాగమ్యా' అవుతుంది. అయితే, మన భావనలలో ఆవిడను నియమించి, నియంత్రించి, నిర్వచించలేము. అని 'నాయమాత్మా ప్రవచనేలభ్య'' అనే వాక్యం 'నిరుక్తంచానిరుక్తంచ' అనే ఉపనిషద్వాక్యం, తెలుపుతాయి కాబట్టి, ఆవిడ ''భావనా + అగమ్యా'' గూడా అవుతుంది.

మొత్తంమీద ఈ నామానికి 5 రకాల భావనల ద్వారా పొందదగినది మరియు పొందశక్యముగానిది గూడా అవుతుంది. అవి –

1) శబ్ద భావనాగమ్యా 2) అర్థ భావనాగమ్యా

3) స్థూల భావనాగమ్యా 4) సూక్ష్మ భావనాగమ్యా

5) కారణ భావనాగమ్యా

## 114. భవారణ్యకుఠారికా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'భవారణ్యకుఠారికాయైనమః'' అని చెప్పాలి.

భవ = సంసారమనెడు, అరణ్య = అడవికి; కుఠారికా = గండ్ర గొడ్డలి వంటిది.

'భవము' అంటే 'సంసారము' అని అర్థం. మాటి మాటికి జన్మిస్తూ, కష్టసుఖాలు అనుభవిస్తూ, మరణిస్తూ, మళ్ళీ జన్మిస్తూ – ఇలా కొనసాగబడే లక్షణం వుండేది కాబట్టి, సంసారాన్ని 'భవము' అంటారు.

అరణ్యంలో వుండే చెట్లు, చేమలకు గూడా ఇలా మాటి మాటికీ పుడుతూ, నరకబడుతూ, చిగురిస్తూ, క్షీణిస్తూ, నశిస్తూ, మళ్ళీ మొలకెత్తుతూ, పెరుగుతూ ఉండే లక్షణం వుంది. కాబట్టి, సంసారానికి - అరణ్యానికి ఉన్న ఈ సమాన లక్షణాన్ని బట్టి, ఈ నామంలో సంసారాన్ని - 'అరణ్యం'తో పోల్చారు.

చిన్న చిన్న కత్తులు, గొడ్డళ్ళు అయితే అరణ్యాన్ని సమూలంగా నాశనం చెయ్యలేవు. గండ్రగొడ్డలి అయితే సమూలంగా వినాశం చెయ్యగలదు. కాబట్టి, ఈ నామంలో ''సంసారమనే అరణ్యానికి అమ్మవారు గండ్రగొడ్డలి లాంటిది'' అన్నారు.

సంసారంలో భౌతికమైన బంధం కన్న మానసికమైన బంధమే ఇబ్బందులను సృష్టిస్తుంది. తెగవలసినది ఈ మానసిక బంధమే దీన్ని 'భవబంధం' అంటారు. ఈ భవ బంధచ్ఛేదనకు ఉపయోగించాల్సిన గొడ్డలి గూడా భౌతికమైనది కాకూడదు. అమ్మవారు జ్ఞాన స్వరూపిణి. అందుకని జ్ఞానమనే గొడ్డలి అన్నమాట. జ్ఞానంతో మానసికమైన చిక్కుల్ని విడదీసుకోవచ్చును. కాబట్టి, 'భవారణ్యానికి' - అమ్మవారు 'జ్ఞాన కుఠారిక' అని ఈ నామానికి అర్థంగా గ్రహించాలి.

'జన్మసంబంధమైన, సంసార సంబంధమైన అరణ్యాన్ని ఛేదించే (జ్ఞాన రూపమైన) గండ్ర గొడ్డలి' - అని ఈ నామానికి అర్థం.

## 115. భద్రప్రియా

ఇది నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''భద్రప్రియాయైనమః'' అని చెప్పాలి.

భద్ర = శుభములు, శ్రేష్ఠములు అయిన వాటి యందు, ప్రియా = ఇష్టము కలిగినది.

''భద్ర'' అనే పదానికి చాలా అర్థాలున్నప్పటికీ, ప్రస్తుతం - భద్రుడు, శుభము, శ్రేష్ఠము, వీరభద్రుడు, శివుడు, ఒక జాతి ఏనుగు - అనే అర్థాలు మాత్రం చెప్పకుంటే సముచితంగా వుంటుంది.

సదాచార ప్రవర్త నాదులు గల వారికి 'శుభములు' చేకూర్చువాడు 'భద్రుడు'. భద్రుడు అంటే శివుడే! 'శుభమే' శివుడు గాబట్టి శుభములు చేకూర్చగలడు. ''శివ' కు

ముందున్న స్థితి 'భద్ర' దీనికి ముందు స్థితి 'వీరభద్ర'. అహంకారంతో చేస్తిన దక్షయజ్ఞాన్ని 'వీరభద్రుని' గా ధ్వంసం చేసి, 'భద్రుని' గా - సంప్రదాయానికి, సత్ప్రవర్తనకు రక్షణ చేకూర్చి; 'శివుని' గా మంగళకరుడై నాడు.'

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) శుభములు, శ్రేష్ఠములు అయిన వాటి యందు ఇష్టము గలది.

2) వీరభద్ర స్థితిలోను, భద్ర స్థితిలోను ఉన్న శివుని ఇష్టపడునది.

3) శ్రేష్ఠమైన ఒక జాతి ఏనుగునందు (భద్రగజములు) ఇష్టమైనది.

4) శివునికి ప్రియమైనది.

## 116. భద్రమూర్తిః

ఇది నాలుగుఅక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''భద్రమూర్తయే నమః'' అని చెప్పాలి.

భద్ర = శుభమైన లేదా మంగళకరమైన; మూర్తిః = స్వరూపము గలది. ''భద్రత్వం'' - అయ్యవారైతే ''మూర్తిత్వం'' - అమ్మవారు. ఎప్పుడూ ఇంతే ! 'గుప్తలక్షణం' - అయ్యవారైతే, దాని 'వ్యక్తరూపం' - అమ్మవారు. అంటే - 'శుభ' లేదా 'మంగళకర' లక్షణమే రూపముగాగలది'' అని ఈ నామానికి అర్థం.

## 117. భక్తసౌభాగ్యదాయినీ

ఇది ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'భక్తసౌభాగ్యదాయిన్యైనమః'' అని చెప్పాలి.

భక్త = భక్తులకు; సౌభాగ్య = సౌభాగ్యమును; దాయినీ = ఇచ్చునది. సు - భ - గ అక్షరాలతో ఏర్పడే ''సుభగ'' అనే విశేషణం యొక్క నామ వాచక రూపమే ''సౌభాగ్యం'' ''సుభగ'' పదంలోని 'సు' - మంచితనము, 'భ' - వెలుగు లేదా వైభవము, 'గ' - గమనము, గతి, 'నడక' లేదా 'ప్రవర్తన' అనే అర్థాలను సూచిస్తాయి. ఈ మూడు లక్షణాలు కలిస్తే సౌభాగ్య లక్షణమౌతుంది.

నాలుగు రకాల భక్తులకు (ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు) అమ్మవారు సౌభాగ్య లక్షణాన్ని ప్రసాదిస్తుంది'' అని, అమ్మవారికి ''సుభగా'' అనే నామం గూడా వుంది. అందువలన 'భక్తసౌభాగ్యదాయినీ' అంటే - భక్తులకు 'అమ్మవారినే' అంటే 'తననే' ఇచ్చునది. అనగా 'సాయుజ్యము' నిచ్చునది' అని గూడా అర్థం చెప్పుకోవచ్చును.

## 118 భక్త ప్రియా

ఇది నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''భక్తప్రియాయైనమః'' అని చెప్పాలి.

భక్త = భక్తులయెడ; ప్రియా = ప్రేమగలది, అనగా - వాత్సల్యము గలది.

ఈనామం ''భక్తి ప్రియా'' అని గూడా కొన్ని పుస్తకాల్లో వుంది. అప్పుడు 'భక్తిని ఇష్టపడునది' అని అర్థం చెప్పుకోవాలి.

భక్తికలిగిన వాళ్ళు భక్తులు. నీళ్ళ యొక్క సాన్నిధ్యంలో పంచదార ఏ విధంగా కరిగి, ఒరిగి, నీటిలో ఐక్యమైపోయి, తన అస్తిత్వాన్ని కోల్పోతుందో - అలాగే అమ్మవారి సాన్నిధ్యంలో తాదాత్మ్య స్థితిని పొందే వారిని - - 'భక్తులు' అంటారు. ఈ లక్షణాన్ని 'భక్తి' అంటారు. జీవుల ఈ లక్షణం అంటే అమ్మవారికి ఇష్టం - అని 'భక్తిప్రియా' అనే విధమైన నామానికి, ఈ లక్షణం గల వారంటే ఇష్టమని 'భక్తప్రియా' అనే విధంగా వ్రాసుకునే నామానికి అర్థాలు చెప్పుకోవాలి.

మన కన్న చిన్నవారి మీద ఉండే ప్రేమను 'వాత్సల్యం' అనీ, మన తోటి వారి మీద వుండే ప్రేమను 'స్నేహము' అనీ, మన కన్న పెద్దవారి మీద ఉండే ప్రేమను 'భక్తి' అనీ అంటారు. అంటే వాత్సల్యం, స్నేహం, భక్తి ఈ మూడు ప్రేమ యొక్క రూపాలేగాని వేరైనవి కాదు. వీటికి నామవైవిధ్యమే గాని అర్థవైరుధ్యం లేదు. అందుకని 'భక్తప్రియా' అన్నప్పుడు భక్తులు అమ్మవారికి పిల్లలే కాబట్టి 'ప్రియా' అనే పదానికి 'వాత్సల్యము'నే చెప్పుకోవాలి.

1) భక్తులయందు వాత్సల్యము గలది.

2) భక్తిని ఇష్టపడునది.

అని, రెండు విధాలుగా ఉన్న ఈ నామానికి - అర్థాలు చెప్పుకోవచ్చును.

## 119 భక్తిగమ్యా

ఇది నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''భక్తిగమ్యాయైనమః'' అని చెప్పాలి.

భక్తి = భక్తికి, గమ్యా = గమ్యమైనటువంటిది.

భక్తికి గమ్యం 'లాభం' కాకూడదు. లాభం వస్తుందంటే చేసేది 'వ్యాపారం' అవుతుంది గాని ''భక్తి'' కాదు. అయినా, దాన్ని మనం పొరపాటున భక్తి అనే పిలుస్తాం! కాని, యదార్థంగా భక్తికి గమ్యం 'అమ్మవారు' కావాలి. 'ముక్తి' యందు 'రక్తి' కలిగిన వాళ్ళకు 'శక్తి' యందు 'భక్తి' కలుగుతుంది. ఆ భక్తి చేతనే గమ్యానికి చేరతాం. ఆ గమ్యమే అమ్మవారు. సద్గతి కావాలంటే ఈ సంగతి తెలియాలి.

భక్తి యొక్క వివిధ దశల గూర్చి శివానందలహరిలో శంకరాచార్యుల వారు ''అంకోలంనిజ బీజసంతతి ...'' అనే శ్లోకంలో సోదాహరణంగా తెలియపరచారు. అవే సారూప్య, సామీప్య, సాలోక్య, సాయుజ్యాలు. చివరిదైన సాయుజ్యస్థితిలో చెప్పినట్లు – 'అమ్మవారిలో ఐక్యం చెందడమే భక్తి యొక్క గమ్యం' అని తెలుసుకోవాలి.

'భక్తికి గమ్యమైనది' అని ఈ నామానికి అర్థం.

## 120 భక్తివశ్యా

ఇది నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ''భక్తివశ్యాయైనమః'' అని చెప్పాలి.

భక్తి = భక్తికి, వశ్యా = స్వాధీనురాలు.

అమ్మవారి నుండే అందరూ వచ్చాముగాబట్టి, చివరకు అందరూ ఆమెనే చేరుకోవాలి. ఇలా అందరి గమ్యం అమ్మవారైనపుడు, – ఆ గమ్యాన్ని పొందడానికి – ఎన్నో రకాల పద్ధతులు, మార్గాలు వుండవచ్చు. కాని, అన్నిటి కన్న అత్యంత సులభమైన మార్గం – 'భక్తి మార్గం' అని ఈ నామం ద్వారా తెలియపరుస్తున్నారు. అమ్మవారు

ఎంత స్వతంత్రురాలైనా, భక్తికి మాత్రం అస్వతంత్రురాలై, భక్తులకు వశమై పోతుందిట! అందుకే – మోక్షాన్ని సాధించే పద్ధతుల్లో భక్తికే అగ్రతాంబూలం – అని ''మోక్షసాధన సామగ్ర్యా భక్తిరేవగరీయసీ'' అన్నారు.

''భక్తికి స్వాధీనురాలు'' అని ఈ నామానికి అర్థం.

## 121 భయాపహా

ఇది 4 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'భయాపహాయైనమః' అని చెప్పాలి.

భయ = భయములను; అపహా = పోగొట్టునది. 'జరిగే వాటికి భయపడకుండా చేసేది' అని అర్థం. అంతేగాని, మనం ఏం చేసినా – మనం భయపడకుండా చేసేది' అని కాదు. అంటే కర్మఫలాలు జరుగుతూంటే మనస్సు చిక్కుకోకుండా చేసేది అని అర్థం.

భయం గొలిపేటటువంటివి, భయపడాల్సినవి అయిన పనులు మనలో ఏ ప్రవృత్తి వలన మనం చేస్తామో – ఆ ప్రవృత్తిని మనలో లేకుండా చేస్తుంది. అంటే, భయపడాల్సిన అవసరం రాని పనులనే మన చేత చేయిస్తుందన్నమాట ! భయానికి దారితీసే 'దుష్ట సంకల్పాలు – అనే చెట్టు యొక్క వేరు దగ్గరే' కావలసిన సంస్కారం జరుగుతుంది. అంతేగాని, దుష్టసంకల్ప వృక్షం యొక్క మూలాలు (వేర్లు) పెరిగి, కొమ్మలుగా విస్తరిస్తే – ఆ కొమ్మలను నరికి, సంస్కరించడం కాదన్నమాట! అంటే, అమ్మవారు చేసేది శాశ్వత పరిష్కారమే గాని, తాత్కాలిక ఉపశమనాలు కాదు.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. జరిగే వాటికి భయపడకుండా చేయునది.
2. కర్మఫలాలు జరుగుతూ వుంటే మనస్సు చిక్కుకోకుండా చేసేది.
3. భయపడాల్సిన అవసరం రాని పనులనే మన చేత చేయించు విధముగా భయమును పోగొట్టునది.
4. శాశ్వతంగా భయాన్ని పోగొట్టు పరిష్కారమును చూపునది.

# 122 శాంభవీ

ఇది 3 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''శాంభవ్యైనమః'' అని చెప్పాలి.

శాంభవీ = శంభుని భార్య

మనం చేసే ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో 'ఓం' మిగిలినపుడు – మనకు కలిగే అనుభూతి ''శం''. ''శం'' అంటే శాంతి, సుఖము అని అర్ధం. అంతరింద్రియ నిగ్రహం వుంటే – ఈ శాంతి వస్తుంది. మన లోపల పనిచేసే, కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గ ప్రకోపాన్ని అదుపులో పెట్టగలిగే శక్తిని 'శమము' అంటారు. 'శం' (అనగా శాంతి) కలవాడే శర్మ. అని గూడా 'శర్మ' పదానికి వ్యుత్పత్తి అర్ధం. శాంతికి, సుఖానికి ఉత్పత్తి స్థానం ''శంభుడు'' ఈ 'శం' అనే గుప్త లక్షణాన్ని (Potential characterstic) తెలియ జేసే శంభుని వ్యక్త రూపమే(Manifested figure) ''శాంభవి'' అనే అమ్మవారు. 'శం' ను పుట్టించు వాడైన 'శంభుడు' – 'ఓం' అనే బీజాక్షరం చేత తెలియబడతాడు, ఉచ్ఛరింపబడతాడు.

''శం'' స్థితి రానంతవరకు మనం శారీరికలోకం(Individual plane)లోగాని, వ్యక్తిత్వ లోకం(Personality plane) లోగాని వుంటాము. శారీరిక లోకంలో వుండేవారు భౌతికమైన వస్తువులతో వ్యాపారం చేస్తారు. హక్కుల కోసం పోరాడతారు. (They fight for the Rights) వ్యక్తిత్వలోకంలో వుండేవారు – తమ మంచితనాన్ని, పేరు ప్రతిష్ఠలను, అవకాశాలను పెట్టుబడిపెట్టి – వాటితో వ్యాపారం చేస్తారు. (Marketing the Virtues)

'శం' లోకంలో వుండేవారికి పై రెండు రకాల వ్యాపారాలు వ్యర్ధమని తెలుస్తుంది. వారు సూటిగా, నిజాయితీగా ఆత్మలోకంలోనే వుండి విధులను నిర్వహిస్తారు. ఈ స్థాయిని ఇవ్వగలిగినది గాబట్టి అమ్మవారు ''శాంభవి''

రెప్పపాటు లేకుండా కళ్ళు బాహ్యంగా చూస్తూ వుండి, మనస్సు మాత్రం సహస్రారం లోని బిందువు వద్ద వుండే అమ్మవారిపై కేంద్రీకృతమై వుంటే – ఆ శారీరిక స్థితిని 'శాంభవీముద్ర' అంటారు.

దేవీ భాగవతంలో తెలిపిన ప్రకారం ఎనిమిది సంవత్సరాల కన్యను 'శాంభవి' అంటారు. మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) శంభుని భార్య

2) శాంతి సుఖములును కలుగజేయునది.

3) శాంభవీ ముద్ర

4) ఎనిమిది సంవత్సరాల కన్య.

## 123 శారదారాధ్యా

ఇది 5 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''శారదారాధ్యాయై నమః'' అని చెప్పాలి.

శారదా = సరస్వతిచే, ఆరాధ్యా = ఆరాధింపబడునది. ''శ'' అనే అక్షరం శాంతిని, సుఖాన్ని, శుభాన్ని – సూచిస్తుంది. 'ర' కారం వెలుగును సూచిస్తుంది. ఈ రెండు అక్షరాలు కలిగినదే ''శరత్'' అనే పదం. ''శాంతి''ని – తెలుపురంగుతో గూడా సంకేతిస్తారు. కాబట్టి, 'స్వచ్ఛమైన తెల్లని వెలుగులు, పరమ ప్రకాశవంతమైన లక్షణం' కలిగిన వస్తువునుగాని, వ్యక్తిని గాని, వాతావరణాన్ని గాన్ని ''శరత్'' అనే పదంతో సూచించవచ్చును. ఈ శరత్ లక్షణం కలిగినది కాబట్టి సరస్వతిని 'శారదా' అన్నారు. ఈ శరత్ లక్షణం వుండే కాలాన్ని ''శరదృతువు'' అన్నారు.

ఈ శరదృతువు ఆశ్వయుజ మాసంతో ప్రారంభమౌతుంది. 'అశ్వినీ' నక్షత్రంలో చంద్రుడు వుండగా పౌర్ణమి వచ్చే మాసం కాబట్టి – ఈ మాసాన్ని 'ఆశ్వయుజ మాసం' అన్నారు. 'అశ్విని' మొదటి నక్షత్రం కాబట్టి, ఒక విధంగా ఈ మాసం సంవత్సరానికి ప్రారంభమౌతుంది. భూమ్మీద జలాలకు వడపోత (Decantation) శరదృతువులో జరిగితే, స్వేదనం (Distillation) వేసవిలో జరుగుతుంది. కాబట్టి, ఈ రెండు కాలాల్లో జలం స్వచ్ఛంగానే ఉంటుంది. బురద, ఒండ్రు ఉండదు. కాబట్టి, అటు – శరదృతువులోను, ఇటు – సంవత్సర ప్రారంభకాలంలోను గూడా ఈ స్వచ్ఛతను లక్షణంగా కలిగిన అమ్మవారిని పూజిస్తారు, ఆరాధిస్తారు.

ప్రజ్ఞ – ముఖంలోకి వచ్చినపుడు (ముఖం అంటే సంస్కృతంలో నోరు) వాక్కు వ్యక్తమౌతుంది. అలా వ్యక్తమైన వాక్కుకు సంబంధించిన దేవతను 'శారద' అంటారు. వాగ్దేవి అయిన ఈ శారదా దేవిచే (వశిన్యాది వాగ్దేవతలతోసహ) స్తుతింపబడి, ఆరాధింపబడేది గాబట్టి – అమ్మవారు ''శారదారాధ్య'' అయింది. మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) శారదాదేవి (సరస్వతి)చే ఆరాధింపబడునది.

2) శరదృతువులో ఆరాధింపబడునది.

3) సంవత్సరారంభములో ఆరాధింపబడునది.

4) వశిన్యాది వాగ్దేవతలచే పూజింపబడునది.

## 124 శర్వాణీ

ఇది 3 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''శర్వాణ్యైనమః'' అని చెప్పాలి.

శర్వాణీ = శర్వుని (శివుని) భార్య.

''శ్రీ'' ని అన్నిటిలోను వ్యాపింపచేయువాడు' ''శర్వుడు''. 'శ్రీ' – అంటే 'సంపద' ఈ సంపద మనకు భూమి నుండే వస్తుంది. ఈ భూమి – శివుని అష్టమూర్తులలో ఒకటి. అందుకే – భూస్వరూపుడైన శివునికి 'శర్వుడు' అనే పేరు వచ్చింది. ఈ శర్వుని భార్య శర్వాణి.

భూమి మూర్తి అయిన శివుని భార్య శర్వాణినే ''సుకేశి'' అని గూడా అంటారు. ఈ సుకేశికి పుట్టినవాడే ''కుజుడు''. ఈ విషయాలు లింగపురాణంలోను, వాయు పురాణంలోను చెప్పబడ్డాయి. (విష్ణు సహస్ర నామాల్లో గూడా ''సర్వశ్శర్వః శివః స్థాణుః'' అనే శ్లోక పాదంలో ఈ 'శర్వ' నామ ప్రసక్తి వుంది. అంటే ''శర్వుడు'' అనే నామం విష్ణుమూర్తికి గూడా చెల్లుతుంది. ఎందుకంటే, విష్ణువు గూడా 'శ్రీ' ని (అంటే సంపదను) అన్నిటా వ్యాపింప చేస్తాడు కాబట్టి. ఈ సంపదకు మూలమైన భూదేవి, శ్రీదేవి – విష్ణువుకు భార్యలే గదా! (భూదేవి – స్థూలసంపదకు, శ్రీదేవి – సూక్ష్మ సంపదకు – సంకేతాలు.

ఇవి 'దేహ', 'ఆత్మ' సంబంధమైనవి). ఈ నాలుగు నామాలు (సర్వః, శర్వః, శివః, స్థాణుః) శివునికి , విష్ణువుకూ గూడా చెల్లుతాయి)

'శర్వుని భార్య' అని ఈ నామానికి అర్థం.

## 125 శర్మదాయినీ

ఇది 5 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''శర్మదాయిన్యై నమః'' అని చెప్పాలి.

శర్మ = శాంతిని, సుఖమును, దాయినీ = ఇచ్చునది.

''శర్మ'' అంటే - 'చిత్తం నిశ్చలత్వం చెందుట' అని అర్థం. ఈ అర్థం లోనే భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగంలో అర్జునుడు ఆ విశ్వరూపాన్ని చూస్తున్నపుడు–

''దిశోనజానే, నలభేచ శర్మ'' - (11 : 25. గీత)

(దిక్కుతోచడం లేదు, శాంతి లభించటం లేదు - అని అర్థం) అంటాడు. అందుకు సమాధానంగా కృష్ణుడు.

''మాతే వ్యథా మాచ విమూఢ భావో'' - 11 - 40 అంటాడు. (నీకు బాధవద్దు, చిత్త వైకల్యం కూడా వద్దు - అని అర్థం) కాబట్టి, 'శర్మ' అంటే శాంతి, సుఖము అని అర్థాలు చెప్పుకోవచ్చును. ''శాంతి'' లక్షణం ఉన్నవారే ''శర్మ''లు, ఆ లక్షణం లేని వాళ్ళు శర్మ అనే పేరుకు అర్హులు కారు. బ్రాహ్మణులకు ముఖ్యంగా ఈ లక్షణం వుండాలి. సంధ్యా వందనంలో బ్రాహ్మణులు వాళ్ళ పేర్లు ఏవైనప్పటికీ చివరకు 'శర్మ' అని చేర్చి చెప్పుకోవాలి. అంటే - శాంతి లక్షణం ఉండవలసిన వారు బ్రాహ్మణులని సూచన.

పదవి కోసం, అధికారం కోసం తాపత్రయ పడేవారికి ఈ 'శర్మ' లభించదు. ఈ శర్మ వుంటేనే 'శక్తి' వుంటుంది. 'పడబోయే వాణ్ణి గూడా - ఈ 'శర్మ' వున్న వాడు రక్షించగలడు లేనివాడు గోల తప్ప ఇంకేమీ చెయ్యలేడు.

(కొడుకులందరినీ చంపావా! అన్నాడు వశిష్ఠుడు – 'ఆ' అన్నాడు విశ్వామిత్రుడు. 'అయితే నువ్వే నా కొడుకువి' అన్నాడు వశిష్ఠుడు. అప్పుడు విశ్వామిత్రుడు 'తెల్లబోయి, ఓడిపోయి, నా అంతమొనగాడే ఇలా అయిపోతే – మామూలు వాళ్ళ సంగతి వేరే చెప్పాలా' అనుకుని, సాధించిన అస్త్ర, శస్త్రాలనన్నిటినీ సముద్రంలో పడేసి, తపస్సు ప్రారంభించాడు. వశిష్ఠుడు అంతటి చిత్త నిశ్చలత్వం (శాంతి) వున్నవాడు. ''శం'' ఆయనకు చెందినట్లుగా ఇంకా ఏ ఋషికీ చెందదు)

ఈ 'శం'ను గురించి పూర్వనామం 'శాంభవీ' లో మరింత వివరింపబడింది.

'శాంతిని (చిత్తనిశ్చలత్వాన్ని) ఇచ్చునది' అని ఈ నామానికి అర్థం. 'శర్మ'ను అనగా 'బ్రాహ్మణత్వమును' ఇచ్చునది – అని గూడా అర్థం చెప్పుకోవచ్చును.

## 126 శాంకరీ

ఇది 3 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''శాంకర్యైనమః'' అని చెప్పాలి.

శాంకరీ = శంకరుని భార్య. 'శం' అనగా శాంతికి, సుఖానికి ఉత్పత్తి స్థానం 'శంభు'డైతే – ఆ శాంతి, సుఖాలను కలుగచేసేవాడు 'శంకరుడు'. ఆ శంకరుని ఇల్లాలు 'శాంకరి'.

'శాంభవి,' 'శర్మదాయినీ' నామాల్లో ఈ 'శం' గురించి మరింత వివరింపబడింది.

'శంకరుని భార్య' అని ఈ నామానికి అర్థం.

## 127 శ్రీకరీ

ఇది 3 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'శ్రీకర్యైనమః' అని చెప్పాలి.

శ్రీకరీ = ఐశ్వర్యమును ఇచ్చునది. ''శ్రీ'' అంటే సంపద, ఐశ్వర్యం, మంగళకరం అని అర్థాలు. కాబట్టి – సమస్తమైన సంపదలను, ఐశ్వర్యములను, మంగళకరమైన వాటిని

ప్రసాదించునది. 'శ' కార'ర' కార, ఈ కారాలతో ఏర్పడే ఈ "శ్రీ" - ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులను గూడా సూచిస్తుంది కాబట్టి, 'ఈమూడింటి'ని గూడా ఇచ్చునది అని అర్థం.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. సమస్త సంపదలను, ఐశ్వర్యములను ఇచ్చునది.

2. ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులను కలుగజేయునది.

## 128 సాధ్వీ

ఇది 2 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'సాధ్వ్యైనమః' అని చెప్పాలి.

సాధ్వీ = సాధు ప్రవర్తన గల పతివ్రత.

'సాధువు' అనే పులింగపదానికి 'సాధ్వీ' అనేది స్త్రీలింగ పదంగా చెప్పుకోవచ్చును. సాధు లక్షణం గల పురుషుణ్ణి 'సాధువు' అని, స్త్రీ ని 'సాధ్వీ' అని అనవచ్చును.

తన ప్రవర్తనచేత ఇతరులను ఆహ్లాదపరచి, ఆనందపరచే లక్షణాన్ని 'సాధులక్షణం' అంటారు. స్త్రీలలోని సాధు లక్షణాన్ని అమ్మవారి అంశగా గుర్తించాలి. పురుషులలో కన్న స్త్రీలలో సాధు ప్రవర్తనకు ఎక్కువ అవకాశం వుంది. ఈ విషయం తూర్పు దేశాల్లో మరింత నిజం. పాశ్చాత్య దేశాల్లో స్త్రీ జన్మకు అంతిమ లక్ష్యం 'ఉత్తమ జీవిత భాగస్వామిని' అవడం అయితే - తూర్పుదేశమైన మన భారతదేశంలో ఆ అంతిమ లక్ష్యం 'ఉత్తమ మాతృమూర్తి' అవడం అని చెప్పుకోవచ్చును. ఎందుకంటే - సాధులక్షణం భార్య స్థితిలో కన్న 'మాతృమూర్తి స్థితిలోనే ఎక్కువ ఉండడానికి అవకాశం ఉంది కాబట్టి. తల్లిని గూడా పేరు పెట్టి పిలుస్తారు పాశ్చాత్య దేశాల్లో - మన భారతదేశంలో పాశ్చాత్యుల ప్రభావం పడనంతవరకు - భార్యను గూడా పేరు పెట్టి పిలిచేవారు కారు. సాధారణంగా ఎవరివల్లనైనా పొరపాటు జరిగితే భార్య సహించినంతగా భర్త సహించలేడు. ఈ లక్షణం వారిద్దరి సాధుత్వంలో గల తేడాను సూచిస్తుంది. (స్త్రీ పాతివ్రత్యానికి, పురుషుని ఏక పత్నీ వ్రతానికి - ఈ సాధులక్షణం ప్రధానమైనది.)

కొంచెం విద్య తెలిస్తే చాలు 'వాణి నా వాణి' అంటున్నారు కవులు. కొంచెం ధనం వుంటే చాలు 'శ్రీపతు' లౌతున్నారు – ధనవంతులు. కాని, పార్వతి విషయంలో అలా అవకాశం లేదు. పైగా ఎన్ని జన్మలెత్తినా అన్ని జన్మల్లోను శివుణ్ణే భర్తగా గలిగినది, శివునిలో సగభాగమై పోయినది. కాబట్టి, పరమపతి వ్రతా లక్షణం గల సాధ్వి అమ్మవారు.

సాధు లక్షణం గల 'మహాపతివ్రత' అని' ఈ నామానికి అర్థం.

## 129 శరచ్చంద్రనిభాననా

ఇది 8 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించు నపుడు "శరచ్చంద్ర నిభాననాయై నమః" అని చెప్పాలి.

శరత్ = శరత్కాలము నందలి; చంద్ర = చంద్రునితో; నిభ – సమానమైన, ఆననా = వదనము గలది.

శరత్కాల చంద్రుడనగా శరత్పూర్ణిమా చంద్రుడని గ్రహించాలి. అంతేగాని కృష్ణ పక్షములోని చంద్రుడని గాని, ఇతర తిథులకు చెందిన చంద్రుడని గాని గ్రహించరాదు. ఇతర ఋతువుల్లో కన్న శరదృతువులో చంద్రుడు – శుక్ల పక్షంలో త్వరత్వరగా ఉదయిస్తాడు. అందువలన వెన్నెల ముందు ముందుగా ప్రారంభమై ఎక్కువ కాలవ్యవధి కలిగి వుంటుంది. (అయితే ఈ విధంగా వుండడం ఉత్తర అక్షాంశ ప్రాంతాల వారికే ! దక్షిణ అక్షాంశ ప్రాంతాల వారికి మన వసంత ఋతువులో ఇలా వుంటుంది) అందువల్లనే ఈ శరదృతువులోని పూర్ణిమా చంద్రుణ్ణి'Harvest Moon' అనగా 'పంటకు వచ్చిన నిండు వెన్నెల పండు చంద్రుడు' అంటారు. ఈ చంద్రుణ్ణే 'పరిణత శరచ్చంద్రుడు' అన్నారు సౌందర్యలహరిలో శంకారాచార్యుల వారు.

శరదృతువు ఆరంభంలో – అంతకు పూర్వం ఉన్న దట్టమైన అజ్ఞానపు కారు మేఘాలు పటా పంచలై, దహరాకాశం నిర్మలంగా స్వచ్ఛంగా మారడం జరుగుతుంది. ఈ కారణం మూలంగానే ఈ ఋతువును 'శరత్' లేదా శారద (సరస్వతి – సర్వశుక్లా సరస్వతి) ఋతువుగా పేరు పెట్టారు.

సూర్యుని వేడి కిరణాలు చంద్రుని మీద పడి వెన్నెలకిరణాలుగా మారి భూమికి చేరతాయి. సూర్యుడు – మన ఆత్మకు; చంద్రుడు – మన మనస్సుకు; భూమి – మన

దేహానికి సంకేతాలు. 'ఆత్మ' అనే సూర్యుని నుండి వెలువడే ''భావాలు'' అనే కిరణాలు 'మనస్సు' అనే చంద్రుని ద్వారా వ్యక్తమౌతాయి. మనస్సు ద్వారా వచ్చే భావాలు ముఖంలో వ్యక్తమౌతాయి. అందువల్లనే Face is the index of mind అని ఆంగ్లంలో చెబుతారు. కాబట్టి, సూర్యుడికి చంద్రుడు ఎలాంటివాడో – మనకు మన ముఖం అలాంటిదన్నమాట! అందువల్లనే, ముఖాన్ని చంద్రుడితో పోలుస్తారు. చంద్రుడికి కళలు మారేటట్లుగానే – మనముఖంలో గూడా కళలు (కళాకళలు) మారుతూ వుంటాయి. అన్ని రోజుల్లూ, అన్ని వేళలూ మనం ఒకే విధంగా వుండం. ముఖాన్ని చూచి మనస్సు స్థితిని ఊహించవచ్చు. ముఖము, చంద్రుడు – ఈ రెండూ ఆహ్లాదాన్ని సూచిస్తాయి. అందుకే ముఖాన్ని చంద్రుడితో పోల్చడం (గుండ్రంగా ఉండడమనే లక్షణ మొక్కటే గాదు పోల్చడానికి కారణం) అమ్మవారి ముఖం పరిపూర్ణ కళ (16 కళలు) గల పూర్ణిమా చంద్రుణ్ణి పోలి వుంటుంది. అంతేగాని ఇతర కళలతో కాదు. అందుకే ఆమె 'షోడశి'. పూర్ణిమా చంద్రుడే అమ్మవారి ముఖం అనడం ఇంకా సమంజసం. బహిర్మాతృకా న్యాసంలో 16 అచ్చుల్నీ అమ్మవారి ముఖంలోని నయన, నాసికా, శ్రోత్రాదులతో న్యసిస్తారు. (పూర్వ నామాల్లో ఈ న్యాస వివరాలు చెప్పబడ్డాయి).

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. శరత్పూర్ణిమా చంద్రబింబాన్ని పోలిన వదనం కలిగినది.
2. శర త్పూర్ణిమా చంద్రుణ్ణి తనముఖముగా కలిగినది.
3. 16 అచ్చులతో (Vowels) న్యసింపబడిన ముఖము కలిగినది.
4. దహరకాశాంలో అజ్ఞానమేఘాలను తొలగించిన జ్ఞాన శరత్పూర్ణిమా చంద్రుణ్ణి తన ముఖముగా కలిగినది.

## 130 శాతోదరీ

ఇది 4 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'శాతోదర్యైనమః'' అని చెప్పాలి.

శాత = కృశించిన, లేదా - సన్నని; ఉదరీ = పొట్టగలిగినది, అనగా - సన్నని నడుము ప్రదేశము గలది.

సన్నని నడుము సదాచార సంపన్నతకు గుర్తు. ఇలా వుండడం ఉత్తమ గృహిణీలక్షణం, ఉత్తమ సాముద్రిక లక్షణం. ఇలా కాకపోతే చాకిరీ చేయించుకోవాల్సిన అవసరంగాని, చాకిరీ చెయ్యవలసిన అవసరం గాని జీవితంలో వస్తుంది. గర్భధారణలో గూడా ఇబ్బంది వుంటుంది. సాధారణంగా నడుం లావుగా వున్న వాళ్ళకు Endocrinal system దెబ్బతింటుంది. నడుం సన్నగా వున్న స్త్రీలలో అమ్మవారి కళ వున్నదని తెలుసుకోవాలి.

శత = నూఱు, లేక - అనేక; ఉదర = గుహ; అని చెప్పుకుంటే 'శాతోదర' అవుతుంది. ఈ పదానికి 'అనేక గుహలు కలిగినవాడు' అని అర్థం వస్తుంది. అలా గుహలు కలిగినవాడు 'హిమవత్పర్వతం' గా అర్థం చెప్పకుంటే - అటువంటి శాతోదరునికి సంబంధించినది (కూతరు) కాబట్టి ''శాతోదరీ''.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. సన్నని నడుము గలిగినది.

2. అనేక గుహలు వుండే హిమవత్పర్వతము యొక్క కుమార్తె.

## 131 శాంతిమతీ

ఇది 4 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించుపుడు ''శాంతి మత్యైనమః'' అని చెప్పాలి.

శాంతిమతీ = శాంతిగలది. ప్రశాంతమైన స్థితిలో వుండే మనస్సు కలిగినది.

శాంభవీ మొదలైన నామాల్లో తెలియపరచిన విశేషాలలో కొన్ని ఈ నామానికి గూడా వర్తిస్తాయి.

మనకు మనశ్శాంతి వుంటే అది మనకు అమ్మవారి కళగా గుర్తించాలి. ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. శాంతియుతమైన మనస్సు గలది.

2. భక్తుల సమస్యలను – శాంతి, సామరస్యములతో పరిష్కరించు మనస్సు గలది.

## 132 నిరాధారా

ఇది 4 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'నిరాధారాయైనమః' అని చెప్పాలి.

నిర్ + ఆధారా = నిరాధారా = ఆధారము లేనిది.

అందఱకీ అమ్మవారు ఆధారం. మరి అమ్మవారికి ఆధారం ఎవరు ? ఎవ్వరూ లేరు. అందుకని ఆవిడ నిరాధార.

అమ్మవారికి పూజా విధానాలు చాలా రకాలుగా వుంటాయి. అందులో కొన్ని బాహ్య పూజలుగాను, కొన్ని అభ్యంతర పూజలు గాను వుంటాయి. మళ్ళీ అభ్యంతర పూజల్లో – సాధార పూజలనీ, నిరాధార పూజలనీ – రెండు రకాలుంటాయి. సాధార పూజలో – విగ్రహం, స్తోత్రాలు, ఉపచారాలు, నైవేద్యాలు వుంటాయి. కాని, నిరాధార పూజలో ఇవేమీ వుండవు. కేవలము జ్ఞాన, ధ్యానాదులే ప్రాముఖ్యం వహిస్తాయి. ఈ నిరాధార పూజ బాహ్య వస్తు సామగ్రి స్తోత్రాదులపై ఆధారపడి వుండదు. కాబట్టి, అమ్మవారు నిరాధార పూజాస్వరూపులురాలుగా గూడా తెలుసుకోవాలి. ('అంతర్ముఖ సమారాధ్య' అనే నామం గూడా ఇలాంటిదే) ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవాలి.

1. తనకు వేరొక ఆధారము లేనిది. (ఆధారము అవసరము లేనిది)

2. నిరాధార పూజా స్వరూపురాలు.

## 133 నిరంజనా

ఇది 4 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''నిరంజనాయై నమః'' అని చెప్పాలి.

నిరంజనా = మాయాసంబంధమైన అజ్ఞానపు పొరలేని దృష్టిగలది.

'అంజనం' అంటే కాటుక కాబట్టి, 'నిరంజనా' అంటే 'కాటుక లేనిది' అని అర్థం చెప్పుకోకూడదు. అంజనం అంటే పొర. ఈ పొర వున్నప్పుడు సమ్యక్ దృష్టి వుండదు. పక్షపాత దృష్టి, అజ్ఞాన దృష్టి, లోప భూయిష్ఠ దృష్టి - ఇత్యాదులుంటాయి. సామాన్య మానవులందరి దృష్టి ఇలాగే వుంటుంది. కాని, అమ్మవారి దృష్టికి ఏ పొర, పక్షపాతం, అజ్ఞానం, మలినత్వం - వుండవు. అందుకని ఆవిడ 'నిరంజన'. కాటుక నల్లగా వుంటుంది. నలుపురంగు - అజ్ఞానాన్ని, తామసత్వాన్ని సూచిస్తుంది కాబట్టి, 'నిరంజనా' అంటే అవి లేనిది అని అర్థం.

కంటి ద్వారా ఎవరు చూస్తున్నారో - వారిని ఈ కన్ను చూడలేదు. చెవిద్వారా ఎవరు వింటున్నారో వారిని ఈ చెవి వినలేదు. అంటే - ఈకంటిద్వారా అమ్మవారు చూస్తోంది మనందరిలో, ఈ చెవి ద్వారా అమ్మవారు వింటోంది మనందరిలో అందుకని అమ్మవారి దృష్టికి గాని, శ్రవణానికి గాని పొరలు, లోపాలు, అడ్డంకులు, పక్షపాతాలు వుండవు. (మన చెవులకు, కళ్లకు లోపాలుంటే వినికిడికి, దృష్టికి లోపాలు మనకు ఉండవచ్చు).

'అజ్ఞానపు పొరలు, లోపాలు, అడ్డంకులు, పక్షపాతాలు లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 134 నిర్లేపా

ఇది 3 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'నిర్లేపాయైనమః' అని చెప్పాలి.

నిర్లేపా = కర్మబంధములు అంటనిది, అనగా - సంగము లేనిది.

'లేపనం' అంటే - 'అంటుకొనుట', 'లిప్తము' అంటే 'పూయబడినది' అని అర్థాలు.

పూస్తే అంటే దాన్ని 'లేపనం' అంటారు. ఈ నామంలో 'లేపనం' అంటే 'కర్మబంధం' అని సంకేతం, ఎందుకంటే - ఫలితం మీద దృష్టి పెట్టుకుని చేసే కర్మలన్నిటికీ కర్మబంధం వుంటుంది, అంటుతుంది. అటువంటి కర్మబంధాలు గాని, అవి

అంటడాలుగాని, లేనిది అమ్మవారు. అన్ని రకాల పదార్థాలు ఆకాశంలో వుంటాయి, ఆకాశం అన్ని రకాల పదార్థాల్లోను వుంటుంది. అయినా, ఆకాశానికి వేమీ అంటవు.

సినిమాహాల్లో తెరమీద నాయికా నాయకుల శృంగార చేష్టలు, నాయక ప్రతి నాయకుల యుద్ధాలు, హత్యలు, దోపిడీలు – ఎన్ని జరిగినా ఆ తెరకు ఇవే మీ ఉండవు, అంటవు. అలాంటిది అమ్మవారు.

'సంగములేనిది. కర్మబంధములు అంటనిది' అని ఈ నామానికి అర్థం.

## 135 నిర్మలా

ఇది 3 అక్షరాల నామం. నమస్కరించునపుడు ''నిర్మలాయైనమః'' అనాలి.

నిర్మలా = ఏ విధమైనా మలినము లేనిది.

ప్రపంచంలో ఏవైనా, ఎప్పుడైనా వినియోగ పడేవి (అంటే ఉపయోగపడేవి) మలినాలు కావు. వినియోగ పడని వాటిని మలినాలు అనాలి. దేన్నైనా తప్పించి, అసలైన దాన్ని ఆనందిస్తున్నప్పుడు, ఆ తప్పించిన దాన్ని 'మలినం' అనవచ్చు. కాని, అలా తప్పించినది ఎప్పుడూ వినయోగపడనిది అయితేనే దాన్ని 'మలినము' అనాలి. ఉదాహరణకి – దీపం మసిని తప్పించి, దాని వెలుతురును ఆనందిస్తాము. కాబట్టి, దీపం మసిని మలిన మనాలి. కాని, ఇది ఎప్పుడూ వినియోగపడేది కానప్పుడే మలినం అవుతుంది. దీపం మసి ''బూట్ పాలిష్'' తయారు చెయ్యడానికి, ఇంకో రకం దీపం మసి 'కాటుక' తయారు చెయ్యడానికి ఉపయోగపడతాయి. కాబట్టి, దీపం మసి మలినం కాదు. దీనిని బట్టి మనకు ఉపయోగించే విధానం తెలియకపోతే దాన్ని వెంటనే '' మలినం'' అనకూడదు'' అని నిర్ధారణ ఔతోంది.

బ్రద్దలైపోయే గుణం ఘనస్థితిలో మంచుగా వుండే నీళ్ళకు ఉంటుంది. కాని ద్రవస్థితిలో వున్నప్పుడు ఉండదు. ఇలా స్థితిని బట్టి కొన్ని గుణాలో, అవగుణాలో అంతకు మునుపు లేనివి రావచ్చును. అయితే, ఈ అవగుణం వుండడం వల్ల ప్రకృతిలో లాభంగా గూడా వుంటుందని తెలుసుకోవాలి. గుణాలకు, అవగుణాలకు – స్థితులు, పరిస్థితులే కారణం. సాధారణంగా ప్రపంచంలోని వారందరూ – ఈ స్థితులకు పరిస్థితులకు

ప్రభావితులే కాబట్టి, వాళ్ళకు అవగుణాలు, మలినాలు ఉంటాయేమోననిపిస్తుంది. కాని, ఈ రెంటికీ అతీతంగా వుండే అమ్మవారికి మలినాల ప్రసక్తి రాదు, ఉండదు (నీటిలోను, నీటియావిరిలోను, మంచులోను ఉన్న $H_2O$ అనేదానికి బ్రద్దలవడం లాంటి అవగుణం వున్నట్లా ? లేనట్లా ? ఈ అవలక్షణానికి అతీతంగా వుంటుందనేది అసలు సత్యం. అలాగే అమ్మవారు గూడా !)

కేవలం శాస్త్రజ్ఞానమే వుండి ఆత్మ జ్ఞానం లేకపోయినా, లేదా ఆత్మ జ్ఞానమే వుండి శాస్త్ర జ్ఞానం లేకపోయినా – ప్రపంచంలో చాలా వాటికి అర్థాలు తెలియక, అవగాహన కుదరదు. ఈ రెండు జ్ఞానాలు వున్నవారికే సమన్వయం తెలిసి, సృష్టి రహస్యాలు లోపరహితంగా స్పష్టమౌతాయి. అవగాహనపెరిగే కొద్దీ – సృష్టిలో అవగుణాలు మలినాలు లేవనీ – అవన్నీ మనం కల్పించుకుంటేను, సమన్వయం కల్పించుకోలేకపోతేను వస్తాయని తెలుసుకునే స్థితి వస్తుంది. ఆ స్థితి వచ్చినప్పుడు సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారి యొక్క 'నిర్మలా' అన్న ఈ నామానికి అర్థం తెలిసి, అవగాహన కుదిరి, ఆనందం కలుగుతుంది.

'ఏ విధమైన మలినము లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 136 నిత్యా

ఇది 2 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''నిత్యాయైనమః'' అని చెప్పాలి.

నిత్యా = నిత్య సత్య స్వరూపిణి

అమ్మవారు – దేశ, కాల, వస్తు, సజాతీయ, విజాతీయ, స్వగత, అవస్థాభేదము లేని నిత్య సత్య స్వరూపిణి. సృష్టి స్థితి లయ కాలాల్లో గూడా అమ్మవారు ఉంటుంది. ప్రపంచం, సృష్టి కాలంలో – వస్తూ, స్థితి కాలంలో – వుంటూ, లయకాలంలో – పోతుంది. మళ్ళీ వస్తుంది, వుంటుంది, పోతుంది. ఇలా 'వస్తూ, వుంటూ, పోతూ వుండే లక్షణం' ప్రకృతి అనే అమ్మవారికి నిత్యమూ ఉండేదే గదా ! అందుకని అమ్మవారు ''నిత్యా'' అని చెప్పబడింది.

తిథులు గూడా ఎప్పటి నుండో అలాగే వస్తూ పోతూ వుంటున్నాయి గాబట్టి తిథులను గూడా అమ్మవారి అంశలుగా పోల్చి, వాటిని 'నిత్య' లన్నారు. శ్రీవిద్యలో (ఈ నిత్యల పేర్లు అనుబంధములోను ''అష్టమీ చంద్ర విభ్రాజ దళిక స్థల శోభితా'' అనే నామంలోను చెప్పబడ్డాయి)

'నిత్యస్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

# 137 నిరాకారా

ఇది 4 అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు ''నిరాకారాయై నమః'' అని చెప్పాలి.

నిరాకారా = ఒక ప్రత్యేకమైన ఆకారము లేనిది.

'నిరాకారా' అంటే 'ఆకారం లేనిది' అని అర్థం కాదు. '' అన్ని ఆకారాలలోను అంతార్యమిగా వుండి, ఏదో ఒక ప్రత్యేకమైన ఆకారమునకే పరిమితము కానిది'' అని అర్థం.

ఒక వస్తువుకు ఆకారం వుంటుంది గాని, వస్తువులోని ద్రవ్యానికి ఆకారం ఉండదు. మట్టితో చేసే పాత్రలకు ఆకారాలుంటాయి గాని, మట్టికి ఆకారం వుండదు గదా ! అంటే కుండకు మట్టి ఎలాంటిదో – సకల జగత్తుకు అమ్మవారు అలాంటిది.

'అన్ని ఆకారాలలోను అంతర్యామిగా వుండి, ఏదో ఒక ప్రత్యేకమైన ఆకారానికే పరిమితము కానిది' అని ఈ నామానికి అర్థం.

# 138 నిరాకులా

ఇది నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'నిరాకులాయైనమః' అని చెప్పాలి.

నిరాకులా = భావ వికారములు లేనిది ( వ్యాకులములు లేనిది)

'ఆకులము' అంటే 'చికాకు' అని అర్థం చెప్పుకోవచ్చును. ఆకులపడడం అంటే – చికాకుపడడం, చెదిరిపోవడం. ఇలాంటి వ్యాకుల భావాలు, భావవికారాలు లేనిది అమ్మవారు.

చిట్లడం, బీట్లివ్వడం, బ్రద్దలవడం – ఇలాంటి చిక్కులు 'కుండ' కి వుంటాయి గాని 'మట్టి' కి ఉండవు. (ఈ ఉదాహరణలో కుండ అంటే మనమే! చిట్లడం, బీట్లివ్వడం వంటివి మన చికాకులు, మట్టి అంటే – అమ్మవారు అని గ్రహించాలి)

'ఏ విధమైన భావ వికారాలు, వ్యాకులాలు లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 139 నిర్గుణా

ఇది మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'నిర్గుణాయైనమః' అని చెప్పాలి.

నిర్గుణా = గుణములు అంటనిది.

పదార్థాలను బట్టి – 'లక్షణాలు'; శరీరాలను బట్టి – 'గుణాలు'; ఇంద్రియాలను బట్టి – 'విషయలౌల్యాలు'; మనస్సును బట్టి – 'భావాలు'; 'బుద్ధిని బట్టి – 'నిర్ణయాలు'; చిత్తాన్ని బట్టి – 'వృత్తులు'; 'అహంకారాన్ని బట్టి – 'ఆగ్రహాలు' – వస్తూవుంటాయి. వాస్తవానికి ఇవన్నీ గుణాల కోవలోకే వస్తాయి. అయితే వివిధ రూపాల్లో వున్న ఈ గుణాలు ఆత్మకు ఉండవు. అమ్మవారికి ప్రతీకయే ఆత్మ. కాబట్టి, అమ్మవారికి గుణాలు వుండవు.

'గుణములు అంటనిది, లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 140 నిష్కలా

ఇది మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'నిష్కలాయైనమః' అని చెప్పాలి.

నిష్కలా = విభాగములు లేనిది (కల = కళ)

'కల' – అంటే – 'అంశ' లేదా 'ముక్క' అని అర్థం.

అమ్మవారిలో - వివిధ పదార్థాలు, వస్తువులు, వ్యక్తులు, సన్నివేశాలు, ప్రదేశాలు, విభాగాలుగా వుంటాయి గాని, అమ్మవారు ఒక ప్రత్యేకమైన విభాగంగా వుండదు. అంటే - అమ్మవారు 'సమన్వయాత్మక'మే గాని 'విభాగాత్మకం' కాదు.

మనిషిలో - ఇంద్రియాలు, వివిధ అవయవాలు వేరు వేరు విభాగాలుగా వుండవచ్చుగాని, 'మనిషి' ఒక ప్రత్యేకమైన విభాగం కాదు అన్నట్లుగా - అర్థం చేసుకోవాలి.

'విభాగములు లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 141 శాంతా

ఇది రెండక్షరాల నామం. 'శాంతాయైనమః' అని నమస్కరించాలి.

శాంతా = ఏ విధమైన ఒడుదుడుకులు, తొట్రుపాటులేనిది.

అనుకూల ప్రతికూల పరిస్థితులుగాని; ప్రమోద, ప్రమాదములు గాని; లాభనష్టములు గాని; సుఖదుఃఖములు గాని; జయాపజయములు గాని, మరి ఇటువంటి ఇతరములైన ద్వంద్వముల వలన - ఏ విధమైన ఉద్వేగమును, భీతిని, తొట్రుపాటును కలుగని చిత్త నిశ్చలత్వ స్థితిని ''శాంతము'' అంటారు. ఈ స్థితినే శృంగారాది నవరసాల్లో 'శాంతరసం' గా నర్తకులు అభినయిస్తారు. ఈ శాంతము యొక్క రూపమే - అమ్మవారు.

చిత్తవృత్తి నివృత్తిని సూచించే స్థితిని 'శాంతము' అంటారు. ఈ స్థితి - నిష్క్రియత్వ, అలసత్వాలతో ఏమీ పట్టనట్లు, నిమ్మకు నీరెత్తినట్లు కదలకుండా కూర్చునే స్థితి మాత్రం గాదు. సాధనతో శాంతస్థితిని పొందవచ్చును. ఈ స్థితి సాధనలో చాలా విలువైన స్థితి. ఖరీదైనవి పొందడం కష్టంగావచ్చు గాని, విలువైనవి పొందడం కష్టం గాదు. బంగారం, ఆస్తి, ఇలాంటివి ఖరీదైనవి - ఇవి పొందడం కష్టంగావచ్చుగాని, నిర్మలత్వం, ప్రశాంతత, గాలి, శ్వాసలాంటి విలువైన వాటిని పొందడం కష్టం కాదు)

'శ' అను అక్షరంతో 'అంత' మగునది (శ + అంత = శాంత). సాధన - ఈ 'శ' కార సంబంధమైన ''శం'' ను పొంది అనగా శాంతిని, అనగా - 'నిశ్చల చిత్తాన్ని' పొంది, ''శ్రీం'' అనే అమ్మవారిని చేరడంతో - పూర్తి అవుతుంది. ఆ యోగ్యతా స్థితిని ఇచ్చు అమ్మవారిగా ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

మొత్తం మీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చు.

1) ఏ విధమైన ఒడుదుడుకులు, తొట్రుపాటు లేనిది.

2) 'శ' కార సంబంధమైన 'శం' ను పొందింపజేసి, సాధకుని తన దగ్గఱకు చేర్చునది.

## 142 నిష్కామా

ఇది మూడు అక్షరాల నామం. 'నిష్కామాయైనమః' అని నమస్కరించాలి.

నిష్కామా = కామము లేనిది, అనగా – ఏ కోరికయు లేనిది.

ద్రవ్య వస్తుల మీద మనస్సు నిలిస్తే – కామం ఉద్భవిస్తుంది. కోరబడేదాన్ని బట్టి 'అల్పకామం', 'మహాకామం' అని కామం రెండు రకాలు. దుఃఖానికి దారితీసేవి, అవి తీరిన తర్వాత గూడా ఇంకా ఏవో కావాలనిపించేవి గూడా అల్పకామాల క్రిందకు వస్తాయి. (రేడియో కొన్న తర్వాత – 'టి.వి.'; 'టి.వి.' తర్వాత – 'వి.సి.ఆర్.' ఇలా వీటికి అంతు, అంతం ఉండదు.) తన కోసం, తన వారి కోసం మాత్రమే పరిమిత మయేవి గూడా అల్ప కామాల క్రిందకే వస్తాయి. సాధారణంగా మనకుండే 'కామా' లన్నీ ఈ తరగతికి చెందినవే !

ప్రళయం అయిన తర్వాత సృష్టికి ముందు సృష్టిద్దామన్న కోరికను 'మహాకామం' అంటారు. (ఈ మహాకామం కలిగిన వాడే మహాకామేశ్వరుడు.) ఈ మహాకామ స్వరూపమే మహాకామేశ్వరి. ఈ మహా కామలక్ష్యంలో స్వార్థం లేదు. కాబట్టి, ఇది నిష్కామం క్రిందకే వస్తుంది)

'ఏవిధమైన కోరికయు లేనిది'. అని ఈ నామానికి అర్థం.

## 143 నిరుపప్లవా

ఇది 5 అక్షరాల నామం. 'నిరుపప్లవాయై నమః' అని నమస్కరించాలి.

నిరుపప్లవా = 'హద్దులు ఉల్లంఘించుట' లేనిది.

'ఉపప్లవం' అంటే సాధారణంగా 'ఉపద్రవం' అనీ, 'ఆపద' అనీ, 'ప్రళయ' మనీ చెబుతారు గాని 'ఉపప్లవం' అంటే నిజమైన అర్థం - 'హద్దులు ఉల్లంఘించడం'. 'నిరుపప్లవం' అంటే 'హద్దులు ఉల్లంఘించకపోవడం.' ఉపప్లవం చేయడం వల్లనే అంటే హద్దుల్ని ఉల్లంఘించడం వల్లనే విపత్తులు వస్తాయి. కాని ఆ విపత్తులను మనం ఉపప్లవాలంటాము.

ఎన్నడూ హద్దులను ఉల్లంఘించనిది అమ్మవారు. అమ్మవారు అనే ఈ ప్రకృతిలో పంచభూాత, పదార్థ, వృక్షాదుల ధర్మాలు ఎప్పుడూ ఉల్లంఘింపబడవు. (Properties of Matter are always according to a rule and rythm. They never transgrace).

'హద్దులను ఉల్లంఘించనిది' అని ఈ నామానికి అర్థం, లేదా 'హద్దులను ఉల్లంఘించడం' లేనిది.

## 144 నిత్యముక్తా

ఇది నాలుగు అక్షరాల నామం. 'నిత్యముక్తాయైనమః' అని నమస్కరించాలి.

నిత్యముక్తా = ఎప్పుడును సంగము లేనిది.

అమ్మవారు సృష్టిస్వరూపిణి అయినప్పటికీ, ఆవిడకు దేనితోనూ సంగం లేదు. కుండబ్రద్దలైనా, చిట్లినా, బీట్లిచ్చినా - ఆ కుండ లాగా తయారయే ద్రవ్యమైన మట్టికి ఏ బాధా వుండదు. ఏ విధమైన దుఃఖము వుండదు. అవన్నీ కుండకే ! ప్రపంచమంతా అమ్మవారి తోనే తయారైనా - ప్రపంచంలో వుండేవారి రోగాలు, రొచ్చులు మొదలైన ఈతిబాధలు ఆవిడకు వుండవు.

బొమ్మలకు, గీతలకు చెరప బడడాలు, సరిగా కనపడకపోవడాలు వుండవచ్చునేమో గాని, అవన్నీ వ్రాయబడిన బోర్డుకు వుండవు. అలా జరిగినా బోర్డుకు ఏమీ పట్టదు. ఇలా 'సంగం' వుండని 'స్థితి' ని - 'ముక్తస్థితి' అంటారు. అమ్మవారు ఎప్పుడూ ముక్త స్థితిలోనే వుంటుంది.

జనన మరణాలు లేనపుడే 'నిత్యత్వం' వుంటుంది. నిత్యత్వం ఉన్నా సంగం లేక పోవడమే విశేషం. అసలు ఈ నామాన్ని 'విశేషణ ఉభయపద కర్మధారయ సమాసం' గా కూడా చెప్పుకోవచ్చును. ఎందుకంటే 'నిత్యత్వం' అనేది ఒక విశేషణం, 'ముక్తిత్వం' అనేది రెండో విశేషణం కాబట్టి, అమ్మవారు - నిత్యత్వ, ముక్తిత్వ లక్షణాలు కలది.

'నిత్యత్వము' అంటే ఎప్పుడూ వుండడం. 'ముక్తిత్వము' అంటే 'విమోచనత్వం' లేదా 'విడుపు'. ఈ రెండు విశేషణాలు పరస్పరం విరుద్ధంగా(Contradicting) వున్నట్లు అనిపిస్తాయి. జీవన్ముక్తస్థితికి కూడా ఇలాగే రెండు లక్షణాలు ఉంటాయి. అందుకే - అమ్మవారిని ఈ నామంతో ఉపాసిస్తే 'జీవన్ముక్తి' ని ప్రసాదిస్తుంది.

ఈ నామానికి ఈ అర్థాలు చెప్పుకోవచ్చును.

1. ఎప్పుడును, ఎటువంటి సంగమును లేనిది.

2. నిత్యత్వ, ముక్తిత్వ లక్షణాలు గలది.

## 145 నిర్వికారా

ఇది నాలుగు అక్షరాల నామం. 'నిర్వికారాయై నమః' అని నమస్కరించాలి.

నిర్వికారా = ఏ విధమైన వికారములూ లేనిది.

వికారాలు ఆరువిధాలుంటాయి. 'పుట్టడం, ఉండటం, పెరగడం, మార్పు చెందడం, కృశించడం, నశించడం' - ఈ ఆరింటిని 'షడ్వికారా' లంటారు. భౌతిక జీవులందరికీ ఈ ఆరువికారాలు వుంటాయి. ఈ వికారాల్లో ఏ ఒక్క వికారము లేనిది అమ్మవారు. మార్పులు(Changes), వికారాలు (deformations), విపథనాలు Aberrations ఆమె నేపథ్యంలో జరుగుతాయేమోగాని ఆమెకు వుండవు.

'ఏవిధమైన వికారాలూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 146 నిష్ప్రపంచా

నాలుగు అక్షరాల నామం. 'నిష్ప్రపంచాయైనమః' అని చెప్పాలి.

నిష్ప్రపంచా = ప్రపంచముతో ముడిలేనిది.

పంచభూతాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, పంచతన్మాత్రలు – ఇలా ఐదు, ఐదు చొప్పున వున్నదే ప్రపంచము. వీటితోనే ఈ ప్రకృతి నిండి వుంటుంది. అయితే వీటన్నిటికీ మూల ప్రకృతి అమ్మవారు. అయినా ప్రపంచ వస్తు సముదాయంతో ముడిపడి వుండదు. అవి తన యందు వుంటాయి గాని, తనవి గాదు. రకరకాల ఆభరణాల నిండా వుండేది బంగారమే ! అయినా ఆ ఆభరణాలు బంగారము నందు వివిధ ఆకారాల్లో, పరిమాణాల్లో మలచబడి వుంటాయి గాని, బంగారానికి ఆ నగల్లో ఇరుక్కుపోవలసినగతి లేదు. సొట్టలు, వంకరపోవడాలు, తెగిపోవడాలు నగలకు ఉంటాయిగాని, బంగారానికి వుండవు. అలాగే ప్రాపంచికమైన లక్షణాలు – విలక్షణాలు, రూపాలు, విరూపాలు – మూల ప్రకృతి అయిన అమ్మవారికి ఉండవు.

'ప్రపంచముతో ముడి లేనిది' అని ఈ నామానికి అర్థం.

# 147 నిరాశ్రయా

నాలుగు అక్షరాల నామం. 'నిరాశ్రయాయై నమః' అని నమస్కరించాలి.

నిరాశ్రయా = ఆశ్రయము లేనిది; ఆశ్రయము అవసరము లేనిది.

ఆధారము, ఆశ్రయము అని రెండు రకాల అవసరాలు మనకు వున్నాయి. పాత్రలో నీళ్ళు వుంటే నీళ్ళని 'ఆధేయ'మని, పాత్రను 'ఆధార'మని, 'నీళ్ళకు పాత్ర ఆధారం' అనీ అంటారు. కట్టెకు తీగ అల్లుకొని వుంటే – తీగను 'ఆశ్రితము' అని, కట్టెను 'ఆశ్రయ' మని అంటారు.

అలాగే – ప్రపంచంలో మనం ఉండాలంటే కావలసినవి 1) ఆధారము, 2) ఆశ్రయము. చోటు, గాలి, వెలుతురు, నిప్పు, నీళ్ళు, అన్నం, ఇవి కావాలి – ఇవి ఆధారాలు. అలాగే ఉద్యోగం, ఇల్లు, వాహనము మొదలైనవి గూడా కావాలి – ఇవి ఆశ్రయాలు. ఈ ఆధార, ఆశ్రయాలతో మన జీవనం ముడిపడి వుంటుంది. బ్రతకడానికి ఆశ్రయం కంటె ఆధారం ముఖ్యం. ఈ ఆధార, ఆశ్రయాలు రెండూ మనకు అమ్మవారే! కాని, అమ్మవారికి ఈ రెండు అవసరాలూ లేవు. అందుకని ఆమె నిరాధార, నిరాశ్రయ.

ఏ ఆశ్రయమూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

# 148 నిత్య శుద్ధా

నాలుగు అక్షరాల నామం. 'నిత్యశుద్ధాయై నమః' అని నమస్కరించాలి.

నిత్య శుద్ధా = ఎల్లప్పుడూ శుద్ధమైనది.

ఒక వస్తువు నందు, ఒక వ్యక్తి యందు మనకు వుండే మానసిక దృష్టి చేత ఆవస్తువుకు – 'పరిశుద్ధత్వము', 'అపరిశుద్ధత్వము' వుంటాయిగాని, వాటి యందలి సర్వాంతర్యామిత్వం చేత అవి ఎప్పుడూ పరిశుద్ధములే ! వాటి రసాయనిక విశ్లేషణ (Chemical Analysis) చేత అవి ఎప్పుడూ పరిశుద్ధములే ! అపరిశుద్ధత్వానికి సంబంధించిన ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రానులు; వాటితో రూపొందే అపరిశుద్ధ మూలకాలు (elements) అని వేరే వుండవు.

నైవేద్యం పెట్టే పండు (fruit) మనం పరిశుద్ధమైంది అనుకుంటే – అది చెట్టు ఉమ్మేస్తేను, విసిరేస్తేను వచ్చిందే గదా! పశు విసర్జనాలు అపరిశుద్ధమని మనం అనుకుంటే – అది చెట్లకు పరిశుద్ధమైన ఆహారం అవుతోంది గదా! కాబట్టి, ఈ 'పరిశుద్ధము' 'అపరిశుద్ధము' అనేవి మన మానసిక దృక్పథం మీద ఆధారపడి వుండే భావనలే గాని, సృష్టిలో అంతర్యామిగా వుండే అమ్మ వారు నిత్య శుద్ధురాలే !

మంగళకరమైన మంత్రాలకు ఉపయోగిస్తే – అక్షరాలకు పరిశుద్ధత్వము; తిట్లకు, అపర క్రియలకు ఉపయోగిస్తే – అక్షరాలకు అపరిశుద్ధత్వమూ రాదు. అక్షరాలు ఎప్పుడూ శుద్ధమైనవే ! అదే విధంగా అన్నిటిలోను సర్వాంతర్యామిగా వుండే అమ్మవారు గూడా నిత్యశుద్ధురాలే !

'ఎల్లప్పుడూ శుద్ధమైనది' అని ఈనామానికి అర్థం.

# 149 నిత్యబుద్ధా

నాలుగు అక్షరాల నామం. 'నిత్యబుద్ధాయైనమః' అని నమస్కరించాలి.

నిత్య బుద్ధా = ఎల్లప్పుడూ జ్ఞాన స్వరూపురాలు.

వెలగడం, మెలకువరావడం, అర్థమవడం - ఇవన్నీ 'ఒకే తత్త్వాన్ని సూచించే' మాటలే ! విషయం అర్థం కాకపోతే - బుఱ్ఱ వెలగలేదు అంటాం. ఆలస్యంగా అర్థమైతే - ట్యూబ్‌లైట్‌తో పోలుస్తాం. జ్ఞప్తికి రావడమన్నా, మెలకువ రావడమన్నా, అర్థమవడ మన్నా ఒకటే! ఇవన్నీ మనలోని జ్ఞాన స్వరూపిణి అయిన అమ్మవారి 'నిత్య బుద్ధి' లక్షణాన్నే సూచిస్తాయి. మన బుద్ధికి అమ్మవారి తేజస్సు సగం తెలుసు. ఆ పైన తేజస్సు బుద్ధే ! మనకు మనస్సు ఎక్కువ, బుద్ధి తక్కువ వుంటాయి. మనస్సు లేకుండా అంతా బుద్ధే వుంటే 'నిత్య బుద్ధా' అనే స్థితి వస్తుంది. పుట్టిన సద్బుద్ధి దైవానుగ్రహం అనీ, మన పురుష ప్రయత్నం దైవానుగ్రహం వల్ల అనుకూలించిందనీ అనుకోవాలి.

'నిత్య జ్ఞాన స్వరూపురాలు' అని ఈ నామానికి అర్థం.

## 150 నిరవద్యా

నాలుగు అక్షరాల నామం. 'నిరవద్యాయై నమః' అని నమస్కరించాలి.

నిర్ + అవద్యా = నిరవద్యా = చెప్పరానిది అంటూ ఏమీ లేనిది, అనగా - నిందింప తగినది కాని, వంకపెట్టుటకు గాని ఏదీ లేనిది అని అర్థం.

బంగారం - బంగారం లాగానే వుంటే వంకలు పెట్టడానికి అవకాశం ఉండదు. ఆ బంగారంతో బొమ్మలు, నగలు చేసినపుడే - ముక్కు బాగుండలేదనో, కళ్ళు బాగుండలేదనో, సొట్టవుందనో వంకలు పెట్టడానికి అవకాశం వుంటుంది. అమ్మవారు బంగారం లాంటిదైతే ఆ బంగారంతో చేసిన బొమ్మలు నగలు ఈ సృష్టిలోని జీవులు, వస్తువులు. ఈ నామాన్ని ఈ విధంగా అర్థం చేసుకోడం ఒక పద్ధతి.

అమ్మవారు అన్ని విధాలా పరిపూర్ణమైన సల్లక్షణాలతో వుండే సౌందర్యనిధి. ఏ విషయంలో దేన్ని పోల్చాలన్నా, ఎవరి వ్యక్తిత్వ సౌందర్యాదుల గురించి చెప్పాలన్నా అమ్మవారినే అన్నిటికీ ప్రమాణంగా (Standard) అంటే కొలబద్దగా తీసుకోవాలి. ఆఖరికి సాముద్రిక శాస్త్రం గూడా అమ్మవారిని ప్రమాణంగా తీసుకుని వ్రాయబడినదే! కాబట్టి, అమ్మవారిలో వంకపెట్టేవి, నిందింప తగిన విషయాలు ఏముంటాయి ? ఈ విధంగా అర్థం చేసుకోడం రెండోపద్ధతి.

''నిందింప తగినది కాని, వంకపెట్టుటకు గాని ఏవీ లేనిది'' అని ఈ నామానికి అర్థం.

## 151 నిరంతరా

నాలుగు అక్షరాల నామం. ''నిరంతరాయైనమః'' అని నమస్కరించాలి.

నిరంతరా = ఏ మాత్రమూ సందు (ఖాళీ) లేకుండా అంతటా వ్యాపించినది. అంతరం అనే పదానికి అవకాశము (సందు), అవధి (హద్దు), ఛిద్రము, భేదము అని ఇలాంటి అర్థాలు చాలా వున్నాయి. ఇవేమీ వర్తించనిది అమ్మవారు (She is beyond or above all) ఈ చోటులో ఏ మాత్రం సందు లేకుండా అంతటా నిండి వుంది. ఈ పని చేయగలదు, ఈ పనులు చేయలేదు - అనే హద్దులు లేనిది. ఎవరితోను, ఎప్పుడూ, ఎక్కడా గూడా భేద దృష్టి లేనిది (ఆవిడే అన్నీ అయితే భేదమెలా వుంటుంది) ఛిద్రము (అంటే - లోపాలు, లొసుగులు) లేనిది. మధ్యలో విరామం లేకుండా సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహ కృత్యాలను నిర్వహించే కాలస్వరూపిణి. అందుకే అమ్మవారు 'నిరంతరా'.

'ఏ మాత్రమూ అవకాశం లేకుండా అంతటా వ్యాపించినది' అని ఈ నామానికి అర్థం.

## 152 నిష్కారణా

నాలుగు అక్షరాల నామం. 'నిష్కారణాయైనమః' అని నమస్కరించాలి.

నిష్కారణా = ఏ కారణమును లేనిది.

అమ్మవారు ఉండటానికి గాని, సృష్టి స్థితిలయాది పంచకృత్యాలను నిర్వహించడానికి గాని కారణం ఏమిటని సమాధానం కోసం ఎదురు చూస్తే - ఏమీరాదు. ఒక కారణాన్ని అనుసరించి ఆవిడ ఈ పనులన్నీ చెయ్యడం లేదు. ఒక వేళ మరీ గ్రుచ్చి గ్రుచ్చి కారణం ఏమిటని అడిగితే - ''నా ఇష్టం'' అంటుంది. ఇది అసలైన, సిసలైన కారణం. ఎవరు ఏపనిచేసినా చెయ్యకపోయినా 'నా ఇష్టం' అన్నదే నిజమైన కారణం.

మిగతావి అన్నీ కుంటిసాకులే! జాగ్రత్తగా ఆలోచిస్తే గాని ఇలా 'నా ఇష్టం' అన్నదాన్ని కారణంగా చెప్పడం ఏమిటో అర్థం కాదు. ఇష్టమైతే ఇబ్బందులన్నిటినీ ప్రక్కకునెట్టి ఆ పని చేస్తాం, ఇష్టం లేకపోతే అన్నిటిని ఇబ్బందులుగానే అడ్డం పెట్టుకుని ఆ పని చెయ్యం.

'ఏకారణమూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 153 నిష్కలంకా (నిష్కళంకా)

నాలుగు అక్షరాలనామం. ''నిష్కలంకాయైనమః'' అని నమస్కరించాలి.

నిష్కలంకా = దోషం, లేదా – పాపము లేనిది.

'కళంకం' అంటే – మచ్చ, దోషం, లోపము, పాపము – అని అర్థాలు చెప్పుకోవచ్చును. (మచ్చ అంటే చర్మంమీద ఏర్పడే గుర్తు. చుక్క (patch) కాదు. దోషం అనే అర్థంలో చెప్పబడింది) ఈ 'కళంకం' అనే పదం ప్రవర్తనకు సంబంధించినది గానే సాధారణంగా చెప్పబడుతుంది.

ఒకరి ప్రవర్తన ఇంకొకరికి నచ్చకపోవచ్చు, అప్పుడు వారి యందు కళంకాన్ని ఆపాదిస్తారు. కాని ''అసలు ప్రవర్తనకు'' మంచి, చెడు అని వుండవు. ఒకరిని 'మనం' గమనిస్తున్నప్పుడు అక్కడ 'మనం' వుండకుండా 'అమ్మవారు' వుంటే – అప్పుడు గమనిస్తున్న మనకు, గమనింపబడేవారికి కళంకాన్ని ఆపాదించే ప్రసక్తే వుండదు. అలాంటి – 'కళంకం లేని ప్రవర్తన' అమ్మవారిది. అలాగే 'పాపము' అని అర్థం చెప్పుకుంటే 'ఏలాంటి పాపము లేనిది' అని అర్థం. అలలు ఆగినపుడు సముద్రం కనబడుతుంది. అలలు ఆగనప్పుడు సముద్రం కనబడకుండా అలలే కనబడతాయి. అసలు 'అలలు' అనేవి ప్రత్యేకంగా ఏమున్నాయి? అంతా సముద్రమే గదా! అంటే – లేనివి ఉన్నట్లుగా అనిపించేవే అలలు. కాబట్టి, లేనివి ఉన్నట్లుగా అనిపించే అలలకు ప్రాముఖ్యం ఇవ్వక్కర లేదన్నమాటే గదా! అభిప్రాయాలు గూడా అలల్లాంటివే! కాబట్టి వాటికీ ప్రాముఖ్యం ఇవ్వక్కర లేదు. ప్రాముఖ్యం ఇవ్వాల్సిన అవసరం లేని అభిప్రాయాల తోనే కళంకాలను ఆపాదిస్తాము. కాబట్టి, ఆ కళంకాలకు ప్రాముఖ్యం ఇవ్వాల్సిన అవసరం లేదు.

అందరిలోను ఉండే అమ్మవారే సముద్రం. అందరికీ కలిగే అభిప్రాయాలే అలలు.

అలలు చూడ్డం మాని, సముద్రాన్ని చూస్తే – అంటే – అభిప్రాయాలు ఏర్పరచుకోడం మాని, అందరిలోని అమ్మవారిని దర్శిస్తే – కళంకాలకు తావుండదు. అప్పుడు 'అమ్మవారి' 'నిష్కళంకా' అన్న నామానికి అర్థం తెలుస్తుంది.

''పాప, దోషరహితమైనది'' అని ఈ నామానికి అర్థం.

## 154 నిరుపాధిః

నాలుగు అక్షరాల నామం. ''నిరుపాధయే నమః'' అని నమస్కరించాలి.

నిరుపాధిః = ఏ విధమైన అవిద్యాసంబంధమైన ఉపాధులు లేనిది.

ఉప + అధి = ఉపాధి అన్నపదానికి – 'ఉప' = సమీపములో వున్న దాని మీద, 'అధి' = (తన) ఆధిపత్యమును చూపునది అని అర్థం.

ఉదా : 1) జానకి ఎఱ్ఱని దోసిలిలో స్వచ్ఛమైన తెల్లని ముత్యాలు ఉంటే – ఆ ముత్యాల గ్గాడా ఎఱ్ఱని రంగు భాసిస్తుంది. ఈ సందర్భంలో ముత్యాలకు – 'జానకి ఎఱ్ఱని దోసిలి' – 'ఉపాధి' అవుతుంది.

ఆత్మ ఉన్నట్లుగా కనబడాలంటే ఆత్మకు శరీరం అవసరం. ఈ సందర్భములో శరీరం ఆత్మకు ఉపాధి అవుతుంది. అలాగే – జీవనం సాఫీగా సాగడానికి ఉద్యోగం ఒక సౌకర్యం. ఈ సందర్భంలో ఉద్యోగం జీవనానికి ఉపాధి (జీవనోపాధి) అవుతుంది. అందుకే – మన జీవనంలో ఉద్యోగ ధర్మం భాసిస్తుంది. జీవనంలో ఉద్యోగ ధర్మం భాసించినట్లే – కర్మ వాసనలతో కూడిన, కారణ శరీర సంబంధమైన అజ్ఞాన అలసత్వాది అవిద్యాలక్షణాలు ఆత్మకు సహజంగా లేకపోయినా ఉన్నట్లు భాసిస్తాయి. ఈ విధంగా 'లేని అవలక్షణాలు' ఉన్నట్లుగా భాసింపజేసే ఏ విధమైన ఉపాధులూ అమ్మవారికి లేవు. అందుకని అమ్మవారు 'నిరుపాధిః' అని చెప్పబడింది.

'ఏవిధమైన అవిద్యా సంబంధమైన ఉపాధులూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 155 నిరీశ్వరా

నాలుగు అక్షరాల నామం. 'నిరీశ్వరాయై నమః' అని నమస్కరించాలి.

నిరీశ్వరా = ఇంకా తనకు పైన ప్రభువు అనువారెవరూ లేనిది.

ప్రకృతీ పురుషులు కలిసి ఈ ప్రపంచాన్ని నడుపుతున్నారు. వాళ్ళే 'అమ్మవారు - అయ్యవారు' అయ్యవారు అమ్మవారికి పైన వుండే ప్రభువు కాదు, అమ్మవారు అయ్యవారికీ ప్రభువురాలు కాదు ( ప్రకృతిం పురుషం చైవ, విద్ధ్య నాదీ ఉభావపి - గీత 13-20)

కాళ్ళు లేని భర్త కదలలేడు. కళ్ళు లేని భార్య చూడ లేదు. కాని ఆ భార్య భుజాల మీద ఆ భర్త ఎక్కి దోవ చూపిస్తున్నాడు. భార్యనడుస్తోంది. భార్యతోపాటు భర్తగూడా ముందుకు సాగుతున్నాడన్నమాటే గదా! ఈ విధంగా ఆ ఇద్దరు భార్యాభర్తలు జీవనాన్ని కొనసాగిస్తున్నారు. అయితే, ఈ ఇద్దరిలో ఎవరు ఎవరికి ప్రభువు? భార్యనడవకపోయినా, భార్య అధోగతిపాలవకుండా ఉండేందుకు భర్తత్రోవ చూపించక పోయినా - వారి జీవితరథం ముందుకు సాగదు. కాబట్టి, ఈ ఇద్దరిలో ఎవరూ ఎవరికీ ప్రభువు కాదు. ఇద్దరూ పరస్పరావసర, పరస్పరాధీన, పరస్పరాధారపరిపూరకాలు(Inter dependent complimentary counter parts)

ఈ ప్రకృతీ పురుషులే సర్వజగత్తును నడిపిస్తుంటే - వీళ్ళకు పైన ఇంకా ప్రభువు ఎవరు వుంటారు ? అందుకని అమ్మవారు ''నిరీశ్వరా'' అని ఈ నామంతో చెప్పబడింది.

'ఇంకా తనకు పైన ప్రభువు అనే వారు ఎవరూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 156 నీరాగా

మూడు అక్షరాల నామం. 'నీరాగాయైనమః' అని నమస్కరించాలి.

నిర్ + రాగా = నీరాగా = రాగము లేనిది ( కోరికలు లేనది)

మనకు బాహ్యంగా వుండే శత్రువులు తెలుస్తారు గాని, మనలోనే తిష్ఠవేసుకుని కూర్చుని వుండే అంతః శత్రువుల గూర్చి తెలియదు. ఈ అంతశ్శత్రువులు ముఖ్యంగా ఆరుగురు వుంటారు. వాళ్ళే - కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు. వీళ్ళనే ఆధ్యాత్మిక విద్యలో 'అరిషడ్వర్గము' 'అంతశ్శత్రువులు' అంటారు. ఈ ఆరింటికీ

మొట్టమొదటగా వున్న ''కామం'' మిగతా ఐదింటికీ మూలకారణం అవుతుంది. ఈ కామాన్నే 'రాగం' అని గూడా అంటారు.

ముందుగా మన ఇంద్రియాల ద్వారా వస్తువిషయ సేకరణ జరిగి, వాటి గురించి ఆలోచించి, అవి కావాలని కోరుకుంటాం. ఈ కోరికనే 'కామం' లేదా వాటి యందు రాగం' అంటారు. ఈ కోరిక తీరక పోతే 'క్రోధం' వస్తుంది. తను కోరినవి ఇతరులకు చెందకూడదని అనుకోవడం – 'లోభం'. కనబడే ప్రతి వస్తువులోను మనం కోరుకున్నవే కనబడడం – 'మోహం'. 'తను పొందినవి ఇతరులకు లేవు' అని అను కోవడం 'మదం' ఒక వేళ తను కోరినవి తనకు లేకుండా ఇతరులకు వుంటే – మాత్సర్యం (అసూయ) వస్తుంది. సామాన్య మానవులందరికీ ఈ అంతశ్శత్రువుల బాధ తప్పదు. సాధనలో ాటిని అధిగమించి అతీతంగా వుండాలి.

అమ్మవారికి ఈ అరిషడ్వర్గ బాధ వుండదు. ఎందుకంటే ఆవిడకు కావలసినవి, పొందలేనివి లేవు గనక. అసలు అన్నీ అమ్మవారితోనే తయారైనపుడు అమ్మవారికి వేటి మీద ఏం కోరిక ఉంటుంది ? మొదట కోరికే లేనపుడు మిగతావి వచ్చే అవకాశమే లేదు.

' ఏ కోరికలూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 157 రాగమథనీ

ఐదు అక్షరాల నామం. 'రాగమథన్యై నమః' అని నమస్కరించాలి. (కొన్ని పుస్తకాల్లో ఈ నామం 'రాగమథనా' అని వుంటుంది. అప్పుడు 'రాగమథనాయై నమః' అని నమస్కరించాలి)

రాగమథనీ = రాగమును పోగొట్టి, వైరాగ్యమును కలుగ జేయునది.

'రాగము – ద్వేషము' ఇవి రెండూ పరస్పర వ్యతిరేక ధ్రువాల్లాంటివి. (వీటిలో ఏ ఒక్కటీ విడిగా వుండదు. రెండూ కలిసే వుంటాయి. రాగము ఉన్నచోట ద్వేషం ఉండి తీరుతుంది. (ప్రేమ వున్నచోట – ద్వేషం ఉండదు. సుఖమే వుంటుంది) రాగం వుండడం వల్ల కలిగే అనుభూతి బాగుంటే – రాగం వున్నా ఫర్వాలేదు. కాని, వుండదు. కాబట్టి

'రాగం' ఉండకూడదు. రాగానికి ద్వేషం ఉంటుంది గాని, పరమ ప్రేమకు పరమద్వేషం వుండదు. కాబట్టి, రాగమథనం జరగాలి. ఆ మథనం జరిపేది అమ్మవారు.

(ద్వేషం రావడానికి అవకాశం లేని రాగాన్ని ప్రేమ అనవచ్చును) రాగమథనం జరిగిన తర్వాత వైరాగ్యం వస్తుంది. రాగం వున్నంత వరకు వైరాగ్యం రాదు.

అయితే – వైరాగ్యం అంటే ఏ విషయానికీ స్పందన లేకపోవడం కాదు. ఏ విషయానికీ అతుక్కుపోకుండా వుండి (Non attachment), వాటికి అతీతంగా వుండడం. ఈ రెంటినీ కలుగ జేస్తుంది కాబట్టి అమ్మవారికి 'రాగమథనీ' అనే నామం వచ్చింది.

'రాగమును పోగొట్టి వైరాగ్యమును కలుగ జేయునది' అని ఈ నామానికి అర్థం.

## 158 నిర్మదా

మూడు అక్షరాల నామం. 'నిర్మదాయైనమః' అని నమస్కరించాలి.

నిర్ + మదా = నిర్మదా = మదము లేనిది.

'మదము' అంటే 'పరవశత్వము' అని మొదట అర్థం వుండేది. 'మదం' అనే మాటకు అర్థం రాను రాను 'మత్తెక్కుట', 'వళ్ళు తెలియకపోవుట' 'పొగరెక్కుట' ఇలా మారుతూ, చివరకు 'వళ్ళు కొవ్వెక్కుట' అనే అర్థాలు వచ్చాయి. ఈ అర్థాలన్నిటిలోను కీలక లక్షణం 'వళ్ళు తెలియక పోవడం' పరవశత్వంలో గూడా 'వళ్ళు మైమరచి పోవడం' వుంటుంది గాని 'వళ్ళు కొవ్వెక్కడం' వుండదు.

మదం వున్న చోట దర్పం ఉంటుంది. 'ఏదైనా తనకే వున్నది, ఇంకొకరికి లేదు, ఉండడానికి వీల్లేదు' – అనే లక్షణం మదానికి వుంటుంది. అమ్మవారికి అటువంటి దుర్లలక్షణం లేదు.

'ఏవిధమైన మదమూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 159 మదనాశినీ

అయిదు అక్షరాల నామం. 'మదనాశిన్యైనమః' అని నమస్కరించాలి.

మదనాశినీ = మదమును పోగొట్టునది.

క్రిందటి నామములో చెప్పిన మదాన్ని పరిమార్చి, ముదాన్ని చేకూర్చేది అమ్మవారు. మదం పోతేగాని సమదృష్టి ఏర్పడదు. వినయ విధేయతలు ఏర్పడవు. విశ్వజనీనత వికసించదు.

'ఏ విధమైన మదమునైనను పోగొట్టునది'' అని ఈ నామానికి అర్థం.

## 160 నిశ్చింతా

మూడు అక్షరాల నామం. 'నిశ్చింతాయై నమః' అని నమస్కరించాలి.

నిర్ + చింత = నిశ్చింత = ఏ చింతలు లేనిది.

'చింతా' అనే పదానికి ముఖ్యంగా రెండర్థాలు వున్నాయి. 1) విచారము 2) చర్చ (చింతనం చేయుట)

జరగకూడనిది జరిగినపుడు విచారించడం పరిపాటి. కాని, విచారించడం కన్న అటుపైన ఏం చెయ్యాలో అది చెయ్యడం సాధకుని లక్షణం.

అలాగే ఒక్కొక్కప్పుడు అనవసర విషయాల మీద చర్చించు కుంటూ కాలం వృధా చేస్తారు. వారి చర్చ వలన ఎవ్వరికీ, ఏమీ ఉపయోగం వుండదు. అలాంటి చర్చల్లోకి గూడా సాధకుడు దిగకూడదు. పాల్గొనకూడదు. ఆ చర్చనుండి, చర్చించుకునే వాళ్ల నుండి నిదానంగా నిష్క్రమించాలి. అమ్మవారికి ఎలాంటి చింతలూ ఉండవు. సుషుప్తి (నిద్ర)లో మన ప్రజ్ఞ పని చెయ్యదు. అమ్మవారే పనిచేస్తుంది. అందుకే అప్పుడు 'ఏ చింతా లేక సుఖానుభూతిని పొందుతాం. అమ్మవారిని ధ్యానిస్తే అన్ని రకాల చింత(న)లను వదిలిస్తుంది.

'ఏ విధమైన చింతలూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 161 నిరహంకారా

ఐదు అక్షరాల నామం. 'నిరహంకారాయైనమః' అని నమస్కరించాలి.

నిరహంకారా = (నిర్ + అహంకారా) ఏ విధమైన అహంకారము లేనిది.

'అహంభావము 'అహంకారము' అని రెండు రకాల పదాలు సాధారణంగా వాడుతూ వుంటాము. ఈ రెండూ ఒకే అర్థం కలిగినవి కావు. 'నేను కాని దాన్ని నేననుకోవడం' – అహంకారం. ఇక్కడ తాను గాక రెండవది వుంటుంది. హిరణ్యకశిపుడు మొదలైన వారికి వున్నది ఇదే. 'నేను' ను 'నేన' ని తెలుసుకోడం – అహంభావం. కాని, ఈ అహంభావమనే పదాన్ని 'గర్వం' అనే అర్థంతోను, 'దర్పం' అనే అర్థంతోను ఉపయోగిస్తున్నారు. ప్రస్తుత నామం 'అహంకారం' గుఱించి. అందరిలోను ఆత్మగా వుండే పరమాత్మ స్వరూపురాలు కాబట్టి, తాను తప్ప ఇతరం లేదు కాబట్టి, అహంకార పడడానికి అవకాశమే లేదు. సామాన్యులకు స్థూల దేహమే తాను అనుకునే తామసాహంకారమైనా వుంటుంది, లేదా – సూక్ష్మ దేహమే తాను అనుకునే రాజసాహంకారమైనా వుంటుంది, లేదా – కారణ దేహమే తాను అనుకునే సాత్త్వికాహంకారమైనా వుంటుంది. అమ్మవారికి మాత్రం ఇలా ఏ విధంగాను అహంకార పడడానికి అవకాశమే లేదు కాబట్టి, ఆవిడ నిరహంకారి. మనకేమన్నా అహంకారం వుంటే వదిలిస్తుంది గూడా!

'ఏ విధమైన అహంకారమూ లేనిది, అహంకార పడుటకు అవకాశము లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 162 నిర్మోహా

మూడు అక్షరాల నామం. 'నిర్మోహాయైనమః' అని నమస్కరించాలి.

నిర్మోహా = అవగాహనలో పొరపాటు లేనిది.

యదార్థము తెలియనప్పుడు విపరీతార్థాలు, విచిత్ర భావాలు కలగడమే మోహము. 'బంగారు లేడి వుండటానికి అవకాశం లేకపోయినా, తాను చూస్తున్నది నిజంగా బంగారు లేడే' అని రామాయణంలో సీతకు అనిపించడం – 'మోహం' క్రిందకే వస్తుంది.

ఈ మోహం ఒక్కొక్కప్పుడు తరుణ లక్షణం(Acute) గాను, ఒక్కొక్కప్పుడు దీర్ఘ (Chronic) లక్షణంగాను గూడా వుంటుంది. కామాన్ని ప్రేమ అనుకోవడం తరుణ మోహ లక్షణం అయితే, అసలు మన దేహం అనేది శాశ్వత మనుకోడం దీర్ఘ మోహ లక్షణం. అలాగే డబ్బును(Money or currency) సంపద (wealth) అనుకోవడం గూడా

మోహ లక్షణం క్రిందకే వస్తుంది. యదార్థాన్ని గుర్తించకుండా పొరపాటు పడడమే ఈ మోహ లక్షణం. ఇలాంటి మోహ లక్షణాలు లేనిది అమ్మవారు.

'అవగాహనలో పొరపాటు లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 163 మోహనాశినీ

ఐదు అక్షరాల నామం. 'మోహనాశిన్యై నమః' అని నమస్కరించాలి.

మోహనాశినీ = మోహమును పోగొట్టునది.

కంటికి విచిత్రంగాను, నజరుగాను, క్రొత్తగాను కనబడే వాటి మీద సాధారణంగా మోహం కలుగుతుంది. అవతల వస్తువులో గాని, వ్యక్తిలో గాని భ్రమను గొల్పే ఆకర్షణ (Glamour) వుంటే మోహ లక్షణం పెరుగుతుంది. ఈ రెంటికీ అవినాభావ సంబంధం వుంది. ఇలాంటి భ్రమతో కూడిన మోహాన్ని పటాపంచలు చేసి, యదార్థాన్ని గోచరింప చేయగలది అమ్మవారు.

'మోహమును పోగొట్టునది' అని ఈ నామానికి అర్థం.

## 164 నిర్మమా

మూడు అక్షరాల నామం. 'నిర్మమాయై నమః' అని నమస్కరించాలి.

నిర్మమా = మమకారము లేనిది.

'ప్రతిది తనకు సంబంధించినది, తనక్కావలసినది, తనది' అనే భావమే మమకారం. చివరకు ఈ ఇల్లు నాది, ఈ దేహం నాది అంటూ - అన్నిటినీ మూట కట్టుకుందామనే మమకార భావం మితిమీరి, వదలలేక వదలలేక, ప్రాణాలు వదులుతారు. ఎన్ని శాస్త్రాలు చదివినా, ఎన్ని ఉపన్యాసాలు విన్నా - ఏమీ ప్రయోజనం వుండదు. నిద్రిస్తున్నప్పుడు తప్ప మిగిలిన అన్ని అవస్థల్లోను ఇది వెన్నంటి వుంటుంది. అమ్మవారి అనుగ్రహం వల్ల వళ్ళు మరచి నిద్రపోతాం కాబట్టి, అప్పుడు ఈ మమకారం వుండదు.

అలా వుండక పోవడం అమ్మవారి అంశ అయిన ఆత్మ లక్షణం. జాగ్రదాది మిగతా అవస్థల్లో వున్నపుడు మమకార లక్షణం పనిచేస్తుంది. నేను లేకపోతే ఎలా అనేది గూడా మమకారమే!

'ఏ విధమైన మమకారము లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 165 మమతాహంత్రీ

ఐదు అక్షరాల నామం. 'మమతాహంత్ర్యైనమః' అని నమస్కరించాలి.

మమతాహంత్రీ = మమకారమును పోగొట్టునది.

ఆత్మజ్ఞానం కలగనంతవరకు, దేహేంద్రియాదులే తాను అనుకునేంత వరకు వుండే మమకార లక్షణాన్ని పోగొట్ట గలిగేది అమ్మవారే! అమ్మవారి అనుగ్రహం వల్ల ఆత్మజ్ఞానం కలిగితే గాని ఈ 'మమత్వ భావన' పోదు. అమ్మవారికి మమత్వ లక్షణం లేదు కాబట్టి – ఆవిడ మన మమకారాన్ని పోగొట్టగలదు.

'మమకారమును పోగొట్టునది' అని ఈ నామానికి అర్థం.

## 166 నిష్పాపా

మూడు అక్షరాల నామం. 'నిష్పాపాయై నమః' అని నమస్కరించాలి.

నిష్పాపా = పాపములు లేనిది.

పాపం రెండు రకాలుగా వుంటుంది. 1. భౌతికము 2. మానసికము. హింసతో కూడినది పాపం. సహించలేనిదే దైనా హింస క్రిందకే వస్తుంది. శారీరికంగా హింసిస్తే వచ్చే పాపం భౌతికమైంది. మనస్సుకు కష్టం కలిగించి హింసించడం వల్ల వచ్చే పాపం మానసికం. మానసికంగా ఒకరి హింసను కోరుకున్నా, స్మరించినా గూడా మానసిక పాపం క్రిందకే వస్తుంది. సర్వ జగత్తుకు తల్లి కాబట్టి, అనురాగ వల్లి కాబట్టి అమ్మవారికి ఈ రెండు రకాల పాపాలూ వుండవు. అందుకని ఆమె 'నిష్పాపా' అన్న నామానికి అర్హురాలు.

'ఏ విధమైన పాపమూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 167 పాపనాశినీ

ఐదు అక్షరాల నామం. 'పాపనాశిన్యై నమః' అని నమస్కరించాలి.

పాపనాశినీ = పాపములను పోగొట్టునది.

శ్లో. పుణ్యస్యఫల మిచ్ఛంతి, పుణ్యం నేచ్ఛంతి మానవాః,
నపాప ఫల మిచ్ఛంతి, పాపం కుర్వంతి యత్నతః.

"సాధారణంగా మానవులు పుణ్యకార్యాలు చెయ్యకుండా – పుణ్య ఫలాలు రావాలని కోరుతారు. పాపకార్యాలు చేస్తూ – పాప ఫలాలు రాకూడదనుకుంటారు." అని పై శ్లోకానికి అర్థం.

అమ్మవారిని ఆరాధిస్తే – పుణ్యకార్యాలు చేసే విధంగా మనల్ని ప్రేరేపించి, పాపకార్యాలను చెయ్యనీయకుండా వుండే వివేకాన్నిచ్చి, మనల్ని పాపాలకు దూరంగా వుంచుతుంది. ఈ నామానికి ఇదే సరియైన అర్థంగాని, మనం వరస పెట్టి పాపాలు చేసుకుంటూ పోతూ వుంటే, ఆవిడ మన వెనకాలే ఒక్కొక్కటీ నాశం చేసి, మనల్ని ఎప్పటికప్పుడు పాపాలంటని పవిత్ర మూర్తిలాగా చేస్తుందని గాదు!

"మనం పాపకార్యాలు చెయ్యనీయకుండా చేసి, మన పాపాలను నాశం చేసేది" అని ఈ నామానికి అర్థం.

## 168 నిష్క్రోధా

మూడు అక్షరాల నామం. 'నిష్క్రోధాయై నమః' అని నమస్కరించాలి.

నిష్క్రోధా = క్రోధము లేనిది.

కోపం దీర్ఘకాలంగా నిలవ వుంటే క్రోధంగా మారుతుంది. 'క్షణకాల మాత్రం కోపం వుండే వాళ్ళను 'ఉత్తము'లనీ, రెండు ఘడియల కాలం కోపం వున్న వారిని 'మధ్యము'లనీ, ఒక అహోరాత్రకాలం కోపం ఉండేవాళ్ళను 'అధము'లనీ, చచ్చేంతవరకు కోపం వుండేవారిని 'పాపిష్ఠు'లనీ అంటారు. ఈ నిర్వచనాల ప్రకారం క్రోధం గల వారందరూ పాపిష్ఠులే అవుతారు.

అవసరమైనపుడు (చిన్న పిల్లల పట్ల, క్రింది పనివారి పట్ల, శిక్షితులకు శిక్షణ ఇస్తున్నప్పుడు) కోపం నటించాలి గాని కోపిష్ఠులు కాకూడదు. అవతలి వారిలో రావలసిన మార్పు రావడం కోసమే గాని, కక్ష సాధింపుగా ఈ కోపం నిలవ వుండకూడదు! అమ్మవారు అనురాగదేవత – జగన్మాత కాబట్టి, ఆవిడకు కోపంగాని, క్రోధం గాని వుండవు.

'క్రోధము లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 169 క్రోధశమనీ

'ఐదు అక్షరాల నామం. 'క్రోధశమన్యై నమః' అని నమస్కరించాలి.

క్రోధశమనీ = క్రోధమును శమింప చేయునది. అనగా పోగొట్టునది. ''క్రోధాకారాంకుశోజ్జ్వలా'' అన్న పూర్వపు నామాన్ని, ఆ నామ వ్యాఖ్యానాన్ని ఇక్కడ గుర్తు చేసుకోవాలి.)

పేరుకు పోయిన కోపంతో, క్రోధంలో ఊపిరాడకుండా వుండే వాళ్ళు – మళ్ళీ సవ్యంగా వూపిరి పీల్చుకునేట్లుగా వారి క్రోధాన్ని శమింపజేసి, ఇక అలాంటి క్రోధం ముందు ముందు రాకుండా వారిని అనుగ్రహించేది అమ్మవారు. ప్రేమతో ఎలాంటి కర్కశత్వాన్నైనా కనికరంగా మార్చగల కారుణ్యరాశి, సౌజన్యమూర్తి ఈ అమ్మవారు.

'క్రోధాన్ని పోగొట్టునది' అని ఈ నామానికి అర్థం.

## 170 నిర్లోభా

మూడు అక్షరాల నామం. 'నిర్లోభాయై నమః' అని నమస్కరించాలి.

నిర్లోభా = లోభము లేనిది.

'పెట్టే గుణం లేకుండా, 'కూడబెట్టుకోవడమే' వుండే లక్షణాన్ని' లోభం అంటారు. దీన్నే తెలుగులో 'పిసినారితనం' అంటారు. ఈ లోభం వున్న వాళ్ళు ఇతరులకు పెట్టకపోవడమే కాదు, తాము గూడా తమకున్న దాన్ని అనుభవించరు. వీలైనంత వరకు ఇతరుల సొమ్ముతో పబ్బం (ఎలాగో అలా) గడిపేసుకోవాలని ప్రయత్నస్తూ వుంటారు.

తమ కోర్కెతీరడం కోసం – పరాయి వాడిదే మన్నా కోరే వారికి – ఏదీ అక్కరకు రాదని గుర్తు పెట్టుకోవాలి. తమని, తమకు సంబంధించిన దాన్ని – పెట్టుబడి పెట్టుకుని, తమ కోర్కెలను తీర్చుకోడమే సాధకుల లక్షణం.

లోభానికి వ్యతిరేక గుణం 'త్యాగం'. అమ్మవారు తన కంటూ ప్రత్యేకమైన అస్తిత్వం లేకుండా ఈ సమస్త ప్రపంచంగా ( ప్రకృతిగా) మారిపోయి, మనందరికీ ఒక జీవితాన్ని, జీవన మాధుర్యాన్ని చవి చూపిస్తోందంటే – ఆ అమ్మవారికి వుండే గుణం అంతా త్యాగమే కదా! లోభం ఎక్కడ వుంటుంది ?

'లోభ గుణం ఏ మాత్రమూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 171 లోభనాశినీ

ఐదు అక్షరాల నామం. 'లోభనాశిన్యైనమః' అని నమస్కరించాలి.

లోభనాశినీ = లోభమును పోగొట్టునది.

ముందుగా అమ్మవారు – లోభి కూడ బెట్టిన దాన్ని – కొల్ల గొట్టబడేట్టుగా చేస్తుంది. అటుపైన కూడ బెట్టిన లోభి ఇతరుల మీద ఆధారపడవలసి వచ్చి, ఇతరులకు పెట్టే గుణాన్ని నేర్చుకుంటాడు. ఇలా – మనలో వుండే లోభ గుణాన్ని పోగొట్టి 'త్యాగ' గుణాన్ని పెంపొందింప జేస్తుంది అమ్మవారు.

లోభి కూడ బెట్టిన దాన్ని కొల్ల గొట్టబడేట్టు చెయ్యడానికి ఇతరులే అక్కర్లేదు. ఇందుకు పూర్తిగా వ్యతిరేకంగా దుబారా చేసే జల్సారాయుళ్ళను, లేదా – త్యాగ గుణం బాగా వుండే కొడుకుల్ని వాడికి పుట్టిస్తే చాలు.

'లోభగుణాన్ని పోగొట్టునది' అని ఈ నామానికి అర్థం.

## 172 నిస్సంశయా

నాలుగు అక్షరాల నామం. 'నిస్సంశయాయైనమః' అని నమస్కరించాలి.

నిస్సంశయా = సందేహములు, సంశయములు లేనిది.

చాలా మందికి 'ఆశయాలు' లేకపోయినా 'సంశయాలు' ఉంటాయి. ఈ సంశయాలు కొన్ని బాహ్య రంగపరమైనవి అయితే, కొన్ని అంతరంగ పరమైనవి. ఈ రెండు రంగాలకు సమన్వయం కుదుర్చుకోలేకపోవడం వలన మరికొన్ని క్రొత్త సంశయాలు వస్తాయి. సాధారణంగా మనం దేన్నీ పూర్తిగా నమ్మనూలేం, నమ్మకుండా వుండనూ లేం. ఇలాంటి స్థితిలో సంశయాలు మరీ పెరుగుతాయి. సంపూర్ణ జ్ఞానం వుంటే గాని ఇలాంటి సంశయాలు రాకుండా వుండవు. సంపూర్ణ జ్ఞానవే అమ్మవారుగా రూపొందాల్చింది. (చిత్కళ) కాబట్టి, ఏ విధమైన సంశయాలు వుండనిదే అమ్మవారు.

'ఏ విధమైన సంశయాలూ లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 173 సంశయఘ్నీ

నాలుగు అక్షరాల నామం. 'సంశయఘ్న్యై నమః' అని నమస్కరించాలి.

సంశయఘ్నీ = సంశయములను పోగొట్టునది.

'సంశయాత్మావినశ్యతి' - అని గీతాచార్యుని ఉపదేశం.

సంశయాలున్నవాడు సద్గతిని పొందలేడు. 'Better to have a bullet in the heart rather than a doubt' అన్నాడు ఒక మహానుభావుడు.

ప్రతి వ్యక్తికి సందేహాలు, కుతూహలాలు వుంటాయి. సందేహాలు కూతుళ్ళలాంటివి, కుతూహలాలు కొడుకుల్లాంటివి. కూతుళ్ళను ఎప్పటికైనా మన దగ్గఱ నుండి పంపించి వెయ్యాల్సిందే ! సమాధానం అనే అల్లుడి వల్లనే ఇది పరిష్కరింపబడుతుంది. ఆ సమాధానం అనే అల్లుడు సరియైన సంపద (సమ్యక్ పదములు = సరియైన పదాలు) లేని వాడైతే - సందేహం అనే కూతురు మళ్ళీ మనింటికే వస్తుంది. అలా జరక్కుండా వుండాలంటే - మంచి సంపద గల (సరియైన పద జాలంతో వుండే) అల్లునికే (సమాధానానికే) అప్పజెప్పాలి. అల్లాంటి మంచి సంపదగల సమాధానం అనే అల్లుణ్ణి ఇచ్చి సందేహం అనే కూతురు మన దగ్గఱకు తిరోగమనం చెయ్యకుండా చేస్తుంది అమ్మవారు. సద్విషయాలు తెలుసుకోడానికి కావలసిన కుతూహలం అనే కొడుకును మాత్రం మన దగ్గఱే వుంచుతుంది. (ఈ ఉదాహరణలో ఉపయోగించిన సంకేతాలు సార్థక

(స + అర్థ) మైనవి. సందేహంలోని 'దేహం' – పదార్థ సంబంధమైన 'స్త్రీత్వాన్ని' తెలియ జేస్తుంది. సమాధానంలోని 'ఆధానం' అంకుర సంబంధమైన 'పుంస్త్వాన్ని' తెలియజేస్తుంది. అందుకే ఈ రెంటినీ అనగా 'సందేహ – సమాధానాలను' వరుసగా 'కూతురు – అళ్ళుళ్ళ'తో పోల్చడంలో చాలా ఔచిత్యం, సార్థకత ఉన్నాయని చెప్పడం!)

జ్ఞాన విద్యుత్ప్రసారంలో మన సంశయాలు అనే అవిద్యుద్వాహకాలు(Non Conductors) పరిష్కరింపబడి, ప్రక్షాళణ మవాలంటే – మన బుద్ధి అనే ఉత్తమ విద్యుద్వాహకాన్ని (Best Conductor) జ్ఞాన నిధి అయిన అమ్మవారితో సంధానం చేసుకోవాలి. అప్పుడు –

'ఈ సంశయం తీరుతుందంటావా ? లేదా, తీరుస్తుందంటారా ?' అనే సందేహాన్ని ముందు తీరుస్తుంది – అమ్మవారు.

శ్లో. భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వ సంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.

''విడివడని హృదయగతమైన ముడులకు విమోచనం, సర్వసంశయాలకు పరిష్కారం, కర్మబంధ వినాశం – ఇవి – 'పరా, అవర' స్థితుల యందు సమన్వయ దృష్టి ఏర్పడినప్పుడు సాధ్యమౌతాయి'' – అని పై శ్లోకానికి అర్థం.

అమ్మవారు 'పరా', 'అవర' స్థితుల 'సమన్వయరూపం' కాబట్టి – మనకూ ఆ సమన్వయ దృష్టిని ప్రసాదించి సంశయాలను, సమస్యలను పరిష్కరిస్తుంది.

'సర్వ సంశయాలను పోగొట్టు జ్ఞాన స్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 174 నిర్భవా

మూడు అక్షరాల నామం. 'నిర్భవాయై నమః' అని నమస్కరించాలి.

నిర్భవా = పుట్టుకలేనిది.

భవము అంటే పుట్టుక. పుట్టడం, పెరగడం, గిట్టడం – ఇలాంటివి భౌతిక జీవులకే వుండేవి. అవి గూడా ఆ జీవుల శరీరాలకే ! ఇవి ఎవరి యందు జరుగుతాయో ఆవిడ అమ్మవారు. ఆవిడ కళ్ళు తెరిస్తే ఈ జగత్తు వుద్భవిస్తుంది, కళ్ళు మూస్తే ఈ జగత్తు

ఉపసంహరింప బడుతుంది, కాబట్టి, ఆవిడ అన్ని సమయాల్లోను సాక్షీభూతురాలుగా వుంటుంది. అందుకని అమ్మవారు 'నిర్భవా' అని చెప్పబడింది.

'పుట్టుక లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 175 భవనాశినీ

ఐదు అక్షరాల నామం. 'భవనాశిన్యై నమః' అని నమస్కరించాలి.

భవనాశినీ = పుట్టుకకు సంబంధించిన సంసార బంధ క్లేశములు లేకుండా చేయునది.

'పుట్టడం' అంటే భౌతిక జీవులకు 'శరీరం ఏర్పడడం' అనే అర్థం. శరీరం పుట్టనంత వరకే గాని పుట్టింతర్వాత సవాలక్ష బాధలు, బంధాలు పుట్టుకొస్తాయి, మార్పులు నెట్టుకొస్తాయి. ఆత్మ జ్ఞానం కలగనంతవరకు బంధాలు పుట్టుకురావడాలు, మార్పులు నెట్టుకు రావడాలు 'మనకే' అనుకుంటాం. కలనుండి మెలకువ వస్తే కలలోని బాధలన్నీ ఒక్కసారి పటాపంచలైనట్లు ఆత్మదర్శనంతో అన్నీ సమసిపోతాయి. మార్పులన్నీ మన 'శరీరానికే' వస్తున్నాయి అనీ 'మనకి' ఏమీ జరగవని తెలుస్తుంది. భవ బంధాల నుండి విముక్తి లభిస్తుంది. ఆ అమ్మవారి అనుగ్రహంతోనే ఆత్మజ్ఞానం కలిగి ఇవన్నీ జరిగేది. అందుకని అమ్మవారు భవనాశిని.

'పుట్టుకకు సంబంధించిన సంసార బంధ క్లేశములను లేకుండా చేయునది' – అని ఈ నామానికి అర్థం.

## 176 నిర్వికల్పా

నాలుగు అక్షరాల నామం. 'నిర్వికల్పాయై నమః' అని నమస్కరించాలి.

నిర్వికల్పా = వికల్పములు లేనిది.

'వికల్పం' అంటే 'సంకల్పించింది కాకపోవడం' అని ఒక అర్థం. ఈ అర్థంలోనే ఎక్కువగా ఈ పదం వాడబడుతోంది. కాని అసలు అర్థం 'భ్రాంతి'. అనుకున్నదాంట్లో

తేడా వుండడం 'భ్రాంతి'. ఏ విధమైన వికారాలు, భ్రాంతులు లేనిది అమ్మవారు. లేనిదాన్ని ఉన్నట్లు, ఉన్నదాన్ని లేనట్లు; మంచిని చెడుగాను, చెడును మంచిగాను అనుకోవడం - ఇలాంటి వికార, విభ్రాంతి లక్షణాలు అమ్మవారికి వుండవు. అమ్మవారు 'విజ్ఞాన ఘనరూపిణి'. సకలము తానైనపుడు 'ద్రష్ట, దృశ్య, దృష్టి భేదము గాని; వస్తు భేదము గాని వుండదు. వస్తు భేదము లేనపుడు భ్రాంతికి తావులేదు. జ్ఞానములో పరాకాష్ఠ స్థితికి చేరినవారు గూడా వికల్పములు వుండక, నిర్వికల్ప స్థితిలోనే వుంటారు. అజ్ఞానం నశిస్తే గాని వికల్ప స్థితి రహితం కాదు! జ్ఞాన స్వరూపిణి అయిన అమ్మవారికి వికల్పముల ప్రసక్తే వుండదు.

'వికల్పములు లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 177 నిరాబాధా

నాలుగు అక్షరాల నామం. 'నిరాబాధాయైనమః' అని నమస్కరించాలి.

నిర్ + ఆబాధా = నిరాబాధా = బాధలు, వేధలు లేనిది.

నియమంగాని, సూత్రంగాని (Rule) చెల్లని చోట (Apply కాని చోట) 'బాధ' వర్తిస్తుందని 'తర్క' శాస్త్రంలో చెబుతారు. ('బాధాంతం' తర్కం చదువుకోవాలి అంటారు ఇందుకే!) ఒక విధంగా 'బాధ' అనేది తర్క శాస్త్ర పదం. ప్రస్తుత నామంలో ఉన్న పదం ''ఆబాధ'' అంతేగాని 'బాధ' కాదు. అయితే 'ఆబాధ' అంటే 'వేధ' (Affliction) అని, 'బాధ' అనీ అర్థాలున్నాయి కాబట్టి 'నిర్ + ఆబాధ = నిరాబాధా అంటే 'ఏ బాధలు, ఏ వేధలు లేనిది' అని అర్థం చెప్పుకోవచ్చును. అన్ని బాధలకు కారణాలు - అవివేక, అజ్ఞాన, వికల్పాలు - ఇవి లేనిది కాబట్టి అమ్మవారు 'నిరాబాధా' అని చెప్పబడింది.

'బాధలు, వేధలు లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 178 నిర్భేదా

మూడు అక్షరాల నామం. 'నిర్భేదాయై నమః' అని నమస్కరించాలి.

నిర్భేదా = భేదములు లేనిది.

ఇతర మనేది వున్నప్పుడు భేదము వర్తిస్తుంది. అమ్మవారు సజాతీయ విజాతీయ, స్వగత భేదాలువమూడూ లేనిది. మంచుకు, నీటికి, నీటి ఆవిరికి స్థితిలో భేదాలుండవచ్చునేమోగాని, ఈ మూడింటిలో వుండే $H_2O$కి ఆ భేదం వుండదు. అలాంటిదే అమ్మవారు – గూడా! 'భేదములు లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 179 భేదనాశినీ

ఐదు అక్షరాల నామం. 'భేదనాశిన్యై నమః' అని నమస్కరించాలి.

భేదనాశినీ = భేదములను పోగొట్టునది.

'వ్యక్తి ప్రజ్ఞగా (Identify Consciousness) వేరుగా వున్న స్థితిని కరగించి, ఐక్యతా స్థితి (Identification) లోనికి లీనము చేయునది.' అని ఈ నామానికి అర్థం. ఇది అద్వైత లక్షణ సూచితమైన నామంగా గూడా అర్థం చేసుకోవచ్చు. అంటే 'శకలాలుగా' అనిపించే సృష్టి యొక్క 'సకల స్వరూపాన్ని' దర్శించ గలిగే జ్ఞానాన్ని ప్రసాదించేది అని అర్థం.

'భేద దృష్టిని పోగొట్టునది' అని ఈ నామానికి అర్థం.

## 180 నిర్నాశా

మూడు అక్షరాల నామం. 'నిర్నాశాయై నమః' అని నమస్కరించాలి.

నిర్ + నాశా = నిర్నాశా = నాశము లేనిది.

'సత్యం జ్ఞాన మనం తం బ్రహ్మ' అని తైత్తరీయోపనిషత్తు చెబుతుంది. సత్యము, జ్ఞానము, అనంతము – అనే మూడు లక్షణాలు చెల్లే – 'పరబ్రహ్మ స్వరూపమే' అమ్మవారు. నిజమైన అస్తిత్వము కలిగినదే 'సత్యము'. మనము తెలుసుకుంటూ పోయి దేనియందు లీనమౌతామో అది 'జ్ఞానము'. ఆద్యంతములు లేక ఎల్లప్పుడూ ఉండడమే 'అనంతము'. కాబట్టి, అమ్మవారికి 'నాశ' లక్షణం ఉండదు. సినిమాలోని జనన మరణాలు, హత్యలు దోపిడీలు – తెరమీదనే జరుగుతాయి. కాని తెరకు అంటవు. తెరకు ఉండవు. సినిమా తెరలాంటిదే అమ్మవారు. ఆవిడ యందు ఈ సృష్టి స్థితిలయాలు వర్తిస్తాయి గాని, ఆవిడకు వుండవు.

'నాశము లేనిది' అని ఈ నామానికి అర్థం.

## 181 మృత్యు మథనీ

ఐదు అక్షరాల నామం. 'మృత్యుమథన్యై నమః' అని నమస్కరించాలి.

మృత్యు మథనీ = మృత్యు భావమును, మృత్యువును పోగొట్టునది.

చనిపోవడం కంటె 'చనిపోతామ'న్న భావమే అసలైన మృత్యు లక్షణం. (Death consciousness is Death) పరీక్షిత్తు 'తాను' మృతుడనౌతాను అని చెప్పినప్పుడు శుకయోగి – ముందు ఆ భావాన్ని మరచిపో, ఇక మిగిలినదంతా అమృతత్త్వమే' అన్నాడు. అలాగే, ముందు మనలోని 'మృత్యుభావనను మథనం చేస్తుంది అమ్మవారు. అటుపైన 'ఆత్మ స్వరూపమైన మనకు మృత్యువు వుండదు, పంచ భూతాత్మకమైన దేహానికే వుంటుంది' అనే జ్ఞానాన్ని కలిగిస్తుంది.

'మృత్యు భావనను, మృత్యువును పోగొట్టునది' అని ఈ నామానికి అర్థం.

## 182 నిష్క్రియా

మూడు అక్షరాల నామం. 'నిష్క్రియాయైనమః అని నమస్కరించాలి.

నిష్క్రియా = (చేయవలసిన, చేయకూడని) క్రియలు లేనిది.

సామాన్యంగా మనకు రెండు రకాల క్రియలుంటాయి. 1) చేయవలసిన పనులు 2) చేయకూడని పనులు. లేని వాటిని పొందడం కోసం చేసే పనులు మనకు వుంటాయి. ఈ ప్రపంచమంతా తనలోంచే వచ్చినపుడు ఆ అమ్మ వారు ప్రత్యేకంగా పొందాల్సినవి వుండవు. కాబట్టి ఆమె నిష్క్రియా. అలాగే ఉన్న వాటిని రక్షించుకోడం కోసం గూడా మనం కొన్ని పనులు చేస్తాం. తన నుండి వేరైతే రక్షించుకోవలసిన అవసరం వుంటుంది గాని 'తన నుండే వచ్చి, తన యందే వుండి, తన లోనే లీనమయే విధంగా సమస్త వస్తు జాలంలో ఈ సృష్టి వుంటే' – ఇంకా అమ్మవారు రక్షించు కోవాల్సినవి ఏ ముంటాయి ? అందుకు పనులు చేయ్యాల్సిన అవసరమే ముంటుంది ? కాబట్టి అమ్మవారు నిష్క్రియ.

'ఏ క్రియలూ' లేనిది అని ఈ నామానికి అర్థం.

## 183 నిష్పరిగ్రహా

ఐదు అక్షరాల నామం. 'నిష్పరి గ్రహాయైనమః' అని నమస్కరించాలి.

నిష్పరి గ్రహా = స్వీకరణ, పరిజనాదులు లేనిది.

'పరిగ్రహము' అంటే స్వీకరించడం, పరివారం, భార్య మొదలైన అర్థాలున్నాయి. ఏవైనా కోరికలు వుంటే వాటిని తీర్చుకోడం కోసం – అందుక్కావలసిన ధనాన్ని గాని, సంపదను గాని, పరిజనాన్ని గాన్ని ఏర్పరచుకోవడంలో – ఆర్జించడం, అర్థించడం లేదా ఎవరైనా ఇచ్చినపుడు స్వీకరించడం జరుగుతూ వుంటుంది. ఇలాంటి కోరికలు, అవసరాలు అమ్మవారికి వుండవు. కాబట్టి, బయటి నుండి అమ్మవారు గ్రహించేవి ఏవీ వుండవు. అందువలన అమ్మవారు నిష్పరి గ్రహా అని చెప్పబడింది.

'గ్రహ' – అంటే పట్టుకోడం. 'పరిగ్రహా' అంటే గట్టిగా పట్టుకోడం. మనస్సుకు అంటి, గట్టిగా మనలను పట్టి వుండే మొండి పట్టుదల, అభిప్రాయాలు, దృక్పథాలు తరహాలు, బిగుసుకుపోవడాలే (మానసికంగా) మన అసలైన పరిజనాలు. అమ్మవారికి ఇవి వుండవు. గాబట్టి – మన మనస్సుకు అంటి వుండే వీటి ముడులను సడలించి, మనల్ని సరిదిద్దుతుంది – ఈ నామాన్ని జపిస్తే

'స్వీకరణ, పరిజనాదులు లేనిది' అని ఈ నామానికి అర్థం.

'నీరాగా' అనే నామం మొదలు ఈ 'నిష్పరిగ్రహా' నామం వరకు వున్న నామాలను జాగ్రత్తగా పరిశీలిస్తే – 'ఉండకూడని లక్షణం అమ్మవారికి లేద'ని చెప్పడం, 'ఆ దుర్ల క్షణం మనలో వుంటే' – దాన్ని పోగొడుతుంద'ని చెప్పడం జరిగినట్లు తేలిగ్గా గ్రహించవచ్చు. కాబట్టి, ఆయా దుర్లక్షణాలు, లేదా – దోషాలున్నవారు, ఆ దోష నివారణార్థం చెప్పబడిన నామాన్ని 'సంపుటి' చేసి, అంటే – 'నమస్కార పూర్వకమైన మంత్రంగా చేసి జపించి ఫలితాన్ని పొందవచ్చును.

## 184 నిస్తులా

మూడు అక్షరాల నామం. 'నిస్తులాయైనమః' అని నమస్కరించాలి.

నిస్తులా = సాటిలేనిది.

ఏవిధంగా ఏ విషయంలో చూసినా అమ్మవారితో తులతూగేవారు లేరు. 'తాను ఎవ్వరినీ తూకం వెయ్యదు కాబట్టి అమ్మవారితో తూకంతూగ గల వారు ఎవ్వరూ వుండరు' అనేది రహస్యార్థం. ఈ గుణం మనం అలవరచుకోవాలి. ప్రతి వారికీ 'మార్కులు వేసి, వారి 'సత్తా'ను నిర్ణయించడానికి ప్రయత్నిస్తాము. దీన్నే 'తూకం తుయ్యడం' అంటారు. ఇంకొకరి సత్తా గురించి మనకు అనవసరం. అమ్మవారి అనుగ్రహాన్ని పొందడానికి మన అర్హతను పెంచుకోవడమే మన సాధనగా తెలుసుకోవాలి.

'సాటిలేనిది' అని ఈ నామానికి అర్థం.

ఈ 'నిస్తులా' నామం నుండి 'సమానాధికవర్జితా' అనే నామం వరకు గల 15 నామాలు 'పంచదశాక్షరీ మహా విద్యోపాసన'కు సంబంధించినవి. ఈ 15 నామాలను ప్రతి దినం స్మరిస్తూ, జపిస్తూ, దుఃఖాలను పోగొట్టుకొని, సుఖప్రదమైన జీవితాన్ని పొందవచ్చును.

## 185 నీలచికురా

ఐదు అక్షరాల నామం. 'నీలచికురాయైనమః' అని నమస్కరించాలి.

నీలచికురా = చిక్కని, చక్కని నల్లని ముంగురులు గలది.

'చికురము' అంటే – 'ముంగురులు' అని అర్థం. అమ్మవారి ముంగురులు సహజ స్వభావ సిద్ధంగానే తుమ్మెద రెక్కల నల్లదనం, వంకర దనం, నునుపుదనం, చిక్కదనం, చక్కదనం కలిగి వుంటాయిట. ఈ విషయం సౌందర్యలహరిలో శంకరాచార్యుల వారు ''అరాళై స్స్వాభావ్యాదళికలభస శ్రీభిరలకైః'' అన్న 45వ శ్లోకంలో వర్ణిస్తారు. సామాన్య స్త్రీలు నుదురుపై భాగాన తలపై ఉండే వెంట్రుకలను వేళ్ళకు ఉంగరాలలాగా చుట్టలు చుట్టి, కణతలకు నుదురుపైగా అతికించుకొని, సౌందర్యాన్ని పెంపొందింప చేసుకోడంలో సతమతమౌతారు. అమ్మవారికిలాంటివేమీ అవసరం లేకుండా సహజంగానే ముంగురులు అలా వున్నాయిట!

ఆడవాళ్ళకు ముంగురులు అలావుండడం సౌభాగ్యవృద్ధిని సూచిస్తుంది.

'చక్కని, చిక్కని నల్లని ముంగురులు కలది' అని ఈ నామానికి అర్థం.

## 186 నిరపాయా

నాలుగు అక్షరాల నామం. 'నిరపాయాయైనమః' అని నమస్కరించాలి.

నిరపాయా = అపాయములు లేనిది.

తన సంతతిని అపాయాల నుండి కాపాడే జగజ్జనని అమ్మవారు. మనకు - కలిగిన అపాయాలు, ప్రమాదాలే తెలుస్తాయి గాని, తొలగిన అపాయాలు, ప్రమాదాలు తెలియవు. అమ్మవారు వెనక వుండి తన సంతతిని రక్షించుకుంటూనే వుంటుంది. అవిడకు అపాయాలు, ప్రమాదాలు వుండవు. అమ్మవారి లాగానే నిండు ప్రేమ కలిగిన వారికి గూడా అవి వుండవు.

'అపాయము' అంటే 'ఎడబాటు' అని అర్థం వుంది. అమ్మవారికి అయ్యవారితో ఎప్పుడూ ఎడబాటు వుండదు. వాళ్ళిద్దరూ ఎప్పుడూ కలిసే వుంటారు ( ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాది ఉభావపి - గీత 20-13) అమ్మవారు నిత్య సుమంగళి. అయ్యవారు విషంతిన్నా గూడా అమ్మవారి మాంగళ్య బలం ఏ 'అపాయము' వాటిల్లకుండా చేసింది. మానసికంగానే కాదు, భౌతికంగా గూడా ఒకళ్ళ శరీరాల్లో ఒకళ్ళు ఇమిడి పోయిన అర్ధనారీశ్వరులు. వాళ్ళకు ఎడబాటు ఎందుకు వస్తుంది ?

ఈ నామాన్ని జపిస్తే ఎడబాటులుండకుండా అమ్మవారు రక్షిస్తుంది.

ఈ నామానికి క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. ఏ అపాయము లేనిది.
2. అయ్యవారితో ఎడబాటులేనిది.

## 187 నిరత్యయా

నాలుగు అక్షరాల నామం. 'నిరత్యయాయైనమః' అని నమస్కరించాలి.

నిర్ + అత్యయా = నిరత్యయా = అతిక్రమింప వీలులేనది.

అమ్మవారు సర్వాంతర్యామిని కాబట్టి ఎవ్వరూ, ఎక్కడారహస్యంగా అతిక్రమించి

ప్రవర్తించలేరు. ఒకవేళ ప్రవర్తించినా ప్రతిఫలంగా శిక్షింప బడక తప్పదు. వాయువు అంతటి వాడు తన ధర్మాన్ని నిర్వర్తించక పోతే ఈ 'మహారాజ్ఞి' ఏం శిక్ష విధిస్తుందో అని వీస్తూ వుంటాడుట! అలాగే సూర్యుడు, అగ్ని మొదలైన వారందరూ గూడా వారి వారికి కేటాయించిన విధులు నిర్వహిస్తూనే వుంటారుట! (తైత్తిరీయమ్)

'అత్యయము' అనే పదానికి 'వినాశము' లేదా 'అంతము' అనే అర్థం గూడా వుంది. విశ్వంలో అంతమే కాదు, అంతరం (Gap) గూడా లేనిది అమ్మవారు. 'నిరంతరత్వం' అనే నేపథ్యం మీద 'ఏకాంతరత్వం' అనే లక్షణం. Succession on the back ground of simultaneity or eternity) గలది' అని ఈ నామానికి అర్థంగా గూడా చెప్పుకోవచ్చును.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. అతిక్రమింప వీలులేనిది.
2. నిరంతరత్వం, అనే నేపథ్యం మీద ఏకాంతరత్వం అనే లక్షణం గలది.

## 188 దుర్లభా

మూడు అక్షరాల నామం. 'దుర్లభాయైనమః' అని నమస్కరించాలి.

దుర్లభా = పొంద శక్యము కానిది.

మన వాక్కులకు, మనస్సుకు గోచరము కానిది. మన ప్రవచనాలకు, నిర్వచనాలకు లొంగేది కాదు (నాయమాత్మా ప్రవచననేన లభ్యః). అసలు అమ్మవారి మీద భక్తి ఏర్పడడానికే ఆవిడ అనుగ్రహం వుండాలి. ఆ అనుగ్రహం కలిగిన ఎన్నో జన్మలకు ఎంతో సాధన చేసిన తరువాత గాని, అమ్మవారి దర్శన భాగ్యం పొందలేము. ఇది జన్మ జన్మాల సుకృతఫలంగా తెలుసుకోవాలి.

చూచి తీరవలసిన, చూడ శక్యము గాని విశ్వరూపం ('సుదుర్దర్శమిదంరూపమ్' గీత) ఎలాంటిదో అమ్మవారు అలాంటిధి. సమీపించడం అంత సులభసాధ్యం కానిది.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. పొందశక్యము కానిది.

2. చూచి తీర వలసి, చూడ శక్యము కానిది.

3. సమీపించటం సులభసాధ్యం కానిది.

## 189 దుర్గమా

మూడు అక్షరాల నామం. 'దుర్గమాయైనమః' అని నమస్కరించాలి.

దుర్గమా = గమింప శక్యము గానిది.

'గమము' అంటే 'ప్రయాణము' లేదా 'త్రోవ', 'మార్గము' 'దాటడము' అని అర్థాలున్నాయి. కాబట్టి, 'మనం దాటలేనిది, మన త్రోవకు లేదా మార్గమునకు మన పద్ధతులకు అందునది కాదు' అని అర్థాలు వస్తాయి.

గీతలో 'మమమాయా దురత్యయా' అన్న దానికి ఏమి అర్థమో ఈ 'దుర్గమా' అన్న నామానికి గూడా అదే అర్థం. పెద్దకోటలాగా దుర్గంలాగా తనవారిని కాపాడుతుంది కాబట్టి దుర్గమా.

(1) (లౌకిక జీవుల పద్ధతులకు నడవడికకు, అనుసరించే మార్గాలకు) అందునది కాదు. (2) 'పెద్ద దుర్గం వలె వుండి తన భక్తులను కాపాడునది' - అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 190 దుర్గా

రెండు అక్షరాల నామం. 'దుర్గాయై నమః' అని నమస్కరించాలి.

దుర్గా = దుర్గాదేవి

'దుర్గముడు' అనే రాక్షసుని చంపిన అమ్మవారికి 'దుర్గా' అని పేరు వచ్చింది.

బుద్ధిబలము, దేహబలము, ఆయుధబలము, మొదలైన బలాలు ఉండి ఎలాంటి శత్రువులైనా దాట శక్యము గాని వాడైన 'దుర్గ' - అనే రాక్షసుణ్ణి చంపి, దేవతలను కాపాడిన అమ్మవారికి 'దుర్గా' పేరు వచ్చింది.

విజయవాడలోని ఇంద్ర కీలాద్రి పర్వతముపై వెలసి, అష్టాదశ శక్తి పీఠాల్లో ఒకటిగా పేరు గన్న అమ్మవారి పేరు గూడా – 'దుర్గాదేవి'. మన లోని ''దుః'' అనగా చెడ్డ స్వభావమును వెడలగొట్టి, దాట శక్యము కాని వానిని దాటించుచు, కష్టమైన కార్యములను సానుకూల పడునట్లు చేయుమనలోని – 'శక్తి స్వరూపిణి'.

దుర్గలు మొత్తం 9 మంది వుంటారు. శైలపుత్రి, బ్రహ్మచారిణి, చంద్రఘంట, కూష్మాండ, స్కందమాత, కాత్యాయని, కాలరాత్రి, మహాగౌరి, సిద్ధిదా – ఈ తొమ్మిది మందిని 'నవదుర్గలు' అంటారు.

9 సంవత్సరాల వయస్సుగల బాలిక 'కుమారి దుర్గా' అనే పేరు గూడా అమ్మవారికి వుంది. ఈ దుర్గాదేవి బీజాక్షరం ''దుం''.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) 'దుర్గము' డనే రాక్షసుణ్ణి సంహరించినది.

2) 'దుర్గ' అనే రాక్షసుని బారి నుండి దేవతలను రక్షించినది.

3) 9 సంవత్సరాల బాలికగా 'కుమారి దుర్గా' అని పిలువబడునది.

4) మనలోని చెడ్డతనమును వెడలగొట్టి, దాటశక్యము గాని వానిని దాటించి, కష్టమైన కార్యములను కూడా సానుకూల పడునట్లు చేయు మనలోని శక్తిస్వరూపిణి.

## 191 దుఃఖహంత్రీ

ఐదు అక్షరాల నామం. 'దుఃఖహంత్ర్యై నమః' అని నమస్కరించాలి.

దుఃఖ హంత్రీ = దుఃఖములను తొలగించునది.

శరీరానికి దెబ్బతగిలితే వచ్చేది 'ఏడుపు', దీన్ని సంస్కృతంలో 'రోదనం' అంటారు. మనస్సుకు దెబ్బతగిలితే వచ్చేది 'దుఃఖం'. మనం చేసుకునే పనులను బట్టి మనకు దుఖం వస్తుంది. కర్మ అనే 'ఇనుము' ను 'గుండు' లాగా చేసుకుంటే సంసారమనే సముద్రంలో మునుగుతాం. తెప్పాలాలాగా చేసుకుంటే తేలుతాం ? కాబట్టి, ఈ సంసార

సముద్రంలో – 'తేలడమా – మునగడమా' – అనేది మనం చేసే పనులను బట్టి, వాటిని చేసే విధానాన్ని బట్టే వుంటుంది.

దుస్తరమైన దుఃఖాలను గూడా అవలీలగా అమ్మవారు దాటించగలదు. అందువలన అమ్మవారి పేరు 'దుఃఖహంత్రీ'.

దీపం వెలిగిస్తే చీకటి దానంతట అదే పోతుంది. అలాగే అమ్మవారి సాన్నిధ్యంలో, అజ్ఞాన దుఃఖాలు రెండూ దూరమౌతాయి. కలిగించుకోవలసిన మంచి వాటిని మనం కలిగించుకుంటే – తొలగింప బడాల్సిన చెడ్డవి మనలోంచి తొలగింపబడతాయి. ఇంకో ప్రయత్నం వల్ల క్రొత్తవి తగిలించు కోడమే జరుగుతుంది. దీన్నే భగవద్గీతలో ''పరం దృష్ట్వా నివర్తతే'' అన్నాడు గీతాచార్యుడైన కృష్ణుడు.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) దుఃఖములను తొలగించునది.

2) దుస్తరమైన దుఃఖాలను అవలీలగా దాటించగలది.

3) తన సాన్నిధ్యంతో దుఃఖాన్ని దూరం చేసేది.

## 192 సుఖప్రదా

నాలుగు అక్షరాల నామం. ''సుఖప్రదాయైనమః'' అని నమస్కరించాలి.

సుఖప్రదా = సుఖములను ఇచ్చునది.

'ఖం' అంటే సంస్కృతంలో 'ఆకాశము' (space) లేదా చోటు అని అర్థం. వ్యక్తుల మధ్య వుండే ఈ చోటు, అంటే వాతావరణం – 'సు' అంటే – మంచిగా వుంటే 'సుఖం', 'దుః' అంటే – చెడ్డగా వుంటే 'దుఃఖం' అని తెలుసుకోవాలి. అందువల్ల మనసాన్నిధ్యం వల్లే మనం వుండే చోటు మంచిగాగాని, చెడ్డగాగాని ప్రభావిత మౌతుంది. దీన్ని బట్టే సుఖంగాని దుఃఖంగాని వుండేది. మన సాన్నిధ్యం బాగుండాలంటే మన 'ప్రవర్తన' ఎప్పుడూ మంచిగా వుండాలి. దీనిని బట్టే అన్ని సుఖాలను అమ్మవారు మనకు ప్రసాదిస్తుంది.

సుఖాలు చాలా విధాలైనవి వున్నా, వాటన్నిటినీ రెండు రకాలుగా విభజించవచ్చును. 1) విషయ సుఖం 2) పరమ సుఖం - వీటినే 'ఐహిక సుఖం' 'ఆముష్మిక సుఖం' అంటారు. భౌతికమైన వస్తుసామగ్రితో పాంచభూతికమైన శరీరానికి కావలసినవి పొందడం ద్వారా - ఐహిక సుఖం ప్రాప్తిస్తుంది. అయితే, ఇది ఎంతో కాలం వుండదు. ఒక్కొక్కసారి దుఃఖానికే దారితీయవచ్చు గూడా ! కాని, ఆ ముష్మిక సుఖంలో నష్టపోయేది ఏమీ వుండదు. నిరంతర ఆనందాన్ని పొందవచ్చు. అంతర్ముఖమైన సాధనతో ఈ ఆనందాన్ని పొందవచ్చును. ''ఈ ఆనందంతో అన్నీ కొనవచ్చును. కాని, ఈ ఆనందాన్ని దేంతోనూ కొనలేము''. అమ్మవారు ఈ ఆనందాన్నిస్తుంది.

'దుఃఖహంత్రీ' - 'సుఖప్రదా' అన్న రెండు నామాలు మనకు అవసరమే ! దుఃఖాలను తొలగించి వూరుకుంటే లాభం లేదు. అమ్మవారు సుఖాలను గూడా కలుగ జేయాలి.

సాధనా మార్గంలో వుండేవారికి 'సుఖపడడం' 'సుఖపడక పోవడం' అని వుండవు. 'సుఖపడదలచుకోడం', 'సుఖపడ దల్చుకోక పోవడమే' వుంటాయి. తీరుబడిగా కూర్చుని దుఃఖించవచ్చు, తీరుబడిగా కూర్చుని ఆనందంగానూ వుండవచ్చు. ఎవరి కిష్టమైంది వాళ్ళు చేసుకోవచ్చు. ఎందుకంటే ఈ సుఖదుఃఖాలు రెండూ మానసికమే కాబట్టి.

'సుఖములను కలిగించునది' అని ఈ నామానికి అర్థం.

## 193 దుష్టదూరా

నాలుగు అక్షరాల నామం. 'దుష్ట దూరాయైనమః' అని నమస్కరించాలి.

దుష్టదూరా = దుష్టత్వము అంటనిది. దుష్టులకు అందనిది.

అమ్మవారి గాలి సోకితే - దుష్టత్వం దూరమై, దుష్టులు పారిపోతారు. అమ్మవారి గాలి సోకాలంటే - అమ్మవారిని స్మరించాలి. ఆమె ఆశించే, నిర్దేశించే కట్టుబాట్లను కట్టుదిట్టంగా ఆచరించాలి. అలా 'ఆచరించిన వారికి - ఆచరించి నంత మహాదేవా' అనే విధంగా అనుగ్రహం సంప్రాప్తమౌతుంది.

ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చు.

1. దుష్టత్వము అంటనిది.
2. దుష్టులకు అందనిది.
3. దుష్టులను దూరముగా నుంచునది.

## 194 దురాచార శమనీ

ఏడు అక్షరాల నామం. 'దురాచార శమన్యైనమః' అని నమస్కరించాలి.

దురాచార శమనీ = చెడునడవడికను పోగొట్టునది.

(ఈ నామాన్ని బాణీ కోసమని 'దురాచారా' అని ఆపకూడదు. 'దురాచారశమనీ' అని చదవాలి).

దురాచారాలంటే దురభ్యాసాలే ! ఒకసారి అభ్యాసమైన వాటిని మనం తొలగించుకోడం కష్టం. ఆ పనికి అమ్మవారే పూనుకుంటే పని సులువౌతుంది. అందుకే అమ్మవారిని 'దురాచార శమనీ' అని ప్రార్థించేది. 'దురాచారాల' ను ఆంగ్లంలో'Cheap tastes' అనవచ్చును.

సదాచారము వలన దురాచారాలను పోగొట్టుకోడం అసలు పద్ధతి. ఆచరించవలసిన వాటిలో మంచి విషయాలుంటాయి గాని, తెలుసుకునే వాటిలోను, తెలుసుకోవలసిన వాటిలోను వుండవు. చీకటి తోనే మేలుకోమంటే – 'ఎంత చీకటి వుండగా ?' అంటాడు తెలుసుకోగోరే వాడు. ఆచరించే వాడైతే ఆ ప్రశ్న తో సంబంధం లేకుండా లేస్తాడు. అంతే ! 'పొరుగు వాణ్ణి ప్రేమించు' అంటే – 'పొరుగువాడు ఎవరు?' అని అడుగుతాడు – తెలుసుకోగోరేవాడు. అలా అడక్కుండా తనకు తారసపడిన వాడినల్లా ప్రేమిస్తాడు ఆచరించేవాడు.

'చెడు నడవడికను పోగొట్టునది' అని ఈ నామానికి అర్థం.

## 195 దోషవర్జితా

ఐదు అక్షరాల నామం. 'దోషవర్జితాయైనమః' అని నమస్కరించాలి.

దోషవర్జితా = దోషములచే విడిచి పెట్టబడినది.

అమ్మవారు 'వర్జితదోష' కాదు 'దోషవర్జిత'. అమ్మవారు దోషాలను విడిచిపెడితే – 'వర్జితదోషా' అవుతుంది. దోషాలే అమ్మవారిని విడిచిపెడితే 'దోషవర్జితా' అవుతుంది. అమ్మవారిలో దోషాలుంటే గదా – వాటిని దూరంగా విడిచి పెట్టడానికి. కాబట్టి, 'వర్జితదోష' కాదు. దోషాలే అమ్మవారిని చేరడానికి ప్రయత్నం చేసి చేసి, ఈవిడ దగ్గఱ మన ఆటలు సాగవని, అమ్మవారిని వదిలి, దూరంగా పోయాయి. కాబట్టి, అమ్మవారు 'దోషవర్జిత' అన్నారు వ్యాసులవారు.

(హయగ్రీవ మంత్రంలో గూడా ఇలాగే 'నరం ముంచంతి పాపాని దరిద్రమివ యోషితః' అని వుంటుంది. దరిద్రుణ్ణి స్త్రీ ఎలా వదిలివేస్తుందో – అలాగే 'హయగ్రీవుని నామాన్ని ఉచ్చరించిన వారిని విడిచి పాపాలు దూరంగా పోతాయి' అని దీని అర్థం.)

దోషం ఏ మాత్రం కొంచెమైనా లేని వారుండరు. ఏ మాత్రం దోషము లేనిది అమ్మవారే ! అందుకని దోషాలు పోవాలంటే అమ్మవారిని అర్చించి, అభ్యర్థించ వలసిందే! అమ్మవారికి నమస్కారాలు చెల్లించుకొని, హృదయగత దోషాలను తొలగించుకోవాలి.

'దోషములచే విడిచి పెట్టబడినది' అని ఈ నామానికి అర్థం.

## 196 సర్వజ్ఞా

మూడు అక్షరాల నామం. 'సర్వజ్ఞాయై నమః' అని నమస్కరించాలి.

సర్వజ్ఞా = అన్నిటినీ తెలిసినది.

అమ్మవారికి తెలియని విషయం లేదు. అన్నీ తెలిసిన సంపూర్ణ జ్ఞాన స్వరూపిణి; దేశ, కాల జ్ఞానం(Knowledge of space and time) తెలుసు. అందుకే ఆవిడ సర్వజ్ఞ.

ఇటువంటి సర్వజ్ఞురాలిని అభ్యర్థించేటప్పుడు మనం – మనకు తెలిసినవి, కావలసినవి ఏవో మంచివనుకొని వాటిని – సలహాలను సూచించే విధంగా ఆమెను అభ్యర్థించ కూడదు. (Don't suggest better things to Her)

'అన్నిటినీ తెలిసినది' అని ఈ నామానికి అర్థం.

## 197 సాంద్ర కరుణా

ఐదు అక్షరాల నామం. 'సాంద్రకరుణాయై నమః' అని నమస్కరించాలి.

సాంద్ర కరుణా = గొప్పదయగలది.

'కారుణ్యం' కమనీయమైన రూపం ధరించి అమ్మవారైంది. (Embodiment of compassion in flesh, blood and frame) 'ఘనీభవించిన కరుణారసం అమ్మవారు' అని అర్థం. ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1. గొప్పదయగలది.

2. ఘనీభవించిన కరుణారసపు ముద్ద.

## 198 సమానాధికవర్జితా

ఎనిమిది అక్షరాల నామం. 'సమానాధికవర్జితాయైనమః' అని నమస్కరించాలి.

సమనాధికవర్జితా = ఎక్కువ తక్కువ భేదాలచే విడువబడినది, అనగా ఎక్కువ వారు, తక్కువ వారు లేనిది.

అమ్మవారిది అపారమైన ప్రేమ. ఆ ప్రేమలో ఎక్కువ తక్కువలు వుండవు. ఆ భావాలు అమ్మవారి దరికి రావు. అందరూ సమానులే అమ్మవారికి. అందుకని 'సమానాధికవర్జితా' అని పిలవబడుతుంది. తనకు సాటిగా 'తులతూగ గలుగుట', 'అధిగమించుట' కుదరనిది. అనగా - అమ్మవారితో సమానమైన వారు, అమ్మవారి కంటె అధికులు ఎవరూ లేరు. అందుకని అమ్మవారు 'సమానాధికవర్జితా' అని పిలువబడుతుంది.

ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పుకోవచ్చును.

1) ఎక్కువ తక్కువ భేదాలు వదలబడినది.

2) తనకు సమానులు, తనకంటె అధికులు లేనిది.

# 199 సర్వశక్తిమయీ

ఆరు అక్షరాల నామం. 'సర్వశక్తిమయ్యైనమః' అని నమస్కరించాలి.

సర్వశక్తిమయీ = సర్వశక్తి స్వరూపిణి.

ఒక్కొక్క శక్తి ఒక్కొక్క దేవతా పరంగా వుంటుంది. కాని, అమ్మవారు సర్వదేవతా స్వరూపిణి కాబట్టి సర్వశక్తి స్వరూపిణి గూడా అవుతుంది.

('యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా' - సర్వభూతముల యందుండే శక్తిస్వరూపిణి అమ్మవారు).

సూర్యునిలోని ప్రకాశ శక్తి, చంద్రుని లోని ఆహ్లాదకర శక్తి, అగ్ని లోని దహన శక్తి - ఇలా అన్నిటి లోని అన్ని శక్తులకు మూలశక్తి అమ్మవారు. సర్వ శక్తులు తన మయముగా గలది. అంటే, అమ్మవారే ఏ శక్తిగా వ్యక్తమవాలంటే - ఆ శక్తిగా వ్యక్తమౌతుంది. వివిధ పేర్లతో వుండే శక్తులు వివిధ రకాల కుండల్లాంటివైతే - అమ్మవారు ఆ కుండలన్నిటిలోను వుండే మట్టి లాంటిది. అందుకే ఆమె 'సర్వశక్తిమయి'.

వస్తువుకు ఏ పేరు పెడతామో అది అబద్ధం. ఆ వస్తువులో నిండి వుండేదే నిజం. రకరకాల కుండలకు రకరకాల పేర్లు పెట్టవచ్చుకాని, ఈ పేర్లన్నీ అబద్ధమే. ఆ రక రకాల కుండల నిండా వున్న మట్టి మాత్రమే నిజం. అలాగే - అన్ని శక్తులకు మూలమైనది అమ్మవారన్నదే నిజం.

'సర్వశక్తి స్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

# 200 సర్వమంగళా

ఐదు అక్షరాల నామం. 'సర్వమంగళాయైనమః' అని నమస్కరించాలి.

సర్వమంగళా = సర్వమంగళ స్వరూపిణి.

'మంగళా' అంటే మంగళకరమైనది, శుభమైనది అని అర్థం. అమ్మవారు ఎక్కడ వుంటే అక్కడ అంతా శుభమే! పెళ్లై పారాణి పాదాన్ని రుద్రభూమి (శ్మశానం)లో పెడితే

అదంతా భద్రభూమిగా, సుభద్రభూమిగా, శుభప్రదమై, సర్వసృష్టికి ఉన్ముఖమై విరాజిల్లి, మంగళకరమైంది.

అందుకే ఆ అమ్మవారికి ప్రణమిల్లుతూ '' సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే, శరణ్యేత్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే'' అని చెప్పడం – అంతే కాదు. 'యశ్శివో నామ రూపాభ్యాం యాదేవి సర్వమంగళా', తయోః సంస్మరణా త్పుంసాం సర్వతో జయమంగళమ్'' అని విఘ్నేశ్వరపూజ ప్రారంభంలోనే చెబుతాం.

అనగా ''నామరూపాల చేత ఏ దేవుడు శివుడో, ఏ దేవి సర్వమంగళయో ఆ ఇద్దరి స్మరణ – సర్వత్ర, సర్వలోకవాసులకు మంగళకరము'' అని అర్థం.

(మా ఇంట్లో మా తాత ముత్తాతల కాలం నుండి దేవీ ఉపాసన ఉండేది. మా నాన్నగారికి ఈ 'సర్వమంగళా' నామం చాలా ఇష్టం. మా నాయనమ్మ గారి పేరు గూడా 'మంగళాంబ'. రెండు విధాలుగాను కలిసి వస్తుందని మా పెద్దక్కయ్యకు, 'సర్వమంగళాంబ' అని పేరు పెట్టుకున్నారు మా నాన్నగారు – వివరణ కర్త)

1. సర్వ మంగళ స్వరూపిణి.

2. సర్వకాల, సర్వఅవస్థల యందు పవిత్రముగా ఉండునది.

3. సర్వమును పవిత్రముగా మార్చునది – అని ఈ నామానికి అర్థాలు.

**(ఇంతవరకు ఈ ప్రథమ భాగములో రెండువందల నామాలకు మాత్రమే వివరణ పూర్తి అయింది. 201 నామం నుండి రెండవ భాగంలో వివరణ వుంటుంది. ఇటు పైన వుండే 'అనుబంధం' లో శ్రీవిద్యకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన విషయాలు వివరింపబడ్డాయి. అవి గూడా చదివితే సంపూర్ణ అవగాహన కలుగుతుంది.**

**- వివరణకర్త)**

## నాడులు

'నాడులు' అనంగానే 'నరాలు' అనుకుంటాము. కాని, ఈ రెండూ ఒకటి కాదు. నరాలు భౌతికమైనవి – అంటే, మనం కళ్లతో చూడగలిగినవి – అంటే, ఇవి స్థూలమైనవి అన్నమాట ! నాడుల విషయంలో అలా కుదరదు. అవి సూక్ష్మమైనవి. కంటితో చూడలేము. ఒక ఉదాహరణ చెప్పుకుంటే గాని ఈ రెంటికీ తేడా తెలియదు.

రాగి తీగగుండా విద్యుత్ ప్రవహిస్తోంది అనుకోండి. అప్పుడు ఆ రాగి తీగలాంటిది 'నరం', తీగగుండా ప్రవహించే విద్యుత్తు లాంటిది 'నాడి'. రాగి తీగను కళ్లతో చూడవచ్చు, కాని, విద్యుత్తును కంటితో చూడలేము గదా! అలా అని విద్యుత్తు ఉండదని, లేదని అనుకోవడం పొరపాటు. వాస్తవానికి రేడియో పాడేది, ఫ్యాను తిరిగేది, విద్యుద్దీపం వెలిగేది రాగి తీగవల్ల కాదు, దాని గుండా ప్రవహించే విద్యుత్ వల్ల. అంటే విద్యుత్ప్రవాహానికి రాగి తీగ ఎలా వాహిక (conductor) లాంటిదో నాడీ ప్రసారానికి నరాలు అలాంటివన్నమాట.

మానవ శరీరంలో మొత్తంమీద 72,000 నాడులుంటాయి. చక్షుర్నాడి, ఘ్రాణనాడి, శ్రోత్రనాడి, ప్రాణనాడి అపాననాడి మొదలైనవి. పంచేంద్రియాల ద్వారా విషయ సంగ్రహణము జరిగి, ఈ నాడుల ద్వారానే మన మెదడుకు, తద్వారా మనస్సుకు నివేదింపబడి, దానికి తగిన స్పందన, అనుభూతి కలుగుతాయి. శవానికి నరాలుంటాయి కాని నాడులు పని చెయ్యవు – అందుకే చైతన్యం వుండదు.

మానవుని వెన్నెముక లోపల ముఖ్యమైన నాడులు మూడుంటాయి. అవి 1) ఇడానాడి 2) పింగళానాడి 3) సుషుమ్నా నాడి. మనలో సూక్ష్మం నుండి స్థూలానికి దారితీసే ప్రక్రియలన్నీ (Process of precipitation, materialisation etc) ఇడానాడి ద్వారా జరుగుతాయి. స్థూలం నుండి సూక్ష్మానికి దారితీసే ప్రక్రియలన్నీ(Process of radiation, sublimation etc) పింగళానాడి ద్వారా జరుగుతాయి. ఇడా నాడి చంద్ర సంబంధమైనది, పింగళానాడి సూర్యసంబంధమైనది. మనం భూమ్మీద వున్నాం. చంద్రుణ్ణి భూమి తనవైపు ఆకర్షిస్తుంది. అందుకని ఈ బలం బయట (ఆకాశం) నుండి మనంవైపుకు (భూమివైపుకు) పనిచేస్తుంది. ఆధ్యాత్మిక విద్యలో చంద్రుడు మనస్సుకు,

# నాడులు

'నాడులు' అనంగానే 'నరాలు' అనుకుంటాము. కాని, ఈ రెండూ ఒకటి కాదు. నరాలు భౌతికమైనవి – అంటే, మనం కళ్లతో చూడగలిగినవి – అంటే, ఇవి స్థూలమైనవి అన్నమాట ! నాడుల విషయంలో అలా కుదరదు. అవి సూక్ష్మమైనవి. కంటితో చూడలేము. ఒక ఉదాహరణ చెప్పుకుంటే గాని ఈ రెంటికీ తేడా తెలియదు.

రాగి తీగగుండా విద్యుత్ ప్రవహిస్తోంది అనుకోండి. అప్పుడు ఆ రాగి తీగలాంటిది 'నరం', తీగగుండా ప్రవహించే విద్యుత్తు లాంటిది 'నాడి'. రాగి తీగను కళ్లతో చూడవచ్చు, కాని, విద్యుత్తును కంటితో చూడలేము గదా! అలా అని విద్యుత్తు ఉండదని, లేదని అనుకోవడం పొరపాటు. వాస్తవానికి రేడియో పాడేది, ఫ్యాను తిరిగేది, విద్యుద్దీపం వెలిగేది రాగి తీగవల్ల కాదు, దాని గుండా ప్రవహించే విద్యుత్ వల్ల. అంటే విద్యుత్ప్రవాహానికి రాగి తీగ ఎలా వాహిక (conductor) లాంటిదో నాడీ ప్రసారానికి నరాలు అలాంటివన్నమాట.

మానవ శరీరంలో మొత్తంమీద 72,000 నాడులుంటాయి. చక్షుర్నాడి, ఘ్రాణనాడి, శ్రోత్రనాడి, ప్రాణనాడి అపాననాడి మొదలైనవి. పంచేంద్రియాల ద్వారా విషయ సంగ్రహణము జరిగి, ఈ నాడుల ద్వారానే మన మెదడుకు, తద్వారా మనస్సుకు నివేదింపబడి, దానికి తగిన స్పందన, అనుభూతి కలుగుతాయి. శవానికి నరాలుంటాయి కాని నాడులు పని చెయ్యవు – అందుకే చైతన్యం వుండదు.

మానవుని వెన్నెముక లోపల ముఖ్యమైన నాడులు మూడుంటాయి. అవి 1) ఇడానాడి 2) పింగళానాడి 3) సుషుమ్నా నాడి. మనలో సూక్ష్మం నుండి స్థూలానికి దారితీసే ప్రక్రియలన్నీ (Process of precipitation, materialisation etc) ఇడానాడి ద్వారా జరుగుతాయి. స్థూలం నుండి సూక్ష్మానికి దారితీసే ప్రక్రియలన్నీ(Process of radiation, sublimation etc) పింగళానాడి ద్వారా జరుగుతాయి. ఇడా నాడి చంద్ర సంబంధమైనది, పింగళానాడి సూర్యసంబంధమైనది. మనం భూమ్మీద వున్నాం. చంద్రుణ్ణి భూమి తనవైపు ఆకర్షిస్తుంది. అందుకని ఈ బలం బయట (ఆకాశం) నుండి మనంవైపుకు (భూమివైపుకు) పనిచేస్తుంది. ఆధ్యాత్మిక విద్యలో చంద్రుడు మనస్సుకు,

ఈ ఇడా, పింగళానాడులు వరుసగా పటంలో పై నుండి క్రిందకు పోయే దిశగాను, క్రింది నుండి పైకి పోయే దిశగాను చూపబడ్డాయి. ఈ రెండు నాడులకు మధ్యన వుండే అత్యంత సూక్ష్మమైన చోటులో సుషుమ్నానాడి వుంటుంది. ఇది తామరతూడు విరిచినపుడు వచ్చే అతి సన్నని దారపు పోగు(Fibre) కన్న సూక్ష్మంగా వుంటుంది. ఇది అగ్నితత్త్వాత్మకం. నీరు నీటి ఆవిరిగా మారడంలోగాని, నీటి యావిరి నీరుగా మారడంలోగాని జరిగే మార్పులు ఉష్ణోగ్రతా భేదం వల్లనే గదా! అందుకే ఈ సుషుమ్నా నాడి - ఇటు శీతల గుణ ఘనీభవన సంబంధమైన, పదార్థ ఉత్పత్తికి సంబంధించిన (Solidification or materialisation) చంద్రనాడి అయిన ఇడానాడిని, అటు ప్రకాశ గుణ వికిరణ సంబంధమైన, ఉత్పతన సంబంధమైన (Radiation or Sublimation) సూర్యనాడి అయిన పింగళానాడిని నియంత్రణం చేస్తూ - రెంటికీ అతీతంగా వుంటుంది. ఈ సుషుమ్నా నాడి మార్గాన్ని అనుసరించే సాధకుని సాధనలో కుండలినీ శక్తి అనే తేజస్సు మూలాధార చక్రం నుండి సహస్రారం దాకా వెన్నెముకలోని ఊర్ధ్వమార్గంలో ఉత్తేజిత మౌతుంది.

ఈ ఇడా, పింగళా, సుషుమ్నా నాడులను వరుసగా గంగా, యమునా, సరస్వతీ నదీ ప్రవాహాలతో పోలుస్తారు. వీటిలో సుషుమ్న అంతర్వాహిని కాబట్టి సరస్వతీ నదితో పోలుస్తారు. సూర్యుని కూతురే యమునా నది కాబట్టి, పింగళానాడిని - యమునతో పోల్చారు. ఆకాశం నుండి భూమి వైపుకు దారితీసిన గంగా మార్గాన్ని - అంటే, అధోమార్గాన్ని సూచించేది కాబట్టి, ఇడానాడిని - గంగతో పోల్చి వుండవచ్చు. ఇంతేకాదు, నిశ్వాసం - ఇడానాడికి, ఉచ్ఛ్వాసం - పింగళా నాడికి, ఈ రెంటి సమన్వయంతో సాధించబడే యోగసిద్ధి - సుషుమ్నా నాడికి సంబంధించినవి గాను సమన్వయ పరచుకోవచ్చును.

## షట్చక్రాలు

కుండలినీయోగ సంబంధమైన శ్రీవిద్యలో షట్చక్రాల గురించి తెలుసుకోవడం చాలా అవసరం. జంతువులన్నిటికి వెన్నెముక(Vertebral column or spinal cord) అడ్డంగా (Horizontal)గా వుంటుంది. అందుకే, వాటిని తిర్యక్ జీవులంటారు. మానవునికి ఈ వెన్నెముక నిట్టనిలువుగా (Vertical)గా వుంటుంది. అందువలన

ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ - అనే పది అక్షరాల బీజాలను సూచిస్తాయి. ఈ చక్రం అధిష్ఠాన దేవత పేరు ''వయోవస్థావివర్జితా''. ఈ వయోవస్థావివర్జితా దేవత 3 ముఖాలు కలిగి, ఎఱుపురంగులో 'లాకిణీశక్తి' రూపంలో వుండి, సప్తధాతువుల్లోని ''మాంస'' ధాతువునకు అధిదేవతగా వుంటుంది. ఇక్కడ వ్యాహృతి 'ఓగ్ం సువః'.

4. అనాహతము: దీనిని ఆంగ్లంలో Heart centre అంటారు. ఇది హృదయం దగ్గర వుంటుంది. ఇది మన శరీరంలోని ప్రాణ స్పందనను, ఉచ్ఛ్వాస నిశ్వాసలను అంటే, పంచభూతాల్లోని వాయుతత్త్వాన్ని నియంత్రణం చేస్తుంది.

ఈ చక్రాన్ని 12 దళాలు కలిగిన పద్మంతో సంకేతిస్తారు. ఈ 12 దళాలు - 'క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ' - అనే 12 అక్షరాల బీజాలను సూచిస్తాయి. ఈ చక్రం అధిష్ఠాన దేవత 'వామదేవి'. ఈ వామదేవి రెండుముఖాలు కలిగి, శ్యామలవర్ణంలో ''రాకిణీ శక్తి'' రూపంలో వుండి, సప్త ధాతువుల్లోని 'రక్త ధాతువు'కు అధిదేవతగా వుంటుంది. ఇక్కడ వ్యాహృతి - 'ఓం మహః'.

5. విశుద్ధి: దీనిని ఆంగ్లంలో 'Throat Centre' అంటారు. ఇది కంఠానికి కొద్దిగా దిగువ భాగంలో స్వరపేటిక ప్రాంతంలో వుంటుంది. ఇది మన శరీరంలో చోటును (space) అంటే పంచభూతాల్లోని ఆకాశ తత్త్వాన్ని నియంత్రణం చేస్తుంది.

ఈ చక్రాన్ని 16 దళాలు కలిగిన పద్మంతో సంకేతిస్తారు. ఈ 16 దళాలు 16 అచ్చు అక్షరాలకు (vowels) బీజాలను సూచిస్తాయి. ఈ చక్ర అధిష్ఠాన దేవత పేరు ''వజ్రేశ్వరి''. ఈమె ఒకే ఒక ముఖం కలిగి, పాటల వర్ణం (తెలుపు + ఎఱుపు మిశ్రం) లో ''డాకినీశక్తి'' రూపంలో వుండి, సప్త ధాతువుల్లోని 'త్వక్' అంటే చర్మ ధాతువుకు అధిదేవతగా వుంటుంది. ఇక్కడ వ్యాహృతి 'ఓం జనః'.

6. ఆజ్ఞాచక్రం: దీనిని ఆంగ్లంలో 'Eye brow centre' అంటారు. ఇది కనుబొమల మధ్య (బొట్టు పెట్టుకునే చోటుకు వెనుక ప్రాంతంలో) వుంటుంది. మన శరీరంలోని 'మనస్సు' తత్త్వాన్ని నియంత్రణం చేస్తుంది.

ఈ చక్రాన్ని రెండు దళాలు కలిగిన పద్మంతో సంకేతిస్తారు. ఈ రెండు దళాలు 'హ, క్ష' అనే రెండు అక్షరాలకు బీజాలను సూచిస్తాయి. ఈ చక్ర అధిష్ఠాన దేవత పేరు 'సిద్ధమాత'. ఈమె ఆఱు ముఖాలు కలిగి, తెల్లని రంగులో 'హాకినీ' శక్తి రూపంలో వుండి, సప్త ధాతువుల్లోని 'మజ్జా' ధాతువు (ఎముకల్లోని కొవ్వు) కు అధిదేవతగా వుంటుంది. ఇక్కడ వ్యాహృతి 'ఓం తపః'.

7. సహస్రారం: దీనిని ఆంగ్లంలో'Head Centre' అంటారు. ఇది శిరస్సుపైన గల బ్రహ్మ రంధ్ర ప్రాంతంలో వుంటుంది.

ఈ చక్రాన్ని వెయ్యి దళాలు కలిగిన పద్మంతో సంకేతిస్తారు. ఈ దళాలు అన్ని అక్షరాలకు బీజాలను సూచిస్తాయి. ఇది వెయ్యి మెరుపుల కాంతిని మించిన కాంతితో వుంటుంది. ఈ చక్ర అధిష్ఠాన దేవత పేరు 'యశస్వినీ'. ఈమె సాక్షాత్తు పరమేశ్వరియే! ఇదియే బ్రహ్మపదాన్ని, ఆత్మ సాక్షాత్కార స్థానాన్ని సూచిస్తుంది. అన్ని వర్ణాల శోభ, కాంతి కలిగి ఈ సహస్రారం – 'యాకినీ శక్తి,' రూపంలో వుండి, సప్తధాతువుల్లోని 'శుక్లాని'కి అధిదేవతగా వుంటుంది. ఇక్కడ వ్యాహృతి 'ఓగ్ం సత్యం'.

## వాగ్దేవతలు

పూజా విధానంలోని మంత్రాలు, స్తోత్రాలు అన్నీ వాక్కుతో ఉచ్చరించాలి కాబట్టి, ఆ వాక్కుకు సంబంధించిన వాగ్దేవతల పేర్లు ఈక్రింద ఇవ్వబడ్డాయి.

1. అరుణాదేవి 2. కామేశ్వరీ దేవి 3. కౌళినీ దేవి 3. జయినీ దేవి 4. మోదినీ దేవి 6. వశినీ దేవి 7. విమలా దేవి 8. సర్వేశ్వరీ దేవి.

వీళ్లనే వశిన్యాది వాగ్దేవతలంటారు. వీళ్ల తల్లిదండ్రులు అమ్మవారి పేర్లే వీళ్లకి పెట్టారు. వీరి అనుగ్రహం వుంటే మంచి వాక్కు, స్ఫుటమైన ఉచ్చారణ, తద్వారా మంచి శాస్త్ర జ్ఞాన, ఆత్మజ్ఞానాలు ప్రసాదింపబడతాయి.

## నిత్యాదేవతలు

అమ్మవారు పదహారు కళలు కలిగిన పరిపూర్ణ స్వరూపిణి. అందువల్లనే అమ్మవారిని 'షోడశీ' అంటారు. చంద్రకళలను సూచించే తిథులకు, అమ్మవారి కళలకు, మన్వంతరాలకు – సమన్వయం వుంది. చంద్రుడు పాడ్యమి నుండి క్రమ క్రమంగా ఒక్కొక్క కళ చొప్పున వృద్ధి చెందుతూ – పూర్ణిమ నాటికి నిండు చంద్రుడౌతాడు. సూర్యుని నుండి పొందే వెలుగు శుక్ల పక్షంలో క్రమ క్రమంగా పెరుగుతూ చంద్రునికి

సంక్రమించడం వలన - పూర్ణిమ రోజు చంద్రుడు పరిపక్వ స్థితిని పొందుతాడు. కృష్ణ పక్షంలో చంద్రుడు ఒక్కొక్క రోజు ఒక్కొక్క కళ చొప్పున తగ్గుతూ అమావాస్య నాడు పూర్తిగా తన కళను కోల్పోతాడు. చంద్రుని ఈ పదహారు కళలను శ్రీవిద్యలో 'నిత్యా దేవతల' పేర్లతో సంకేతిస్తారు. రెండు పక్షాలలోని తిథులకు నిత్యల పేర్లకు మధ్య సమన్వయం ఈ క్రింద తెలుపబడింది.

| | తిథిపేరు | శుక్లపక్షంలోని నిత్యపేరు | కృష్ణపక్షంలోని నిత్యపేరు |
|---|---|---|---|
| 1. | పాడ్యమి | కామేశ్వరీ | (వి)చిత్రా |
| 2. | విదియ | భగమాలినీ | జ్వాలామాలినీ |
| 3. | తదియ | నిత్యక్లిన్నా | సర్వమంగళా |
| 4. | చవితి | భేరుండా | విజయా |
| 5. | పంచమి | వహ్నివాసినీ | నీలపతాకా |
| 6. | షష్ఠి | మహావజ్రేశ్వరీ | నిత్యా |
| 7. | సప్తమి | శివదూతీ | కులసుందరీ |
| 8. | అష్టమి | త్వరితా | త్వరితా |
| 9. | నవమి | కులసుందరీ | శివదూతీ |
| 10. | దశమి | నిత్యా | మహావజ్రేశ్వరీ |
| 11. | ఏకాదశి | నీలపతాకా | వహ్నివాసినీ |
| 12. | ద్వాదశి | విజయా | భేరుండా |
| 13. | త్రయోదశి | సర్వమంగళా | నిత్యక్లిన్నా |
| 14. | చతుర్దశి | జ్వాలామాలినీ | భగమాలినీ |
| 15. | పూర్ణిమ | (వి)చిత్రా | కామేశ్వరీ |

పైన తెల్పిన 15 నిత్యలలో వర్తించే మూలభూతమైన కళను 'మహానిత్యా' అంటారు. ఈ మహానిత్యనే లలితా, శ్రీకళ, నైసర్గిక కళ, సంవిత్కళ, చిత్కళ, ఆద్యకళ అనే పేర్లతో గూడా పిలుస్తారు.

# శ్రీ చక్రము



శ్లో: బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ మన్వస్ర నాగదళ షోడశ పత్రయుక్తం
వృత్త త్రయంచ ధరణీ సదన త్రయంచ శ్రీ చక్రరాజ ఉదితః పరదేవతాయాః

[గోపురమువలె కనబడు శ్రీ చక్ర ఉద్ధారము (Three Dimensional Srichakra) చూచుటకు పై నుండి క్రిందకు క్రమముగా - 1) బిందువు, 2) త్రికోణం, 3) వసుకోణం, 4) అంతర్దశారం, 5) బహిర్దశారం, 6) చతుర్దశారం, 7) అష్టదళపద్మం, 8) షోడశదళ పద్మం, దానిచుట్టూ మూడు వృత్తరేఖలు, 9) మూడు రేఖలతో ధరణీ సదనం (భూపురము) - కలిగియుండి, బిందువువద్ద, 'పరదేవత' అయిన అమ్మవారు (శ్రీలలితా పరమేశ్వరి) ఆసీనురాలై ఉంటుంది.]

# నవావరణములు

శ్రీ చక్రంలో తొమ్మిది ఆవరణలుంటాయి. వీటిని 'నవావరణములు' అంటారు. వీటి పేర్లు - బయట నుండి కేంద్రం వైపుకు పోయే వరుసలో క్రింద తెలిపిన విధంగా వుంటాయి.

1) ధరణీ సదనం, లేదా భూపురం 2) షోడశ (పదహారు) దళపద్మం 3) నాగ (అష్ట) దళపద్మం 4) మన్వస్రం; లేదా - చతుర్దశారం 5) బహిర్దశారం 6) అంతర్దశారం 7) వసుకోణం 8) త్రికోణం 9) బిందువు - ఈ తొమ్మిది ఆవరణల నమూనా చిత్రాలు, ఇతర వివరాలు ఈక్రింద తెలుపబడ్డాయి.

**1.** ప్రథమావరణం - ధరణీసదనం (భూపురం)

శ్రీ చక్రానికి బాహ్యంగా నాలుగు వైపులా గోడల్లాగా వుండే దాన్ని భూపురం అంటారు. ఇది ఈక్రింది పటంలో చూపిన విధంగా వుంటుంది.



పటం : ప్రథమ ఆవరణం
భూపురం లేదా ధరణీ సదనం

ఈ ప్రథమావరణలో 'అణిమాది దేవతలు' మొత్తం 28 మంది వుంటారు. వీరందరూ మందార పువ్వు రంగు గల దేహకాంతితో వుంటారు. ఒక్కొక్కరికి నాలగు చేతులుంటాయి. ఆ నాలుగు చేతుల్లోను 1) చింతామణి 2) కపాలం 3) త్రిశూలం 4) సిద్ధి కజ్జలం (కజ్జలం అంటే అంజనం లేదా కాటుక అని అర్థం) ఆయుధాలను ధరించి వుంటారు. ఈ 28 మంది దేవతల పేర్లు ఈ క్రింద తెలుపబడ్డాయి.

1) అణిమా 2) లఘిమా 3) మహిమా 4) ఈశిత్వ 5) వశిత్వ 6) ప్రాకామ్య 7) భుక్తి 8) ఇచ్ఛా 9) ప్రాప్తి 10) సర్వకామ 11) బ్రాహ్మీ 12) మాహేశ్వరీ 13) కౌమారీ 14) వైష్ణవీ 15) వారాహీ 16) మాహేంద్రీ 17) చాముండా 18) మహాలక్ష్మీ 19) సర్వసంక్షోభిణీ 20) సర్వవిద్రావిణీ 21) సర్వాకర్షిణీ 22) సర్వవశంకరీ 23) సర్వోన్మాదినీ 24) సర్వమహాంకుశా 25) సర్వఖేచరీ 26) సర్వబీజా 27) సర్వయోని 28) సర్వత్రిఖండా

ఈ ఆవరణకు సంబంధించిన సంకేతముద్ర – సర్వసంక్షోభినీ ముద్రా

ఈ ప్రథమావరణకు సంబంధించిన రసం – శృంగారరసం

ఈ ప్రథమావరణకు సంబంధించిన బీజాక్షరం – ''ద్రాం''

**2.** ద్వితీయావరణం– షోడశారం (షోడశదళపద్మం)

ఇది శ్రీచక్రంలో 16 దళాల పద్మాకారంలో వుంటుంది. ఇది పటంలో చూపిన విధంగా వుంటుంది.




పటం : ద్వితీయ ఆవరణం
షోడశ దళ పద్మం

ఈ ద్వితీయావరణంలో పదహారు 'గుప్తదేవతలు' పటంలో చూపిన సంఖ్యల క్రమంలో వుంటారు. ఒక్కొక్కరికి నాలుగు చేతులుంటాయి. మూడు నేత్రాలుంటాయి. చంద్రార్ధ శకలాన్ని ధరించి వుంటారు. నాలుగు చేతుల్లోను క్రమంగా ధనుస్సు, బాణం, డాలు, ఖడ్గం ధరించి వుంటారు. వీరి పేర్లు ఈ క్రింద తెలుప బడ్డాయి.

1) కామాకర్షిణీ 2) బుద్ధ్యా కర్షిణీ 3) అహంకారా కర్షిణీ 4) శబ్దాకర్షిణీ 5) స్పర్శాకర్షిణీ 6) రూపాకర్షిణీ 7) రసాకర్షిణీ 8) గంధాకర్షిణీ 9) చిత్తాకర్షిణీ 10) ధైర్యాకర్షిణీ 11) స్మృత్యాకర్షిణీ 12) నామాకర్షిణీ 13) బీజాకర్షిణీ 14) ఆత్మాకర్షిణీ 15) అమృతాకర్షిణీ 16) శరీరాకర్షిణీ .

ఈ ద్వితీయావరణకు సంబంధించిన సంకేతముద్ర – సర్వవిద్రావిణీ ముద్రా
ఈ ద్వితీయావరణకు సంబంధించిన రసం – వీరరసం
ఈ ద్వితీయావరణకు సంబంధించిన బీజాక్షరం – ''ద్రీం''.

**3.** తృతీయావరణం : అష్టదళపద్మం

ఇది శ్రీ చక్రంలో 8 దళాల పద్మాకారంలో వుంటుంది. పటంలో సూచించిన విధంగా వుంటుంది.




పటం : తృతీయ ఆవరణం
అష్టదళ పద్మం

ఈ తృతీయావరణలో 8 మంది 'గుప్తతరదేవత' లుంటారు. మందారపువ్వురంగు దేహకాంతితో వుంటారు. ఒక్కొక్కరికి నాలుగు చేతులుంటాయి. నాలుగు చేతుల్లోను వరుసగా 1) ఇక్షుచాపం (చెఱుకుగడ విల్లు) 2) పుష్పశరం 3) పుష్పగుచ్ఛం 4) ఉత్పలం - ధరిస్తారు. వీరి పేర్లు 1) అనంగకుసుమ 2) అనంగ మేఖల 3) అనంగమదన 4) అనంగ మదనాతుర 5) అనంగ రేఖా 6) అనంగ వేగినీ 7) అనంగాంకుశ 8) అనంగమాలినీ

ఈ తృతీయావరణకు సంబంధించిన సంకేతముద్ర - సర్వాకర్షిణీ ముద్రా

ఈ తృతీయావరణకు సంబంధించిన రసం - కరుణరసం

ఈ తృతీయావరణకు సంబంధించిన బీజాక్షరం - ''క్లీం''.

**4. చతుర్ధావరణం : మన్వస్రం**

ఇది పటంలో చూపిన విధంగా 14 కోణాలు కలిగిన ఆకారంలో వుంటుంది. ఇక్కడ 'సంప్రదాయ యోగినులు' 14 మంది పటంలో సూచించిన సంఖ్యల క్రమంలో వుంటారు. వీరు కాలానల శరీరకాంతితో వుంటారు. ఒక్కొక్కరికి నాలుగు




పటం : చతుర్ధ ఆవరణం

చతుర్ధశారం లేదా మన్వస్రం

చేతులుంటాయి. నాలుగు చేతుల్లోను వరుసగా 1) వహ్నిచాపం 2) వహ్నిబాణం 3) వహ్ని రూప ఖడ్గం 4) వహ్ని రూప చక్రం – ధరించి, పరివేష్ఠించి వుంటారు. వీరి పేర్లు –

1) సర్వసంక్షోభిణీ 2) సర్వవిద్రావణీ 3) సర్వాకర్షిణీ 4) సర్వాహ్లాదినీ 5) సర్వసమ్మోహినీ, 6) సర్వస్తంభినీ 7) సర్వజృంభిణీ 8) సర్వవశంకరీ 9) సర్వరంజనీ 10) సర్వోన్మాదినీ 11) సర్వార్థ సాధినీ 12) సర్వసంపత్తి పూరిణీ 13) సర్వమంత్రమయీ 14) సర్వద్వంద్వక్షయంకరీ

ఈ చతుర్థావరణమునకు సంబంధించిన సంకేతముద్ర – సర్వవశంకరీ ముద్రా
ఈ చతుర్థావరణమునకు సంబంధించిన రసం – భయానకరసం
ఈ చతుర్థావరణమునకు సంబంధించిన బీజాక్షరం – ''బ్లూం''.

**5.** పంచమావరణం : బహిర్దశారం

ఇది పటంలో చూపిన విధంగా పదికోణాలు కలిగిన ఆకారంలో వుంటుంది.




పటం : పంచమ ఆవరణం
బహిర్దశారం

ఈ ఆవరణలో పది 'శక్తులు' పటంలో సూచించిన సంఖ్యల వరుసలో వుంటారు. స్ఫటిక మణి కాంతులు విరజిమ్మే శరీరకాంతి కలిగి వుంటారు. ఒక్కొక్కరికి నాలుగు చేతులుంటాయి. నాలుగు చేతుల్లోను 1) పరశువు 2) పాశము 3) గద 4) ఘంటామణి. ధరించి వుంటారు. ఈ పదిమంది శక్తుల పేర్లు -

1) సర్వసిద్ధిప్రద 2) సర్వసంపత్ప్రద 3) సర్వప్రియంకరీ 4) సర్వమంగళకారిణీ 5) సర్వకామప్రద 6) సర్వదుఃఖవిమోచినీ 7) సర్వమృత్యు ప్రశమనీ 8) సర్వవిఘ్ననివారిణీ 9) సర్వాంగసుందరీ 10) సర్వసౌభాగ్యదాయినీ

ఈ పంచమావరణకు సంబంధించిన సంకేతముద్ర - సర్వోన్మాదినీ ముద్రా

ఈ పంచమావరణకు సంబంధించిన రసం - బీభత్సరసం

ఈ పంచమావరణకు సంబంధించిన బీజాక్షరం - ''సః''

**6. షష్ఠావరణం - అంతర్దశారం**

ఇది శ్రీ చక్రంలో ఈక్రింది పటంలో చూపిన విధంగా




పటం : షష్ఠ ఆవరణం
అంతర్దశారం

పది కోణాలు కలిగిన ఆకారంలో వుంటుంది. ఈ ఆవరణలో పదిమంది 'నిగర్భయోగినులు' వుంటారు. ఒక్కొక్కరికి నాలుగు చేతులుంటాయి. నాలుగు చేతుల్లోను 1) వజ్రము 2) శక్తి 3) తామరం 4) చక్రం – ధరించి వుంటారు. వీరి పేర్లు –

1) సర్వజ్ఞా 2) సర్వశక్తి 3) సర్వఐశ్వర్యప్రద 4) సర్వ జ్ఞానమయీ 5) సర్వవ్యాధి వినాశినీ 6) సర్వాధార స్వరూపా 7) సర్వపాపహరా 8) సర్వానందమయీ 9) సర్వరక్షాస్వరూపిణీ 10) సర్వేప్సితార్థప్రదా.

ఈ షష్ఠావరణానికి సంబంధించిన సంకేతముద్ర – సర్వమహాంకుశా ముద్రా
ఈ షష్ఠావరణానికి సంబంధించిన రసం – రౌద్రరసం
ఈ షష్ఠావరణానికి సంబంధించిన బీజాక్షరం – ''క్రోం''

7. సప్తమావరణం: వసుకోణం

ఇది శ్రీ చక్రంలో ఈక్రింది పటంలో చూపిన విధంగా




పటం : సప్తమ ఆవరణం
వసుకోణం

ఎనిమిది కోణాలు కలిగిన ఆకారంలో వుంటుంది. ఈ ఆవరణలో ఎనిమిది మంది 'వాగ్దేవతలు (రహస్యశక్తులు) ఉంటారు. వీరు రక్తాశోక కాంతిగల శరీర కాంతులు కలిగి వుంటారు. ఒక్కొక్కరికి నాలుగు చేతులుంటాయి. నాలుగు చేతుల్లోను 1) బాణం 2) విల్లు 3) వీణ 4) పుస్తకం ధరించి వుంటారు. వీరి పేర్లు - 1) వశినీ 2) కామేశ్వరీ 3) మోదినీ 4) విమలా 5) అరుణా 6) జయినీ 7) సర్వేశ్వరీ 8) కౌళినీ

ఈ సప్తమావరణకు సంబంధించిన సంకేతముద్ర - సర్వఖేచరీ ముద్రా

ఈ సప్తమావరణకు సంబంధించిన రసం - హాస్యరసం

ఈ సప్తమావరణకు సంబంధించిన బీజాక్షరం - ''హ్స్ల్రౌం''

8. అష్టమావరణం : త్రికోణం

ఇది శ్రీ చక్రంలో ఈక్రింది పటంలో చూపిన విధంగా మూడు కోణాలు గలిగిన త్రిభుజాకారంలో వుంటుంది. ఈ ఆవరణలో ముగ్గురు ''అతిరహస్యా శక్తులు'' పటంలో సూచించిన సంఖ్యల వరుసక్రమంలో వుంటారు. వీరికి ఒక్కొక్కరికి ఎనిమిది




పటం : అష్టమ ఆవరణం
త్రికోణం

చేతులుంటాయి. ఎనిమిది చేతుల్లో వరుసగా 1) బాణం 2) చాపం 3) పానపాత్ర 4) మాతులుంగ 5) ఖడ్గం 6) డాలు 7) నాగపాశం 8) ఘంటాయుధం ధరించి వుంటారు. వీరి పేర్లు –

1) కామేశ్వరీ 2) భగమాలినీ 3) వజ్రేశ్వరీ.

ఈ త్రికోణావరణానికి సంబంధించిన సంకేతముద్ర – సర్వబీజముద్రా

ఈ త్రికోణావరణానికి సంబంధించిన రసం – అద్భుత రసం

ఈ త్రికోణావరణానికి సంబంధించిన బీజాక్షరం – ''హ్స్రౌమ్''

**9. నవమావరణం : బిందువు**

ఇది శ్రీచక్ర కేంద్రం వద్ద బిందు పరిమాణంలో వుంటుంది. ఈ ఆవరణలో పదహారు 'నిత్యాదేవత'లుంటారు. వీరందరూ లలితా దేవితో సమానమైన తేజస్సు, పరాక్రమం కలిగి వుంటారు. వీళ్లందరూ కాలరూపులు, విశ్వమంతా వ్యాపించి వుంటారు. నిత్యాదేవతల పేర్లు ఇంతకు పూర్వమే చెప్పబడ్డాయి.

పటం : నవమ ఆవరణ

బిందువు

ఈ నవమావరణానికి సంబంధించిన సంకేతముద్ర – సర్వయోనిముద్రా

ఈ నవమావరణానికి సంబంధించిన రసం – శాంతరసం

ఈ నవమావరణానికి సంబంధించిన బీజాక్షరం – ''ఐం''

## శ్రీ లలితాపరమేశ్వరి మంత్రిణులు

అమ్మవారి మంత్రిణులు 16 మంది వుంటారు. వారి పేర్లు 1) సంగీతయోని 2) శ్యామా 3) శ్యామలా 4) మంత్రనాయికా 5) మంత్రిణీ 6) సచివేశానీ 7) ప్రధానేశ 8) కుశప్రియా 9) వీణావతీ 10) వైణికీ 11) ముద్రిణీ 12) ప్రియకప్రియా 13) నీపప్రియా 14) కదంబవేశ్యా 15) కదంబవనవాసినీ 16) సదామలా

వీరందరిలోను ముఖ్యమైనది ''శ్యామలా''.

## అమ్మవారి సేనానులు

అమ్మవారికి 12 మంది సేనానులుంటారు. వారి పేర్లు 1) పంచమీ 2) దండనాథా 3) సంకేతా 4) సమయేశ్వరీ 5) సమయసంకేతా 6) వారాహీ 7) పోత్రిణీ 8) శివా 9) వార్తాళీ 10) మహాసేనానీ 11) అజ్ఞాచక్రేశ్వరీ 12) అలిందినీ

వీరందరిలోను ''వారాహీ'' ముఖ్యురాలు.

## భండాసురుని సేనానులు

భండాసురునికి 15 మంది సేనానులుంటారు. వారి పేర్లు 1) దమనక 2) దీర్ఘజిహ్వ 3) హుబక 4) హులుమాలు 5) కక్లస 6) కల్లివాహన 7) ధుక్లస 8) పుత్రకేతు 9) చంద్రబాహు 10) కుక్కుర 11) జంబుకాక్ష 12) కుంభగ 13) తీక్ష్ణశృంగ 14) త్రికంటక 15) చంద్రగుప్త

## భండాసురుని పుత్రులు

భండాసురునికి 30 మంది పుత్రులుంటారు వారి పేర్లు – 1) చతుర్బాహువు 2) చికోరాక్షుడు 3) చతుశిరస్కుడు 4) వజ్రఘోషుడు 5) ఊర్ధ్వకేశుడు 6) మహాకాయుడు 7) మహాహనువు 8) మఖశత్రువు 9) మఖస్కందుడు 10) సింహఘోషుడు 11) నిరాలకుడు 13) లశుణుడు 13) కుట్టిసేనుడు 14) పురజిత్తు 15) పూర్యరమాకుడు 16) స్వర్గశత్రువు 17) ఇంద్రశత్రువు 18) అమిత్రకుడు 19) విద్యున్మాలి 20) ఉగ్రకర్మ 21) ఉగ్రధన్వా 22) స్వర్గపీడుడు 23) దుర్గుడు 24) స్వర్గకంటుడు 25) అతిమాయుడు 26) బృహన్మాయుడు 27) విభీషణుడు 28) శ్రుతి పారగుడు 29) విదురుడు 30) ఉపమాయుడు

## అస్త్ర ప్రత్యస్త్రములు

భండాసురునికి అమ్మవారికి జరిగిన యుద్ధంలో భండాసురుడు కొన్ని అస్త్రాలు

ప్రయోగించగా అమ్మవారు ఆ అస్త్రాలన్నిటికి ప్రత్యస్త్రాలను ప్రయోగించి, వాటిని తుదముట్టించి భండాసురుణ్ణి వధించింది. ఆ అస్త్ర ప్రత్యస్త్ర వివరాలు ఈ క్రింద తెలుపబడ్డాయి.

| భండాసురాస్త్రాలు | | పరమేశ్వరీ ప్రత్యస్త్రాలు |
|---|---|---|
| 1. అంధతామిస్రాస్త్రము | - | మహాతరణ్యస్త్రము |
| 2. పాషండాస్త్రము | - | గాయత్ర్యస్త్రము |
| 3. అంధాస్త్రము | - | చాక్షుష్మత్యస్త్రము |
| 4. శక్తినాశాస్త్రము | - | విశ్వావస్వస్త్రము |
| 5. అంతకాస్త్రము | - | మృత్యుంజయాస్త్రము |
| 6. సర్వస్మృతినాశాస్త్రము | - | ధారణాస్త్రము |
| 7. భయాస్త్రము | - | అభయంకర ఐంద్రాస్త్రము |
| 8. మహారోగాస్త్రము | - | నామత్రయాస్త్రము |
| 9. ఆయుర్నాశాస్త్రము | - | సంకర్షణాస్త్రము |
| 10. సర్వాసురాస్త్రము | - | దుర్గాస్త్రము |
| 11. మూకాస్త్రము | - | వాగ్వాదిన్యస్త్రము |
| 12. వేదతస్కరాస్త్రము | - | మత్స్యాస్త్రము |
| 13. ఆర్ణవాస్త్రము | - | కూర్మాస్త్రము |
| 14. హిరణ్యాక్షాస్త్రము | - | వరాహాస్త్రము |
| 15. హిరణ్యకశ్యపాస్త్రము | - | నృసింహాస్త్రము |
| 16. బలీంద్రాస్త్రము | - | వామనాస్త్రము |
| 17. హైహయాస్త్రము | - | భార్గవాస్త్రము |
| 18. రావణాస్త్రము | - | శ్రీరామాస్త్రము |
| 19. ద్వివిధాస్త్రము | - | బలరామాస్త్రము |
| 20. రాజాసురాస్త్రము | - | కృష్ణాస్త్రము |
| 21. కల్యస్త్రము | - | కల్క్యస్త్రము |
| 22. మహామోహాస్త్రము | - | శాంభరాస్త్రము |

ఇవి కాక అమ్మవారు 'నారాయణాస్త్రం' తో – భండాసురుని మొత్తం సైన్యాన్ని, 'పాశుపతాస్త్రం' తో – భండాసురుని సైన్యాధిపతులను, 'మహాకామేశ్వరాస్త్రం' తో భండాసురుని రాజధాని అయిన శూన్యక నగరంతో సహా భండాసురుణ్ణి సంహరించింది. ఈ అస్త్రాలను 'సంహారకాస్త్రాలు' అంటారు.

## శ్రీ మన్నగరము

అమ్మవారి నామాల్లో 'శ్రీమన్నగరనాయికా' అనే నామ వివరణలో (91వ పుటలో) పూర్తిగా చెప్పబడని వివరాలు ప్రస్తుతం ఇక్కడ తెలుపబడుతున్నాయి.

సకలలోకాలకు ఆధారమైనదిగాను, సర్వదేవతలకు నివాసమైనదిగాను ఉండే – మేరుపర్వతం మధ్యలో ఉండే శిఖరం మీద శ్రీమన్నగరం ఉంటుంది. దీన్ని దేవ శిల్పి. మయుడు నిర్మించాడు. దీనికి 25 ప్రాకారాలు ఉంటాయి. ఈ ప్రాకారాలు వరుసగా 1)ఇనుము, 2)కంచు, 3)రాగి, 4)సీసం, 5)ఇత్తడి, 6)పంచలోహసాల, 7)వెండి, 8)బంగారం, 9) పుష్యరాగం, 10)పద్మరాగం, 11)గోమేధికం, 12)వజ్రం, 13)వైఢూర్యం, 14)ఇంద్రనీలం, 15)ముత్యం, 16)మరకతం, 17)విద్రుమం, 18)మాణిక్యం, 19)సహస్రస్తంభ మంటపం, 20)మనస్సాల, 21)బుద్ధిసాల, 22)హంకారసాల, 23)సూర్యబింబసాల, 24)చంద్రబింబసాల, 25)శృంగారసాల – లకు సంబంధించినవి.

ప్రక్క ప్రక్కన ఉండే ప్రాకారాల మధ్య ఉండే చోటును 'ఆవరణము' అంటారు. అందుకే – ప్రాకారాలు 25 కాబట్టి, ఆవరణలు 24 ఉంటాయి. ఈ 24 ఆవరణలలో వరుసగా –

1) కాళీసమేతుడై మహాకాలుడు, 2)మధుశ్రీ, మాధవశ్రీలతో వసంతఋతురాజు, 3)శుక్రశ్రీ, శుచిశ్రీలతో గ్రీష్మఋతురాజు, 4) నభశ్రీ వంటి ద్వాదశ శక్తులతో వర్షఋతురాజు. 5)ఇషశ్రీ, ఊర్జశ్రీలతో శరదృతురాజు, 6)సహశ్రీ, సహ్యశ్రీలతో హేమంతఋతురాజు, 7)తపశ్రీ, తపస్యశ్రీలతో శిశిరఋతురాజు, 8)సిద్ధులు, 9)చారణులు, 10)భైరవులు, 11)గంధర్వ – కిన్నర

– కింపురుషులు, 12)అనంతుడు, వాసుకి మొదలైన పన్నగాలు, 13)మనువు, మాంధాత, భగీరథాదులైన మానవులు, 14)అష్టదిక్పాలకులు, 15)సమస్త సైన్య సమేతంగా వారాహీదేవి, 16)మరీచ్యాది ప్రజాపతులతో బ్రహ్మ, 17)విష్ణువు, 18)శివుడు, 19)తారాంబ, 20)అమృతేశ్వరి, 21)కురుకుల్లాంబ, 22)చక్షుష్మతీ, ఛాయాదేవీలతో మార్తాండ భైరవుడు, 23)నక్షత్ర పరివృతుడై చంద్రుడు, 24)శృంగార శక్తితో మన్మథుడు – ఉంటారు.

పైన చెప్పిన ఆవరణ లన్నిటికి మధ్యగా ఉండే కేంద్రంవద్ద చింతామణి గృహం ఉంటుంది. ఈ గృహానికి ఆగ్నేయ దిశలో – పరమేశ్వరి ఆవిర్భవించిన 'చిదగ్ని కుండము', నైఋతిదిశలో – శ్రీ చక్రరథం, వాయువ్యదిశలో – గేయచక్రరథా రూఢియై శ్యామలా దేవి, ఈశాన్యదిశలో – కిరిచక్ర రథారూఢియై వారాహీదేవి – ఉంటారు.

చింతామణి గృహానికి నాలుగు దిక్కుల వద్ద నాలుగు ద్వారాలుంటాయి. ఈ నాలుగు ద్వారాల వద్ద ఆమ్నాయ మంత్ర దేవతలు సేవిస్తూ ఉంటే – గృహమధ్యంలో, పంచబ్రహ్మాసనం మీద, కామేశ్వరుని వామాంకం మీద – ఈ సమస్త విశ్వాన్ని పరిపాలిస్తూ– 'శ్రీ మన్నగరనాయిక' అయిన 'శ్రీ లలితా పరమేశ్వరి' విరాజిల్లుతూ ఉంటుంది.



# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమ్

న్యాసమ్

అస్య శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమాలా మహా మన్త్రస్య; వశిన్యాది వాగ్దేవతా ఋషయః, అనుష్టుప్ఛన్దః, శ్రీ లలితా పరాభట్టారికా మహాత్రిపుర సున్దరీ దేవతా, ఐం-బీజం, సౌః - శక్తిః, క్లీం - కీలకం, మమ చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థే జపే వినియోగః,. ఐం - అంగుష్ఠాభ్యాం నమః, క్లీం - తర్జనీభ్యాం నమః, సౌః - మధ్యమాభ్యాం నమః, సౌః అనామికాభ్యాం నమః, క్లీం - కనిష్ఠికాభ్యాం నమః, ఐం - కరతల కర పృష్ఠాభ్యాం నమః, ఐం - హృదయాయ నమః, క్లీం - శిరసే స్వాహా, సౌః-శిఖాయై వషట్, సౌః-కవచాయహుం, క్లీం - నేత్రత్రయాయ వౌషట్, ఐం - అస్త్రాయ ఫట్, భూర్భువ స్సువరోమితి దిగ్బన్ధః.

## ధ్యానమ్

అరుణాం కరుణా తరంగితాక్షీం ధృత పాశాంకుశ పుష్పబాణ చాపామ్,
అణి మాది భి రావృతాం మయూఖైః అహమి త్యేవ విభావయే భవానీమ్.
ధ్యాయేత్ పద్మాసనస్థాం వికసితవదనాం పద్మపత్రాయతాక్షీం,
హేమాభాం, పీతవస్త్రాం కరకలిత లసద్ధేమ పద్మాం వరాంగీమ్
సర్వాలంకారయుక్తాం, సకల మభయదాం, భక్త నమ్రాం భవానీం,
శ్రీ విద్యాం శాన్తమూర్తిం, సకల సురనుతాం సర్వ సమ్పత్ప్రదాత్రీమ్.
సంకుంకుమ విలేపనామ్ అళిక చుమ్బి కస్తూరికాం
సమన్ద హసితేక్షణాం సశరచాప పాంశాంకుశామ్
అశేష జనమోహినీమ్ అరుణమాల్య భూషాంబరాం
జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరే దమ్బికామ్.

## పంచపూజలు

(లమిత్యాది పంచపూజాం విభావయేత్ తద్యథా) - లం - పృథివీతత్త్వాత్మికాయై, శ్రీ లలితా దేవ్యై గన్ధం పరికల్పయామి. హం - ఆకాశతత్త్వాత్మికాయై, శ్రీ లలితాదేవ్యై పుష్పం పరికల్పయామి. యం - వాయుతత్త్వాత్మికాయై, శ్రీ లలితా దేవ్యై ధూపంపరికల్పయామి. రం - వహ్నితత్త్వాత్మికాయై, శ్రీ లలితాదేవ్యై దీపం

పరికల్పయామి - వం - అమృతతత్త్వాత్మికాయై, శ్రీ లలితా దేవ్యై అమృత నైవేద్యం పరికల్పయామి. సం - సర్వతత్త్వాత్మికాయై, శ్రీ లలితాదేవ్యై తామ్బూలాది సర్వోపచారాన్ పరికల్పయామి.

ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః.

ఓం॥ శ్రీమాతా, శ్రీమహారాజ్ఞీ, శ్రీమత్సింహాసనేశ్వరీ,
చిదగ్నికుణ్డ సమ్భూతా, దేవకార్య సముద్యతా. 1
ఉద్యద్భాను సహస్రాభా, చతుర్బాహు సమన్వితా,
రాగస్వరూప పాశాఢ్యా, క్రోధాకారాంకుశోజ్జ్వలా. 2
మనోరూపేక్షు కోదణ్డా, పంచతన్మాత్రసాయకా,
నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాణ్డ మణ్డలా. 3
చమ్పకాశోక పున్నాగ సౌగన్ధిక లసత్కచా,
కురువిన్దమణి శ్రేణీ కనత్కోటీర మణ్డితా. 4
అష్టమీ చన్ద్రవిభ్రాజ దళికస్థల శోభితా,
ముఖచన్ద్ర కళంకాభ మృగనాభి విశేషకా. 5
వదనస్మర మాంగల్య గృహతోరణ చిల్లికా,
వక్త్రలక్ష్మీపరీవాహ చలన్మీనాభలోచనా. 6
నవచమ్పక పుష్పాభ నాసాదణ్డ విరాజితా,
తారాకాన్తి తిరస్కారి నాసాభరణ భాసురా. 7
కదమ్బ మంజరీ క్లృప్త కర్ణపూర మనోహరా,
తాటంక యుగళీభూత తపనోడుప మణ్డలా. 8
పద్మరాగశిలాదర్శ పరిభావి కపోలభూః,
నవవిద్రుమబిమ్బశ్రీ న్యక్కారి రదనచ్ఛదా. 9
శుద్ధవిద్యాంకు రాకార ద్విజపంక్తి ద్వయోజ్జ్వలా,
కర్పూరవీటికామోద సమాకర్ష ద్దిగన్తరా. 10
నిజసల్లాపమాధుర్య వినిర్భర్త్సితకచ్ఛపీ,
మన్దస్మిత ప్రభాపూర మజ్జత్కామేశమానసా. 11

అనాకలితసాదృశ్య చుబుక శ్రీ విరాజితా,
కామేశబద్ధ మాంగల్యసూత్రశోభితకన్ధరా. 12
కనకాంగద కేయూర కమనీయ భుజాన్వితా,
రత్నగ్రైవేయ చిన్తాక లోల ముక్తాఫలాన్వితా. 13
కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణస్తనీ,
నాభ్యాలవాల రోమాళి లతాఫల కుచద్వయీ. 14
లక్ష్యరోమ లతాధారతా సమున్నేయ మధ్యమా,
స్తనభార దళన్మధ్య పట్టబన్ధవళిత్రయా. 15
అరుణారుణ కౌసుమ్భ వస్త్రభాస్వత్కటీతటీ,
రత్న కింకిణి కారమ్య రశనా దామ భూషితా. 16
కామేశ జ్ఞాత సౌభాగ్య మార్దవోరుద్వయాన్వితా,
మాణిక్య మకుటాకార జానుద్వయ విరాజితా. 17
ఇన్ద్రగోప పరిక్షిప్త స్మర తూణాభ జంఘికా,
గూఢగుల్ఫా, కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా. 18
నఖదీధితి సఞ్ఛన్న సమజ్జన తమోగుణా,
పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా. 19
శింజానమణి మంజీర మణ్డిత శ్రీ పదామ్బుజా,
మరాళీ మన్దగమనా, మహాలావణ్య శేవధిః. 20
సర్వారుణా, అనవద్యాంగీ, సర్వాభరణ భూషితా,
శివకామేశ్వరాంకస్థా, శివా, స్వాధీన వల్లభా. 21
సుమేరు శృంగ మధ్యస్థా, శ్రీమన్నగర నాయికా,
చిన్తామణి గృహాంతఃస్థా, పంచ బ్రహ్మాసన స్థితా. 22
మహాపద్మాటవీ సంస్థా, కదమ్బ వనవాసినీ,
సుధాసాగర మధ్యస్థా, కామాక్షీ, కామదాయినీ. 23
దేవర్షిగణ సంఘాత స్తూయమానాత్మవైభవా,
భణ్డాసుర వధోద్యుక్త శక్తి సేవాసమన్వితా. 24

మూలాధారైక నిలయా, బ్రహ్మగ్రన్థి విభేదినీ,
మణిపూరాన్త రుదితా, విష్ణుగ్రంథి విభేదినీ. 38
ఆజ్ఞాచక్రాన్త రాళస్థా, రుద్ర గ్రన్థివిభేదినీ,
సహస్రారామ్బుజారూఢా, సుధాసారాభివర్షిణీ. 39
తటిల్లతాసమరుచిః, షట్చక్రోపరిసంస్థితా,
మహాసక్తిః, కుణ్డలినీ, బిసతన్తు తనీయసీ. 40
భవానీ, భావనాగమ్యా, భవారణ్య కుఠారికా,
భద్రప్రియా, భద్రమూర్తిః, భక్త సౌభాగ్యదాయినీ. 41
భక్తిప్రియా, భక్తిగమ్యా, భక్తివశ్యా, భయాపహా,
శామ్భవీ, శారదారాధ్యా, శర్వాణీ, శర్మదాయినీ. 42
శాంకరీ, శ్రీకరీ, సాధ్వీ, శరచ్చంద్ర నిభాననా,
శాతోదరీ, శాన్తిమతీ, నిరాధారా, నిరంజనా. 43
నిర్లేపా, నిర్మలా, నిత్యా, నిరాకారా, నిరాకులా,
నిర్గుణా, నిష్కళా, శాన్తా, నిష్కామా, నిరుపప్లవా. 44
నిత్యముక్తా, నిర్వికారా, నిష్ప్రపంచా, నిరాశ్రయా,
నిత్యశుద్ధా, నిత్యబుద్ధా, నిరవద్యా, నిరన్తరా. 45
నిష్కారణా, నిష్కళంకా, నిరుపాధిః, నిరీశ్వరా,
నీరాగా, రాగమథనీ, నిర్మదా, మదనాశినీ. 46
నిశ్చిన్తా, నిరహంకారా, నిర్మోహా, మోహనాశినీ,
నిర్మమా, మమతాహన్త్రీ, నిష్పాపా, పాపనాశినీ. 47
నిష్క్రోధా, క్రోధశమనీ, నిర్లోభా, లోభనాశినీ,
నిస్సంశయా, సంశయఘ్నీ, నిర్భవా, భవనాశినీ. 48
నిర్వికల్పా, నిరాబాధా, నిర్భేదా, భేదనాశినీ,
నిర్నాశా, మృత్యుమథనీ, నిష్క్రియా, నిష్పరిగ్రహా. 49
నిస్తులా, నీలచికురా, నిరపాయా, నిరత్యయా,
దుర్లభా, దుర్గమా, దుర్గా, దుఃఖహన్త్రీ, సుఖప్రదా. 50

దుష్టదూరా, దురాచారశమనీ, దోషవర్జితా,
సర్వజ్ఞా, సాన్ద్రకరుణా, సమానాధిక వర్జితా. 51
సర్వశక్తిమయీ, సర్వమంగళా, సద్గతిప్రదా,
సర్వేశ్వరీ, సర్వమయీ, సర్వమన్త్రస్వరూపిణీ. 52
సర్వయన్త్రాత్మికా, సర్వతన్త్రరూపా, మనోన్మనీ,
మహేశ్వరీ, మహాదేవీ, మహాలక్ష్మీః, మృడప్రియా. 53
మహారూపా, మహాపూజ్యా, మహాపాతక నాశినీ,
మహామాయా, మహాసత్త్వా, మహాశక్తిః, మహారతిః. 54
మహాభోగా, మహైశ్వర్యా, మహావీర్యా, మహాబలా,
మహాబుద్ధిః, మహాసిద్ధిః, మహాయోగేశ్వరేశ్వరీ. 55
మహాతన్త్రా, మహామన్త్రా, మహాయన్త్రా, మహాసనా,
మహాయాగ క్రమారాధ్యా, మహాభైరవ పూజితా. 56
మహేశ్వర మహాకల్ప మహాతాణ్డవ సాక్షిణీ,
మహాకామేశమహిషీ, మహాత్రిపుర సున్దరీ. 57
చతుష్షష్ట్యుపచారాఢ్యా, చతుష్షష్టి కళామయీ,
మహా చతుష్షష్టి కోటి యోగినీగణ సేవితా. 58
మనువిద్యా, చన్ద్ర విద్యా, చన్ద్రమణ్డల మధ్యగా,
చారురూపా, చారుహాసా, చారుచన్ద్రకళాధరా. 59
చరాచర జగన్నాథా, చక్రరాజ నికేతనా,
పార్వతీ, పద్మనయనా, పద్మరాగ సమప్రభా. 60
పంచ ప్రేతాసనాసీనా, పంచబ్రహ్మ స్వరూపిణీ,
చిన్మయీ, పరమానన్దా, విజ్ఞాన ఘనరూపిణీ. 61
ధ్యాన ధ్యాతృ ధ్యేయరూపా, ధర్మాధర్మ వివర్జితా,
విశ్వరూపా, జాగరిణీ, స్వపన్తీ, తైజసాత్మికా. 62
సుప్తా, ప్రాజ్ఞాత్మికా, తుర్యా, సర్వావస్థా వివర్జితా,
సృష్టికర్త్రీ, బ్రహ్మరూపా, గోప్త్రీ, గోవిన్దరూపిణీ. 63

సంహారిణీ, రుద్రరూపా, తిరోధానకరీ, ఈశ్వరీ,
సదాశివా, అనుగ్రహదా, పంచకృత్య పరాయణా. 64
భానుమండల మధ్యస్థా, భైరవీ, భగమాలినీ,
పద్మాసనా, భగవతీ, పద్మనాభ సహోదరీ. 65
ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః,
సహస్రశీర్ష వదనా, సహస్రాక్షీ, సహస్రపాత్. 66
ఆబ్రహ్మకీటజననీ, వర్ణాశ్రమ విధాయినీ,
నిజాజ్ఞారూపనిగమా, పుణ్యాపుణ్య ఫలప్రదా. 67
శ్రుతిసీమన్త సిన్దూరీకృత పాదాబ్జధూళికా,
సకలాగమసన్దోహ శుక్తి సమ్పుట మౌక్తికా. 68
పురుషార్థప్రదా, పూర్ణా, భోగినీ, భువనేశ్వరీ,
అమ్బికా, అనాదినిధనా, హరిబ్రహ్మేన్ద్ర సేవితా. 69
నారాయణీ, నాదరూపా, నామరూప వివర్జితా,
హ్రీంకారీ, హ్రీమతీ, హృద్యా, హేయోపాదేయవర్జితా. 70
రాజరాజార్చితా, రాజ్ఞీ, రమ్యా, రాజీవలోచనా,
రంజనీ, రమణీ, రస్యా, రణత్కింకిణి మేఖలా. 71
రమా, రాకేన్దువదనా, రతిరూపా, రతిప్రియా,
రక్షాకరీ, రాక్షసఘ్నీ, రామా, రమణలమ్పటా. 72
కామ్యా, కామకలారూపా, కదమ్బకుసుమప్రియా,
కళ్యాణీ, జగతీకన్దా, కరుణారససాగరా. 73
కళావతీ, కళాలాపా, కాన్తా, కాదమ్బరీ ప్రియా,
వరదా, వామనయనా, వారుణీ మద విహ్వలా. 74
విశ్వాధికా వేదవేద్యా, విన్ధ్యాచల నివాసినీ,
విధాత్రీ, వేదజననీ, విష్ణుమాయా విలాసినీ. 75
క్షేత్రస్వరూపా,క్షేత్రేశీ, క్షేత్రక్షేత్రజ్ఞ పాలినీ,
క్షయవృద్ధి వినిర్ముక్తా, క్షేత్రపాల సమర్చితా. 76

విజయా, విమలా, వన్ద్యా, వన్దారుజనవత్సలా,
వాగ్వాదినీ, వామకేశీ, వహ్నిమణ్డలవాసినీ. 77
భక్తిమత్కల్పలతికా, పశుపాశ విమోచినీ,
సంహృతా శేషపాషణ్డా, సదాచార ప్రవర్తికా. 78
తాపత్రయాగ్ని సన్తప్త సమాహ్లాదన చన్ద్రికా,
తరుణీ, తాపసారాధ్యా, తనుమధ్యా, తమోపహా. 79
చితిః, తత్పదలక్ష్యార్థా, చిదేక రసరూపిణీ,
స్వాత్మానన్దలవీభూత బ్రహ్మాద్యానన్ద సన్తతిః. 80
పరా, ప్రత్యక్చితీరూపా, పశ్యన్తీ, పరదేవతా,
మధ్యమా, వైఖరీరూపా, భక్తమానస హంసికా. 81
కామేశ్వర ప్రాణనాడీ, కృతజ్ఞా, కామపూజితా,
శృఙ్గార రససమ్పూర్ణా, జయా, జాలన్ధరస్థితా. 82
ఓడ్యాణపీఠ నిలయా, బిన్దుమణ్డలవాసినీ,
రహోయాగక్రమారాధ్యా, రహస్తర్పణ తర్పితా. 83
సద్యఃప్రసాదినీ, విశ్వసాక్షిణీ. సాక్షివర్జితా,
షడఙ్గ దేవతాయుక్తా, షాడ్గుణ్య పరిపూరితా. 84
నిత్యక్లిన్నా, నిరుపమా, నిర్వాణ సుఖదాయినీ,
నిత్యాషోడశికారూపా, శ్రీకణ్ఠార్థశరీరిణీ. 85
ప్రభావతీ, ప్రభారూపా, ప్రసిద్ధా, పరమేశ్వరీ,
మూలప్రకృతిః, అవ్యక్తా, వ్యక్తావ్యక్త స్వరూపిణీ. 86
వ్యాపినీ, వివిధాకారా, విద్యావిద్యాస్వరూపిణీ,
మహాకామేశ నయన కుముదాహ్లాద కౌముదీ. 87
భక్తహార్ద తమోభేద భానుమద్భాను సన్తతిః,
శివదూతీ, శివారాధ్యా, శివమూర్తిః, శివంకరీ. 88
శివప్రియా, శివపరా, శిష్టేష్టా, శిష్టపూజితా,
అప్రమేయా, స్వప్రకాశా, మనోవాచామగోచరా. 89

చిచ్ఛక్తిః, చేతనారూపా, జడశక్తిః, జడాత్మికా,
గాయత్రీ, వ్యాహృతిః, సన్ధ్యా, ద్విజబృన్ద నిషేవితా. 90
తత్త్వాసనా, తత్, త్వమ్, అయీ, పంచకోశాన్తరస్థితా,
నిస్సీమ మహిమా, నిత్య యౌవనా, మదశాలినీ. 91
మదఘూర్ణిత రక్తాక్షీ, మదపాటల గణ్డభూః,
చన్దనద్రవ దిగ్ధాంగీ, చామ్పేయ కుసుమప్రియా. 92
కుశలా, కోమలాకారా, కురుకుల్లా, కుళేశ్వరీ,
కుళకుణ్డాలయా, కౌళమార్గ తత్పరసేవితా. 93
కుమార గణనాథామ్బా, తుష్టిః, పుష్టి, మతిః, ధృతిః,
శాన్తిః, స్వస్తిమతీ, కాన్తిః, నందినీ, విఘ్ననాశినీ. 94
తేజోవతీ, త్రినయనా, లోలాక్షీ కామరూపిణీ,
మాలినీ, హంసినీ, మాతా, మలయాచల వాసినీ. 95
సుముఖీ, నళినీ, సుభ్రూః, శోభనా, సురనాయికా,
కాలకణ్ఠీ, కాన్తిమతీ, క్షోభిణీ సూక్ష్మరూపిణీ. 96
వజ్రేశ్వరీ, వామదేవీ, వయోఽవస్థావివర్జితా,
సిద్ధేశ్వరీ, సిద్ధవిద్యా, సిద్ధమాతా, యశస్వినీ. 97
విశుద్ధిచక్రనిలయా, ఆరక్తవర్ణా, త్రిలోచనా,
ఖట్వాఙ్గాది ప్రహరణా, వదనైక సమన్వితా 98
పాయసాన్నప్రియా, త్వక్స్థా, పశులోక భయఙ్కరీ.
అమృతాది మహాశక్తి సంవృతా, ఢాకినీశ్వరీ, 99
అనాహతాబ్జనిలయా, శ్యామాభా, వదనద్వయా,
దంష్ట్రోజ్జ్వలా, అక్షమాలాదిధరా, రుధిరసంస్థితా. 100
కాళరాత్ర్యాది శక్త్యౌఘవృతా, స్నిగ్ధౌదనప్రియా,
మహావీరేన్ద్రవరదా, రాకిన్యమ్బా స్వరూపిణీ. 101
మణిపూరాబ్జనిలయా, వదనత్రయ సంయుతా,
వజ్రాది కాయుధోపేతా, డామర్యాది భిరావృతా. 102

రక్తవర్ణా, మాంసనిష్ఠా, గుడాన్న ప్రీతమానసా,
సమస్త భక్త సుఖదా, లాకిన్యమ్బా స్వరూపిణీ. 103
స్వాధిష్ఠానామ్బుజగతా, చతుర్వక్త్ర మనోహరా,
శూలాద్యాయుధ సమ్పన్నా, పీతవర్ణా, అతిగర్వితా 104
మేదోనిష్ఠా, మధుప్రీతా, బన్దిన్యాది సమన్వితా,
దధ్యన్నాసక్త హృదయా, కాకినీ రూపధారిణీ. 105
మూలాధారామ్బుజారూఢా, పఞ్చవక్త్రా, అస్థిసంస్థితా,
అఙ్కుశాది ప్రహరణా, వరదాది నిషేవితా. 106
ముద్గౌదనాసక్త చిత్తా, సాకిన్యమ్బా స్వరూమిణీ,
ఆజ్ఞా చక్రాబ్జ నిలయా, శుక్లవర్ణా, షడాననా 107
మజ్జాసంస్థా, హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా,
హరిద్రాన్నైక రసికా, హాకినీరూపధారిణీ. 108
సహస్రదళ పద్మస్థా, సర్వవర్ణోప శోభితా,
సర్వాయుధధరా, శుక్లసంస్థితా, సర్వతోముఖీ. 109
సర్వౌదన ప్రీతచిత్తా, యాకిన్యమ్బా స్వరూపిణీ
స్వాహా, స్వధా, అమతిః, మేధా, శ్రుతిః, స్మృతిః, అనుత్తమా. 110
పుణ్యకీర్తిః, పుణ్యలభ్యా, పుణ్యశ్రవణ కీర్తనా,
పులోమజార్చితా, బన్ధమోచనీ, బన్ధురాలకా. 111
విమర్శరూపిణీ, విద్యా, వియదాది జగత్ప్రసూః,
సర్వవ్యాధి ప్రశమనీ, సర్వమృత్యు నివారిణీ. 112
అగ్రగణ్యా, అచిన్త్యరూపా, కలికల్మషనాశినీ,
కాత్యాయనీ, కాలహన్త్రీ, కమలాక్ష నిషేవితా. 113
తామ్బూలపూరితముఖీ, దాడిమీ కుసుమప్రభా,
మృగాక్షీ, మోహినీ, ముఖ్యా, మృడానీ, మిత్రరూపిణీ. 114
నిత్యతృప్తా, భక్తనిధిః, నియన్త్రీ, నిఖిలేశ్వరీ,
మైత్ర్యాది వాసనాలభ్యా, మహాప్రళయ సాక్షిణీ. 115

పరాశక్తిః, పరానిష్ఠా, ప్రజ్ఞాన ఘనరూపిణీ,
మాధ్వీపానాలసా, మత్తా, మాతృకా వర్ణరూపిణీ. 116
మహాకైలాసనిలయా, మృణాళ మృదుదోర్లతా,
మహనీయా, దయామూర్తిః, మహా సామ్రాజ్యశాలినీ. 117
ఆత్మవిద్యా, మహావిద్యా, శ్రీ విద్యా, కామసేవితా,
శ్రీ షోడశాక్షరీ విద్యా, త్రికూటా, కామకోటికా. 118
కటాక్ష కింకరీ భూత కమలాకోటి సేవితా,
శిరస్థితా, చన్ద్రనిభా, ఫాలస్థా, ఇన్ద్రధనుఃప్రబా. 119
హృదయస్థా, రవిప్రఖ్యా త్రికోణాన్తరదీపికా,
దాక్షాయణీ, దైత్యహన్త్రీ, దక్షయజ్ఞ వినాశినీ. 120
దరాన్దోళిత దీర్ఘాక్షీ, దరహాసోజ్జ్వలన్ముఖీ,
గురుమూర్తిః, గుణనిధిః, గోమాతా, గుహజన్మభూః. 121
దేవేశీ, దణ్డనీతిస్థా, దహరాకాశ రూపిణీ,
ప్రతిపన్ముఖ్య రాకాన్త తిథి మణ్డల పూజితా. 122
కళాత్మికా, కళానాథా, కావ్యాలాప వినోదినీ,
సచామర రమావాణీ సవ్య దక్షిణ సేవితా. 123
ఆదిశక్తిః, అమేయా, ఆత్మా, పరమా, పావనాకృతిః,
అనేకకోటి బ్రహ్మాణ్డ జననీ, దివ్యవిగ్రహా. 124
క్లీంకారీ, కేవలా, గుహ్యా, కైవల్యపదదాయినీ,
త్రిపురా, త్రిజగద్వన్ద్యా, త్రిమూర్తిః, త్రిదశేశ్వరీ. 125
త్ర్యక్షరీ, దివ్యగన్ధాఢ్యా, సిన్దూర తిలకాంచితా,
ఉమా, శైలేన్ద్రతనయా, గౌరీ, గన్ధర్వసేవితా. 126
విశ్వగర్భా, స్వర్ణగర్భా, అవరదా, వాగధీశ్వరీ,
ధ్యానగమ్యా, అపరిచ్ఛేద్యా, జ్ఞానదా, జ్ఞానవిగ్రహా. 127
సర్వవేదాన్త సంవేద్యా, సత్యానన్ద స్వరూపిణీ,
లోపాముద్రార్చితా, లీలాక్లుప్త బ్రహ్మాణ్డ మణ్డలా. 128

అదృశ్యా, దృశ్యరహితా, విజ్ఞాత్రీ, వేద్యవర్జితా,
యోగినీ, యోగదా, యోగ్యా, యోగానన్దా, యుగన్ధరా. 129
ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ,
సర్వాధారా, సుప్రతిష్ఠా, సదసద్రూప ధారిణీ. 130
అష్టమూర్తిః, అజాజైత్రీ, లోకయాత్రా విధాయినీ,
ఏకాకినీ, భూమరూపా, నిర్ద్వైతా, ద్వైత వర్జితా. 131
అన్నదా, వసుదా, వృద్ధా, బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ,
బృహతీ, బ్రాహ్మణీ, బ్రాహ్మీ, బ్రహ్మానన్దా, బలిప్రియా. 132
భాషారూపా, బృహత్సేనా, భావాభావ వివర్జితా,
సుఖారాధ్యా, శుభకరీ, శోభనా సులభాగతిః. 133
రాజరాజేశ్వరీ, రాజ్యదాయినీ, రాజ్యవల్లభా,
రాజత్కృపా రాజపీఠనివేశిత నిజాశ్రితా. 134
రాజ్యలక్ష్మీః, కోశనాథా, చతురంగ బలేశ్వరీ,
సామ్రాజ్యదాయినీ, సత్యసన్ధా, సాగరమేఖలా. 135
దీక్షితా, దైత్యశమనీ, సర్వలోక వశంకరీ,
సర్వార్థ దాత్రీ, సావిత్రీ, సచ్చిదానన్ద రూపిణీ. 136
దేశకాలా పరిచ్ఛిన్నా, సర్వగా, సర్వమోహినీ,
సరస్వతీ, శాస్త్రమయీ, గుహామ్బా, గుహ్యరూపిణీ. 137
సర్వోపాధి వినిర్ముక్తా, సదాశివ పతివ్రతా,
సమ్ప్రదాయేశ్వరీ, సాధు, ఈ, గురుమణ్డల రూపిణీ. 138
కులోత్తీర్ణా, భగారాధ్యా, మాయా, మధుమతీ, మహీ,
గణామ్బా, గుహ్యకారాధ్యా, కోమాలాంగీ, గురుప్రియా. 139
స్వతన్త్రా, సర్వతన్త్రేశీ, దక్షిణామూర్తిరూపిణీ,
సనకాది సమారాధ్యా, శివజ్ఞాన ప్రదాయినీ. 140
చిత్కళా, ఆనందకలికా, ప్రేమరూపా, ప్రియంకరీ,
నామపారాయణ ప్రీతా, నన్దివిద్యా, నటేశ్వరీ. 141

మిథ్యా జగదధిష్ఠానా, ముక్తిదా, ముక్తిరూపిణీ,
లాస్యప్రియా, లయకరీ, లజ్జా, రమ్భాది వన్దితా. 142
భవ దావ సుధావృష్టిః, పాపరణ్యదవానలా,
దౌర్భాగ్యతూలవాతూలా, జరాధ్వాన్త రవిప్రభా.
భాగ్యాబ్ధిచన్ద్రికా, భక్త చిత్త కేకిఘనా ఘనా,
రోగపర్వత దంభోళిః, మృత్యుదారు కుఠారికా. 144
మహేశ్వరీ, మహాకాళీ, మహాగ్రాసా, మహాశనా,
అపర్ణా, చండికా, చండ ముండాసుర నిషూదినీ. 145
క్షరాక్షరాత్మికా, సర్వలోకేశీ, విశ్వధారిణీ,
త్రివర్గదాత్రీ, సుభగా, త్ర్యమ్బకా, త్రిగుణాత్మికా. 146
స్వర్గాపవర్గదా, శుద్ధా, జపాపుష్ప నిభాకృతిః,
ఓజోవతీ, ద్యుతిధరా, యజ్ఞరూపా, ప్రియవ్రతా. 147
దురారాధ్యా, దురాధర్షా, పాటలీ కుసుమప్రియా,
మహతీ, మేరునిలయా, మన్దార కుసుమప్రియా. 148
వీరారాధ్యా, విరాడ్రూపా, విరజా, విశ్వతోముఖీ,
ప్రత్యగ్రూపా, పరాకాశా, ప్రాణదా, ప్రాణరూపిణీ. 149
మార్తాణ్డ భైరవారాధ్యా, మన్త్రిణీ న్యస్త రాజ్యధూః,
త్రిపురేశీ, జయత్సేనా, నిస్త్రైగుణ్యా, పరాపరా. 150
సత్యజ్ఞానన్దరూపా, సామరస్య పరాయణా,
కపర్దినీ, కళామాలా, కామధుక్, కామరూపిణీ. 151
కళానిధిః, కావ్యకళా, రసజ్ఞా, రసశేవధిః,
పుష్టా, పురాతనా, పూజ్యా, పుష్కరా, పుష్క రేక్షణా. 152
పరంజ్యోతిః, పరన్ధామా, పరమాణుః, పరాత్పరా,
పాశహస్తా, పాశహన్త్రీ, పరమన్త్ర విభేదినీ. 153
మూర్తా, అమూర్తా, అనిత్యతృప్తా, మునిమానస హంసికా
సత్యవ్రతా, సత్యరూపా, సర్వాన్తర్యామినీ సతీ. 154

బ్రహ్మాణీ, బ్రహ్మ, జననీ, బహురూపా, బుధార్చితా,
ప్రసవిత్రీ, ప్రచండా, ఆజ్ఞా, ప్రతిష్ఠా, ప్రకటాకృతిః. 155
ప్రాణేశ్వరీ, ప్రాణదాత్రీ, పంచాశత్పీఠరూపిణీ,
విశృంఖలా, వివిక్తస్థా, వీరమాతా, వియత్ప్రసూః. 156
ముకున్దా, ముక్తినిలయా, మూల విగ్రహ రూపిణీ,
భావజ్ఞా, భవరోగఘ్నీ, భవచక్ర ప్రవర్తినీ. 157
ఛన్దస్సారా, శాస్త్రసారా, మన్త్రసారా, తలోదరీ,
ఉదారకీర్తిః, ఉద్దామవైభవా, వర్ణరూపిణీ. 158
జన్మమృత్యు జరాతప్త జనవిశ్రాన్తి దాయినీ,
సర్వోప నిషదుద్ఘుష్టా, శాన్త్యతీత కళాత్మికా. 159
గమ్భీరా, గగనాన్తస్థా, గర్వితా, గానలోలుపా,
కల్పనారహితా, కాష్ఠా, అకాన్తా, కాన్తార్ధవిగ్రహా. 160
కార్యకారణ నిర్ముక్తా, కామకేళి తరంగితా,
కనత్కనక తాటంక, లీలావిగ్రహ ధారిణీ. 161
అజా, క్షయవినిర్ముక్తా, ముగ్ధా, క్షిప్ర ప్రసాదినీ,
అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభా. 162
త్రయీ, త్రివర్గనిలయా, త్రిస్థా, త్రిపురమాలినీ,
నిరామయా, నిరాలమ్బా, స్వాత్మారామా, సుధాసృతిః 163
సంసార పంక నిర్మగ్న సముద్ధరణ పండితా,
యజ్ఞప్రియా, యజ్ఞకర్త్రీ, యజమాన స్వరూపిణీ. 164
ధర్మాధారా, ధనాధ్యక్షా, ధనధాన్య వివర్ధినీ,
విప్రప్రియా, విప్రరూపా, విశ్వభ్రమణ కారిణీ. 165
విశ్వగ్రాసా, విద్రుమాభా, వైష్ణవీ, విష్ణురూపిణీ,
అయోనిః, యోనినిలయా, కూటస్థా, కులరూపిణీ. 166
వీరగోష్ఠీప్రియా, వీరా, నైష్కర్మ్యా, నాదరూపిణీ,
విజ్ఞానకలనా, కల్యా, విదగ్ధా, బైన్దవాసనా. 167

తత్త్వాధికా, తత్త్వమయీ, తత్త్వమర్థ స్వరూపిణీ,
సామగానప్రియా, సౌమ్యా, సదాశివకుటుమ్బినీ. 168
సవ్యాపసవ్య మార్గస్థా, సర్వాపద్వినివారిణీ,
స్వస్థా, స్వభావమధురా, ధీరా, ధీరసమర్చితా. 169
చైతన్యార్ఘ్య సమారాధ్యా, చైతన్యకుసుమప్రియా,
సదోదితా, సదాతుష్టా, తరుణాదిత్యపాటలా. 170
దక్షిణాదక్షిణా౽౽రాధ్యా, దరస్మేర ముఖామ్బుజా,
కౌళినీ కేవలా, అనర్ఘ్య కైవల్య పదదాయినీ. 171
స్తోత్రప్రియా, స్తుతిమతీ, శ్రుతిసంస్తుత వైభవా,
మనస్వినీ, మానవతీ, మహేశీ, మంగళాకృతిః. 172
విశ్వమాతా, జగద్ధాత్రీ, విశాలాక్షీ, విరాగిణీ,
ప్రగల్భా, పరమోదారా, పరామోదా, మనోమయీ. 173
వ్యోమకేశీ, విమానస్థా, వజ్రిణీ, వామకేశ్వరీ,
పంచయజ్ఞప్రియా, పంచప్రేతమంచాధిశాయినీ. 174
పంచమీ, పంచభూతేశీ, పంచసంఖ్యోపచారిణీ,
శాశ్వతీ, శాశ్వతైశ్వర్యా, శర్మదా, శమ్భుమోహినీ. 175
ధరా, ధరసుతా, ధన్యా, ధర్మిణీ, ధర్మవర్ధినీ,
లోకాతీతా, గుణాతీతా, సర్వాతీతా, శమాత్మికా. 176
బన్ధూక కుసుమ ప్రఖ్యా, బాలా, లీలావినోదినీ,
సుమంగలీ, సుఖకరీ, సువేషాఢ్యా, సువాసినీ. 177
సువాసిన్యర్చనప్రీతా, ఆశోభనా, శుద్ధమానసా,
బిన్దుతర్పణ సన్తుష్టా, పూర్వజా, త్రిపురామ్బికా. 178
దశముద్రాసమారాధ్యా, త్రిపురా శ్రీవశంకరీ,
జ్ఞానాముద్రా, జ్ఞానగమ్యా, జ్ఞానజ్ఞేయ స్వరూపిణీ. 179
యోనిముద్రా, త్రిఖణ్డేశీ, త్రిగుణా, అమ్బా, త్రికోణగా,
అనఘా, అద్భుతచారిత్రా, వాంఛితార్థ ప్రదాయినీ. 180

అభ్యాసాతిశయ జ్ఞాతా, షడధ్వాతీత రూపిణీ,
అవ్యాజ కరుణామూర్తిః, అజ్ఞానధ్వాన్త దీపికా. 181
అబాల గోపవిదితా, సర్వానుల్లంఘ్యశాసనా,
శ్రీచక్రరాజనిలయా, శ్రీమత్త్రిపురసుందరీ. 182
శ్రీశివా, శివశక్త్యైక్యరూపిణీ, లలితామ్బికా ( ఓమ్),
ఏవం శ్రీ లలితా దేవ్యానామ్నాం సాహస్రకం జగుః. 183

ఇతి శ్రీ బ్రహ్మాణ్డ పురాణే, ఉత్తరఖండే, శ్రీ హయగ్రీవాగస్త్య సంవాదే ,
శ్రీ లలితా రహస్యనామ సాహస్రస్తోత్ర కథనం నామ ద్వితీయో2 ధ్యాయః.
సర్వం శ్రీ లలితా పరదేవతార్పణ మస్తు.

శ్రీః

శ్రీ మాత్రే నమః

# శ్రీ లలితా సహస్ర నామావళి

(ఈ ప్రథమ భాగములోనివి)

# అకారాదినామ సంఖ్యాను క్రమణిక

(ఈ ప్రథమభాగములోనివి)